# విప్లవ గీతిక



అజ్ఞానాన్నీ నిరంకుశాన్నీ జయించి పొందిన మన విజయాన్నీ,
హరించలేరూ ! లేలేరూ !! ఎవ్వరుకానీ ! ఎన్నడుగానీ !!



కూలికోసం కూడుకోసం దేవులాడుతు మేము పోయాం,
బాధతోటీ మాదు హృదయాల్ అణగిపోయాయీ;
సత్తువంతా సన్నగిల్లీ, అలసిపోయిన హస్తమల్లే,
ఫ్యాక్టరీలా పొగలగొట్టాల్ మబ్బువంకా పైకి చూచాయీ;
మాదు శోకం, మాదు వేదన, వెల్లడించే దీన వాక్యాల్,
రాతిగుండెల చీల్చివైచాయీ, స్తబ్ధతంతా భగ్నపఱచాయీ॥ అజ్ఞానాన్నీ॥



రక్తమోడ్చే శ్రమిక జీవుల ప్రేమమూర్తివి ఓ ! లెనిన్ !
పోరు ! పోరాటం !! పోరే !!! మా గతి యంటూ,
తెలిసి వచ్చిందీ— ఓ లెనిన్ ! మాకు తెలిసివచ్చిందీ ;
ఉత్సాహంతో యువకుల్లాగా ధైర్యంతోటీ పోరాడామూ,
నీవు అంతిమ యుద్ధభూమికి మమ్ము నడిపావూ,
కూలివాళ్లా విజయహారము మెడను వేశావూ ॥అజ్ఞానాన్నీ ॥



విజయం పొందీ ప్రసిద్ధిచెందిన విప్లవం ! నవంబరు విప్లవం !
నవ సంఘానికి దారితీసే వెల్గే మన విప్లవం !
తిరుగబడేటీ నవ్యయుగాలా కోర్కెల చిహ్నమె విప్లవం !
కూలిచేసే—పొలము దున్నే—కష్ట జీవుల అదృష్టరూపమె విప్లవం !
మాదు కష్టం—హర్షధ్వానం—మధుర గానమె విప్లవం !
లెనిను వీరుని, శూర యువకుల త్యాగచిహ్నమె విప్లవం॥ అజ్ఞానాన్నీ॥

Library's copy lacks p. 1-4

# యునైటెడ్ సోవియట్ సోషలిస్టు రష్యా విప్లవ చరిత్ర

కా ప్రేమ్ "చంద్రం"



విప్లవాన్ని జయప్రదంగా నడిపిన లెనిన్.

21 యేండ్లు గడచినాయి. పెట్టుబడిదారీ ప్రపంచాన్ని గడ గడ లాడించిన, ప్రపంచ కష్ట జీవుల ఆశాలతను జేవురింప జేసిన అక్టోబరు విప్లవం జరిగి, భూమండలంలో ఆరవవంతుపై శ్రామిక వర్గ ప్రభుత్వాన్ని స్థాపించి 21 వర్షాలు గతించాయి. విప్లవం సోవియట్ యూనియన్‌లోని ప్రజా సామాన్యాని కొసంగిన మేలు, ప్రపంచ శాంతికి, విశ్వమానవ కళ్యాణానికి ఒనర్చిన ప్రయత్నాలను గురించి పరిశీలించుటకు ముందు, ఆ విప్లవ చరిత్రను ఒక పరి సంస్మరించుదాం.

విప్లవ మొక శాస్త్రం (సైన్సు). అది ఒక కళ. విప్లవ కారుడు విప్లవయెత్తులను, వ్యూహరచనను అవగాహన చేసుకోవాలి. సమాజ మందలి సాంఘిక శక్తులను గుర్తించి, ప్రజల కష్టాలను, భావాలను గ్రహించినపుడే వారి హక్కుల కొరకు పోరాటమును జయప్రదంగా సాగించ గలరు. వేర్వేరు చోట్ల వచ్చు స్థానిక ప్రజా పోరాటాలను సమీకరణ మొనర్చి గమ్య స్థానాన్ని జేరుటకు చేయాలసిన దేశ వ్యాపిత ప్రజా పోరాటాన్ని జయప్రదంగా నడుపుటకు తగిన ఆధారాలను నిర్మించుకోవాలి. ప్రతి చిన్న పోరాటాన్ని నడుపుటలోనూ పెద్ద పోరాటాన్ని దృష్టిలో వుంచుకోవాలి.

బోల్షివిక్ పార్టీ విప్లవపు వివిధ గతుల్లో పోరాటం యెలా నడిపిందీ గమనించుదాము.

## ప్రథమ విప్లవం

1825 లో మొట్టమొదట జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవోద్యమం బయలుదేరింది. అప్పటిరోజుల్లో దాన్ని మధ్య తరగతి విద్యావంతులు నడిపించేవాళ్ళు. 1881 లో రెండవ అలెగ్జాండరు చక్రవర్తిని టెర్రరిస్టులు హత్య గావించారు. వాళ్ళు గొప్ప త్యాగాన్ని ప్రదర్శించి ప్రపంచాన్నంతనీ సాహస కృత్యాల చేతా వ్యక్తిగత దౌర్జన్యయుత పోరాట పద్ధతులచేత ముగ్ధుల్ని చేసారు కాని వారు ప్రజా విప్లవాన్ని ప్రేరేపించలేకపోయారు.

1905 జనవరి 22 వ తేదీ ఆదివారం నాడు పెట్రోగ్రాడ్‌లోని వేలకొలది కూలీలు—రాజభక్తి విశ్వాసం గల ప్రజలు—'గేపన్' మతగురువు నాయకత్వాన 'వింటర్ పాలెస్' (రాజభవనం) ముందలి మైదానం లోనికి జారు చక్రవర్తికి ఒక పిటీషను యిచ్చుకోడానికి జేరారు. సేనలు వారిని చుట్టు ముట్టాయి. కూలీలు మోకాళ్ళపై సాగిలపడి చక్రవర్తి దర్శనం చేసికోనిమ్మని సైనికుల్ని బ్రతిమాలారు. కాని నిరాయుధులైన వారిపై తుపాకులు పేల్చబడినాయి. పోలీసు రిపోర్టులే ఆ రోజున వెయ్యిమందికి పైగా చనిపోయారనీ రెండు వేలకు పైగా గాయపడ్డారనీ చెబుతున్నాయి. ఇదియే రష్యా చరిత్రలో 'బ్లడీ సన్‌డే' (రక్త సిక్త ఆదివారము) అని ప్రసిద్ధి పొందింది. ప్రజలలో బ్రహ్మాండమైన రాజకీయ చైతన్యాన్ని కల్గించి విప్లవ పోరాటానికి పురిగొల్పడంచేతనే దానికంత ప్రాముఖ్యత వచ్చింది.



అంతకు పూర్వం, రష్యా విప్లవ కారులయిన సోషల్ డెమాక్రేటుల్ని కొలదిమంది మాత్ర ముండేవారు. వీరిని మిత వాదులు 'ఒక గుంపు' అని హేళన చేసేవారు. కొలది రోజుల లోనే పరిస్థితులు మారిపోయాయి. విప్లవ పక్షీయుల సంఖ్య వేలకొలది పెరిగి పోయింది. లక్షల కొలది శ్రామికులకు నాయకులై పోయారు. దేశమంతటా వ్యాపించిన బ్రహ్మాండమైన సమ్మెలూ, రష్యా జపాన్ యుద్ధ భయానక ఫలితమూ, దుర్భర దారిద్ర్య పీడితులయి జమీందారులచే దోచుకోబడుతూ, మత గురువులచే మోసగింపబడుతూ దారి డొంకలులేని దేశంలో వెదజల్లబడిన రైతులను వాళ్ల మైకంనుంచి మేల్కొనునట్లు చేసాయి. పట్టణాలనుండి నిరుద్యోగులు పల్లెలకుపోయి సమ్మెలను గురించి చెబుతూ సమ్మెల అనుభవాలను పల్లె ప్రజలకు చెబుతుండేవారు. చైతన్యం గల్గిన రైతు యువకులు వార్తాపత్రికలు చదువుచూ రైతులకు రాజకీయ కోర్కెలను బోధిస్తూ జమీందార్లకు, మత గురువులకూ, ఉద్యోగులకు వ్యతిరేకంగా పోరాడటానికి ప్రోత్సహించేవాళ్లు. క్రమ క్రమంగా రైతులంతా విప్లవ పోరాటంలోనికి ఆకర్షించ బడ్డారు. గుంపులుగా బయలు దేరి జమీందారుల ఆస్తిని దోచుకొని, భవనాలను తగులబెట్టి, అడ్డుపడిన పోలీసును చంపివేసి, జమీందారీలన్నీ రైతుల పరం చేయాలని ఆందోళన ప్రారంభించారు.

పట్టణాలలోని కార్మికుల సమ్మెలు, పల్లెలలోని రైతు ఉద్యమం కలసి జార్ ప్రభుత్వపు ముఖ్యాధారమైన సైన్యాలను కూడా కదల్చి వేశాయి. నౌకా దళము సైన్యాలలో తిరుగుబాట్లు వచ్చాయి. ప్రజలలోని విప్లవ సంచలనం సైన్యాలలోకి వ్యాపించి తీరింది. ఆధునిక యంత్రాలనుపయోగించే నేర్పుగల పారిశ్రామిక కార్మికులనుండి వచ్చిన "శాపర్సు" మొదలయిన వారే సైనిక తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. కాని వారి ఉద్దేశ్యం వాళ్ళకే స్పష్టంగా తెలియదు. సాయిధ తిరుగుబాటును తీవ్రంగా కొనసాగిస్తేనేగాని, ప్రభుత్వాన్ని కూల ద్రోసి—రాజ్యాధికారాన్ని రష్యా యందంతటా వశపరచుకొంటేగాని విప్లవ విజయం చేకూరదని వాళ్లు గ్రహించలేదు. అరెస్టు చేసిన అధికారుల్ని వదిలి వేసారు. వారి వాగ్దానాలకు లొంగి పోయారు. అదను జూచి అధికార్లు కొత్త పటాలాలను తెప్పించుకొని, తిరుగుబాటుదారుల్ని, ఉద్యమాన్నీ అతి క్రూరంగా అణచి వేసారు. విప్లవ నాయకులనేకమంది ఉరిదీయ బడ్డారు.

## 1905 అనంతరం

1905 విప్లవం అణచివేయబడ్డా, పునాదులు కదలిన జార్ ప్రభుత్వం కొన్ని సంస్కరణలు యివ్వక తప్పిందికాదు. కొలది మందికి ఓటింగు హక్కు యిచ్చారు. వారిచే ఎన్నుకోబడిన శాసన సభకు ప్రభుత్వానికి సలహా యిచ్చు అధికారమే గాని శాసన నిర్మాణాధికారంలేదు. ఈ సంస్కరణలు కార్మికుల యిబ్బందుల తీర్చనూలేదు. రైతులకు భూమిపై హక్కునూ ఒసంగలేదు. పోరాటము నివురుగప్పి విప్లవ ప్రచారము రహస్య మార్గాల సాగ నారంభించింది.

ఇపుడే విప్లవ పక్షమయిన సోషల్ డిమాక్రేటు పక్షంలో చీలికలు ఏర్పడ్డాయి. ఒక కక్ష స్వతంత్ర ప్రజా సంఘ పోరాటాలకు ప్రాముఖ్యత నివ్వక "సక్రమాందోళన"కు ప్రాధాన్య మిచ్చిన 'మెన్షివిక్కులు'. రెండవ కక్ష ప్రజా సంఘ స్వతంత్ర పోరాటాల ద్వారానే విప్లవ చైతన్యం కల్గుతుందనీ, శాసన సభ ఆందోళన పై దానికి తోడ్పడునదిగా మాత్రమే వుండాలనే 'బోల్షివిక్కులు'. ఈ కక్షకు నాయకుడే 1917 నవంబరు విప్లవాన్ని జయప్రదంగా నడిపిన 'లెనిన్'.

అతి సంకుచితమైన ఓటింగు పద్ధతిపై ఏర్పడినదైనా డ్యూమా (శాసన సభ) నిరంకుశ జారు ప్రభుత్వానికి అనవసరమయిన బెడదగా కాన్పించింది. దానికున్న స్వల్పాధికారాలు కూడా తగ్గించ బడ్డాయి. వరుసగా 1, 2, 3 డ్యూమాలు రద్దు చేయ బడ్డాయి. 4 వ డ్యూమాలోని బోల్షివిక్ ప్రతినిధులు అరెస్టు చేయబడి సైబీరియాకు ప్రవాసం పంప బడ్డారు.

ఈలోగా ప్రజా ఉద్యమం మరల విజృంభించింది. 1912 లో పెట్రోగ్రాడ్, మాస్కో వగైరా నగరాల్లో సమ్మెలు మితి మీరాయి. లక్షలకొలది కార్మికులు సమ్మెలలో పాల్గొంటూ, రాజకీయ నినాదాలతో సహా ఊరేగింపులు సాగించారు. ఈ సమ్మెల తీవ్రత, ప్రపంచ సంగ్రామ ప్రారంభపు దినాల్లో కొంత తగ్గింది. "దేశ గౌరవాన్ని నిలబెట్టండి" అనే బూర్జువా నినాదం మధ్య తరగతి ప్రజలను కొంత కాలం ఆకర్షించగల్గింది. మెన్షివిక్కులు, సోషల్ రివల్యూషనరీలు తప్పటడుగులు వేయ నారంభించారు. లెనిన్ నాయకత్వాన బోల్షివిక్ పార్టీ మాత్రం, సామ్రాజ్య విస్తీర్ణం కోసం వివిధ కేపిటలిస్టు దేశాల మధ్య జరుగు మారణ హోమమే యుద్ధమని ఆయా దేశాల కార్మికులకు, ప్రజా సామాన్యానికి యెలుగెత్తి చాటారు. దేశభక్తిపేరుతో కేపిటలిస్టు ప్రభుత్వాలు, కష్ట జీవులను ఒండొరుల మైకి పురికొల్పుతాయి. యుద్ధం ప్రజా సామాన్యం కిచ్చేదల్లా, కరవు, అంటువ్యాధులు, యువకులను మారణ యంత్రాల కప్పగించుట మాత్రమే. కాబట్టి బోల్షివిక్ పార్టీ కష్ట జీవులు, సామ్రాజ్యవాద యుద్ధాన్ని, — జార్ ప్రభుత్వాన్ని జమీందారీ ధనస్వామిక విధానాన్ని కూలద్రోసే అంతర్యుద్ధం (సివిల్ వార్)గా— మార్చాలని ప్రకటించింది.

ప్రపంచ యుద్ధ ఫలితంగా రష్యన్ కార్మికుల యొక్క రైతుల యొక్క స్థితి మరింత హైన్య మయినది. కార్మికులు పని చేసే గంటలు హెచ్చు చేయబడ్డాయి. రైతుల ధాన్యము, పశువులు నామకః ఖరీదుకు ప్రభుత్వం తీసికొనసాగింది. వ్యష్టి

గలు [illegible]భరిని నిర్బంధంగా సైన్యంలో చేర్చుకొనుటతో సాగు చేయు భూమి తగ్గిపోయింది. జమీందారులు, భూస్వాములు యుద్ధపు ఖరీదుల వలన విపరీత లాభములు పొందిరి. దివాలా తీసిన రైతుల నుండి పశువులు, పనిముట్లు కొనివేసారు.

ప్రతిచోటా రైతుల తిరుగుబాట్లు బయలుదేరి భూస్వాముల (దోపిడిదార్ల) ఆస్తిని దోచుకొంటూ, భవనాలు తగులబెట్టనారంభించారు. ప్రభుత్వం తిరుగుబాట్లు నణచుటకు సైనిక దళాలను పంపేది. అది "సాధ్యమైనంత తక్కువ మందిని అరెస్టు చేయుట, సాధ్యమైనంత ఎక్కువ మందిని కాల్చివేయుట" ముఖ్య సూత్రంగా అవలంబించేది.

యుద్ధంలో జారు సైన్యాలు వరుసనే అపజయాలు పొందసాగాయి. వారికి ఆయుధ సామగ్రి, భోజన పదార్థాలు కూడా ప్రభుత్వం అందజేయలేకపోయింది. నిరంతరం సైన్యాలు పొందుచున్న అపజయం, పొందుచున్న లక్షలకొలది సైనికుల నష్టం, ప్రజా సామాన్యంలోనూ, సైన్యంలోనూ 'శాంతి' కావాలనే ఆక్రోశం బయలుదేరింది.

## మార్చి రివల్యూషన్

అన్ని వర్గాల నిరసనకు గురియైన జార్ ప్రభుత్వ యంత్రం తుప్పు పట్టి అన్ని వైపులనుండి వచ్చుచున్న ఘర్షణకు నిలువజాలక కూలిపోయింది. జార్, అతని కుటుంబం అరెస్టు చేయబడి నిర్బంధమునందుంచబడ్డారు. ఎల్ల చోట్ల కార్మికుల, రైతుల, సైనికుల సోవియట్లు నెలకొల్పబడ్డాయి. పట్టణాల్లో శ్రామిక వర్గ సైనికులు (రెడ్ గార్డులు) ఆయుధాలు పూని విప్లవ భద్రతను కాపాడ సాగారు.

సోషల్ రివల్యూషనరీలు, మెన్షివిక్కులు బూర్జువా పార్టీలతో కలసి తాత్కాలిక ప్రభుత్వాన్ని నెలకొల్పారు. కాన్స్టిట్యుయంటు అసెంబ్లీ రాజ్యాంగ విధానాన్ని నిర్మించుతుందని ప్రకటించారు.

1917 ఏప్రిల్ 3 వ తేదీకి లెనిన్ రష్యాకు చేరుకొన్నాడు. ప్రజలు, తాత్కాలిక ప్రభుత్వంకూడ బ్రహ్మాండమైన ఆహ్వానమిచ్చారు. వెంటనే బోల్షివిక్‌లు "అధికారమంతా సోవియట్ల వశమవాలి;" "కూలీలకు భోజనం: రైతులకు భూమి: ప్రజలందరికీ శాంతి కావాలి" అనే నినాదాలు లేవనెత్తారు. యుద్ధంలో "పరిహారాలు, ఆక్రమణలు" లేని సంధి, వెంటనే చేసికోవాలని ప్రకటించారు.

అప్పటికి సోవియట్లలో అధిక సంఖ్యాకులు సోషల్ రివల్యూషనరీలు, మెన్షివిక్కులే. ప్రజల ఆక్రోశాలను వారు వింటూ కూడా, వారి అవసరాలను గుర్తించలేక పోయారు. బూర్జువా అండలేనిదే ప్రభుత్వం నడుపలేమని యెంచారు. మిత్రమండలి కాపిటలిస్టు ప్రభుత్వాల ప్రోత్సాహంతో యుద్ధాన్ని కొనసాగింప బూనారు. పరిశ్రమలలో వెనుకబడిన రష్యన్ విప్లవం బూర్జువా డిమాక్రాటిక్ విప్లవమని చెప్పుతూ, మార్చి విప్లవం ఆ పనిని పూర్తి చేసిందని యెంచారు. భూమి [illegible] ఎవ్వరిదీ అనే సమస్యను కాన్స్టిట్యుయంటు అసెంబ్లీకి వాయిదా వేసారు. అటుల తాత్కాలిక ప్రభుత్వం మార్చి విప్లవంకు అగ్రగాములైన కార్మికులను [illegible] పరచలేదు. భూమిని రైతుల పరమూ చేయలేదు. [illegible] కోరు శాంతిని యివ్వలేదు.

విప్లవ ఫలితంగా వచ్చిన రాజకీయ అధికారాన్నే తన బూర్జువా హస్తగతం చేసుకోవాలని ప్రయత్నింప సాగింది. ఫ్యాక్టరీలను వరుసగా మూసివేయ సాగారు. తమ స్నేహితుల పలుకుబడి తగ్గుటకును, యుద్ధ సంరంభంలో విజయం ప్రజలలో దేశభక్తి ఉద్రేకాలు కలిగించును అనే ఆశతో నూతన ప్రయత్నాలు చేయించారు. జర్మనీపై తిరిగి యుద్ధము సాగించడానికి సైన్యాన్ని ముందుకు నడవమని, తాత్కాలిక ప్రభుత్వం ఆజ్ఞలు పంపింది.

## జులై దినాలు

బూర్జువా యెత్తులను కార్మికులు సమ్మెలతోనూ ఊరేగింపులతోనూ ఎదుర్కొన్నారు. యుద్ధభూమిలో అపజయాలతో తాత్కాలిక ప్రభుత్వంపై సైనికుల విశ్వాసం క్షీణింప సాగింది. కర్షకుల సోవియట్‌లలో మెజారిటీ అయిన సోషల్ రివల్యూషనరీలు వారించుతున్నా రైతులు జమీందార్ల నెదిరింప సాగారు. సైన్యాలలో పెత్తనం కమాండర్ల చేతులనుండి జారిపో సాగింది.

ఈ సమయంలో ప్రభుత్వంలోని బూర్జువా మంత్రులు రాజీనామా యిచ్చారు. తమనే అనుసరించుతున్న 'సోషల్ రివల్యూషనరీలను' మెన్షివిక్కులను బెదరించుటకు వారాపని చేసారు. కాని వారి రాజీనామా దేశంలో మహత్తర విజృంభణకు కారణమయింది. ఫిరంగుల సైనికుల దళం "బూర్జువా మంత్రులను మన ఫిరంగులకు బలి గావిస్తా"మనే నినాదంతో ఊరేగింపు లేవదీసింది. 'క్రాన్ స్టేంట్' నావికులుకూడ విజృంభించారు. జులై 17 తేదీన సైనిక దళాలన్నీ పెట్రోగాడ్‌లో సమావేశపడ నిశ్చయించుకొన్నాయి.

బోల్షివిక్ పార్టీ ఫ్యాక్టరీ కార్మికులలోని సైన్యంలోని అసంతృప్తిని గమనించింది. పెట్రోగ్రేడ్ ప్రాముఖ్యమైనదైనా అది ఒకటే విప్లవ జయాన్ని నిర్ణయించలేదని గుర్తించారు. దేశమందన్ని భాగముల కార్మికులు, సైన్యము ఆ చైతన్యం పొందాలి. అందుచే బోల్షివిక్కులు జులై డిమాన్‌స్ట్రేషన్ వలదని నిర్ణయించి ప్రచారం చేయ సాగారు. కాని పరిస్థితు[illegible]

విషమిర్చాయి. అందుచే ఊరేగింపు అధికార స్వీకారం కొరకు గాక శాంతంగా నిర్మాణ యుక్తంగాను "అధికార మంతా సోవియట్లకే వుండాలి" అనే నినాద మిచ్చారు. ఏమింటే రివ ల్యూషనరీ పార్టీ ప్రజా ఉద్యమంనుండి దూరంగా ఉండజాలదు. ఏపరిస్థితులలోనైనా అది ప్రజలను నడపాలి. లేనిచో ఆత్మహత్య చేసుకొన్నట్లయే: విప్లవ పార్టీ స్థానమునుండి నిర్గమించుటయే.

## కౌంటర్ రివల్యూషన్

సోషల్ రివల్యూషనరీలు, మెన్షివిక్‌లు అది తమకు సవాల్ అని యెంచుకొన్నారు. యుద్ధరంగం నుండి సైన్యాలను పెట్రోగ్రాడ్‌కు రా నాజ్ఞాపించారు. శాంతంగా జరుగు ఊరేగింపుపై చాటునుండి పోలీసు యేజంట్లు కాల్చారు. 'రెడ్ గార్డు'లు వారి ఆటలు సాగకుండా ఊరేగింపుకు రక్షణ యేర్పాట్లు చేసారు. 18 వ తేదీ ఉదయం బోల్షివిక్ పార్టీ పత్రిక ఆఫీసును విప్లవ ప్రతిఘాతకులు నాశనం గావించారు. ప్రభుత్వం బోల్షివిక్‌పార్టీని నిషేధించింది. లెనిన్ అరెస్టుకు ఆర్డ రిచ్చింది. లెనిన్ జర్మనీ ఏజంటని ప్రచారం సాగించారు.

బోల్షివిక్‌పార్టీ, లెనిన్, రహస్యంగా పనిచేయ నారంభించారు. ట్రాట్‌స్కీ, జినోవీవ్‌లు అరెస్టు అయ్యారు. లెనిన్‌పై అసత్య ప్రచారములోని బూటకాన్ని నిరూపించి ప్రచారంచేసారు.

## కార్నిలావ్ దాడి

బూర్జువా ప్రజల చైతన్యాన్ని అణచివేయడానికి ఇంకా హీనమైన స్థితికి దిగింది. తిరిగి జారునే తేవాలనెడి కర్నల్ "కార్నిలావ్" నాయకత్వాన విప్లవ ప్రతికూల సైన్యాలు పెట్రోగ్రాడ్‌ను, స్వాధీనముచేసుకోవడానికి దాడి వెడలాయి. తాత్కాలిక ప్రభుత్వం, దాడిని యెదుర్కోవడానికి సరియైన యేర్పాటులు చేయలేదు. విప్లవ ప్రజానీకం యొక్కబలం అంచనా వేయలేక పోయింది. కార్మికులు, సైనికులు విప్లవాన్ని రక్షించడానికి సన్నిద్ధులైయ్యారు. 'కార్నిలావ్' ను ఓడించి, పెట్రోగ్రాడును, తాత్కాలిక కెరినిస్కీ ప్రభుత్వాన్నీ రక్షించారు.

## నవంబరు విప్లవం.

కెరన్‌స్కీ ప్రభుత్వం పిలుస్తానన్న కానిస్టిట్యుయంట్ యెశెంబ్లీని పిలువక కాలక్షేపం చేయసాగింది..యుద్ధములో అన్ని రంగాల్లోను అపజయాలు కలిగాయి. జమీందారుల భూమిని ఆక్రమించుతున్న రైతుల తిరుగుబాట్లను అణచి వేయడానికి "కెరన్‌స్కీ" ప్రభుత్వం ప్రయతింప. సాగింట. సైన్యంలో మరల మరణ దండన నెలకొల్పబడింది,

ఇట్టి పరిస్థితులలో .యిక నుపేక్షించిన, రైతుల నడంచే విప్లవ ప్రతి ఘాతకులు, తరువాత కార్మికుల నడచివేయునని బోల్షివిక్‌పార్టీ గ్రహించింది. అధికారాన్ని స్వాధీనము చేసుకోడానికి విప్లవ సైనికులకు కార్మికులకు అనుజ్ఞ యివ్వబడింది. లెనిన్ 7వ తేదీకి చాలముందునుండే "ప్రభుత్వాన్ని ఆక్రమించుకోవాలి, లేనిచో ఆలస్యం మరణం" అన్నాడు. కడకు అఖిల రష్యన్ సోవియట్ కాంగ్రెస్ సమావేశం కూడనప్పటకి విప్లవం చెలరేగాలనీ" ఇదిగో అధికారం! స్వీకరించడి! అని చెప్పే ధీమాలో ఉండాలని" పట్టుపట్టినాడు.

సరిగా యిప్పటికి 21 సంవత్సరాలముందు నవంబరు 7 వ తేదీ నాడు 'అరోరాయుద్ధనావనుండి' విప్లవ సైన్యాల ఫిరంగులు 'వింటర్ ప్యాలెస్' ( రాజభవనము ) పై అగ్ని వర్షించాయి. ఎక్కువ పోరాటం లేకుండానే అధికారం విప్లవకారులు వశమయింది. కెరన్‌స్కీ విదేశాలకు పారిపోయాడు. సోవియట్ కాంగ్రెసులలో, సోషల్ రివల్యూషనరీలలో అతివాదులు, బోల్షివిక్కులు కలిసారు. నూతన విప్లవ ప్రభుత్వం లెనిన్ అధ్యక్షతను ఏర్పడింది.

## ప్రభుత్వ స్థాపన

విప్లవ ప్రభుత్వం ఏర్పడుటతోనే, దున్నువారిదే భూమిపై హక్కనీ, జమీందారుల భూమిని లాక్కొని కర్షకుల సోవియట్ స్వాధీనంచేయాలని శాసనం చేసింది. యుద్ధంలో నిమగ్నులైన వివిధ ప్రభుత్వాలకు, ఆక్రమణలు, పరిహారాలు లేని సంధి చేసుకోవాలంటూ విన్నప మంపింది. తన సైన్యాలను యుద్ధరంగానికి పంపుట ఆపింది. ఆఫీసర్లకు వెంటనే శత్రు సైన్యాలతో పోరాటం ఆపి రాయబారాలు సాగింప శాసించింది. ఫ్యాక్టరీలను యజమానులనుండి లాక్కొని "వర్కర్సు కంట్రోల్‌కు" అప్పగించింది.

1917 నవంబరు 7 వ తారీఖు ఏర్పరచబడిన సోవియటు ప్రభుత్వానికి, 1918 జూలై 10 వ తారీఖున రాజ్యాంగ ప్రణాళిక ఏర్పరచబడింది. దానిలో "కష్ట జీవుల యొక్క, పీడిత ప్రజల యొక్క హక్కుల వివరణ" ఈ క్రింది విధంగా ప్రకటించబడింది.

1. కార్మికుల, సైనికుల, రైతుల ప్రతినిధులతో కూడిన సోవియటు రిపబ్లిక్ రష్యా. కేంద్ర ప్రభుత్వాధికారము, స్థానిక పరిపాలనా అధికారము, అంతయూ, ఈ సోవియటులదే.

2. రష్యను సోవియటు రిపబ్లిక్, స్వతంత్రము గల జాతులు (దేశాలు) తాము స్వేచ్ఛగ కలసి యుండడానికి అంగీకరించుటచే, (వివిధ) జాతుల సోవియటు రిపబ్లిక్‌ల ఫెడరేషనుగా ఏర్పడింది.

3. మనిషిని మనిషి దోచుకోవడ మనేది పూర్తిగ లేకుండ చేయడము ; సమాజము తరగతులుగా విభజించడము

ఇక యెప్పటికి లేకుండ చేయడము; దోచుకొనుచుండే వారిని నిర్దాక్షిణ్యంగా అణచివేయడము; అన్ని దేశాలలోను సోషలిస్టు సమాజ నిర్మాణమునూ, సోషలిజము యొక్క విజయమునూ తేవడం; ఇవి ప్రధానమైన (మూలభూతమైన) ఉద్దేశాలు. వీనితోపాటు, ఈ క్రిందివానిని కూడ, కార్మికుల, సైనికుల, రైతుల ప్రతినిధులతో కూడిన మూడవ అఖిల రష్యను సోవియటు కాంగ్రెసు, అంగీకరించుచున్నది.

(ఎ) "పొలమును సమాజాధీనము గావించబడింది. అంటే, పొలము ఇక ముందు ఏ వ్యక్తి యొక్క సొంత ఆస్తిగా ఉండదు. పొల మంతయూ జాతి అంతటి సొత్తు. అది పని చేయు ప్రజా సామాన్యానికి, ఎట్టి పరిహారము పుచ్చుకొనకయే ఇచ్చివేయబడింది. దానిని న్యాయమగు రీతిని విభజించుకోవచ్చు. కేవలము దానిని ఉపయోగించుకొనే హక్కు మాత్రమే ఇవ్వబడింది.

(బి) అడవులు, భూగర్భమందున్న ఖనిజ సంపత్తు, దేశమునకంతయు ప్రధానమైన జలాశయములు, పశువులు వానికి సంబంధించిన ఉపకరణములు, మోడల్ వ్యవసాయ కేంద్రాలు, జాతి అంతటి సొత్తు.

(సి) ఫ్యాక్టరీలను, పరిశ్రమలను, దుకాణాలను, గనులను, రైలు మార్గాలను, తదితర ఉత్పత్తి సాధనాలను, రాకపోక సాధనాలను, కార్మిక కర్షక సోవియటు రిపబ్లిక్ వశము చేయుటకునూ, ఈవరకు దోచుకొంటూ ఉండే వారిపై పనిచేసే ప్రజాసామాన్యము యొక్క ఆధిక్యతను కాపాడడానికినీ మొదటి మెట్టుగా పరిశ్రమలపై కార్మికుల అధికారాన్ని, జాతీయ ఆర్థిక సంఘమును ఏర్పరచింది. దేశంలో ఉన్న సమాజిక సంబంధాలను వివరిస్తుంది సోవియటు కాన్స్టిట్యూషను.

అందుచే, సోవియట్ యూనియన్ ఎంతవరకు అభివృద్ధి చెందినదీ, ఈ పై డిక్లరేషనును, 1937 లో వచ్చిన నూతన రాజ్యాంగ ప్రణాళికలోని డిక్లరేషనుతో పోల్చి చూస్తే వెల్లడవుతుంది. 1918 లో సోవియటు రష్యా సోషలిజము తేవడము ఉద్దేశమని ప్రకటించింది. 1937 లో తన సమాజము సోషలిస్టు సమాజ మైనదని ప్రకటించింది. ఈ మార్పు ప్రజల యొక్క హక్కుల నిర్వచనములో కూడ కన్పడుతుంది. 1937 లో ఇవ్వబడిన హక్కులు 1918 లో కేవలం ఆదర్శంగా మాత్రం చెప్పబడ్డాయి.

## బ్రెస్టు లిటోవ్స్కు సంధి.

మిత్రమండలినుండి యుద్ధవిరామ సూచనలకు ఎట్టి అంగీకార సూచనలు రాకపోవుటచే, జర్మనీతో విడిగా సంధి చేసుకొనుటకు నూతన ప్రభుత్వం "ట్రాట్స్కీని" పంపింది. జర్మనీ విపరీత కోర్కెలు కోరిందని, ట్రాట్స్కీ "యుద్ధం లేదు: సంధిలేదు" అని ప్రకటన చేస్తూ తిరిగి వచ్చాడు. కాని లెనిన్ ఈ నినాదంలో అర్థము లేదనీ, శత్రువులు దేశాన్ని ఆక్రమించుతూన్నపుడు, యుద్ధమైనా చేయాలి. లేదా శత్రువుల కోర్కెల ఒప్పుకొంటానికి రాజీ అయినా చేసుకోవాలి అన్నాడు. ప్రజలు శాంతిని కోరుచున్నారు. యుద్ధంచేసే స్థితిలో లేరు. కాన జర్మనులేమి కోరినా సరే సంధి చేసుకొమ్మన్నాడు. ట్రాట్స్కీ బుఖారిన్‌లు వ్యతిరేకించినా లెనిన్ సూచన పార్టీ అంగీకరించింది. ట్రాట్స్కీ, జర్మనులతో బ్రెస్టు లిటోవ్స్కు వద్ద సంధి పత్రంపై సంతకం చేసాడు.

## అంతర్యుద్ధము.

క్రొత్తగా ఏర్పడిన శ్రామిక ప్రభుత్వానికి అన్నివైపులా శత్రువులే. దేశంలోని పదచ్యుతులైన వర్గాలు, కోల్పోయిన తమ అధికారాన్ని తిరిగి సంపాదింప విద్రోహాన్ని ప్రారంభించాయి. బ్రిటను, అమెరికా, ఫ్రాంసు, కేపిటలిష్టు ప్రభుత్వాలు కోట్లకొలది ధనం, ఆయుధసామాగ్రి, సైన్యాలను పంపి విద్రోహులకు సాయంచేయుటచే ఈ అంతర్యుద్ధం నాల్గు సంవత్సరాలు సాగింది. చివరకు వివిధ దేశాలలోని కార్మిక వర్గం మేల్కొంచి కార్మిక ప్రభుత్వాన్ని భగ్నంచేయాడానికి పంపుచున్న ఆయుధ సామాగ్రిని రవాణా చేయనిరాకించుటతో విదేశ సహాయం ఆగిపోయింది. ఈ సమయములో సోవియట్ ప్రభుత్వం అవలంబించిన పాలసీని 'వార్ కమ్యూనిజమం' టారు. అంటే యుద్ధంకోసం, పంటలను, పరిశ్రమలను, ఉత్పత్తి విధానమంత వినియోగించడం. 1923 జూలై 6వ తారీఖున, అది వరకు రష్యను జారుసామ్రాజ్యంలో ఉండి, యుద్ధాంతరము స్వతంత్రముపొంది సోవియటు రిపబ్లిక్కులను స్థాపించుకొన్న నాల్గు దేశాలు, సోవియటు యూనియనుగా ఏర్పడ్డాయి. అట్టి రాష్ట్రాలలో రష్యా ఒక్కటి. యూనియనుగా ఏర్పడినప్పుడీ ప్రధాన సూత్రమును అవలంబించాయి.

సమాన హక్కులుగల వివిధ జాతుల యొక్క ఈ యూనియను (సమ్మేళనము) పూర్తిపూర్తిగా ఈ వివిధ జాతుల స్వేచ్ఛాభీష్టము మీదనే ఉండును. ఈ యూనియను ఒకే జాతిని నిర్బంధించదానికెట్టి అవకాశమునులేదు. యూనియన్‌లో ఉండమని ఏ జాతినికూడ నిర్బధించుట కెట్టి అవకాశమునులేదు. ప్రతి జాతియు తన కిష్టమువచ్చినప్పుడు యూనియనును వదలిపోవుటకు హక్కుగలదు. భవిష్యత్తున ఏర్పడు సోషలిష్టు రిపబ్లిక్కులు యూనియనులో తమంతట తాము చేరుటకు పూర్తిగా అవకాశముంది.

## న్యూ ఎకనమిక్ పాలసీ.

1913 నుండి 1917 చివరకు ప్రపంచ సంగ్రామము 1918 నుండి 1922 వరకు అంతర్యుద్ధమువలన రష్యా ఆర్థిక స్థితి నీరసించి పోయింది. ఉత్పత్తి పరిశ్రమలు వ్యవసాయం కూడ క్షీణించింది. ఈ పరిస్థితులనుండి బయట పడటానికి, వ్యక్తిగత వ్యాపారానికి ఉత్పత్తికి కొంత అవకాశమిచ్చారు. కార్మిక ప్రభుత్వం లాభంకొరకు వ్యాపారం సాగించే వారిపై అజమాయిషీ చేస్తూ వారు సౌకర్యాలను దుర్వినియోగం చేయకుండా జాగ్రత్త తీసు కొనేది.

## ఐదేండ్ల ప్రణాళిక

1928 నుండి సోవియటు ప్రభుత్వం ఐదేండ్ల ప్లానులు వేసి దేశ సౌభాగ్యాన్ని పెంపొందించడానికి తీవ్ర కృషి చేసింది. మొదటి పంచవర్ష ప్రణాళిక ద్వారా దేశములో ప్రధానముగా యంత్రాలను తయారు చేయు పరిశ్రమలను స్థాపించిరి. దీనివలన రష్యాపై ఏ దేశమూ దాడి ఎత్తినా ఆత్మరక్షణకు కావలసిన ఆయుధ సామగ్రిని తయారు చేసుకోడానికి వీలు గల్గింది. అంతేగాక రెండవ పంచవర్ష ప్రణాళికల వలన ప్రజా సామాన్యానికి ఉపయుక్తములగు సామగ్రిని విరివిగా తయారు చేయుటకు సాధ్యమయింది. ఈ రెండు పంచవర్ష ప్రణాళికల వలన పారిశ్రామికంగా సోవియటు యూనియను ఎన్నోరెట్లు అభివృద్ధిజెందడమేగాక, సోవియటు యూనియనులోని ప్రజాసామాన్యానికి కావలసిన ఆహారమంతా కూడ ఉత్పత్తి చేసుకో గల్గుతూ ఉంది. ఇది సాధ్యమయ్యేటట్లు చేసింది స మి ష్టి వ్య వ సా య ము. నేడు రష్యాలో సమిష్టి వ్యవసాయము మొత్తము వ్యవసాయములో నూటికి 98 పాళ్లు. ఈ రెండు ప్రణాళికలను జయప్రదంగా నెరవేర్చబట్టి సోవియటు యూనియనులో తరగతి విభేదము కూడ లేకుండా పోయింది. ప్రతివాడు పనిచేసేవాడుగ అయ్యాడు. పనిచేసే అలవాటు, పనిచేసేవాడి దృక్పథం అలవడింది.

## నియంత పరిపాలనా ?

సామాన్యంగా రష్యాను కూడా బూర్జువా పత్రికలు నిరంకుశ పాలన సాగుచున్న నియంతృత్వమని ప్రచారం చేస్తాయి. నూటికి 90 మంది అయిన కష్టజీవుల పరిపాలన రష్యాలో సాగుతూంది. ప్రతి వ్యక్తి అచట పౌరుడుగా, ఉత్పత్తిదారుడుగా, వస్తువినిమయదారుడుగా (వస్తువుల కొనేవాడుగా) హక్కులను కలిగివున్నాడు. సమాజ మంతటి క్షేమమునకు భంగకరము గానిచో అన్ని స్వేచ్ఛలను పొందవచ్చును. అచట నిరుద్యోగం లేదు. పనిచేసే వాని కష్ట ఫలితాన్ని దోచుకొనే పెట్టుబడిదారుడు లేడు. పిల్లల రక్షణకు తదితర ప్రభుత్వాల కంటె సోవియటులో ఎక్కువ శ్రద్ధ తీసికొంటున్నారు, స్త్రీ, పురుష తారతమ్యం లేదు. అందరూ పని చేయాలి. పనినిబట్టి కూలి ఇస్తారుగాని మతాన్ని, జాతిని, హోదాను బట్టి గాదు ఇచ్చేది. స్త్రీలకు జీతంపై సెలవు, ప్రత్యేక సౌకర్యాలు. అచట ప్రజా సామాన్యం రాజ్యాంగాన్ని నడపటానికి, సలహా లివ్వడానికి సమానఅవకాశాలున్నాయి. అయినచో రష్యన్ ప్రభుత్వాన్ని "డిక్టేటరు షిప్" అని ఎందుకు పిలుస్తారు ?

కమ్యూనిస్టులు, "ప్రభుత్వము" (State) నకు తక్కిన వారివలెగాక ప్రత్యేక అర్థం చెప్పుతారు. ప్రభుత్వం (యేరకము దైనాసరే) ఒక వర్గం, తక్కిన ప్రజలపై తన అధికారం చెలా యించుటకేర్పడిన నిర్మాణమే అని అంటారు. రాచరికం అయినా, పార్లమెంటరీ ప్రభుత్వాలయినా ధనికవర్గాలు ప్రజాసామాన్యాన్ని అణచి లాభాలు పొందుట కేర్పడినవే నంటారు. లెనిన్ చెప్పినటుల అమెరికా ఇంగ్లాండులో ఉండేలాంటి పార్లమెంటరీ ప్రభుత్వాలు, ధనికవర్గాల నియంతృత్వం, సోవియటు ప్రభుత్వం కార్మిక కర్షకుల నియంతృత్వం. అవి నూటికి పదిమంది ప్రజాపరిపాలన అగుచో సోవియటులు నూటికి 90 మంది ప్రజాపరిపాలన.

1936కి సోవియటు యూనియన్‌లో వర్గాలు నశించుటచే 1936 డిసంబరు 5వ తారీఖున ఏర్పరుచబడిన నూతనరాజ్యాంగ విధానంలో నూటికి నూరుమందికి అనుకూలమైన ప్రజాపరిపాలన యేర్పాటు చేసారు. ప్రజలకు యీ క్రింది హక్కులు యివ్వబడినాయి.

1. సోవియటు ప్రజలు పనిచేయు హక్కుకలిగి వుంటారు. అనగా వారికి పనియూ, పనిని బట్టి వేతనమూ గ్యారంటీ చేయబడుతూంది

2. పౌరులందరు విశ్రాంతి తీసుకొను హక్కును కలిగియున్నారు. దినమునకు 7 గంటలే పని నిర్ణయించబడింది. జీతముపై సెలవు, విశ్రాంతిమందిరాలు, ఆరోగ్యపురాలు వారికొరకు నిర్మించబడ్డాయి.

3. సోవియటు పౌరులకు వృద్ధాప్యంలో, జబ్బులో, పనిచేయలేని దశలో వారికి సర్వ సౌకర్యాలు చేకూర్చుటకు ప్రభుత్వఖర్చుపై భీమా, ఉచిత వైద్యము యేర్పాటు చేయబడింది.

4. పౌరులందరు విద్యపొందుటకు హక్కుకల్గి వున్నారు ప్రజలందరికి నిర్బంధ ప్రాథమిక విద్య వారివారి జాతీయ భాషలలో ఏర్పాటు చేయబడింది, ఉన్నత విద్య ప్రభుత్వపు స్టైఫెండు ఫండుతో అందరికి అందుబాటులో ఉంచబడింది. ఫాక్టరీలు, వ్యవసాయస్థానాలు, ట్రాక్టర్ స్టేషన్లలో ఉచితంగా పారిశ్రామిక, వ్యవసాయక విద్య యేర్పాటు చేయబడింది.

5. సోవియటు స్త్రీలు ఆర్థిక, ప్రభుత్వ, రాజకీయ, విజ్ఞాన, సామాజిక విషయాలన్నిటిలోనూ, పురుషులవోపాటు సమాన హక్కులు కలిగి వున్నారు. పురుషులతో సమంగా పనిని బట్టి వేతనము, విశ్రాంతిహక్కులతోబాటు, స్త్రీలకు ప్రసవ సమయాల్లో జీతంపై సెలవు, బిడ్డలకు పోషకాలయాల యేర్పాటువుంది.

6. జాతి విచక్షణ లేక సోవియటు పౌరులందరు సమానమయిన హక్కులు కలిగియున్నారు.

ఈ హక్కులను యే సోవియటు పౌరులకైనను వారి జాతి, పుట్టువుల కారణంచే నిరాకరించుట లేక తగ్గించుట శిక్షార్హము.

7. సోవియటు ప్రజలందరు ఆత్మ, మత స్వాతంత్ర్యమును కలిగి వుందురు. ప్రభుత్వము, విద్యలతో మతమునకు సంబంధము లేకుండా చేయబడి, ఎవరిష్టమున్న మతమును వారవలంబించుటకును, మత వ్యతిరేక ప్రచారము చేయుటకును కూడ పౌరులందరికి స్వాతంత్ర్య ముంది.

8. కష్టజీవుల లాభము కనుగొనుచునట్టియు, సోషలిస్టు విధానము బలపరచునట్టియు వాక్, పత్రికా, సభా, సమావేశ ఊరేగింపు స్వాతంత్ర్యములను సోవియటు పౌరులు కల్గివున్నారు. ఈ హక్కుల ప్రజలనుభవించుటకు అచ్చు కూటములు, పేపరు, పబ్లిక్ కట్టడాలు, వీధులు, బహిరంగ స్థలాలు, ఉపయోగించుకోవచ్చును.

9. కష్టజీవుల లాభంకొరకు. ప్రజల రాజకీయ చైతన్యాభివృద్ధి కొరకు, సోవియటు పౌరులు సంఘాలుగా ఏర్పడుటకు హక్కు కలిగివున్నారు. వివిధ సంఘాలలో చైతన్యం నైపుణ్యం సంపాదించిన వారు సోవియటు కమ్యూనిస్టుపార్టీలో చేరి, సోషలిస్టు విధానాన్ని అభివృద్ధిపరచే హక్కును కల్గివున్నారు.

10. సోవియటు పౌరులకు వ్యక్తి రక్షణ పూచీ యివ్వబడింది. ఎవరూ కోర్టు ఉత్తరువు గాని లేక ప్రభుత్వ ప్లీడరు అనుమతి గాని లేకుండా అరెస్టు చేయబడరు.

11. పౌరుని ఇండ్లలో అతని అనుమతి లేనిదే ఇతరులు ప్రవేశింపకుండునట్లును, ఉత్తర ప్రత్యుత్తరాల రహస్యం శాసనం ద్వారా కాపాడబడుతూంది.

12. విదేశాలలో కష్టజీవుల హక్కుల రక్షణకు, శాస్త్ర పరిశోధన కొరకు, బాధితులైన వారికినీ జాతీయ-స్వాతంత్ర్య సంపాదనకు జరుగు పోరాటాలలో బాధితులకునూ-సోవియటు యూనియను ఆశ్రయమిస్తుంది.

13. సోవియటు పౌరు లందరు సోవియటు శాసనాలను, రాజ్యాంగాన్ని గమనిస్తూ • కార్మిక డిసిప్లిన్ (కట్టుబాటు)తో తాము సమాజానికి చెయ్యాలసిన విధిని నెరవేర్చవలెను. సోషలిస్టు సమాజపు నియమాలను గౌరవించవలెను.

14. ప్రభుత్వం, ప్రజా సంస్థల యొక్క సోషలిష్టు ఆస్థి, శ్రామికుల సౌఖ్యము, విజ్ఞానయుత జీవితానికి పునాది. సోవియటు, మాతృభూమియొక్క శక్తి సంపదలకు పునాది. సోవియటు విధానానికి ప్రాణాధారము. అట్టి సోషలిస్టు ఆస్తిని ప్రతి సోవియటు పౌరుడూ రక్షించాలి; బలపరచాలి. నష్టం కల్గించు వారు ప్రజల శత్రువులుగా యెంచబడుదురు.

15. పౌరు లందరూ మిలిటరీ శిక్షణ పొందాలి. కార్మిక కర్షకుల రెడ్ సైన్యంలో పని చేయుట సోవియటుపౌరుల గౌరవప్రదమైన విధి.

15. సోవియటు యూనియన్ రక్షణ పౌరు లందరి పవిత్ర విధి. దేశ ద్రోహం, నమ్మక ద్రోహం, శత్రువులతో కలియుట, ప్రభుత్వ సైనిక బలానికి నష్టం కలుగజేయుట, సైనిక రహస్యాలను ఇతరులకు తెలియజేయుట కఠిన శిక్షార్హములు.

కొందరు చెప్పునట్లు సోవియటు యూనియను 'రష్యా రాజ్యం' కాదు. బోల్షివిక్కు లధికారంలోకి రాగానే జార్ రాజ్యంలోని వివిధ జాతులకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగబడినది.. చీలిపోవుటకు కూడ స్వతంత్రతగల్గిన 11 సోషలిస్టు సోవియటు రిపబ్లిక్‌లు (వానిలోని 22 స్వతంత్ర రిపబ్లిక్‌లు, 14 స్వతంత్ర • ఆబ్లాస్టులు)కలసి యునైటెడ్ సోషలిస్టు సోవియటు రిపబ్లిక్‌గా ఏర్పడినాయి.

వివిధ శాఖల్లో సోవియటు యూనియన్ పొందిన వికాసాన్ని, ప్రపంచ శాంతికి దాని ప్రయత్నాలను, ఆర్థిక, రాజ్యాంగ విధానాలను గురించి ఇతర వ్యాసాలలో విపులంగా చర్చించబడతాయి.

. 21 యేండ్లనాడు నవంబరు విప్లవాన్ని జయప్రదంగా నడిపి, భూఖండంలో ¼ వంతు భాగాన కార్మిక కర్షక ప్రభుత్వాన్ని స్థాపించి. ప్రపంచ కష్టజీవులకు దీప్తి నిచ్చు తారవలె ప్రకాశించుచున్న బోల్షివిక్ పార్టీకి (సోవియటు కమ్యూనిస్టు పార్టీకి) జేజేలతో యీ వ్యాసం ముగించుదాం!

## భళీ! బోల్షివిక్!!

ఆకాశం నిర్మలం
వెలుంగు మరగుపరచే రాత్రి కాదు
జార్ లేడు—స్వతంత్రులు ప్రజలంతా
భళీ! బోల్షివిక్!

ఎంతో కాలం నుంచి
మూకల దోపిడి చేసే నిరంకుశుల అణచావూ
విజయంలో బీదలంతా భాగం కొన్నారూ
భళీ! బోల్షివిక్!

నీవు తెచ్చిన సౌఖ్యంతో
నే పొందిన విజ్ఞానంతో
విన్నది కన్నది నే పాడానూ,
భళీ! బోల్షివిక్!

గుళ్ళు గోపురాల్ స్కూళ్లుగ మార్చావూ
అజ్ఞానంలో వున్న ప్రజలంతా
నీవు తెచ్చిన విజ్ఞానం నేర్చుకొంటారు
భళీ! బోల్షివిక్!

మూఢ నమ్మకాల్ వదిలేసి
కాలం వృథాపుచ్చకుండా
ప్రపంచ కష్టజీవులంతా మేల్కొండి
మరగు పరచిన దారి చూపే
బోల్షివిక్ వెలుంగదిగో
ఐక్యత నిర్మించండి, పోరాటం సాగించండి,
కొల్లబోయే దేమీ లేదు,
విందు సౌఖ్యము రానున్నది.

(కార్ మొల్లీ)



# సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో...

కామ్రేడ్స్

## డాక్టర్ వుప్పల లక్ష్మణరావు
## మెల్లీ సోలింగర్ లక్ష్మణరావు

[లక్ష్మణరావు దంపతులు స్వయంగా రష్యాను దర్శించారు. ఎక్కువ అనుభవం గడించారు. అట్టి వీరు 'కోల్‌ఖోజ్' (సమిష్టి వ్యవసాయ క్షేత్రం) ను గురించివ్రాసిన వ్యాసాన్ని ప్రకటించడానికి ఎంతో సంతసించుతున్నాం.—సంపాదకుడు.]

రష్యాలో వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి సోవియట్లు చేసిన కృషిని గురించి పుస్తకాల్లో చదివితే నమ్మడానికి వీల్లేకుండా వుంటుంది. ఈ అద్భుతాన్ని కళ్ళారా యెప్పుడేనా చూడ గలుగుతామా అని మాకుండేది. అంచేత మాస్కో చేరగానే అక్కడికి నలభై మైళ్ళ దూరంలో వున్న వక "కలక్టివ్ ఫారమ్"ని చూడడానికి వెళ్ళాం.

యీ కలక్టివ్ ఫారమ్ మొదట 1929 లో 70 రైతు కుటుంబాలు కలిసి ప్రారంభించారట. యవరిమట్టుకు వారు వ్యక్తిగతంగా పొలందున్నుకొని పండించుకుంటే వుండే సాధక బాధకాలు అనుభవించిం తరువాత, అందరూ కలిసి సంయుక్తంగా వ్యవసాయం చేసుకుంటే వుండే లాభాలు స్వయంగా తెలుసుకున్నారు. చుట్టుప్రక్కల రైతులు కూడా చూసి, స్వంత శేరీలు మానుకుని వీళ్ళతో కలిశారు. మొదట యే 70 కుటుంబాలు కలిసి చేరారో—ఈవాళ 150 కుటుంబాలు కలిసి—మొత్తం 600 మంది వ్యక్తులు—కలిసి యీ "సంయుక్త శేరీ"లో వ్యవసాయం చేస్తున్నారు. యీ ఆరువందల జనం ఆ వక్క పల్లెటూరులోనే వుంటారు. ఆపల్లెటూరు, ఆగ్రామం చుట్టూవున్న భూములు, తోటలూ, నివేశనాలు—అన్నీ వాళ్ళవి.

ఈ కోల్‌ఖోజులో ఈ ఆరువందల వ్యక్తులు కలిసి పెట్టుబడి పెట్టిన సొమ్ము—అంటే పశువులు, యెడువులు, మోటారు ట్రాక్టర్లు, మరనాగళ్ళు ఇంకా వ్యవసాయానికి కావలసిన పరికరాలు, గుర్రాలు, పంటసామగ్రి నిలవ వుంచడానికి కొట్లు—మొత్తం మీద 5,00,000 రూబుల్సు విలువ వుంటుంది. అంటే 2,50,000 రూపాయలు అన్నమాట.

సాలీనా పండేపంటలో, ప్రతివ్యక్తీ—మొగవాడు, ఆడది, ముసిలివాళ్ళు, పడుచువాళ్ళు ఎన్నిగంటలు పనిచేశారో లెక్కకట్టి, ఎవరి వంతు వాళ్ళు పంపకాలు వేసుకుంటారు. పంచుకొనేముందు మాత్రం - గవర్నమెంటుకు కట్టవలసిన పన్ను మొదట చెల్లించేయాలి, తరువాత పద్ధతి ప్రకారం వచ్చే సంవత్సరం వ్యవసాయానికిగాను విత్తనాలకి కావలసిన మొత్తం వేరే పెట్టేయ్యాలి. మిగిలిన దాంట్లోనుంచి గవర్నమెంటు పద్ధతుల ప్రకారము ఆ కోల్‌ఖోజులో పాల్గొనే ప్రతివ్యక్తీ "అనారోగ్య భీమా" (Sickness insurance) కోసం కావలసిన సొమ్మున్నూ, పశువులు, మోటారు ట్రాక్టర్లు వగైరాల భీమా కోసమున్నూ విధిగా కొంత సొమ్ము వెనకవెయ్యాలి. యీలాగే సాదరు, కంటింజన్సీలు (contigencies) వగైరా బాపతుల క్రింద వెనక వేసేయగా మిగిలిన మొత్తం అందరూ ఎవరు ఎంత కష్టపడ్డారో ఆకష్టం ప్రకారం పంచు కుంటారు.

ప్రతీ మెంబరు తన భాగాన్ని తన యిష్ట ప్రకారం వినియోగం చేసుకోడానికి సంపూర్ణం అయిన హక్కుంది. తనకి మనసువుంటే తన భాగానికొచ్చిన పంటని అంతా నగదుకి అమ్ముకోవచ్చు. లేదూ—కొంత భాగమే అమ్ముకొని, మిగతాదాన్ని తన భుక్తి కోసం వినియోగం చేసుకోవచ్చు. అమ్ముకోవడం కూడా—పట్నంలోకి పోయి, అక్కడ మార్కెట్టులో అమ్ముకోవచ్చు — లేకపోతే తన కోల్‌ఖోజ్‌కే అమ్మవచ్చు. ఎలాగ చేసినా, ఎవ్వరూ ఏమీ ఆపడానికి వీలులేదు.

మరో సంగతి. సాలీనా పండేపంట పంపకం చేసుకోడంలో, కొంత నగదు రూపంగాను, కొంత వస్తు (ధాన్యం, కూరగాయలు, గడ్డి వగైరా) రూపకంగాను ప్రతీ మెంబరుకీ ముట్టుతుంది.

మొత్తం పంటలో భాగం కాకుండా—ప్రతీ కుటుంబానికి వాళ్ళ స్వంత యిల్లు, యింటితో పాటు. కూరగాయలు పండించుకోడానికి దొడ్డి, స్వంత పశువులు ఉంటాయి! ఎవరి ఇల్లు వాళ్ళదే, ఎవరి పశువుల పాడి వాళ్ళదే, ఎవరి దొడ్లో పండిన కూరగాయలు వాళ్ళవే, అవి వాళ్ళ వాళ్ళ వ్యక్తిగతమైన ఆస్తికిందే గవర్నమెంటు శాశించేశారు.

ప్రతీ కోల్‌ఖోజూ, ఒక్కొక్క కో ఆపరేటీవు సొసయిటీ మోస్తరు అనుకోవచ్చు. (డైరెక్టర్లు అప్పులివ్వడం, కమీషన్లు కొట్టడం, బినామీ వ్యవహారం మినహా!) ప్రతీ కోల్‌ఖోజు వ్యవసాయం పనే కాకుండా, వాళ్ల మొత్తం పెట్టుబడితో, వాళ్ళ గ్రామంలోనే కొన్ని పరిశ్రమలు ఫ్యాక్టరీలు కూడా నడుపుతారు. మేం చూసిన కోలుఖోజుకి రంగుల ఫ్యాక్టరీ ఉంది. అది ఆ కోల్‌ఖోజు స్వంత ఆస్తి. ఆ ఫ్యాక్టరీ వల్ల వచ్చేరాబడి, అందరూ పంచుకుంటారు.

మామూలుగా, ఒక కలక్టివ్ ఫారములో వుండే ప్రతీ వ్యక్తిని—ముసలాళ్లు, చంటివాళ్లు మినహాయించి—పని చేయవలసిందే. మొత్తం మెంబర్లనందరినీ నాల్గు "బ్రిగేడ్సు"

**(brigades)** గా భాగిస్తారు. రెండు బ్రిగేడ్సుకి వ్యవసాయం పని వప్పజెప్తారు. వక బ్రిగేడుకి కూరగాయల వ్యవసాయం పని, నాల్గో పటాలానికి పశువులను చూడడం. ఇలాగ—సైన్యం నిర్మాణం, శిక్షణ ఎలాగుంటుందో—సరీగ్గా అలాగే యీ కలక్టివు ఫారములు, వాటి రైతులు అలాగే పనిచేస్తారు.

శేరీమీద చేసే ప్రతీ పనికీ—గంటకి ఇంత కూలీ అని గవర్నమెంటే నిర్ణయం చేస్తుంది. ఆ ప్రకారం—ఎవరు ఎన్ని గంటలు పని చేశారో — చూసుకొని — ప్రతీరోజూ జీతాలు నగదులో ఇచ్చేస్తారు.

మేం చూసిన ఫారంలో 500 ఎకరాల భూమి సాగుబడి చేస్తున్నారు. దీనిలో 175 ఎకరాలు బంగాళా దుంపల కింద ఉంది. అదే వాళ్ళకి ముఖ్యం అయిన పంట. తరువాత—100 యకరాలు ఫల వృక్షాలకింద,ముఖ్యంగా ఆపిల్సు తోటల కింద—మరో 175 యకరాలు గోధుమలు కింద; 50 యకరాలు కూరగాయల కింద. యీ కలక్టివు ఫారం, విస్తీర్ణం, మెంబర్లు సంఖ్య పట్టి చూస్తే—చాలా చిన్న శేరీ కిందే లెఖ్క. కొన్ని కొన్ని పెద్ద కలక్టివు ఫారాల్లో ఒక్కొక్క ఫారంలో 125,000 ఎకరాలు వ్యవసాయం చేస్తారు; ఒక్కొక్క ఫారంలో 15,000 మెంబర్లు! ఎంత పెద్ద సంస్థలో, వాటి పలుకుబడి ఎంతుంటుందో, ఎంతెంత పంటలు పండిస్తాయో, దేశం యొక్క ఆర్థిక జీవనం లోని ఎంత ముఖ్యం అయిన స్థానాన్ని ఆక్రమిస్తున్నాయో ఆలోచించండి !!

1936 సంవత్సరంలో మేం చూసిన యీ కలక్టివు ఫారంలో, ఒక్కొక్క మెంబరుకి రోజుకి కూలి కింద, నగదు రూపంగా 15 రూబుల్సు—అంటే రూ 7-8-0 న్ను, 30 కిలో గ్రాములు-అనగా 80 వీశెలు పళ్లూ కూరగాయలున్నూ. ముగ్గురున్న కుటుంబం-అంటే తండ్రీ, తల్లీ, కొడుకు వున్న కుటుంబం యొక్క సాలీనా వ్యవసాయం మీద వచ్చే రాబడి లెక్క వేస్తే: 15,000 రూబుల్సు-అంటే రూ 7,500 నగదున్ను, 30 టన్నులు కూరగాయలున్ను — ముడుతున్నాయని వాళ్ళు చెప్పారు. మన దేశానికి అక్కడికి ఎంత వ్యత్యాసం అనిపించింది !

సంవత్సరానికి కొకసారి అందరు మెంబర్లు కలసి సభ చేస్తారు. వ్యవహారాలు జరపడానికి గవర్నమెంటువారు యేర్పరచిన పద్ధతుల ప్రకారం ఐదుగురిని కార్యనిర్వాహక సంఘంగా ఎన్ను కుంటారు. ఒకడు ప్రసిడెంటు, మరొకతను వైస్-ప్రెసిడెంటు, ముగ్గురు కార్య నిర్వాహక సభ్యులు. ప్రెసిడెంటుకి, వైస్-ప్రెసిడెంటుకి, జీతాలిస్తారు-వాళ్లు కాయ కష్టం పడనక్కరలేదు. మిగతా ముగ్గురు మెంబర్లు మాత్రం, అందరిలాగే పని చెయ్యాలి. కార్య నిర్వాహక సంఘం వాళ్లు ఇద్దరు గుమస్తాలని నెల జీతాలమీద వేసుకున్నారు. జమా ఖర్చులు వెయ్యడానికిన్ని రాతకోతలకిన్ని వీళ్లు. పై వాళ్లు కలక్టివు ఫారం మెంబర్లుకారు. గవర్నమెంటు వారు నిర్ణయించిన జీతాల ప్రకారం, గుమాస్తాలకి జీతం ఇవ్వాలి. ఒక్కొక్కళ్ళకి 200 రూబుల్సు-అంటే 100 రూపాయల జీతం యిస్తున్నాం అని చెప్పారు. ఇంతే కాకుండా:— గోధుమ పంట కోసం ఒక వ్యవసాయ శాస్త్రవేత్తని, ఆపిల్సు తోటలమీద వక నిపుణుడిని, కూరగాయల పంట గురించి ఏక అధికారిని, పశువుల అభివృద్ధి కోసం వక శాస్త్రజ్ఞుణ్ణీ— గవర్నమెంటువారి సలహాపైని, ఒక్కొక్కడికి 500 రూబుల్సు, 600 రూబుల్సు జీతాల మీద పెట్టుకున్నారు.

కేంద్ర సోవియటు విధానం ప్రకారం—ప్రతీ కలక్టివ్ ఫారమున్ను, అ ఫారంతో వుండే కుటుంబాల వారి పిల్లల తర్ఫీదుకోసం ఒక కిండరుగార్టెను—స్థాపించి, దాన్ని సాగిస్తుండాలి. కిండరుగార్డెనులో 3 ఏళ్ళనుంచి 8 ఏళ్ళ వరకు వయస్సుండే పిల్లలకి, శుచి, శుభ్రం, ఆరోగ్యం — ఇలాంటివి చెపుతారు. అంటే పాఠాలు, పుస్తకాలవల్ల కాదు. మేం వెళ్ళినపుడు—కొందరి పిల్లలకి స్నానాలు చేయిస్తున్నారు, కొందరికి పళ్లు తోముతున్నారు. కొందరి చేత చిన్న చిన్న బట్టలు వుతికిస్తున్నారు, కొందరికి, టూత్‌బ్రష్ ఎలా ఉపయోగించడమో, బోధిస్తున్నారు. ఇక, రంగులు, వాటిని పోల్చుకోవడం—సంఖ్య. ఒకటి, రెండు, మూడు, సంఖ్యా జ్ఞానం—బొమ్మలు గీయడం—సంగీతం—నాట్యం — అభినయం — ఇవీ పిల్లలికి చెప్పేవి! ఓనామహాలు—పుస్తకం పట్టించడం-ఎక్కాలు—అసలు చెప్పకూడదని గవర్నమెంటు రూల్సు. పిల్లలు, 8 ఏండ్లు దాటేవరకు ఏమి నేర్చుకున్నా ఆడుతూ పాడుతూ నేర్చుకోవలసిందే.

ఈ కిండరుగార్టెనులో ముగ్గురు ట్రెయినింగైన ఉపాధ్యాయులు, ఇద్దరు నర్సులున్ను వున్నారు. కిండరుగార్టెను పిల్లల కోసం ఒక సినిమా-హాలు అందులోనే వుంది.

పెద్దవాళ్ళ కోసం ఒక్క క్లబ్బుంది. పత్రికలు, బిలియర్డ్సు, మీటింగులకి హాలు అందులో వున్నాయి. క్లబ్బు హాలులో గోడలమీద స్పెయిను, చైనా, పటాలు **(maps)** పెద్దవి వున్నాయి. లెనిన్, స్టాలిన్, వోరోషిలావు, కాలినిన్, మొదలైన నాయకుల పోటోగ్రాపులు వున్నాయి. ఒక సినిమా హాలు కూడా ఉంది.

యీ కలెక్టివు ఫారానికి 5 మోటారు లారీలున్నాయి. మెంబర్లెవరేనా వాళ్ళ భాగానికి వచ్చిన పంటని దగ్గిరవూళ్లో అమ్ముకోవాలంటే యీ లారీలు అద్దెకి తీసుకొని వుపయోగించుకోవచ్చు. అలాగే అద్దె కోసం, గుఱ్ఱపు లారీలు కూడా వున్నాయి.

సోవియటు పద్ధతుల ప్రకారం కూలి ఇచ్చే పద్ధతిమీద ఎవ్వరిచేత పని చేయించ కూడదు. ఎంతో అవసరం వచ్చి, పైవూళ్ళనుంచి, కూలి మీద తీసుకు రావలిసివస్తే గవర్నమెంటు వారి అనుమతి మీద కొంతమందిని, తెచ్చుకోవచ్చు. వాళ్ళకి మాత్రం తమ మెంబర్లకి రోజుకి ఎంత కూలి ఇస్తారో అంత కూలీ పైవాళ్ళకి ఇవ్వవలసిందే కాని తగ్గించి ఇవ్వడానికి వీలులేదు.

సోవియట్సు వచ్చిం దగ్గరనుంచీ వ్యవసాయం పనులు చేయడానికి చాలామట్టుకు మెషీనరీవే వాడుకునేటట్టు రైతులని ప్రోత్సాహం చేస్తున్నారు. దున్నడం, అణవడం మెషనుచేతే. చారలు కట్టడం మెషనే. పంట కోత కోసిన వరిని కట్టలు కట్టడం, కట్టలన్నీ కుప్పలుగా వెయ్యడం సర్వం మెషీనుతే. యేపనికి కావలసిన మెషీను, ఒక మోటారు ట్రాక్టరుకి తగిలించడం ఆ ట్రాక్టరుని పొలంలో నడపించడం. ట్రాక్టరుని తోలేవాడు పొలం అంతట నడుపుతూ వుంటే, వెంబడి వుండే మరయంత్రం యేమో—దున్నడమో — లేకపోతే కోతకోయడమో, లేకపోతే కలుపు తియ్యడమో యేపని అవుసరం అయితే ఆపని అతి అద్భుతంగా వుంటుంది. అందులోకే సోవియటు ఇంజనీర్లు వక కొత్త యంత్రం వకదాన్ని కనిపెట్టారు. అమెరికాలో, జర్మనీలో అక్కడా ఏమిటంటే కోత కొయ్యడానికి ప్రత్యేకించి వక యంత్రం-కట్టలు కట్టడానికి పక యంత్రం, కట్టలన్నీ పోగుచేసి కుప్పలు వెయ్యడానికి మరో యంత్రం—ఇలాగు మూడు యంత్రాలు. సోవియట్టు ఇంజనీర్లు మూడు పనులు వక్క మెషనేచేసి పారేస్తుంది. అందువల్ల ఎంతపని కలిసొస్తుందో యెంత సొమ్ము కలిసొస్తుందో ఆలోచించుకోండి! చూడ్డానికి కన్నుల పండుగ, మహా అద్భుతం!



పూర్వం రష్యాలో ట్రాక్టర్లూలేవు, యంత్రాలూలేవు. ఓనా మహాలు వచ్చిన రయితే వుండేవాడు కాడు. యే గొప్ప మహారాజో (గ్రాండు డ్యూకు) తమాషాకి ఇలాంటి మెషినరీ అమెరికానుంచో, జర్మనీనుంచో, తెప్పించి వినోదంగా వాడుతుండే వారు. రైతు ఎలాచస్తే వాళ్ళకేంగావాలి. వ్యవసాయం ఎలా తగులడితే వాళ్లకేం గావాలి; అలా వుండేది.

ఇప్పుడో అదంతా మారిపోయింది! రష్యాలో తయారు చేసినన్ని మోటారు ట్రాక్టర్లు కొసకి అమెరికాలో కూడా చెయ్యడంలేదు. మొదట రయితులు ఈ ట్రాక్టర్లు వాడడానికి చాలా తకరరు చేశారు. గవర్నమెంటువారు ఎంత నచ్చజెప్పినా, విన్నారుకారు. చివరకి విప్లవాలు కూడా జరిగేయి.

ఇప్పుడు వ్యవసాయదార్లు తెలివి తెచ్చుకున్నారు. మెషినరీ పరికరాలు వుపయోగించడంవల్లా, సంయుక్తంగా వ్యవసాయం చేయడం వల్లా వుండే లాభాలు స్వయంగా అనుభవించి తెలుసుకున్నారు. ఇప్పుడు సర్వత్ర అవే వాడుతున్నారు.

మునుపెలా వుండేవారంటే — మునుపంటే ఎన్నో వందలేళ్ల క్రితంగాదు — పాతికేళ్ళ కిందట — ఇరవై ఏళ్ళకిందట — భూమివున్న రైతే వుండేవాడు కాడు. నూటికి 99 యే గొప్ప భూఖామందు దగ్గిరో రోజు కూలి చేసుకుని బ్రతకవలసిందే. అదృష్టంవల్ల చచ్చీచెడి పొలం సంపాదించు కున్నాడంటే ఎంత పొలం? గోచపాతంత పొలం! ఏం పండించు కుంటాడు; ఏం తింటాడు. ఏం పన్నులు చెల్లిస్తాడు? జోడెద్దులు ఒక పాలిచ్చే ఆవు, ఓ గుఱ్ఱం, పది ఎకరాల భూమివుంటే, మోతుబరి రయితు కిందలెక్క! పది ఎకరాలు దున్నుకోడం అంటే బ్రహ్మాండం అయేది. పది ఎకరాలు దున్నుకుంటే పదిహేను మణుగులు గోధుమలు, 3 మణుగులు బార్లీ గింజలు, 4 మణుగులు ఓట్సు గింజలు పంట, దీంట్లో తన కుటుంబానికి తల్లీ, తండ్రీ, ఇద్దరు కొడుకులూ అనుకుందాం, 9 మణుగులు గోధుమలు తిండికయి పోయేది. బార్లీ, ఓట్సు పశువిలికి, గుఱ్ఱానికి అయిపోయేవి. ఇంక మిగిలింది 6 మణుగుల గోధుమలు. అమ్మితే 50 రూపాయల లాభం. ఇసీ సంవత్సరం పొడుగునా కుటుంబం అంతా కష్టపడితే వచ్చే ఆదాయం! దాట్లో ఇంకా పన్నులు చెల్లించాలి. చివరకి మిగలడమే కష్టంగా వుండేది. ఇక ఆమాత్రం పొలం ముక్కలేని వాళ్ళసంగతి చెప్పే అక్కరలేదు.

ఇప్పుడా-అంతా మారి పోయింది. నా భూమి-నా పంట-నా ఆవులు - నా పశువులు-అని లేదు. అంతా సంయుక్తం-అంతా-మనదే మన దంతా అందరి దిన్నీ.

కలక్టివు ఫారానికి డబ్బుంటే - ట్రాక్టర్లు గవర్నమెంట్ దగ్గరనుంచి నగదిచ్చి కొనుక్కుంటాయి. చిన్న సంస్థలయితే గవర్నమెంటు మొదట ట్రాక్టర్లు సప్లయిచేసి-ఖరీదు వాయిదాలమీద తీర్చుకోనిస్తారు. ప్రతి జిల్లాలోనూ, నాలుగైదు ట్రాక్టరు స్టేషన్లు వుంటాయి. యీ కలక్టివు ఫారంవాళ్లు అక్కడికి వెళ్ళి మాకు ఇన్ని ట్రాక్టర్లు కావాలి - మా శేరీ విస్తీర్ణం ఇంత-అని దరఖాస్తు పెట్టుకుంటే వెంటనే ఇనస్పెక్టరుని పంపించి, భోగట్టా చేయించి ట్రాక్టర్లని శాంక్షను చేస్తారు. సాధారణంగా ట్రాక్టర్ల సొమ్ము పదియేళ్ల వాయిదాలమీద తీర్చుకోవచ్చు. నూటికి 2 చొప్పున వడ్డీ! పంట పండగానే మాత్రం వెంటనే యీ ట్రాక్టర్ల వాయిదాలు గవర్నమెంటుకి చెల్లించేయాలి. వాట్లని ఇన్సూర్యారెన్సు రుసుం ఏ సంవత్సరానికా సంవత్సరం సరీగా కట్టేస్తూండాలి. పంట పండుతే వచ్చే రాబడిలోనించే కదా ఇవన్నీ చెల్లించాలి. వక వేళ పంటలు చెడిపోతేనో? అందుకుగాను పంటలు గవర్నమెంటువారే ఇన్స్యూర్ చేస్తారు. అందుచేత ఏ సంవత్సరమైనా పంటలు చెడిపోతే పస్తుండాలి అన్న భయంలేదు.

సంవత్సరం పొడుగునా రోజు జీతాలు ఇవ్వడానికి ఎరువుకనీ, కిండరు గార్డియనుకనీ, సినిమాలకనీ, ఖర్చుపెట్టడానికి నగదు ఎక్కడిదయ్యా అంటే ప్రతీ కలెక్టివు ఫారం ఒకటో రెండో యంత్రాగారాలో ఫ్యాక్టరీలో నడిపిస్తూంటాయి. ఆ ఫ్యాక్టరీలనుంచి వచ్చే రాబడినుంచి దిన చర్య ఖర్చులు పెడుతూంటారు. ఇంకా లావా దేవీలు గవర్నమెంటు బ్యాంకు ద్వారా జరుగుతూండాలి.

కలక్టివు ఫారాలు కూడా గవర్నమెంటుకి పన్నులు చెల్లిస్తాయి. కలక్టివు ఫారాలని ప్రోత్సహించడానికిగాను పన్నులు చాలా తక్కువగా పెట్టారు. పంట దినుసును బట్టి వుంటాయి పన్నులు సాధారణంగా బంగాళా దుంపల పంట మీద 7% లేకపోతే 8% వుంటుంది పన్ను-ధాన్యాలమీద 2% పన్ను. అంత తక్కువగా వుంటాయి పన్నులు సోవియటు రాజ్యంలో!!

యీ కలక్టివు ఫారాలే కాకుండా—సోవియట్ రష్యాలో గవర్నమెంటు ఫారాలు కూడా వున్నాయి. యీ గవర్నమెంటు ఫారాలు **(State forms--Sovkhoz)** సాధారణంగా 70,000 యకరాలు, 80,000 యకరాలు ఆలా వుంటాయి. ఈ ఫారాల మీద పనిచేసే జనం అంతా జీతాల మీద పని చేస్తారు. పశువులు—వ్యవసాయపు పరికరాలు — ట్రాక్టర్లు— పండిన పంట — అంతా గవర్నమెంటువారి స్వంతం. పెద్ద పెద్ద ఫ్యాక్టరీల్లో పని ఎల్లా జరుగుతుందో—సరిగ్గా టంగని గంట కొట్టేవరకు అందరు పనిలో హాజరుగా వుండడం—రోజుకి ఏడు గంటలు పని—ఘాటైన శిక్షణ—అంత పని మెషినరీ చేతే - అంతా ఒక మిలిటరీలాగుంటుంది. అందుచేత పంటలు అద్భుతంగా పండుతాయి. ఏదేనా లోపం వచ్చిందంటే—తప్పు చేసినవాడు—పెద్ద జీతగాడైన సరే చిన్న జీతగాడైన సరే—శిక్ష పడిపోయిందన్న మాటే!

రష్యాలో పరిశ్రమల అభివృద్ధి ఎలాగో— వ్యవసాయం అభివృద్ధి కూడా ఆలాగే—అంతా "ప్లాను" ప్రకారం జరగాలి. కలక్టివు ఫారాల్లో-యేయే పంటలు యీ సంవత్సరంలో పండించాలో—ఎన్ని ఎకరాలు ఒక్కొక్క పంట చల్లాలో—యే పంట తరువాత ఏ పంట పండించాలో—యే పంటకి ఏ ఎరువు వెయ్యాలో అంతా ప్లాను ప్రకారం జరగాలి. దేశం మొత్తానికి వేసిన ప్లానులో—యీ చిన్న కలెక్టివు ఫారం యొక్క ప్లాను కూడా—సరీగా ఇముడాలి కాని విరుద్ధంగా వుండకూడదు.

ఫలానా పంటలు పండించాలి మీరు, ఇంత ఇంత ఎకరాలు చల్లాలి—అని జిల్లా సోవియటు వారు కలక్టివు ఫారానికి ఆజ్ఞాపిస్తారు. ఇంక-వివరాలు - జిల్లా సోవియటు వాళ్ళ సలహాపైని. ఫారంవాళ్లు నిశ్చయం చేసుకుని, మళ్ళా జిల్లా సోవియటువారి అనుమతి పొంది —పని చెయ్యాలి. మొదట - ఆ పూర్తిగా నిర్ణయించిన ప్లాన్ను - కలక్టివు ఫారం మెంబర్ల మీటింగులో-ఆడవాళ్ళు, మొగవాళ్లు అందరు కలిసి తర్జనభర్జన చేసి - ఒప్పుకుంటే ఒప్పుకుంటారు, లేకపోతే మార్పులు చేస్తారు. తోసేవేస్తే, అందుకు ప్రత్యామ్నాయంగా మరో ప్లాను అంగీకరిస్తారు, అందరు సమ్మతించిన ప్లాన్ను మళ్ళీ డిస్ట్రిక్టు సోవియట్ వారికి పంపించి - వాళ్ళ ఒప్పుదల పొంది - అప్పుడు సంవత్సరం పొడుగునా సాగిస్తారు.

మొదటి సంవత్సరాల్లో కలక్టివు ఫారాలు అంతగా జయప్రదంగా సాగలేదు. వ్యవసాయ దార్లు - మా ఆస్తులు అందరితోనూ కలుపు కుంటామా - నాసూమి నాకే వుండాలి - నా ఆవు నా పెరట్లోనే వుండాలి - అనే అంధకారంలో పడిపోయి - సంయుక్తంగా పని చెయ్యడానికి ఒప్పుకోలేదు. రాను రాను, కాలం మార్పు వల్ల - "నా" అనేది వదలుకొని - ఆస్తులు వున్న రైతులు - ఆస్తులు లేని రైతులు - భూములు వున్న ఖామందులు - కూలి మీదే బతికే పాలికాపు - అందరు కలిసి పోయి - సంయుక్తంగా వ్యవసాయం చేయడం మొదలు పెట్టారు. అందువల్ల వచ్చే లాభం కూడా గ్రహించారు. మంచి పంటలు పండటానికి అవకాశం — శాస్త్రీయమైన పద్ధతుల మీద సేద్యము చెయ్యడము — అందరికీ అంటే కష్టపడి పని చెయ్యడానికి ఇష్టపడే వారందరికీ కావలసినంత భోజనం—పిల్లలకి కానీ ఖర్చులేకుండా యూనివర్సిటీ వరకుకూడా విద్య, ఉచితంగా వైద్య సహాయం, అందరికీ ఇన్సూర్యారెన్సు, జీతంమీద శలవులు అందరికీ, అన్నిటికంటే ముఖ్యం దేశ సౌభాగ్యం పంటా, పాడీ, శిరి, సంపద, ఇవి కళ్ళారా చూచారు. అనుభవించారు. ఇప్పుడు వ్యక్తిగత వ్యవసాయ దార్ల సంఖ్య రోజుకి రోజూ తగ్గిపోతూంది. కలక్టివు ఫారాలు రోజుకి రోజూ వృద్ధి అవుతున్నాయి.

[నోట్:—ఈ వ్యాసంలో రూబుల్ అర్ధ రూపాయతో సమానమని వాడారు. ఈ దేశములో అర్ధ రూపాయకి ఎంత సామాను వస్తుందో, అంత సామానును కొనాలంటే ఒక రూబుల్ ఖర్చువుతుంది. ఇది వ్యాస కర్తల అనుభవము. దానిని అనుసరించి వారా విధంగా వాడారు. తక్కిన వ్యాసాలలో మారకపు రేటును బట్టి రూబిలు 2 షిల్లింగులు లేక రూ 1-8-0 గా లెక్కించారు. పాఠకులు గమనించ ప్రార్థన.

సంపాదకుడు]


మీ వార్తాపత్రికలు కేటలాగులు, పుస్తకములు మొదలగునవి చిత్రించుటకు కావలసిన లైనుబ్లాకులు హాఫ్‌టోను బ్లాకులు, త్రై కలర్ బ్లాకులు మేము ఆధునిక ఎలెక్ట్రిక్ యంత్రముల సహాయముతోచేసి యిచ్చెదము. ఆంధ్ర దేశములో ఆంధ్రులచే బ్లాకుల చేయు పరిశ్రమాలయ మిది యొక్కటి మాత్రమే. ఆంధ్రులందరు ఆదరించ ప్రార్థితులు.

వివరములకు ధరలకు నేడే వ్రాయండి.

కుమార్ అండ్ కంపెనీ,

ఫొటో ఆర్టిస్టులు లైన్ అండ్ హాఫ్‌టోన్ బ్లాక్ మేకర్స్, తెనాలి.

ప్రజలకు ! ప్రచారకులకు !

జాతీయ గ్రంథములు.

1. ప్రభుత్వ ధనము—మన బీదతనము
2. గాంధీ మహాత్ముని లండను ఉపన్యాసములు
3. హరిజన సమస్య
4. ఆధునిక రాజ్యాంగ సంస్థలు (రెండు భాగములు)
5. చైనా జాతీయోద్యమము (రెండు భాగములు)

ఈ 7 గ్రంథములును విడివిడిగా ప్రతి 1కి రు 0—12—0 లును, అన్నియు నొకేసారి కోరినచో నాలుగు రూపాయిలు మాత్రమే.

ప్రతులకు:—

ఆంధ్ర ప్రచారిణి లిమిటెడ్, కాకినాడ.

సామ్రాజ్య వాదులు
ప్రపంచం పంచు కొన్న విధం,
అందుకు వారవలంబించిన "ధర్మ" మార్గాలూ.
ఎరుగుదురా?

'ఆఫ్రికా పంపకం'
చదవండి.

సామ్రాజ్య తత్వం స్పష్టంగా తెలుస్తుంది.
రచయిత: కాశీపట్నపు కొండయ్యగారు 'విజ్ఞానం' పత్రికా సంపాదకులు.
180 పేజీలు - వెల పోస్టేజీతో సహా 12 అణాలు.
'విజ్ఞానం' చందా దారులకు - పోస్టేజీతో సహా 10 అణాలు.

ప్రకాశకులు:—

మోడరన్ పబ్లిసిటీ బ్యూరో,
భీమవరం. (పశ్చిమ గోదావరి)

# బైలోరష్యా సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

## ★ ముఖ్య పట్టణం — మిన్స్క్




సోవియట్ యూనియన్ పడమటి సరిహద్దు. రెడ్ ఆర్మీ రక్షణ. మంచి సారవంతమైన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు. కలప, ఇంజనీరింగ్, కాగిత పరిశ్రమ, బంగాళా దుంపలు, అవిసె, మొదలైనవి ముఖ్యమైనవి.

పూర్వం దారిద్ర్య దుఃఖాలకు నిలయమే గాక, యూదుల ప్రవాస శిక్షల ననుభవించే ప్రదేశం. 1918 లో ఈ రిపబ్లిక్‌ను నిర్మించిన తరువాత దేశాన్ని సారవంతంగాను, పారిశ్రామికంగాను చేసుకొన్నారు ప్రజలు. రోడ్డులు, విద్యుచ్ఛక్తి విరివిగా వ్యాపించాయి.

సరిహద్దులలో (పోలండ్ వగైరా) తమ మాతృ దేశాన్ని రక్షించడానికి, శత్రువును ఒక్కదెబ్బతో తరమడానికి ఉత్సాహ పూరితులైన సైనికులు వీరగేయాలు పాడుకొంటూ కాపలా గాస్తారు.

# సోవియట్ యూనియన్‌లో

# వివిధ జాతుల సమ్మేళనం

కామ్రేడ్ సుందరయ్య

సోవియటు యూనియను మొదట 1923 జూలై 6వ తేదీని ఈ క్రింది నాలుగు సోవియటు రిపబ్లిక్కులతో కలసి ఏర్పడింది. (రిపబ్లిక్ అంటే ప్రజా స్వామికం.)

1. రష్యను సోవియటు సోషలిస్టు రిపబ్లికుల ఫెడరేషను

2. వైట్ రష్యను సోవియటు సోషలిస్టు రిపబ్లికు. దీనికి ఇప్పుడు బైలో రష్యను సోవియటు సోషలిస్టు రిపబ్లికు అని పేరు.

3. యుక్రెయిన్ సోవియటు సోషలిస్టు రిపబ్లికు.

4. ట్రాన్సుకాకేషియను సోవియటు సోషలిస్టు రిపబ్లికుల ఫెడరేషను.

1924 ఆఖరున ఈ క్రిందివి రెండు స్వతంత్ర దేశాలుగ చేయబడ్డాయి,

5. టర్కోమన్ సోవియటు సోషలిస్టు రిపబ్లికు

6. ఉజెబెక్ సోవియటు సోషలిస్టు రిపబ్లికు

1929 లో తజిక్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కును విడదీసి స్వతంత్ర దేశము చేశారు. దానితో సోవియటు యూనియను 7 స్వతంత్ర సోవియటు సోషలిస్టు రిపబ్లికుల సమ్మేళనం అయింది. 1936 లో నూతన రాజ్యాంగ విధానములో, ట్రాన్సుకాకేషియను సోవియటు సోషలిస్టు రిపబ్లికు మూడు స్వతంత్ర దేశాలుగ జేయబడింది. అవి

జార్జియను సోవియటు సోషలిస్టురిప బ్లికు

ఆర్మేనియను సోవియటు సోషలిస్టు రిపబ్లికు

అజర్ బెయిజాన్ సోవియటు సోషలిస్టు రిపబ్లికు.

రష్యను సోవియటు సోషలిస్టు రిపబ్లికులో నుండి, మరి రెండు సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కుల విడదీశారు. అవి,

కిర్గిజ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లికు.

కజాక్ సోవియట్ సోషలిస్టు రిపబ్లికు.

అందుచే, నేడు సోవియటు యూనియను 11 స్వతంత్ర సోవియటు సోషలిష్టు రిపబ్లిక్కులు తమంతట తాము కలసి ఏర్పడిన సమ్మేళనము.

వివిధ జాతుల ఈ సమ్మేళనములో సోవియటు రష్యా ఒకటి. అయితే మిగిలిన 10 దేశాల కన్న వైశాల్య మందునూ, జనాభా యందును ఆర్థిక రాజకీయ విజ్ఞానాలందును అభివృద్ధి చెంది ఉంది.

ఇది కూడ కాక, జారు చక్రివర్తులు పరిపాలిస్తూ ఉన్నప్పుడు, రష్యా ప్రభుత్వం ఈ మిగిలిన పది దేశాలపై అధికారం చెలాయిస్తూ ఉండేది. వారి భాషలను ఉపయోగించుకో నిచ్చేది కాదు. రష్యను భాషలోనే నిర్బంధంగా పాఠాలు నేర్చుకో మనేది. వారి విజ్ఞానాన్ని గాని వారి కళలనుగాని వారి పాఠశాలలనుగాని పెంపొందించేదికాదు. వారి పరిశ్రమలను, పంటలను అభివృద్ధి పరిచేదికాదు. వారిపై శిస్తుల నధికంగా వేసి వసూలు చేసేది. ఆ శిస్తులను, ఆ దేశాలలోని ప్రజల కోసం ఖర్చు పెట్టక రష్యాకు కొల్లగొట్టుక పోయేది. ఆ దేశాలలోని ప్రజలను అణచి ఉంచడానికి రష్యా సైనికులను, పోలీసులను పంపేది. ఒకే జిల్లాలోగాని పరగణాలలోగాని వివిధ జాతులుండేటట్లు ఏర్పాటు చేసేది. ఒక జాతిని మరియొక జాతిపైకి ఎక్కద్రోలేది. జాతి కలహాలు, మత కలహాలు వృద్ధి చేసేది. ప్రత్యేక భాష, చరిత్ర విజ్ఞానము, ఒక నిశ్చిత భూభాగమందు నివాసము, గల జాతులను కూడ, జారు చక్రవర్తి తన పాలనక్రింద ఉంచుకోడానికి ముక్కలు ముక్కలుగా చీల్చి, పరగణాలు, జిల్లాలు ఏర్పాటు చేశాడు.

అందుచే ప్రపంచానికంతా జారు సామ్రాజ్యమంతా రష్యాగానే కనబడేది, జారు చక్రవర్తిని లేకుండజేసి, సోవియటు ప్రభుత్వాన్ని మొదట రష్యాలో స్థాపించినపుడు, అదివరకు జారు పరిపాలనలో ఉన్న వివిధ జాతులకు పూర్ణస్వాతంత్ర్య మివ్వబడింది. రష్యా నుండి విడిపోడానికి కూడా హక్కు ఇవ్వబడింది. ఆ విధముగా ఫిన్లాండు, పోలండులు విడిపోయాయి. లిథూనియా, లాట్వియా, ఈస్తోనియాలు కూడ సోవియటు ప్రభుత్వాలను మొదట ఏర్పాటు చేసుకున్నాయిగాని బ్రిస్టులిట్ వస్కీ సంధి ప్రకారం జర్మనీ క్రిందనే ఉండిపోయాయి. జర్మనీ ప్రపంచ యుద్ధములో ఓడిపోగానే స్వతంత్ర రాష్ట్రాలు పెట్టుబడిదారీ ప్రభుత్వాలతో ఏర్పడ్డాయి. కాని మిగిలిన జాతులన్నీ సోవియటు రిపబ్లిక్కులను ఏర్పాటు చేసుకొని సోవియటు సమ్మేళనాన్ని తమంతటనే ఏర్పాటు చేసుకొన్నాయి. అందుచే నేడు, సోవియటు రష్యా అనేపేరు ముందటి జారు సామ్రాజ్య మంతటికి వర్తించదు. నేడు వీటి కన్నిటికి వర్తించే పేరు సోవియటు యూనియను.

## నేటి రష్యా : వివిధ జాతులు

రష్యాలో కమ్యూనిస్టులు సోవియటు ప్రభుత్వాన్ని ఏర్పరిచినపుడు, వారు ఈ క్రింది సూత్రాన్ననుసరించారు. "మరియొక జాతిస్వాతంత్రాన్ని హరించిన జాతి ఎప్పటికీ స్వాతంత్ర్యము పొందజాలదు. అందుచే ధనిక ప్రభుత్వాలను కూలద్రోయడానికి ప్రయత్నించే కార్మిక వర్గమంతా తమ ప్రభుత్వం క్రింద నలిగే జాతుల స్వాతంత్ర్య పోరాటాలను బలపర్చాలి"

నూతన సమాజాన్ని నూతన నాగరికతను, నెలకొల్పడానికి పూనుకొనిన కమ్యూనిస్టులు, వివిధ జాతుల పూర్ణ వికాసానికి పనిచేయక తప్పదు. ఏ జాతియైనా అభివృద్ధి చెందాలంటే, దాని ప్రత్యేక భాషద్వారా, కళలద్వారా, విజ్ఞానముద్వారా, దాని ప్రత్యేక సాంప్రదాయాలననుసరించే పనిచేయాలి. దానివల్లనే త్వరగా అభివృద్ధి చెందడానికి కూడ సాధ్యమవుతుంది.

ఈ అభివృద్ధిని మరింత త్వరితగతిని తెచ్చేది స్వాతంత్ర్య భావం.

అందుచే సోవియటు ప్రభుత్వాన్ని రష్యాలో ఏర్పాటు చేయగనే, వివిధ జాతులకు స్వాతంత్ర్యము రష్యను సోవియటు ప్రభుత్వమిచ్చింది. ఆ స్వాతంత్ర్య రాష్ట్రాలకు అన్ని రకాలుగా సహాయము చేసింది.

ఈ సంపూర్ణ స్వాతంత్ర మిచ్చినది ప్రత్యేక భాష, విజ్ఞానము, చరిత్ర, నిశ్చిత భూభాగమందు నివాసము, స్వతంత్ర ఆర్థిక జీవనము గలవానికే గాదు. ఇవిలేని జాతులకు, వెనకబడియున్న జాతులకు కూడ ఇట్టి స్వతంత్రత కలిగించడానికి, ఇదివరకెప్పుడూ ప్రపంచంలో లేని రీతిని రాష్ట్ర విభాగము చేసింది. ఈ విభాగము వలన, వాని ఆర్థిక జీవనమునకెట్టి భంగము కలుగకయే ఉండుటకు సాధ్యమయింది. దానితోపాటు వారివారి భాషలను, విజ్ఞానాన్ని, వ్యక్తిత్వాన్ని, నాగరికతను వృద్ధి పొందించుకోడానికి పూర్ణ అవకాశాలు కలిగాయి. వెనకబడిన జాతుల ఆర్థిక పరిస్థితులు అభివృద్ధి చేయడానికి, విజ్ఞానాన్ని, కళలను, భాషను, సారస్వతాన్ని అభివృద్ధి చేయడానికి, ప్రత్యేక శ్రద్ధ తీసుకొని సహాయము చేసింది. అదివరకు లిపిలేని భాషలకు లిపి ఏర్పరచింది. ఆ భాషలలో పుస్తకాలు, పత్రికలు, అన్నివిషయాలకు సంబంధించిన వానిని ప్రకటింప చేసింది.

## ఆ రాష్ట్రవిభాగ మేమిటి?

సోవియటు యూనియనులో 11 ముఖ్య దేశాలున్నాయియని చూచాము. ఈ ఒక్కొక్క దేశములోనూ, అనేక జాతులున్నాయి. ఈ జాతుల జనసంఖ్య బట్టి, వైశాల్యాన్ని బట్టి, స్వతంత్ర రిపబ్లిక్కులగాగాని, స్వతంత్ర అబ్లాస్టులగాగాని ఏర్పరచ బడ్డాయి. అబ్లాస్టులంటే, మన దేశములో జిల్లాల లాంటివి.

సోవియటు యూనియనులో రాష్ట్ర విభాగాలు ఆర్థిక సంపదను బట్టి, అనుకూలాన్ని బట్టి విభజించ బడతాయి. కాని అలా చేసేటప్పుడు, ఒక జాతి ఒక రాష్ట్రముగా ఏర్పడేటట్లు చూస్తారు. ఒక రాష్ట్రముగ ఏర్పడడానికి వీలులేకపోతే, ఆ జాతి ఒక జిల్లా ఏర్పడేటట్లు చూస్తారు.

ఉదాహరణంగా సోవియటు యూనియనులోని ఒక ముఖ్య దేశము రష్యను సోవియటు సోషలిష్టు ఫెడరేషనును చూడండి. (ప్రతి ముఖ్య దేశానికి సోవియటు సోషలిస్టు రిపబ్లికు అని అంటారు). దీనిలో 17 స్వతంత్ర రిపబ్లికులు, స్వతంత్ర అబ్లాస్టులు ఉన్నాయి. ఇది గాక, మిగిలిన స్థలములో 19 అబ్లాస్టులు ఉన్నవి. 19 మామూలు జిల్లాలు.

మామూలు అబ్లాస్టులకూ స్వతంత్ర అబ్లాస్టులకున్న బేధమిది. స్వతంత్ర అబ్లాస్టులకు స్వతంత్ర రిపబ్లిక్కులకు వలె మంత్రి మండలి ఉంటుంది. మామూలు అబ్లాస్టులకు కేవలము అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కార్యనిర్వాహక వర్గము ఉంటుంది.

యుక్రేయిన్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కులో మాల్డేవియను స్వతంత్ర రిపబ్లికు, 7 అబ్లాస్టులు ఉన్నవి.

అజర్ బెయిజాన్ సోవియటు సోషలిస్టు రిపబ్లికులో ఒక్క స్వతంత్ర రిపబ్లికు, ఒక్క స్వతంత్ర అబ్లాస్టు ఉన్నవి.

జార్జియను సోవియటు సోషలిస్టు రిపబ్లికులో 2 స్వతంత్ర రిపబ్లికులు, ఒక స్వతంత్ర అబ్లాస్టు ఉంది.

యుజ్‌బేగ్ సోవియటు సోషలిస్టు రిపబ్లికులో ఒక్క స్వతంత్ర రిపబ్లికు ఉంది.

తజిక్ సోవియటు సోషలిస్టు రిపబ్లికులో ఒక్క స్వతంత్ర అబ్లాస్టు ఉంది.

కజాక్ సోవియటు సోషలిస్టు రిపబ్లికులో 8 అబ్లాస్టులున్నవి.

ఆర్మీనియను, వైట్ రష్యను, టర్కోమన్, కర్గిజ్ సోవియటు సోషలిస్టు రిపబ్లికులలో అబ్లాస్టులు గాని, స్వతంత్ర రిపబ్లికులు గాని లేవు.

## స్వతంత్ర దేశానికి కావలసిన పరిస్థితులు

ఏపరిస్థితులలో సోవియటు సోషలిస్టు రిపబ్లికును జాతి నేర్పరుచటకు వీలగునో స్టాలిన్ ఈ క్రింది విధముగా వివరించాడు:—

"1. ఒక జాతి నివసించు ప్రదేశము సోవియటు యూనియను యొక్క సరిహద్దులలో ఉండాలి. లేనిచో చుట్టూ సోవియటు యూనియనే యున్నచో, అది విడిపో దలచుకొన్నప్పుడు పోజాలదు. విడిపోయే హక్కులేని దేస్వతంత్ర దేశం లాగ పరిగణించడమెలా?

2. ప్రదేశములో ఆ జాతి అత్యధిక సంఖ్యాకులుగ ఉండాలి.

3. ఒక జాతి కనీసము పది లక్షలమందియైనా లేనిచో సామ్రాజ్యవాదులతో పోరాడి[illegible] ఎదుర్కొని స్వతంత్రత కాపాడుకో జాలదు. ఆర్థిక జీవితానికి కూడ నష్టము కలుగుతుంది."

ఇక సోవియటు యూనియనులోని వివిధ జాతులకెట్టి ప్రత్యేక ప్రయత్నాలు చేయబడుతున్నాయో, వారి అభివృద్ధి గత 20 ఏండ్లలో ఏ విధంగా ఉందో చూదాం.

## పరిశ్రమలు

విప్లవానికిముందు ఈ వివిధ దేశాలందునూ, పరిశ్రమలు ఏ మాత్రమూ అభివృద్ధి చెందలేదు. కాని సోవియటు ప్రభుత్వము వచ్చిన వెంటనే పరిశ్రమలకు ఎక్కువ జేసింది.

కజాకు సోషలిస్టు రిపబ్లికులో రసాయన పదార్థాలను తయారుచేసే పరిశ్రమలను ఎక్కువ తయారు చేశారు. భాస్వరము, ఉప్పు, రబ్బరు పరిశ్రమలను విరివిగా వృద్ధి చేశారు. బొగ్గు గనులనుకూడ తవ్వారు. రైలు మార్గాలను క్రొత్తగా షుమారు 5000 మైళ్ల వేశారు. ఈ ఒక్క రిపబ్లిక్కులోనే 1927-32 సం॥లలో పరిశ్రమ 5 రెట్లు పెరిగింది. కాని ఆ కాలములో సోవియట్ యూనియను అందంతటా 3 రెట్లే అభివృద్ధి చెందింది. అంటే వెనుకబడియున్న ఈ దేశములో ప్రత్యేక శ్రద్ధలో పరిశ్రమ అభివృద్ధి చేయబడింది.

టర్కోమన్ సోషలిస్టు రిపబ్లికులో, బట్టల యంత్రాలు, కిరసనాయిల్ పరిశ్రమ, రసాయన పదార్థాలను, తయారుచేసే యంత్రాలు అభివృద్ధి చేయబడ్డాయి. 1913 లో తయారుచేసిన పదార్థాలకన్న 7 రెట్లు తయారు చేసింది.

యుజ్‌బెక్ సోషలిస్టు రిపబ్లికులో కూడ రసాయన పరిశ్రమ, నూనె, బట్టల పరిశ్రమే గాక విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే ఒక గొప్ప యంత్రాగారము కూడ ఉంది. విప్లవానికి పూర్వముకన్న 4 రెట్లధికముగా వస్తువులను తయారు చేసింది.

చాల వెనకబడియుండే తజిక్ సోషలిస్టు రిపబ్లికు దేశముకూడ నేడు చాల అభివృద్ధి చెందింది. సిల్కు గుడ్డల పరిశ్రమ యంత్రాలను తయారుచేసే ఫ్యాక్టరీ, వెన్న ఫ్యాక్టరీలు, తోళ్ళ ఫ్యాక్టరీలు బయలుదేరాయి. పర్వతమయ దేశమయినను, అనేక రోడ్లు వేయబడ్డాయి. మోటారు బండ్ల సౌకర్యము కలుగజేయబడింది. దూది కూడ విరివిగా సాగు చేస్తున్నారు. పరిశ్రమ విప్లవానికి ముందు ఉన్న దానికన్న 116 రెట్లు ఎక్కువ.

అజర్ బెయిజానులో పెట్రోలు పరిశ్రమ చాల ఎక్కువయింది. విప్లవానికి మునుపు 30 లక్షల టన్నులు తయారుచేసే వారు. నేడు 2 కోట్ల 10 లక్షల టన్నుల పెట్రోలు తయారు చేస్తూఉంది.

వ్యవసాయము కూడ చాల అభివృద్ధి చెందింది. విప్లవానికి ముందు ఏమాత్రములేని ట్రాక్టర్లు నేడు యీ దేశాలన్నిటిలోనూ విరివిగా ఉన్నాయి. ఒక్క ఉజ్‌బెక్ సోషలిస్టు రిపబ్లిక్‌లోనే 18000 ట్రాక్టర్లున్నాయి.

## విద్యా—విజ్ఞానము.

విప్లవానికి ముందు ఈ దేశాలలో మాతృభాషలను ఉపయోగించడానికి వీలుండేదికాదు. నేడు వారి వారి మాతృ భాషలలోనే విద్యను నేర్పుతున్నారు. ఈ దేశాలన్నిటిలోనూ, 14 ఏండ్లలోపు నున్నవారి కందరికి 1937 ఆఖరికి 7 ఏండ్ల సెకండరీ స్కూలు శిక్షణ ఇచ్చుటకు ఏర్పాటు చేయబడింది. 1932 నాటికే ప్రాథమిక విద్యను ప్రతి బాలునికి నిర్బంధంగా చెప్పడానికి ఏర్పాటు చేయబడ్డాయి. జారు ప్రభుత్వం నిర్బంధ ప్రాథమిక విద్యను సామ్రాజ్యమంతటా ప్రవేశ పెట్టడానికి 125 సంవత్సరాలు పట్టుతుందనీ, సంవత్సరానికి 7 కోట్ల 60 లక్షల రుబుల్సు ఖర్చు పెట్టాలని చెప్పి ఊరుకొనేది. కాని సోవియటు ప్రభుత్వం, 15 ఏండ్లలో ప్రాథమిక విద్యను, తరువాత 5 ఏండ్లలో సెకండరీ విద్యను సోవియటు యూనియనులో వెనకబడియున్న దేశాలలో సైతము ప్రవేశపెట్టింది.

విప్లవానికి ముందు యుజ్‌బెక్ సోషలిస్టు రిపబ్లికులో తలకొక పాతిక రుబులు, టర్కోమన్‌స్థాన్‌లో అర్ధ రుబులు విద్యకు ఖర్చుపెట్టేది నేడు తలకు 40 రుబుల్సు ఖర్చు పెట్టుతూ ఉంది. వైట్ రష్యను సోషలిస్టు రిపబ్లికులో జారు కాలంలో అర్ధ రుబులు ఖర్చు పెట్టేవారు. నేడు 100 రుబుల్సు ఖర్చు పెట్టుతున్నారు, అదే విధంగా బురయత్ మంగోలియాలో మునుపు ముప్పాతిక రుబులు. నేడు 75 రుబుల్సు.

సినిమాలు. నాటకశాలలు ఏ విధంగా అభివృద్ధి చెందాయో ఈ క్రింది టేబిలు తెలియజేస్తుంది.

| నాటకశాలలు | 1914లో | 1936 |
|---|---|---|
| అజర్బైయిజాన్ | 2 | 14 |
| యుజ్‌బెక్ | 1 | 37 |
| టర్కోమన్ | 0 | 3 |
| వజిక్ | 0 | 6 |

| సినిమా ఫిల్ములు | 1914లో | 1936 |
|---|---|---|
| అజర్బైయిజాన్ | 17 | 544 |
| యుజ్‌బెక్ | 25 | 564 |
| టర్కోమన్ | 6 | 218 |
| వజిక్ | 0 | 68 |

విప్లవానికి మునుపు 24 భాషలలోనే పత్రికలు, పుస్తకాలు, అవికూడ చాల తక్కువగా వచ్చాయి. నేడు 73 భాషలలో వస్తూ ఉన్నాయి. సారస్వతము. శాస్త్రాలు, కళలు ఆర్థిక రాజకీయ విషయాలను గురించి వెనుకబడిన భాషలలో కూడ నేడు పుస్తకాలు వెలువడుతూ ఉన్నాయి. ఈ వరకు లిపి లేని భాషలకు లాటిన్ లిపి ఏర్పాటు చేయ బట్టి ప్రజలలో విద్యాభ్యాసము సులభ సాధ్యమయింది.

మునుపు ఈ వివిధ భాషలలో 84 వార్తా పత్రికలు వచ్చేవి. నేడో 3000. మునుపు 70 లక్షల పుస్తకాలు వస్తే నేడు 13 కోట్ల 30 లక్షల పుస్తకాలు వస్తున్నాయి.

సోవియటు యూనియనులో విజ్ఞానం, విద్య ఆరోగ్యము, శిశు సంరక్షణ, వీని కోసం 1938 లో 3727 కోట్ల రుబుల్సు ఖర్చు పెట్టుతున్నారు. మొత్తము ఆదాయములో నూటికి 28 పాళ్లు ఖర్చు చేస్తున్నారన్నమాట.

పైన వివరించిన లెక్కలన్నీ ఉదాహరణం కోసం జారు ప్రభుత్వ కాలంలో చాల వెనుకబడియున్న దేశాలను గూర్చే ఇవ్వ బడ్డాయి. ఈ లెక్కలు, సోవియటు యూనియనులోని వివిధ జాతులు ఎంత అభివృద్ధి చెందుచున్నారో ప్రకటించడానికి చాలు.

యూరపు ఖండమందంతా, అమిత నీచంగా చూడబడుతూ, తల దాచుకోడానికి కూడ నీడ లేని స్థితిలో యూదులున్నారు. నేడు. జారు కాలంలోకూడ వీరు జారు ఏజెంట్లు రెచ్చగొట్టిన మత కలహాలలో చెండాడబడేవారు. కాని నేడు సోవియటు యూనియను బిరో బిడ్జాడ్ అనే స్థలమును స్వతంత్ర అబ్లాస్టుగా ఏర్పరచి వారికిచ్చింది. సోవియటు యూనియనులో నున్న యూదులు ఏమాత్రమూ ద్వేషింపబడక తమ నాగరికతను, తమ భాషను పోషించుకుంటూ ఉన్నారు.

అమెరికాలో నీగ్రోలను దగ్గరికి కూడ రానివ్వరు. కోపము వచ్చినప్పుడల్లా నడి వీధులలో తగులబెట్టు తుంటారు కూడ. కాని అట్టి నీగ్రోలకుకూడ సోవియటు యూనియనులో ఒక స్వతంత్ర గ్రామము ఉంది.

ప్రతి దేశంలోనూ అల్పజాతుల సమస్య, అల్ప సంఖ్యాకుల సమస్య తాండవ మాడుతునే ఉంది. వానిని ఒక్క సోవియటు యూనియను తప్ప మరేదేశమూ పరిష్కరించజాలక పోయినది. అల్పజాతుల విజ్ఞానాన్ని నాగరికతను పెంపొందించడానికి అవకాశాలను ఏమీ ఇవ్వలేక పోతున్నాయి. ఒక్క సోవియటు యూనియను మాత్రమిచ్చింది. నేడు సోవియటు యూనియనులోని జాతులలో తాము తక్కువ జాతి వారమనే భావము ఎవరికి లేకుండ జేసినది. స్త్రీలకు ముసుగు, పర్దాలు పోగొట్టి స్వాతంత్ర్య మిచ్చింది. ఆరోగ్యమును విద్యను పెంపొందించింది. నూతన పంటలు పండిస్తూ ఉంది. నూతన యంత్రాల నుపయోగిస్తూ ఉంది. నూతన నగరాలు, నూతన నాగరికత నిర్మిస్తూ ఉంది.

ఏ జాతియైనా, ఏభాష మాట్లాడినా, ఏరంగు మనిషియైనా, ఏమతాన్ని అవలంబించినా, ప్రతి మనుష్యునికి సంపూర్ణ పౌరసత్వ హక్కులన్నీ పూర్తిగా ఉండాలనే కమ్యూనిస్టుల నమ్మకము. వారి పట్టుదల, వారి కార్యాచరణవలనే ఇదంతా సాధ్యమయింది.

కార్మిక వర్గం అధికారానికి వచ్చి ప్రపంచానికి మొదటిసారి ఆశ్చర్యకరమైన వెలుగును ఇచ్చింది, ఏ ఇతర వర్గ ప్రభుత్వం చేపియుండని ఘనకార్యాన్ని చేసింది. అణచి వేయబడిన జాతులకు స్వాతంత్ర్యమిచ్చి, వారికి అభివృద్ధిని చేకూర్చింది. మానవ శ్రేయస్సుకు, కార్మిక ప్రభుత్వం చేసిన దిది ఒక్కటే చాలు—ఇతర ప్రభుత్వా లన్నిటికంటే మిన్న యనడానికి ఏమంటారు?......

# కర్షకుడు : నాడు — నేడు

కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.



## విప్లవానికి పూర్వం

విప్లవానికి పూర్వం, జార్ చక్రవర్తుల పరిపాలనలో, రష్యాదేశపు రైతు జమీందార్ల యొక్క - షాపుకార్ల యొక్క - ప్రభుత్వోద్యోగుల యొక్క హద్దులేని దోపిడీకి గురియై, చెప్పరాని బాధలెన్నో అనుభవించే వాడు. లెనిన్ యిచ్చిన లెక్కలు చూస్తే!—

| వర్గాలు | యకరాలు |
|---|---|
| 30,000 మంది జమీందార్లు | 18 కోట్ల 90 లక్షలు |
| జార్ చక్రవర్తి, రాజ కుటుంబీకులు, క్రైస్తవ మత సంస్థలు, పెట్టుబడిదార్లు | 19 కోట్ల 23 లక్షలు |
| 15 లక్షల మంది ధనిక రైతులు | 18 కోట్ల 90 లక్షలు |
| 12 కోట్ల మంది బీద రైతులు, మధ్య తరగతి రైతులు | 34 కోట్ల 75 లక్షలు |
| మొత్తం | 91 కోట్ల 78 లక్షలు. |

యీ విధంగా భూముల్ని కలిగియుండేవారు.

జమీందార్ల కీయవలసిన శిస్తు, ఋణదాతల కీయవలసిన వడ్డీ, ప్రభుత్వాని కీయవలసిన పన్ను పోగా రైతుకు మిగిలేది సాధారణంగా సున్న. మళ్ళీ అప్పుచేసి, తనూ, తన కుటుంబం పొట్టపోసుకోవాలి. దేశం యొక్క 17 కోట్ల మంది జనాభాలో 12 కోట్ల రైతులే అయినప్పుడు ఈ పేదరికం, యీ ఋణభారం, యీ ఆకలి మంట వారిని ఎంత కుంగ దీశాయో ఊహించుకోవచ్చు. విద్యా, జ్ఞానమూ, శూన్యం. మూఢ నమ్మకాలూ, కావలసినన్ని. చేసే ప్రతి పనీ క్రౌర్యంతో నిండియుండేది. మార్పుగాని, కొత్త విషయంగాని సూచిస్తే, విపరీతమైన అనుమానం!

1914 లో ప్రారంభమయిన ప్రపంచ యుద్ధంవల్ల రష్యా దేశపు రైతు మరింత క్షీణ దశలో పడ్డాడు. గోధుమలు మొదలయిన ఆహార పదార్థాలు రైతులవద్ద అతి చౌక ధరలకు కొని షాహుకార్లు యుద్ధ భూమికి రవానా చేసేవారు. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులు కూడా ఎక్కువయాయి. తయారయిన సరకుల ధర మూడేసి, నాలుగేసి రెట్లు అధిక మయింది. యుద్ధం ప్రారంభమైన కొంత కాలం వరకూ రైతులు ఆకలి బాధకు సహించారు. ఆ పైన సహించలేక, దోపిళ్లు-తిరుగుబాట్లు ప్రారంభించారు. కజాక్ స్థాన్, కిర్ఘిడె, ఉజ్బేకి స్థాన్ మొదలయిన ప్రదేశాలలో బయలుదేరిన రైతు పోరాటాలను అణచడానికి ప్రభుత్వం మిలిటరీలను పంపింది. "సాధ్యమైనంత తక్కువ మందిని ఎరస్టు చేయాలి; సాధ్యమైనంత ఎక్కువ మందిని తుపాకులతో కాల్చి చంపాలి!" అనే సూత్రం ఆచరణలో పెట్ట బడింది. అనేక గ్రామాలను తగుల పెట్టారు. అసంఖ్యాక ప్రజలను చిత్ర వధ చేశారు. ఎక్కడ చూచినా, భయంకరమైన హత్యా కాండ. ఎక్కడికి పోయినా, పైశాచిక ప్రభుత్వపు భీభత్సతాండవం.

## విప్లవం

మార్చి 1917 లో విప్లవం వచ్చింది.

"ఆకలి మంటచే—మల మల మాడే
అనాధు లందరు—లేవండోయ్"

అనే విప్లవ గీతం దేశమంతటా మారు మ్రోగింది. జారు చక్రవర్తి సింహాసనం విడిచిపెట్టి పారిపోయాడు. కెరెన్స్కీ ప్రభుత్వం అధికారానికి వచ్చింది. కాని జమీందారీ పద్ధతిని యీ ప్రభుత్వం శాసనం ద్వారా నిర్మూలించ లేక పోయింది. అయినా, పేద రైతులు తమ కష్టాన్ని దోచుకొని తెగ బలిసిన జమీందార్ల భవనాలను తగుల పెట్టారు; ధాన్యపు గాదులు దోచుకొన్నారు; జమీందార్ల భూముల్ని స్వాధీనం చేసుకొని దున్నుకోవడం ప్రారంభించారు.

నవంబరులో రెండవ విప్లవం వచ్చింది. అప్పటికే రైతులు చాలా వరకు జమీందారీ పద్ధతిని స్వయంగా నిర్మూలించారు. జమీందార్ల భూములను చిన్నచిన్న ముక్కలుగా రైతులు పంచుకొని, తయారైన పంటను తామే అనుభవించ సాగారు. ఇందువల్ల పట్టణాలలో నివసించే ప్రజలకు తగిన తిండి సప్లయి కాలేదు. పురాతన పద్ధతులతో, పాత పనిముట్లతో వ్యవసాయం జరిగేది. ఈ క్లిష్టసమస్య కొత్తగా స్థాపించబడ్డ బోల్షివిక్ ప్రభుత్వాన్ని ఎదుర్కొంది. వెంటనే లెనిన్ దీన్ని పరిష్కరించడానికి పూనుకొన్నాడు. ప్రభుత్వంచేత ఒక ఉత్తరువు చేయించాడు. దాని ప్రకారం దేశంలో ఉన్న భూమియావత్తూ రష్యా ప్రజలది. జార్ చక్రవర్తి, అతని కుటుంబీకులు, క్రైస్తవ మత సంస్థలు, జమీందార్లు పూర్వం అనుభవించే ఎస్టేట్లు, అంటే 38 కోట్ల యకరాల భూమి, రైతులకు పంచిపెట్ట బడింది. చాలామంది ధనిక రైతులకు చెందిన $4\frac{1}{2}$ కోట్ల యకరాలు కూడా సోవియట్ ప్రభుత్వం రైతులకు పంచిపెట్టింది, కాని పూర్వం ధనిక రైతుల చేతుల్లో సొంత నేరీలుగా ఉండి, పంట అభివృద్ధికీ—పశు వృద్ధికి వుపయోగించబడే భూములు మాత్రం "ఆదర్శ వ్యవసాయ క్షేత్రాలు"గా ఉపయోగించబడుతూ ప్రభుత్వాధీనం చేయబడ్డాయి. కాని, యివికూడ ఆరంభ దశలో, రైతులు స్వాధీనం చేసుకొని పంచుకొన్నారు. విప్లవం జరిగిన పది సంవత్సరాల వరకూ వ్యవసాయం చిన్నచిన్న పొలాల పైననే జరిగేది. చాలా పురాతనమైన పద్ధతులతో రైతులు వ్యవసాయం చేసేవారు.

## 1918—21 : అంతర్యుద్ధం.

దేశంలో సోషలిస్టు ప్రభుత్వం స్థాపించబడి నప్పటికీ, దానికి ఉండవలసినంత బలం, రక్షణ 1921 వరకులేవు. బ్రిటన్. మొదలైన శత్రు రాజ్యాలు కొత్త ప్రభుత్వానికి సరకులు పంపడం మానివేశాయి. జమీందార్లు, షాహుకార్లు కలిసి ప్రభుత్వాన్ని పడగొట్టడానికి తిరుగుబాట్లు చేయడం ప్రారంభించారు. బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, జర్మనీ, ఇటలీ, అమెరికా ప్రభుత్వాలు సైన్యాలను పంపి, రష్యన్ జమీందార్లకు, షాహుకార్లకు సహాయం చేశాయి. సోవియట్ ప్రభుత్వం ఒక వైపున, దేశీయ దోపిడిగాండ్రు - విదేశ సైన్యాలను మరొక వైపున ఉండి, ఒకరితో ఒకరు పోరాటం ప్రారంభించారు. దేశంలో పెద్ద అంతర్యుద్ధం చెలరేగింది. పట్టపగటి దోపిళ్ళు, క్రూరమైన చిత్రవధలు ప్రజల్ని భయకంపితుల్ని చేశాయి. ఏ నిమిషాన్ని విద్రోహులు గ్రామాలను ముట్టడిస్తారో, ఏ నిమిషాన్ని ఇండ్లు తగలబెడతారో తెలిసేదికాదు. ఈ విధంగా బీద ప్రజలు తమ ప్రాణాలను గుప్పెళ్ళలో పెట్టుకొని కాలం గడిపేవారు.

ఇట్టి విపరీత పరిస్థితుల్లో, వ్యవసాయంగాని, పరిశ్రమలుగాని నేలమట్టం కాకతప్పదు, 1920 వ సంవత్సరపు రష్యా ఉత్పత్తి అంతా కలిసి 1913 వ సంవత్సరపు ఉత్పత్తిలో మూడో వంతు మాత్రమే. 1918-20 సంవత్సరాల మధ్య, పెట్రోగ్రాడ్ (ఇప్పుడు దీన్ని లెనిన్ గ్రాడ్ అంటాము) నగరవాసు లందరూ తిండిలేక అనేక రోజులు ఉపవాసాలు చేయవలసి వచ్చింది, ఇక పల్లెటూళ్ళ ప్రజలు పడిన అవస్థలు చెప్పనే అక్కర్లేదు. ప్రతి ముఖంలోనూ మృత్యుదేవత తాండవ మాడేది.

ఈ నాలుగు సంవత్సరాలలో సోవియట్ ప్రభుత్వంయొక్క దృష్టి అంతా దేశీయ, విదేశీయ విద్రోహుల్ని ఏవిధంగా రష్యానుంచి తరిమివేయడమా అనే సమస్యపైననే కేంద్రీకరించ బడింది. శత్రు సైన్యాలతో అహోరాత్రాలు యుద్ధంచేసే 50 లక్షల మంది విప్లవ సైనికులకు ఆహార పదార్థాలు, యితర సరకులు ఎప్పటికప్పుడు పంపిస్తూ ఉండాలి. రైతులు పండించిన పంటలో ప్రభుత్వం యెక్కువ భాగాన్ని స్వాధీనం చేసుకొని యుద్ధ రంగాలకు పంపేది. ఆఖరికి అంతర్యుద్ధం 1921 వ సంవత్సరంలో పూర్తిఅయి, శాంతి ఏర్పడింది. కాని, ఆ సంవత్సరంలోనే ఎన్నడూ రష్యాకు సంభవించని క్షామం దేశంలో విస్తారంగా వ్యాపించింది. అనేక రాష్ట్రాలలో పంటలు ధ్వంసమయాయి. సుమారు 4 కోట్ల మంది తిండిలేక అనేక యిబ్బందులు పడ్డారు. ఒక కోటిమందికి విత్తనాలు సహితం దొరకలేదు. 27 రాష్ట్రాలలో, అంటే సగం దేశంలో యీ విధంగా క్షామం వ్యాపించింది. మనుష్యులు, పశువులు విపరీతంగా నశించారు.

## 1921—28 : నూతన ఆర్థిక విధానం

ఇంతవరకూ ఓపికతో సహించిన ప్రజలు ఇక సహించలేక పోయారు. చాలాచోట్ల రైతులు తిరుగుబాట్లు చేశారు. క్రాన్‌స్టాడట్ అనే పట్టణం వద్ద కేంద్రీకరించ బడిన నావికాదళం ఒక్కసారి సోవియట్ ప్రభుత్వం మీద తిరుగబడింది. సోవియట్ ప్రభుత్వం యిప్పుడు చేయవలసిన పనిని లెనిన్ వెంటనే గ్రహించాడు. 1921 మార్చిలో సమావేశమైన కమ్యూనిస్టు పార్టీ 10 వ సమావేశంలో లెనిన్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. ఇంతవరకూ ప్రభుత్వం అవలంబిస్తూన్న విధానాన్ని విడిచి పెట్టాలన్నాడు. పరిమితి లేకుండా రైతుల వద్ద ధాన్యం వసూలు చేసే పద్ధతి పోవాలన్నాడు. తీవ్రమైన చర్చలు సాగాయి. ఆఖరికి లెనిన్ తీర్మానం జయించింది. దీని ప్రకారం రైతుల నికరాదాయం మీద, క్రమాభివృద్ధి సూత్రాన్ననుసరించి పన్నులు విధించాలి. మిగిలిన పంటను రైతులు ఏమి చేసుకొన్నా చేసుకోవచ్చు. ఎంత ఎక్కువ ధరకైనా అమ్ముకోవచ్చు. వ్యాపారం చేసి లాభాలు సంపాదించుకోవచ్చు. ఇంతేకాదు. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో ధనిక రైతులు వ్యవసాయ కూలీలను నియమించి కూలికి పని చేయించుకోవచ్చు.

ఈ తీర్మానంతో జమీందారీ పద్ధతి యొక్క నిర్మూలన సమస్య మంట కలిసిందని చాలా మంది ఊహించారు. కాని, ఒక అడుగు వెనక్కి వేసి, రెండడుగులు ముందుకు వేయడానికే యీ తీర్మానం చేయబడిందని లెనిన్ యొక్క దృఢ విశ్వాసం. బ్యాంకులు, అంతర్జాతీయ వ్యాపారం, రైల్వేలు, ఓడ వ్యాపారం, పట్టణాల్లో ఉండే భూమి, భవనాలు, గనులు, బొగ్గు, పెట్రోలు, విద్యుచ్ఛక్తి, పెద్ద పరిశ్రమలు-ఇవన్నీ ప్రభుత్వాధీనంలో ఉన్నప్పుడు సోషలిస్టు సమాజాన్ని స్థాపించడానికేట్టి నష్టమూ ఉండదని లెనిన్ వాదించాడు.

ఈ నూతన ఆర్థిక విధానం అమల్లో ఉన్న కాలంలో వ్యవసాయం ముఖ్యంగా నాలుగు విధాలుగా ఉండేది.

1. సహకార వ్యవసాయ పద్ధతి. దీని ప్రకారం రైతులు తమ తమ భూ[illegible]ఖండంగా సేద్యంచేసి, సంవత్సరం చివర ఒక్కొక్క రైతుకు [illegible]మి పై శాల్యాన్ని బట్టి పంటను పంచుకొంటారు. 1927 వ స[illegible]లో యిట్టి సహకార వ్యవసాయ సంస్థలు రష్యాలో 80,000 ఉండేవని లెక్కలవల్ల తెలుస్తోంది.

2. కొంతమంది రైతులు వేర్వేరు పొలాలలో దున్నడం. విత్తులు చల్లడం, కోతలు కోయడం మొదలైన పనులు చేస్తారు. దీనివల్ల లభించిన పంటను తమ తమ పొలాల వైశాల్యాన్ని బట్టి పంచుకొంటారు.

3. రైతులందరూ కలిసి పనిచేయడం మాత్రమే కాకుండా, తమ తమ భూముల్నీ, పనిముట్లనీ, బిల్డింగుల్నీ, పశువుల్నీ ఏక మొత్తంగా ఉపయోగించి, సేద్యం చేస్తారు. ఎవరి యిండ్లు వారివే; ఎవరి తోటలు వారివే; ఎవరి ఆవులు, గేదెలు, వారివే (దీనికి 'అర్టెల్' అని పేరు).

4, ధాన్యపు పంటకు సంబంధించిన బిల్డింగులూ, భూమి, పనిముట్లూ మాత్రమే కాకుండా గ్రామంలో ఉన్న ప్రతి పరిశ్రమ, ప్రతివృత్తి సాముదాయికంగా చేయబడుతుంది. (దీన్ని "కమ్యూన్" వ్యవసాయ పద్ధతి అంటారు).

5. ఇవిగాక, చాలామంది రైతులు పూర్వం మాదిరిగానే ఎవరి భూముల్లో వారు స్వయంగా కృషిచేసి, పంట పండించుకొని తింటారు.

## 1928—32 : మొదటి పంచవర్ష ప్రణాళిక

1928 వ సంవత్సరంలో ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాన్ని విడిచిపెట్టి, మొదటి పంచవర్ష ప్రణాళికను ప్రవేశపెట్టింది. దీనిప్రకారం. వేగంగాను, అధికంగాను వ్యవసాయాన్ని అభివృద్ధి చేయాలి. దేశంలో ఉన్న చిన్నచిన్న పొలాలన్నింటినీ కలిపి, యంత్ర సహాయంతో సమిష్టిగా దున్నడం, ఊడ్చడం, కోయడం మొదలైన పనులన్నీ సాధ్యం అయేటట్లు, ఏయేడు ఏపంట ఎంత అవసరమో ప్రభుత్వం ముందుగానే అంచనావేసి, ఆ అంచనా ప్రకారం "సమిష్టి వ్యవసాయ క్షేత్రాల" (రష్యన్ భాషలో "కోల్ ఖోజ్")లో రైతులచేత పని చేయిస్తుంది. అప్పుడే నగరవాసులకూ, పల్లెటూళ్ళ ప్రజలకూ తిండి సమృద్ధిగా లభిస్తుంది. ఎన్ని కరవులు వచ్చినా, ఎన్ని శత్రు రాజ్యాలు దేశాన్ని ముట్టడించినా ఫరవాలేదు.

పేద రైతుల చేత, బొత్తిగా భూమిలేని వ్యవసాయ కూలీల చేత యిట్టి క్షేత్రాలలో పని చేయించడం ప్రారంభించారు. ఉత్సాహంతో దీనికి వారంగీకరించారు. ఎందువల్లనంటే, శాస్త్రీయ పద్ధతుల ద్వారా చేసే వ్యవసాయం అనేక రెట్లు లాభదాయకం అని సులభంగా వారికి నచ్చచెప్పవచ్చును. మధ్య తరగతి రైతులు మాత్రం అంత సులభంగా ఒప్పుకోలేదు. కాబట్టి, ప్రభుత్వం వారిని నిర్బంధించలేదు. కొత్త పద్ధతి వల్ల ఎంతలాభం ఉంటుందో ప్రత్యక్షంగా వారికి చూపాలని సంకల్పించింది. ఇక మూడవ తరగతివారు ధనిక రైతులు. వీరు తమ భూముల్లో కూలీల చేత పని చేయించి, ఆ కష్ట ఫలితాన్ని అనుభవిస్తారు. వ్యాపారం చేసి లాభాలు సంపాదిస్తారు. సొమ్ము వడ్డీకిచ్చి విపరీతమైన వడ్డీ రేట్లతో వసూలు చేస్తారు. ఇట్టి ధనిక రైతుల్ని అణచడానికి ప్రభుత్వం పూనుకొంది. కొన్ని వందల యకరాల భూమిని ఒకే ఖండంగా చేసి, దున్ని వ్యవసాయం చేస్తూంటే, మధ్య మధ్య యీ ధనిక రైతుల పొలాలు అడ్డం వచ్చేవి. వాటిని బలవంతంగా స్వాధీనం చేసుకో[illegible]ండికాదు.

"సమిష్టి వ్యవసాయ" పద్ధతి రష్యా విప్లవ చ[illegible] నూతన శకం అని చెప్పాలి. మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రక[illegible]క్కొక్క సంవత్సరానికి అయిదవ వంతు భూభాగం వంతున, దేశం అంతా 5 సంవత్సరాలలో యీ కొత్త పద్ధతి ప్రకారం వ్యవసాయం చేయించాలి. కాని, మొదటి సంవత్సరంలోనే దేశం యొక్క సగం భూభాగాన్ని రైతులు సమిష్టి పద్ధతి క్రిందికి తీసుకువచ్చారు. చిన్న రైతులు నిర్బంధంగా ఇష్టంలేని మధ్య తరగతి రైతుల్ని యీ పద్ధతికి లాక్కువచ్చారు. కాని, ఇంత భూమినీ దున్నడానికి కావలసిన మర నాగళ్లు వగైరా సప్లయి కాలేదు. వెంటనే రైతుల్లో అసంతృప్తి బయలుదేరింది. ఇంతే కాదు. ధనిక రైతుల్లో విపరీతమైన తిరుగుబాటు బీజాలు వ్యాపించాయి. తటస్థంగా ఉన్న మధ్య తరగతి రైతుల్ని వీరు తమ వైపుకు త్రిప్పుకోవడం ప్రారంభించారు. రైతుల భూమినీ, రైతుల పశువుల్నీ లాగివేసుకొన్న తరువాత యిక ప్రభుత్వం ఎందుకని అనేకమందిలో విష బీజాలు చల్లారు. ప్రభుత్వానికి నష్టం చేయాలనే ఉద్దేశంతో ఆవుల్నీ, గేదెల్నీ, యెడ్లనీ, మేకల్నీ చంపివేశారు. తమకు కావలసిన ధాన్యం మాత్రమే కోసుకొని, మిగిలింది ప్రభుత్వానికి చిక్కకుండా ధ్వంసం చేశారు. ప్రభుత్వాన్ని ఎన్ని యిబ్బందులు పెట్టాలో అన్ని యిబ్బందులూ పెట్టారు.

స్టాలిన్ యిదిచూచి, పేదరైతులు చేస్తూన్న అనాలోచిత పనులను తీవ్రంగా ఖండించాడు. నిర్బంధంగా మధ్య తరగతి రైతులచేత "సమిష్టి వ్యవసాయ క్షేత్రా"ల్లో పని చేయించకూడదని ప్రభుత్వం ఆర్డర్లు ప్యాస్ చేసింది. ఇదివరకు చేర్చుకోబడిన వారు తిరిగి వెళ్ళిపోవడానికి స్వాతంత్ర్యము ఈయబడింది. ఈ ఉత్తరువులు అమల్లో పెట్టబడ్డంవల్ల, రెండో సంవత్సరంలో సమిష్టి వ్యవసాయదార్ల సంఖ్య సగానికి సగం తగ్గింది. కాని, మూడవ సంవత్సరం నుంచి, ప్రణాళిక ప్రకారం, క్రమ క్రమంగా వృద్ధి చెందింది. 1933 నాటికి దేశంలో సాగుకు పనికివచ్చే మొత్తము భూమిలో 100 కి 65 వంతులు "సమిష్టి వ్యవసాయ పద్ధతి" ప్రకారం సాగుచేశారు. ధనిక రైతుల భూములు బలవంతంగా స్వాధీనం చేసుకోబడ్డాయి. ఇష్టపడని వారిని ప్రభుత్వం జైళ్ళకూ, సైబీరియా అడవులకూ పంపింది. వీరిచేత కాలువలు త్రవ్వించడం, రైలు మార్గాలు వేయించడం మొదలైన పనులు చేయించింది. కొంత శిక్ష అయాక, కొందరి మానసిక ప్రవృత్తి మారింది. ఇతరుల కష్టాన్ని దోచుకొని బ్రతకడం తగనిపని అని కొందరు గ్రహించారు. ప్రభుత్వం యిది కనిపెట్టి శిక్షలు పూర్తి కాకుండానే చాలా మందిని విడుదల చేసింది. వారందరినీ "సమిష్టి వ్యవసాయ క్షేత్రా"లలో చేర్చారు.

## "సమిష్టి వ్యవసాయం" అంటే?

ప్రభుత్వ శాసనం ప్రకారం, రష్యాలో ఉన్న భూమి యావత్తు ప్రజలది. దానిల్లో వ్యవసాయం చేసే రైతులు శాశ్వత జిరాయితీ హక్కును కలిగియుంటారు. కొన్ని వందల, లేక వేల, యకరాల భూమిని కలిపితే ఒక "సమిష్టి వ్యవసాయ క్షేత్రం" అవుతుంది. వ్యవసాయానికి కావలసిన యంత్రాలు, బిల్డింగులు, పశువులు మొదలయినవన్నీ ఉమ్మడి ఆస్తిగా పరిగణించ బడతాయి. వీటిని ఏ విధంగా ఉపయోగించాలో ఆ క్షేత్రంలో పని చేసే రైతులే నిర్ణయించు కుంటారు. సంవత్సరం మొత్తం మీద, ఖర్చులు పోగా లభ్యమయిన పంటలో ఒక నిర్దిష్టమైన భాగాన్ని ప్రభుత్వానికి పన్నుగా చెల్లించాలి. మిగిలిన పంటను రైతులంతా పంచు కుంటారు. కాని, సమానంగా పంచుకోరు. ఏ రైతు ఎంత పని చేస్తాడో దాన్ని బట్టి అతని భాగం నిర్ణయించ బడుతుంది. నిర్దిష్టమైన ఒక పని చేయడానికి సాధారణంగా ఒక రోజు (7 గంటలు) పట్టితే, ఒక వ్యక్తి తన ప్రత్యేక శ్రద్ధవల్ల, కృషివల్ల, ఆ పనిని $3\frac{1}{2}$ గం. కాలంలో పూర్తి చేస్తాడను కొందాం. అతను 7 గం. కాలం పూర్తిగా పని చేస్తే, అప్పుడతనికి రెండు రోజుల ప్రతి ఫలం యిస్తారు, ఇదే విధంగా, రైతులు చేసిన పనిని బట్టి వారికి రావలసిన భాగం ఎంతో నిర్ణయం చేయబడుతుంది. రైతుల సాంవత్సరిక సమావేశంలోనే [illegible]వన్నీ నిర్ణయించ బడతాయి. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్ను ప్ర[illegible]త్వాధికార్లు పంట రూపంలో "సమిష్టి క్షేత్రా"న్నుంచి వసూలు చే[illegible]రు. ఏ వ్యవసాయ క్షేత్రం నుండి ఎంత పంట లభిస్తుందో సంవత్సర ప్రా[illegible]రంభంలోనే ఆ భూమి యొక్క సారాన్ని బట్టి, పంట యొక్క రకాన్ని బట్టి, అంచనా వేస్తారు. దాంట్లో సాధారణంగా మూడవ వంతు పన్ను (యంత్రాలకు ఈయవలసిన అద్దెతో సహా) విధిస్తారు. ఈ పన్ను సంవత్సరం చివర వసూలు చేస్తారు. ఈలోగా, రైతులు ఎక్కువ కృషి చేయడంవల్లగాని, కొత్త పద్ధతు లవలంబించడంవల్లగాని, ఎక్కువ భూమిని కలుపుకొని సేద్యం చేయడంవల్లగాని లభ్యం అయే అదనపు పంటను రైతులే పంచు కుంటారు. ప్రభుత్వానికి దీని మీద ఎట్టి హక్కు లేదు. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్ను, అద్దె పోగా మిగిలిన పంటను ఏ విధంగా ఉపయోగించాలో రైతులే సాంవత్సరిక సమావేశంలో నిర్ణయించు కుంటారు. వచ్చే సంవత్సరం విత్తనాలకు, కొత్త బిల్డింగులకు, కొత్త [illegible]రాలకు, శిశువుల క్రిషీ (తల్లులు పని చేసే టప్పుడు శిశువుల పో[illegible] ఏర్పరచబడు సంస్థలు)లకు, కిండర్ గార్టెన్ల (3 మొదలు 8 [illegible]రాల వయస్సు గల బాలబాలికల విద్యాలయాలు)కూ, సినీమా[illegible] ఆస్పత్రులకూ, పఠన మందిరాలకు మొదలయిన వాటికి కొంత ప[illegible]త్యేకించి, మిగిలిన దాన్ని పంచు కుంటారు. ఒక్కొక్క రై[illegible]లభించిన యీ పంటను అందరూ కలిసి, ఏక మొత్తంగా, [illegible]ని, సహకార సంస్థలలోగాని అమ్ముకొని, ఆ సొమ్మును పంచు[illegible]. లేదా, ఒక్కొక్క రైతు తనకు లభించిన భాగాన్ని ఒక [illegible] వద్దకు గాని ఒక స్టోర్ వద్దకుగాని తీసుకువెళ్ళి, అక్కడ [illegible]కోవచ్చు.

[illegible] ప్రతి రైతు కుటుంబం 2 లేక 3 ఆవులు, వాటి దూడలు, 20 లేక 25 [illegible]గొర్రెలు లేక మేకలు, కొన్ని పందులు, అవసరమైనన్ని కోళ్ళు, చెవు[illegible] పిల్లులు, యివి సొంతంగా ఉంచుకొన వచ్చును. $2\frac{1}{2}$ యకరాల వరకూ భూమినికూడ కలిగి యుండవచ్చును. దీనిని కాయకూరలు, ప[illegible] పండించుకోడానికి యింటి తోటగా ఇస్తారు.

## 1932—37 : రెండవ పంచవర్ష ప్రణాళిక.

1932 లో ప్రారంభమైన రెండో పంచవర్ష ప్రణాళిక 1937 తో దిగ్విజయంగా అమలు జరిగింది. ఈరోజున రష్యాలో మొత్తం 2,43,700 "సమిష్టి వ్యవసాయ క్షేత్రా" లున్నాయి. సాగుబడి చేయబడుతూన్న భూమిలో 100 కి 99 వంతులు "సమిష్టి" పద్ధతిపైననే వ్యవసాయం నడుస్తోంది. దీన్ని నాశనం చేయడానికి ఇదివరలో అనేక మార్గాలు చేబట్టిన ధనిక రైతులు యిప్పుడు సంతోషంగా కొత్త విధానంలో పాల్గొంటున్నారు. కుట్రలు, తిరుగుబాట్లు, పశువుల్ని చంపడం ఎక్కడా కన్పించవు. ప్రభుత్వానికి ప్రతిరైతూ ఉల్లాసంతో తోడ్పడుతున్నాడు.



## యంత్ర సహాయం

యంత్ర సహాయం లేకపోతే "సమిష్టి వ్యవసాయ" పద్ధతి జయింపేదికాదు, 1938 వ సంవత్సర ప్రారంభంలో మొత్తం 3,67,000 ట్రాక్టర్లు (విధ్యుచ్ఛక్తి సహాయంతోగాని, ఆవిరి సహాయంతోగాని పొలాలు దున్నే యంత్రం), వీటిని తయారు చేయడానికి 5919 ట్రాక్టర్ స్టేషన్లు రష్యాలో ఉన్నాయి. ఈ సంఖ్య 1932 లో కంటె 5 రెట్లు ఎక్కువ. ఇంతేగాక. 1,04,00 కంబైన్ (పొలాలలో పండిన పంటను కోసే యంత్రం)లూ (ఇవి 1932 లో కంటె 50 రెట్లు హెచ్చు) 67000 మోటార్ కార్లు (1932 లో కంటె 10 రెట్లు హెచ్చు), వ్యవసాయంలో ఉపయోగించబడు తున్నాయి. ట్రాక్టర్లు ఉపయోగించడంవల్ల, 10 రోజుల్లో దేశంలో ఉన్న భూమి అంతటినీ 18 అంగుళాల లోతు దున్నడం సాధ్యం అవుతోంది.

ఇదే విధంగా విత్తులు చల్లడం కూడా యంత్ర సహాయంతోనే జరుగుతోంది. ఎన్ని లక్షల యకరాల పొలం అయినా విత్తులు చల్లడానికి ఏ వ్యవసాయ క్షేత్రంలోనూ 3 రోజుల కాలం కంటె ఎక్కువ పట్టదు. కొన్ని ప్రత్యేక సందర్భాల్లో విమానాల మీదనుంచి కూడా విత్తులు చల్లుతున్నారు. ఈ విధంగానే కోతలకు, నూర్పులకు మొదలైన పనులన్నింటికీ యంత్రాలే ఉపయోగించబడు తున్నాయి.

మొదటి పంచవర్ష ప్రణాళిక ($4\frac{1}{2}$ సంవత్సరాలు) లో దేశం మొత్తం మీద 1080 కోట్ల రూబుల్సు (1 రూబుల్ రు. 1-8-9) "సమిష్టి వ్యవసాయా"నికి ఖర్చు చేయబడింది. రెండవ ప్రణాళిక 5 సంవత్సరాలు) లో యిది 2190 కోట్ల రూబుల్సుకు పెరిగింది. ఈ 2190 కోట్లలో 500 కోట్ల రూబుల్సు "సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు" తమ సొంత ఆదాయంలో నుంచి ఖర్చు చేసుకున్నాయి. మిగిలిన 1690 కోట్ల రూబుల్సు ప్రభుత్వం పెట్టుబడి పెట్టింది. ఈ క్రింది అంకెలు చూస్తే, ఏ విధంగా వ్యవసాయంలో యంత్రశక్తి వృద్ధి చేయబడుతూందో తెలుస్తుంది:—

| యంత్రాల రకాలు | 1928—32 | 1932—37 |
|---|---|---|
| ట్రాక్టర్లు (లక్ష హార్స్ పవర్ గలవి) | 24 | 87 |
| విత్తులు చల్లే యంత్రాలు (వేల సంఖ్యలో) | 16 | 87 |
| మోటారు కార్లు, లారీలు వగైరా (వేల సంఖ్యలో) | 14 | 170 |
| విధ్యుచ్ఛక్తి పవర్ స్టేషన్లలో ఎన్ని వేల కిలోవాట్ల (గంటలు) శక్తి ఉత్పత్తి అవుతోంది? | 36 | 384 |
| కొత్తగా తయారు కావలసిన ట్రాక్టర్ స్టేషన్లు | 2446 | 3554 |
| యంత్రాలను బాగుచేసే కొత్త కర్మాగారాలు | 2320 | 4600 |

ఈ విధంగా, వ్యవసాయంలో యంత్రశక్తిని విరివిగా ప్రవేశపెట్టడం వల్ల [illegible] 1937 వ సంవత్సరం చివరకి అమెరికా వంటి పెద్ద [illegible] దేశాల కంటె కూడా ముందంజ వేసింది. రష్యాలో పూర్వపు వ్యవసాయ పద్ధతులకూ, నేటి పద్ధతులకూ ఎంత తారతమ్యం ఉందో ఈ క్రింది వివరాల వల్ల తెలుసుకోవచ్చు:—

| వివరాలు | | 1929 100 యకరాలలో | 1937 100యకరాలలో |
|---|---|---|---|
| దున్నుట | కొయ్యనాగళ్ళతో | 10 | — |
| | గుర్రాలనుకట్టి | 89 | 20 |
| | ట్రాక్టర్ల సహాయంతో | 1 | 80 |
| విత్తు యిచల్లుట | చేతితో | 74 | — |
| | గుర్రాలను కట్టి | 25 | 45 |
| | యంత్రసహాయంతో | 20 సెంట్లు | 55 |
| కోతలు | కొడవళ్ళతో | 44 | — |
| | గుర్రాలనుకట్టి | 55 | 40 |
| | ట్రాక్టర్ల సహాయంతో | 20 సెంట్లు | 60 |
| నూర్పుళ్ళు | చేతి పనిముట్లతో | 41 | — |
| | గుర్రాలను కట్టి | 58 | 15 |
| | యంత్ర సహాయంతో | 1 | 85 |

యంత్రశక్తితో బాటు చక్కని యెరువులు కూడా భూముల కుపయోగించి, ప్రజలు ఎక్కువ లాభాన్ని పొందుతున్నారు.

| ఎరువుల రకాలు | 1932 | 1937 |
|---|---|---|
| నైట్రేట్లు | 22 వేల టన్నులు | 1410 వేలటన్నులు |
| పొటాష్ | 79 ,, | 1680 ,, |
| సూపర్ ఫాస్ఫేట్లు | 614 ,, | 3000 ,, |
| పౌడర్ ఫాస్ఫరైట్లు | 396 ,, | 2200 ,, |

ఈ యంత్రాభివృద్ధి వల్ల ప్రజలు పూర్తియైన ప్రయోజనం పొందాలంటే, ఇంజనీర్లు మొదలైన నిపుణులు ఎక్కువగా తయారౌతూ ఉండాలి. 1937 లో కొత్త యంత్రాలవద్ద పనిచేసే నిపుణులు 25 లక్షలున్నారు. ప్రత్యేకంగా "సమిష్టి వ్యవసాయ క్షేత్రాల"లో యంత్రాలు నడపడానికి 80 లక్షల మంది తరిఫీదు చేశారు. వీరుగాక, అగ్రనైజర్లు, మేనేజర్లు, బ్రిగేడ్ నాయకులు, ఫైర్‌మెన్లూ, యంత్రాగారముల డైరెక్టర్లు, మెకానిక్‌లు, రసాయన శాస్త్రజ్ఞులు, బుక్‌కీపర్లు — ఇంకా ఎంతో మంది తరిఫీదు పొందిన రైతులు పని చేస్తున్నారు.

## పశు సంపద

ప్రజలకు బలం కలిగించే ఆహార పదార్థాలు విరివిగా లభ్యం కావాలంటే, పశువుల విషయమై ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి. రెండవ పంచ వర్ష ప్రణాళికలో యీ క్రింది ప్రకారం పశువుల సంఖ్య వృద్ధి చేయబడింది.

| పశువుల రకాలు | 1932 | 1937 |
|---|---|---|
| గుర్రాలు | 196 లక్షలు | 218 లక్షలు |
| ఆవులు | 210 ,, | 269 ,, |
| పందులు | 116 ,, | 434 ,, |
| మేకలు, గొర్రెలు | 521 ,, | 960 ,, |
| చెవుల పిల్లులు | 53 ,, | 170 ,, |
| కోళ్ళు | 1200 ,, | 3000 ,, |

ప్రజలకు కావలసిన మాంసపు సరకులన్నీ, ఎక్కువగా పందుల వల్ల - కోళ్ళ వల్ల - చెవుల పిల్లుల వల్ల లభించాలని ప్రభుత్వపు ఆశయం. ఇది స్వల్ప కాలంలోనే పెద్దవై, త్వర[illegible] ఉపయోగానికి వస్తాయి. మేకలు, గొర్రెలు, ఆవులు వగయి[illegible]ధంగా రావు. వీటిని ప్రభుత్వం కాపాడి, వీటి సంఖ్యను వృద్ధిచేసి, ప్రజలకు కావలసిన పాలు, వెన్న, నెయ్యి మొదలయిన పదార్థాలు కూడా ఎక్కువగా లభించేటట్లు ప్రభుత్వం శ్రద్ధ తీసుకొంటూంది. క్రింది లెక్కలు యీ విషయాన్ని సూచిస్తున్నాయి.

| సంవత్సరం | ఆవుమాంసం ఎద్దుమాంసం (100 కి) | మేకమాంసం (100 కి) | పందిమాంసం (100 కి) | కోళ్లు చెవుల పిల్లులు వగైరా (100 కి) |
|---|---|---|---|---|
| 1932 | 47 | 18 | 28 | 7 |
| 1937 | 27 | 7 | 51 | 15 |

ఇంతేకాదు. శ్రేష్ఠమైన పశుజాతులు 1932 వ సంవత్సరం కంటె 1937 నాటికి ఎక్కువ చేయబడ్డాయి. ఆవులు, గేదెలు, ఎద్లు-వీటి బరువు 100 కి 35 వంతున; పందుల బరువు 100 కి 25 వంతున; గొర్రెల బరువు 100 కి 80 వంతున ఎక్కువ చేయబడింది. గొర్రెల బొచ్చు 100 కి 24 వంతున; కోళ్ళు, కోడిగుడ్లు, చెవుల పిల్లులు వగైరా 100 కి 450 వంతున; మొత్తం పాలు 100 కి 100 వంతున 1032 కంటె 1937 లో ఎక్కువ లభించింది.

## ఇతర దేశాలు—రష్యా

ఈ విధంగా రష్యా ప్రభుత్వం వ్యవసాయంలో యంత్రశక్తి, శాస్త్ర పరిశోధనలు విరివిగా ప్రవేశ పెట్టడంవల్ల, పంటలు ఎక్కువౌతున్నాయి. 1932 వ సంవత్సరంలో తయారయిన మొత్తపు పంటల విలువ 1307 కోట్ల రూబుల్సు (1 రూబుల్ రు. 1-8-0) ఐ ఉండగా 1937 లో 2616 కోట్ల రూబుల్సు. రష్యా ప్రపంచ దేశాల్లో ఎట్టి స్థానం అలంకరించి యుందో యీ క్రింది అంకెలవల్ల బోధపడుతుంది :

| పంట | 1928 లో ఎన్నో స్థానం | 1932 లో ఎన్నో స్థానం | 1937 లో ఎన్నో స్థానం |
|---|---|---|---|
| గోధుమలు | 2 | 2 | 1 |
| బార్లీ | 2 | 2 | 1 |
| ఓట్సు | 2 | 2 | 1 |
| పత్తి | 5 | 4 | 3 |
| ఫ్లాక్సు నార | 1 | 1 | 1 |
| బీట్ పంచదార | 2 | 2 | 1 |
| గుర్రాలు | 1 | 1 | 1 |
| ఆవులు, గేదెలు | 2 | 4 * | 3 |

* 1930 లో ధనిక రైతులు వాటిని చంపడంవల్ల నాల్గవ స్థానం ఆక్రమించవలసి వచ్చింది.

ఒక్కొక్క సరకు యొక్క పంట 1937 నాటికి ఏ విధంగా వృద్ధి చెందిందో యీ క్రింది అంకెలు తెలియజేస్తాయి.

| సరకు | 1932 (లక్షల టన్నులు) | 1937 (లక్షల టన్నులు) | 100 కి ఎంత ఎక్కువ |
|---|---|---|---|
| ధాన్యపు దినుసులు | 199 | 346 | 174 |
| బంగాళా దుంపలు | 90 | 164 | 183 |
| పండ్ల దినుసులు | 42 | 87 | 208 |
| మాంసం | 9 | 25 | 266 |
| పాలు, వెన్న | 41 | 96 | 236 |

## రష్యా రైతు

"సమిష్టి వ్యవసాయ క్షేత్రా"లలో పనిచేసే రైతు యొక్క ఆదాయం నానాటికి వృద్ధి అవుతోంది. అంస్కీ రాష్ట్రంలో **Flourishing of New Life** (నూతన జీవితపు శోభ) అనే క్షేత్రం ఉంది. అక్కడ

# యుక్రేనియన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

## ★ ముఖ్య పట్టణం — కీవ్




రిపబ్లిక్కులలో యుక్రైన్ రెండవది. చాల భాగ్యవంతమైనది. బొగ్గు, రసాయనములు, ఇంజనీరింగ్, లోహములు ఎక్కువ ఉన్నాయి. సోవియట్ యూనియన్‌కు ధాన్యపు కొట్టులాంటిది. "స్టఖనోవ్" ఉద్యమానికి మూలకందము.

జారు సామంత ప్రభువులను, పోపిడిగాండ్రను, జాతీయ బూర్జువాను, జర్మనులను, గెలిషియన్ జాతీయవాదులను తరిమివేయటానికి రక్తస్రవంతులను, కన్నీటి కాలువలను, ప్రవహింప చేశారు.

యుక్రైన్ ప్రజలు బోల్షివిక్ నాయకత్వాన, రష్యన్ కార్మిక రక్షుల సహాయంతో జర్మను సామ్రాజ్య వాదులను తరిమి వేశారు. "పెట్లురా" ను ఓడించి, తమ దేశానికి యజమాను లయారు

ఒక్కొక్క రైతు రోజుకు 52 వీశెల ధాన్యం వంతున సంపాదించ గలిగాడు. ఎట్ కుల్ స్కీ జిల్లాలో, 30 వ్యవసాయ క్షేత్రాల లెక్కలను బట్టి, ఒక్కొక్క రైతు రోజుకి 50 మొదలు 60 వీశెల ధాన్యం లేక 5—7 రూబుల్సు వంతున సంపాదించినట్లు తెలుస్తోంది. వీరుగాక, పరిశ్రమలకు కావలసిన పంటలు పండించేవారు రోజుకి 20—25 రూబుల్సు వంతున 1937 లో చాలా రాష్ట్రాలలో సంపాదించారు. ఉజ్బెక్ రాష్ట్రంలో "కారల్ మార్క్స" అనే పేరుగల సమిష్టి క్షేత్రానికి 1937 లో పండిన అదనపు పత్తి పంటకు 17 లక్షల రూబుల్సు లభించాయి. మొత్తము ఆదాయం, 35 లక్షల రూబుల్సు. రోజుకు 21 రూబుల్సు వంతున రైతులకు పంచిపెట్ట బడింది. రైతుల శరీర పోషణకు కావలసిన ఆహార పదార్ధాలన్నీ పుష్కలంగా లభిస్తున్నాయి, వెన్న, పాలు, కోడిగుడ్లు, మాంసం—యివి రష్యాలో ప్రతి సామాన్య రైతుకు దొరుకుతున్నాయి. చక్కని బూట్లు, తెల్లని దుస్తులు, కుర్చీలు, టేబిల్సు, ఇనుప మంచాలు, ఆటలకు సంబంధించిన సాధనాలు, సబ్బులు, తలనూనెలు, పుస్తకాలు, ఫోటో కెమేరాలు, సంగీతపు వాయిద్యాలు, వైర్లెస్ సెట్లు—యింకా ఎన్నో విలాస వస్తువులు నేటి రష్యారైతు కొనుక్కొని ఆనందిస్తున్నాడు.

విద్య విషయంలోను, ఇతర విజ్ఞాన సౌకర్యాల విషయంలోను కూడా ఏ విధంగా ఉన్నాడో చూద్దాం. బైలో రష్యన్ రిపబ్లిక్ అనే రాష్ట్రంలో రైతులకు 6435 సెకండరీ పాఠశాలలు, 1427 క్లబ్బులు, 3215 లైబ్రరీలు, 64 రేడియో స్టేషన్లు, 15,930 రేడియో యంత్రాలు, 735 సినీమాలు, 50 టాకీలు 1937 లో ఉన్నాయి. ప్రతి "సమిష్టి వ్యవసాయ క్షేత్రా"నికి ప్రత్యేకమైన థియేటర్లు, వందలకొద్దీ సంగీత పాటకులు, డ్యాన్స్ చేసేవారు, చిత్రకళలో ఆరితేరినవారూ ఉంటారు. ఏ శాస్త్రంగాని, ఏ కళగాని అభివృద్ధి చేసుకోవటానికి ప్రతి రైతుకూ అవకాశం, తీరిక ఉంది. స్త్రీల ఔన్నత్యం విషయం చెప్పనే అక్కర్లేదు. స్టాలిన్ యీ విధంగా వ్రాశాడు:—

"సమిష్టి వ్యవసాయ పద్ధతివల్ల స్త్రీలు పూర్వపు దాసిసత్వం నుంచి విముక్తిని పొంది, సంపూర్ణమైన స్వాతంత్ర్యం అనుభవిస్తున్నారు. అవివాహితలు పూర్వంవలె తమ తండ్రుల కొరకు ఊడిగం చేయనక్కరలేదు. వివాహం అయిన తరువాత భర్తకు నిర్బంధసేవ చేయనవసరం లేదు. తమ కొరకు తామే కృషి చేస్తారు. రైతు స్త్రీలకు స్వాతంత్ర్యం యిదే. సమిష్టి వ్యవసాయం వల్లనే ఇది సాధ్యమయింది. పనిచేసే ప్రతి స్త్రీయు పురుషునితో సమాన ప్రతిపత్తి అనుభవించ గలుగుతోంది."

స్త్రీలు పొలాల్లో పని చేసేటప్పుడు వారి శిశువుల్ని క్రెషీలలో ఉంచి జాగ్రత్తగా పోషిస్తారు. కొంచెం వయస్సు వచ్చిన బాల బాలికల్ని కిండర్ గార్డెన్లలోను, పయినీర్లలోను పెంచుతారు. ప్రత్యేకంగా తరిఫీదు పొందిన నర్సులు, డాక్టర్లు క్రెషీలలో పని చేస్తారు.

ఇదే విధంగా ప్రభుత్వం వయస్సుతీరిన రైతుల ఆరోగ్యం విషయంలోను, ఇతర సౌకర్యాల విషయంలోను ఎంతో శ్రద్ధ తీసుకొంటుంది. ముసలి రైతులు కూడా నేడు "సమిష్టి వ్యవసాయ పద్ధతి"కి అనుకూలురు.

•

కార్మిక కర్షకులచేత, కార్మిక కర్షకుల కొరకు స్థాపించబడిన సోవియట్ ప్రభుత్వం నేడు, వారి వారి శ్రమకు తగిన ప్రతి ఫలాన్ని యిస్తోంది. విప్లవానికి పూర్వం, రైతు యొక్క శ్రమను జమీందార్లు, షాహుకార్లు, ప్రభుత్వం దోచుకొని బ్రతికేవారు. నేడో? దోపిడీదార్లు లేరు. ప్రభుత్వమే రైతుల తరఫున వ్యవసాయం అంతా ప్రణాళికల ప్రకారం నడిపిస్తోంది. శాస్త్ర పరిశోధనలవల్ల విరివిగా లభ్యమయ్యే పంట, రైతులే అనుభవిస్తారు. కొంత భాగం పన్ను రూపంగా ప్రభుత్వం వసూలు చేయవచ్చు. కాని యీ ప్రభుత్వం తమదే నని రైతులకు తెలుసు. కాబట్టి సంతోష పూర్వకంగా యిస్తారు.

ఏ శాసనాలైనా ఇచ్చే గ్యారంటీకన్న ఎక్కువ నమ్మకమైన భీమా కావాలంటే, మదరాసు ప్రభుత్వ ట్రస్టీతో, ట్రస్టీ అరేంజ్ మెంటున్న యునైటెడ్ ఇండియా లో భీమాచేయండి.

యునైటెడ్ ఇండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

[ 1906 లో స్థాపితము ]

హెడ్ ఆఫీసు, మద్రాసు.



# ఆదర్శప్రాయమైన విద్యా విధానం

కామ్రేడ్ చలసాని వాసుదేవరావు

రష్యాలో నేడున్న విద్యా విధానము ప్రపంచమం దెచ్చటను లేదు. ప్రపంచములో నున్న అన్ని దేశముల రాజకీయార్థిక విధానములకును, రష్యాలోనున్న రాజకీయార్థిక విధానమునకును ఉన్న ముఖ్య భేదమే రష్యా విద్యా విధానము, ప్రపంచములోని యితర దేశములలో నున్న విద్యా విధానముల మధ్య కన్పించును. సోవియట్ రాజ్యాంగ నిర్మాణముతో, సోషలిస్టు ఆర్థిక సిద్ధాంతములతో నున్న సమాజములోనే తప్ప తదితర యేసమాజములోను ప్రస్తుతము రష్యాలో నున్న విద్యా విధానము అనుకరింపబడ జాలదని గట్టిగ నిరూపింప బడినది. అందుచే రష్యాలోని విద్యా విధానములోని గొప్పతనము రష్యా ప్రజల ప్రతి యొక్కనికి చదువను, వ్రాయను నేర్పుటలోను, సర్వతోన్ముఖ విద్యావ్యాప్తి గల్గించటములోను, రష్యా గడించిన వైజ్ఞానికాభివృద్ధిలోనే గాక అందిమిడియున్న ప్రాధమిక సిద్ధాంతములలోనే యున్నది. విద్యా విధానమున కొక ఆమూలాగ్రమైన విప్లవకర లక్షణమును యేర్పరచుటలో వుంది. ఇదివరలో జార్ ప్రభుత్వములో నున్నదియు, ప్రస్తుత మన్ని దేశములలో నున్నట్టి విద్యా విధానములలో యెన్ని ఆధునిక సంస్కరణలు చేసినప్పటికిని ప్రధానలక్షణ మొకటి మారడం లేదు. పరిపాలకుల వర్గ లక్షణములు, సాంప్రదాయములు దాటి బయల్పడ జాలకున్నది. అందుచే రష్యాదేశములోని విద్యా విధానము వలన ప్రజలు జీవితములో సర్వతోన్ముఖాభివృద్ధి గాంచునట్లు యితర దేశముల విద్యా విధానములను యెంత స్వతంత్రముగా వుంచుటకు ప్రయత్నించినను సమాజమునంతను ఆవరించిన ధనాఢ్య లక్షణములు, సంకుచితాభివృద్ధి మొదలగు హద్దులను అతిక్రమించ జాలకున్నది. అందుచేతనే రష్యన్ ప్రభుత్వము నూతన విద్యా విధానమును అమలులో పెట్టునప్పుడు విద్య యొక్క ఆశయములను స్పష్టీకరించుచూ ప్రకటన చేసినది.

## విద్యాభివృద్ధి.

1917వ సంవత్సరములోనే పైవిధానమును అమలులో పెట్టినప్పటికిని దాదాపు 1929వ సంవత్సరం వరకు ప్రభుత్వం సర్వత్రా ఆచరణలో పెట్టజాలక పోయినది. రష్యాలో విప్లవానంతరం గల్గిన అంతఃకలహము తత్ఫలితము వలన ప్రభుత్వమును స్థిరపరచుకొనుటకే శక్తులన్నీ ధారబోయ వలసి వచ్చింది. అయినప్పటికిని జార్ ప్రభుత్వమునకన్న అనేక రెట్లు ఆ కొద్ది ఆర్థికావకాశములతోనే విద్య నభివృద్ధిపరచెను. 1913 వ సంవత్సరంలో జారు ప్రభుత్వం విద్యకై 240 లక్షల రూబుల్సు (3 కోట్ల 60 లక్షలుల రూపాయలు) అనగా ప్రతి విద్యార్థికి ఒకటి ముప్పాతిక రూబుల్సు (2-8-0రూ) ఖర్చుచేస్తే సోవియట్ ప్రభుత్వం1925వ సంవత్సరం నాటికే 6,4 కోట్ల 10 లక్షల రూబుల్సు. (94 కోట్ల 16 లక్షల రూపాయలు) అవగా మనిషి 1కి 39 రూబుల్సు (58 రూపాయలు.) ఖర్చుపెట్టినది. అనగా దాదాపు అప్పటికన్న 23 రెట్లు హెచ్చు విద్యకొరకై వెచ్చించినది. 1913 వ సంవత్సరపునాటి ఆర్థిక పరిస్థితులు 1925 వ సంవత్సరమునాటికి లేనప్పటికిని, 1927వ సంవత్సరం నాటికి ప్రభుత్వమును స్థిరపరచు కోవడమేగాక, జార్ ప్రభుత్వము నాటి ఆర్థికపరిస్థితులను పునరుద్ధించ గల్గింది. నిజముగ గత 10 సంవత్సరములనుండే రష్యాలో వచ్చిన అద్భుత మార్పులన్నీ ఉద్భవించినవి. 1930 నాటికి రష్యా దేశమంతటను నిర్బంధ, వుచితమైన సార్వజనిక విద్యా విధానమును అమలులో పెట్టగల్గినది.

## విద్యావిధానంయొక్క ఆశయం.

రష్యా విధానములో నేర్పేప్రతిఫాతం దేశానికి, సమాజానికి ఆర్థికంగా తోడ్పడే విధానం మీద ఆధారపడినదిగా వుండును. అందుచేతనే ఉపాధ్యాయులు, విద్యార్థులు కేవలం విద్యాభ్యాస కాలములోనైనా విద్యాలయములలోనే వుండక వుత్పత్తి విధానములో గూడ నిర్బంధముగ పాల్గొనవలెను. దీని వలన మానసిక, శారీరక శ్రమల మధ్యనుండే అంతరాయము పోయి తద్వారా పట్టణములకునూ, పల్లెలకునూ సామాన్యునకునూ, చదువునేర్చిన వానికి నున్న కృత్రిమ భేదము తొలగిపోయి, స్వేచ్ఛావాతావరణము, విశాల భావములు గల్గుట కవకాశ మేర్పడును. ఈ దృష్టితోనే రష్యన్ విద్యావిధానములో యెన్నిరకములుగ బోధించుచున్నను అన్నిటిలో నుద్యోతకమగునది పై లక్షణమే. ఈ నూతన విధానము "పోలిటెక్నికైజేషన్" అని సాంకేతిక భాషలో వాడబడుచున్నది. రష్యన్ విద్యా విధానము యొక్క యింకొక లక్షణం సార్వజనితమైన నిర్బంధ వుచిత ప్రారంభ విద్యయేగాక, ప్రారంభమునుండి సాంకేతిక (Technical), పారిశ్రామిక (Industrial) రాజకీయ (Political) విద్యను సిద్ధాంతరీత్యా, ఆచరణ పరిశోధన రూపేణా నిర్బంధముగ నేర్పుటచేతనూ, యిట్టి విద్య యే కొద్దిమందికో గాక సార్వజనిక మగుట చేతనూ, ప్రస్థుతం ధనాఢ్యవిధానములో నున్న వర్గ హద్దులకు (Class limitations) మించ గలిగి నిజమైన మానవులుగా ప్రతి వాడిని తయారు చేయగలుగుచున్నది. అందుచే రష్యన్‌విధానములో మరియొక ముఖ్య లక్షణము ప్రతి పౌరునకు జీవితాధారము నిచ్చు విద్యను గరుపుటేగాక మానసిక పరిపక్వముపొంది వుత్తమ వైజ్ఞానిక లక్షణములు గల్గి జీవితముయొక్క సర్వతోన్ముఖాభి వృద్ధిగాంచ గలుగుచున్నాడు, ఇట్టి విద్యను ప్రతి పౌరుడు పొందుటకు యేర్పడ్డ అవకాశముల వలననే రష్యా దేశములో విద్య సార్వజనికముగా వ్యాపించుచున్నది. (Universalism). నూతన విధానముయొక్క ముఖ్యలక్షణములు.

1. జీవితము యొక్క సర్వతోన్ముఖాభివృద్ధి కొరకై విద్యను గరపుట.

2. దేశము యొక్క ఉత్పత్తి విధానమునకు తోడ్పడునట్లుగా విద్యా విధానము నేర్పాటుచుట.

3. మానసిక, శారీరక శ్రమల మధ్య నున్న అంతరాయమును పోగొట్టి తద్వారా పట్టణములకు పల్లెలకు వున్న కృత్రిమ భేదమును తొలగించుట.

4. ప్రతి పౌరుడు రాజకీయ జ్ఞానముతో పబ్లిక్ వ్యవహారములో స్వయముగ వివేచనతో పాల్గొనునట్లు చేయుట.

5. ప్రతి పౌరుని సర్వతోన్ముఖ మేధా సంపన్నునిగా చేయుట.

6. ఈ లక్షణములతో గూడిన విద్యను సార్వజనిక మొనర్చుటకు జాతి, మత, వర్గ రహిత మొనర్చి విద్యను విశాల మొనర్చుట.

7. విద్యను సంపూర్ణముగ ప్రాపంచిక, వైజ్ఞానిక (Secular & Scientific) పద్ధతులతో నేర్పుట.

## విద్యావిధానములోని విభాగాలు

ఈ ఆశయములు సాధించుటకు విద్యా విధానమును పూర్తిగ నూతన పద్ధతులపై నిర్మించినది. విద్యను 3 రకాలుగా విభజించారు.

1. స్కూలుకు వెళ్ళకముందు గరిపే విద్య (7 సంవత్సరముల వరకు).

2. పాఠశాలలో నేర్పు విద్య

(అ) ప్రాథమిక విద్య—4 సంవత్సరాలు. (8 సంవత్సరములనుండి 11 సంవత్సరముల వరకు)

(ఆ) మాధ్యమిక విద్య—3 సంవత్సరాలు. (12 సంవత్సరాల నుండి 14 ఏండ్ల వయస్సు వరకు)

(ఇ) 15—17 ఏండ్ల వరకు ఉన్నత విద్య (3 ఏండ్లు)

3. కళాశాల విద్య, ప్రత్యేక సాంకేతిక, పరిశోధక కార్యముల కొరకై యేర్పడ్డ విద్య—5 సంవత్సరాలు. (18 సంవత్సరముల వయస్సు నుండి 22 సంవత్సరముల వయస్సు వరకు)

పై వివిధ రకాల విద్య యే విధముగ నేర్పబడుచున్నదీ వివరముగ తెలుసుకొనే ముందు యీ వివిధ రకాల విద్యలను సంపూర్ణ విజయముతో యేపద్ధతులద్వారా ప్రజలకు నేర్పగల్గిరో తెలుసుకొనుట అవసరము.

ప్రజలకు సులభ సాధ్యముగా ఎంత క్లిష్ట సమస్యలనైనను బోధించవలెనన్న అట్టి సమస్యలను తమ తమ దేశీయ భాషల ద్వారా నేర్పుటే మంచి మార్గము. ఈ సూత్రమును రష్యా ప్రభుత్వములో అమలులో పెట్టినట్లు యెచ్చటను పెట్టలేదు. విద్యను సార్వజనికముగా చేయవలెనన్న దేశీయభాషలలోనే నేర్పవలయునని రష్యన్‌ప్రభుత్వము తలంచెను. తమ విద్యా విధానమును జయప్రద మొనర్చుటకు ప్రప్రధమమున చేసినది యే జాతికా జాతికి విజ్ఞాన స్వాతంత్ర్యము (Cultural Autonomy) యిచ్చుచూ దేశభాషలను ప్రోత్సహించి విద్య నంతనూ (ఆఖరి దశలో బోధించు కళాశాల విద్యను గూడ) దేశ భాషలలోనే బోధిస్తూ వుంది.

## దేశభాషలలో విద్య

దేశీయ భాషలతో విద్య గరపుటచే అద్భుతమైన విద్యాభివృద్ధి సర్వత్రా గల్గినది. ముఖ్యంగా వెనుకబడిన జాతులలో చాల గొప్ప మార్పు త్వరలో వచ్చినది. టార్టార్ రిపబ్లిక్‌లో విప్లవమునకు ముందు చదువుకున్న వాళ్లు నూటికి 15 మంది వుంటే యిప్పుడు నూటికి 99 మంది అయ్యారు. రాష్ట్రమంతటా నిర్బంధ ప్రాథమిక విద్య అన్ని తరగతుల విద్యార్థులకు ఏర్పాటు చేశారు. బాష్కిర్ రాష్ట్రములో విప్లవమునకు ముందు వేయికి 18 మంది స్కూలుకు వెళ్ళేవారు. 1929 లో 584 కున్నూ,

1930 లో 718 కిన్నీ వృద్ధియై యిప్పుడు అంతటా నిర్బంధ ప్రాథమిక విద్య ఏర్పాటు చేశారు.

నిర్బంధ ప్రాథమిక విద్య ఏర్పడుటే గాక కళాశాల విద్య-గూడ యీరాష్ట్రములలో చాల అభివృద్ధి పొందుచున్నది. బాష్కిర్ రాష్ట్రములలో 6 కళాశాలలు, 2 వ్యవసాయ కేంద్రములు, 2 వైద్య కళాశాలలు, 50 టెక్నికల్ స్కూళ్లు మొదలగు ఉన్నత విద్యాశాలలు గూడ ఏర్పడిన్వి. ఇదే విధముగ అన్నిజిల్లాలు సంపూర్ణమైన అభివృద్ధి గాంచుచున్నవి. అన్ని రాష్ట్రములలోను ఉపాధ్యాయులందరు ఆ జాతీయులే. ఇదివరలో ముఖ్య పట్టణాలైన లెనిన్‌గ్రాడ్, మాస్కో, కైల్ పట్టణాలనుండి ఉపాధ్యాయులను పంపవలసి వచ్చేది.

ఇదే గాక యొక జిల్లాలో వున్న మైనారిటీ సంఘాలకు కూడ వాటి భాషలలో విద్య గరపు యేర్పాట్లు చేయబడినవి. వుక్రేన్ రాష్ట్రములో పోలిష్, యిడ్డిష్, వైట్ రష్యన్ జర్మన్, గ్రీక్, ఈస్త్రోనియన్, లెట్టిష్, బల్గేరియన్ మొదలగు 20 కు పైగా వివిధ జాతులున్నప్పటికిని ఆ జాతు లన్నిటికి వాటి వాటి భాషలలో విద్య గరపుకొనుటకు ఆవకాశములు కల్పించి విద్యను పోషించుచున్నారు. జార్జియా రాష్ట్రములో గూడ యిట్లే వున్న జాతులకు ఆ యా జాతీయ భాషలలో విద్య గరపుకొనుటకు ఏర్పాట్లు చేయబడినవి.

ఈ విధంగా వివిధ దేశభాషలను అభివృద్ధిపరచి ప్రోత్సాహించుటచే సోవియట్ ప్రభుత్వం మరింత బలపడినది. విద్యావిహీనత సాంతముగ వివిధజాతుల లోను రూపు మాపబడినది. తద్వారా రష్యన్ దేశీయ విద్యా ప్రమాణములో చాల అభి వృద్ధికల్గి సోషలిష్టు ఆర్థిక రాజకీయ సిద్ధాంతము నూటికి 90మందికి మనస్సుకు పట్టినిది. ఈ రాజకీయార్థిక యైక్యత వివిధ జాతులమధ్య పై పద్ధతి అవలంబించక పోయిన సాధ్యము కానేరదు.

## ప్రాథమిక విద్య

విద్య యెట్లు వివిధరకములుగా చెప్పబడుచున్నదో చెప్పవలసివుంది. మూడు రకములుగ విభజింప బడినదని యిదివరలో చెప్పబడినది. మొదటి రకపువిద్య స్కూలుకు పోకుండగనే కిన్‌డర్‌గార్టెన్సు ద్వారాను, ఆటస్థలముల ద్వారాను ఆటస్థలములద్వారాను, ప్రకృతి సౌందర్య ప్రదేశములలోనికి తీసుకపోయి ప్రత్యక్షముగ చూపించుటద్వారాను నేర్పబడును. ఈ విద్య 7 సంవత్సరములు అంతకు లోపు వయస్సుగల చిన్న పిల్లలకే చెప్పబడును. దిక్కు-మొక్కు-లేని వారున్నూ, తల్లిదండ్రులు పోషించడము చేతగాని పిల్లలకు ప్రత్యేక గృహములు గట్టి ప్రత్యేక శిక్షణ, రక్షణ యొసగుదురు.
ఈ పద్ధతి ప్రారంభములో అన్నిచోట్లను అనగా అన్ని రాష్ట్రములలోను ఆచరణలో పెట్టజాలక పోయినను 1937 వ సంవత్సరమునకు సర్వత్ర అమలులోనికి వచ్చెను. పిల్లలకు మనసు స్థిర పడకముందే స్కూలులో కూర్చుని చదువుటకన్న ప్రత్యక్షముగా చిత్రములద్వారాను, ఆట పాటల ద్వారా విద్యగరపుట తేలిక. 1932 లో యీ విధమైన విద్యను 52 లక్షల మంది పిల్లలు పొందిరి. 1937 వ సంవత్సరమునకు 160 లక్షలు వరకూ సంఖ్య పెరిగినది. మొత్తంమీద 7 సంవత్సరములలోపు పిల్లలలో నూటికి 75 గురు యిట్టివిద్యను పొందుచున్నారు, సమిష్టి వ్యవసాయ పద్ధతి అభివృద్ధి గాంచిన కొలది గ్రామాలలో పిల్లలు యీ విద్య అంటే హెచ్చుగా అభిరుచి కనపరచిరి. ఈ విధానమును అభివృద్ధి పరచుటకు 1937 వ సంవత్సరంలో 228 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టుటకు యేర్పాట్లు చేశారు.

రెండవరకపు విద్య 8సంవత్సరముల నుండి 11 సంవత్సరముల వయస్సుగల వాళ్లకు యేర్పరుప బడినది. ఈ రకపు విద్యను నిర్బంధముగాను వుచితముగాను చదువు కొనుటకు సోవియటు పరిపాలన ఏర్పడి నప్పటి నుండే నేర్పబడుచుండెను ఈ రకములో 1 మొదలు 4 తరగతుల వరకూ చెప్పబడును. మొట్టమొదటలో యీ రకపు విద్య గరపు స్కూళ్ళలో సాంకేతిక (Technical) విద్య చెప్పబడలేదు. కాని రెండవ పంచవర్ష ప్రణాళికలో యీ స్కూళ్ళలోగూడ అచ్చట విద్యార్థులు, విద్యార్థినులు చేయగల చిన్న చిన్న వస్తువుల యొక్క వుత్పత్తివిధానమును గూర్చి అందుకు సంబంధించిన కొలది శాస్త్రీయజ్ఞానము నేర్పుటకు యేర్పాటు చేసిరి.

పైరకపు స్కూళ్ళలో హెచ్చుగా భాషను చదువుట, వ్రాయుట నేర్పుట గూర్చి యే, నేర్పుటకు శ్రద్ధ వహించెదరు. ఈ స్కూళ్ళలో తయారైన వారందరు బాగుగ చదవడం, వ్రాయడం నేర్చుకొని కొంత శాస్త్రీయ జ్ఞానము గూడ సంపాదించెదరు. ఈ ప్రమాణముతో పై తరగతి స్కూలులో ప్రవేశించి అచ్చట విద్యలన్నిటిని అభ్యసించుటకు తగినవాడుగ యుండగలడు.

ఈతరగతి స్కూళ్లు ప్రతి పల్లెల్లోను ఏర్పరుచబడెను. ఈస్కూళ్ళలో 1932 లో చదువుకొను వారి సంఖ్య 2 కోట్ల 18 లక్షలు. 1937 లో వీరి సంఖ్య 3 కోట్లకు పెరిగినది. 1932 లో గ్రామీణులు 168 లక్షలు, పట్టణవాసులు 50 లక్షలు చదువుచుండెడివారు. 1937 లో 232 లక్షలు గ్రామీణులు, 68 లక్షలు పట్టణ వాసులు. 1932 లో యొక్కొక్కరికి 60½ రూపాయలు ఈ రకపు విద్యకు ఖర్చుపెట్టుచుంటే 1937 లో ఆ ఖర్చు మనిషి 1 కి 100 రూపాయల వరకు పెరిగినది.

స్కూళ్ళలో చదువుకొనకుండ స్కూళ్ల వెలుపల కిన్‌డర్ గార్డెను మొదలుగాగల సంస్థలలో చదువువారి సంఖ్య 1932 లో 52 లక్షలుండగా 1937 లో 160 లక్షల వరకూ పెరిగినది. ఈ విధముగా 1937వ సంవత్సరమునాటికి 11 సంవత్సరములలో వున్న పిల్లలందరున్నూ పూర్తిగ చదువుకొను అవకాశములు దేశమంతటా గల్పింపబడినవి.

## మిడిల్ స్కూళ్ళు: సెకండరీ స్కూళ్ళు

ఇక రెండురకముల పాఠశాలలను గూర్చి తెలుసుకోవాలి (1) 12 సంవత్సరములనుండి 14 సంవత్సరములు వయస్సు గల్గియున్న వాళ్ళకు విద్యనేర్పు స్కూళ్ళు. (2) 14 సంవత్సరముల నుండి 17 సంవత్సరముల వయస్సుగల్గి యున్నవారు నేర్చుకొను విద్యాలయములు. ఈ రెండు రకముల స్కూళ్ళున్నూ సెకండరీ మాధ్యమిక విద్యక్రిందకు వచ్చును. మొదటిరకపు స్కూలులో 5 నుండి 7 వ తరగతివరకున్నూ, రెండవ రకము స్కూలులో 8 నుండి 10వ క్లాసు వరకున్నూ విద్య చెప్పబడును.

7, 11 సంవత్సరముల బాలుర స్కూళ్లకున్నూ, యీ రెండవరకము స్కూళ్ళకున్నూ చాల వ్యత్యాసముగలదు. ఈ స్కూళ్ళలోని విద్యార్థులు సామాన్య విజ్ఞానమున్నూ, జీవితమునకు అవసరమైన 'వృత్తి' సాంకేతిక శాస్త్రీయ విద్యలు సంపూర్ణముగ నేర్చుకొనుదురు. ఇక యిచ్చటనుండి ప్రత్యేక శాఖలలో నైపుణ్యము సంపాదించుటకును, పరిశోధన చేయుటకే కళాశాలలకుపోవునది. దేశము యొక్క వుత్పత్తి విధానము, ఆర్థికనీతి వీటికవసరమైన సామాన్య శాస్త్రీయ జ్ఞానమంతా నేర్చుకొని యికపై బాధ్యతాయుత జీవితమును ప్రవేశించి స్వతంత్ర వివేచనా సహితమైన నడవడినిపొంది పౌరసత్వములను గలిగియుండుటకే మాత్రము అభ్యంతరముండదు.

ఈ రకపు స్కూళ్ళలోనే రష్యన్ విద్యా విధానము యొక్క ప్రత్యేక లక్షణమైన పోలిటెక్నికైజేషన్ విధానము హెచ్చుగా ఆచరణలో పెట్టబడుచున్నది. సామాన్యంగా యీ స్కూళ్ళు ప్రారంభములో బస్తీలలో ఉత్పత్తి కేంద్రాలయములలోను, గ్రామాల్లో ప్రభుత్వ వ్యవసాయ పరిశోధనా కేంద్రములలోను, సమిష్టి వ్యవసాయ సంఘముల వద్దను యుండెడివి. 1929 వ సంవత్సరం వరకూ యీరకపు విద్య ఉచితముగను, నిర్బంధముగను నేర్పజాలకపోయిరి. అయినప్పటికిని ప్రజాసామాన్యంలో హెచ్చుమంది, యిట్టి స్కూళ్ళలో చదువుకొనుటకు చట్టరీత్యా కొన్ని సదుపాయములు చేసిరి. మొదటి పంచవర్ష ప్రణాళికలోనే స్కూళ్లలో హెచ్చుమంది కూలీలు, రైతులు చదువుకొను యేర్పాట్లు చేసినను, నిర్బంధముగను, వుచితముగను యేర్పాటు చేయడం రెండవ పంచవర్ష ప్రణాళికలోనే. 12 సంవత్సరములనుండి 14 సంవత్సరముల వరకూ వయస్సు గలవారు చదువుకొను స్కూళ్ళకు నిర్బంధ, ఉచిత విద్య నేర్పరచ గల్గిరి. ఈ స్కూళ్లు హెచ్చుగా ఉత్పత్తి కేంద్రములలోనే గాక సర్వత్ర మొదటి పంచవర్ష ప్రణాళికానంతరము యేర్పడినవి. 1937 వ సంవత్సరం ఆఖరులలో రకు రష్యాలో వివిధ వర్గములు పోయి నూటికి నూరు పాళ్లు బస్తీలలో శ్రామిక తత్వము, గ్రామాలలో నూటికి 94 గురు సమిష్టి వ్యవసాయ తత్వము గలవారై సర్వ సాధారణముగ సోషలిస్టు సమాజ స్థాపనకు యేమాత్రము అడ్డులు లేకుండుటచే, ప్రజలంతా వివిధ వర్గములలో విభజింపబడుటకు బదులు ఉత్పత్తి కేంద్రములుగా విభజింపబడినారు. అందుచే యీ రకపు స్కూళ్ళు గూడ సర్వత్ర ఏర్పడినవి. దీనితోపాటు యీ స్కూళ్ళలో విద్యార్థులు తయారయ్యేవారు సోషలిస్టు ఉత్పత్తి విధానములో దైనందినం కలిసిపోవుటచే సోషలిస్టు ఉత్పత్తి విధానమునకు తగిన రాజకీయ చైతన్యము, కమ్యూనిస్టు తత్వము గ్రహించగల్గుతే గాక పై సిద్ధాంతముల నిరంతర ప్రచారక బృందముగ కోటానుకోట్లు తమంతట తామే రష్యాలోని విద్యా విధానము వలన తయారగుచున్నారు.

మొదటి పంచవర్ష ప్రణాళిక ఆఖరులో 12 నుండి 14 సంవత్సరముల వయస్సుగల పిల్లలు 100 కి 70 మంది ఈ బడులలో చదువుకొనుచున్నారు. వీరి సంఖ్య రెండవ ప్రణాళిక ఆఖరుకు 1937 కు 92 వరకు పెరిగినది. వుక్రేనియన్, వైట్ రషియన్, ట్రాన్స్‌కాకేషియన్ ప్రాంతములలో గూడ రెండవ ప్రణాళిక ఆఖరుకు ఈ విధానము నిర్బంధముగను, ఉచితముగను చేయబడి మొత్తం మీద రష్యాలో 8 సంవత్సరములనుండి 14 సంవత్సరముల వరకూ చదువుకొనువారి సంఖ్య 106 లక్షల వరకూ పెరిగిపోయింది. 1932 సంవత్సరమునకన్న 3 రెట్లు పెరిగినది. ఈ వయస్సుగల వారిలో నూటికి 95 గురు పై రకపు స్కూళ్ళలో విద్య నభ్యసించుచున్నారు.

1937 లో వీరి సంఖ్య వుజ్బెక్ రిపబ్లిక్‌లో 1932 వ సంవత్సరమునకన్న 23 రెట్లు పెరిగినది. జాతీయ రిపబ్లిక్కులలో గూడ రెండవ ప్రణాళిక ఆఖరుకు చాల అభివృద్ధి వచ్చినది. కిర్గీజ్‌లో 6 రెట్లును, డేఘెస్టన్‌లో 11 రెట్లును, తాజిక్స్తాన్‌లో 6 రెట్లును, యాకుటియాలో 5 రెట్లును అభివృద్ధి గలిగినది. ఈ సందర్భములో సోవియట్ రష్యాలో మొత్తం మీద గ్రామాలనుండి పోవు వారి సంఖ్య 3½ రెట్లును, పట్టణాల నుండి వెళ్లు వారి సంఖ్య 2 రెట్లును 1932 వ సంవత్సరమునకన్న అభివృద్ధి కనుపించినవి.

ఈ రకమైన విద్యకు 1932 లో యొక్కొక్కనికి రు 170 లు ఖర్చుపెట్టారు. 1937 లో రు 260 లు ఖర్చుపెట్టారు.

14 నుండి 18 సంవత్సరముల వయస్సు గల విద్యార్థుల సంఖ్య 1932 లో 57 వేలు అయివుంటే 1937 లో వీరి సంఖ్య 1067 వేల వరకూ పెరిగినది. ఈ రకపు విద్యార్థులకు విద్యార్థి కొక్కొక్కరికి 1932 లో రు 218 లు ఖర్చు చేసారు. 1937 వ సంవత్సరంలో విద్యార్థి కొక్కొక్కరికి యీ రకపు విద్యకై రు 444 లు ఖర్చుపెట్టారు.

ఈ రకపు విద్యకై రష్యాదేశము మొత్తంమీద 1937 వ సంవత్సరంలో 1770 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టారు. ఈ మొత్తంలో 1650 కోట్ల బడ్జెటు నుండి ప్రత్యేకించినది.

ఈ సంవత్సరం బడ్జెట్‌లో విద్యకొరకై, తల్లుల సహాయముకొరకు, ప్రత్యేకించిన మొత్తం 5500కోట్ల రూపాయలు అనగా బడ్జెటు మొత్తంలో నూటికి 28.4 వంతులు. గత ఐదు సంవత్సరములలో వీని అన్నిటికోసం అన్నిశాఖల ద్వారాను ఖర్చు చేసిన మొత్తం రు 13100 కోట్లు రూపాయలయితే దానిలో దాదాపు నూటికి 42 వంతులు 1938లో ఖర్చుపెట్టుతున్నారంటే, ఈ ఒక్క సంవత్సరములో గత సంవత్సరానికన్న 2½ రెట్లు సంపదసౌఖ్యం ప్రజలకోసం హెచ్చించారన్న మాట!

## పోలి టెక్నికల్ విద్య

ప్రైరకపు విద్యావిధానములో రెండవ పంచవర్ష ప్రణాళిక కాలములో పూర్తి చేయుటకు యొక నూతన విధానమును యేర్పరచారు. ఆ నూతన విధానమే పోలిటెక్నికైజేషన్ పద్ధతి. ఈవిధానము 12 సంవత్సరములనుండి 17 సంవత్సరముల వరకు వయస్సుగల విద్యార్థులకు నేర్పునట్లును 10 సంవత్సరములలోపల యీ వయస్సుగల వారితో చాల భాగము విశ్వ విద్యాలయ కళాశాలలోను, పరిశోధ కేంద్రాలయములలో విద్య నభ్యసించునట్లు తయారు చేయునట్లు యేర్పాటు చేసారు. రెండవ ప్రణాళికలో పై విధముగ తయారు చేయగలిగిరి. అందుచే యీరోజున మాధ్యమిక, వున్నత విద్యలను నడపగల కార్మిక, కర్షక, యువక బృందము తయారైనది. దేశీయ విద్యావిధానమున కంతకు సరిపోవునట్టి సంఖ్య శ్రామిక వర్గమునుండి అద్వితీయమైన ఆధునిక శాస్త్రయుక్త జ్ఞానముతోను సోషలిష్టు తత్వముగల 20 సంవత్సరముల లోపు గల యువకులను రష్యా ప్రభుత్వము తయారుచేయ గల్గినది, ఈ విధానముయొక్క ముఖ్య సూత్రము విద్యార్థులకు జాతీయ ఆర్థిక నిర్మాణములోనున్న వివిధ వృత్తి శాఖలయొక్క విధానమును తద్విధానముయొక్క శాస్త్రీయ మూల సూత్రములను తప్పని సరిగా నేర్ప వలయును.

ఫాక్టరీనుండ తయారగుచున్నట్టి సమస్త సరుకులు పుట్టు పూర్వోత్తరము లేమిటో యేవిధముగ వుత్పత్తి చేయబడుచున్నవో, మొదలగు సమస్త వుత్పత్తి విధానము ప్రతి విద్యార్థికి నేర్పవలయును. ఈ విధమైన విద్యను అన్ని శాఖలలోను పొందినవారు, యెంత వైజ్ఞానికాభివృద్ధి పొందిన దేశమైనను, చాల కొద్దిమందే తయారుగా గలుగుచున్నారు,

ఈవిధాన మవలంబించిన ప్రతి స్కూలులోను సామాన్యముగ నేర్చుకొను విద్యతోపాటు విద్యార్థులు, ఉపాధ్యాయులు ఆధునిక పద్ధతులతో నడుపబడు ఉత్పత్తి కేంద్రాలయములలో స్వయముగ పనిచేయుట ద్వారా, ఉత్పత్తిలో పాల్గొనుట ద్వారా, పుస్తకములలో నుండి, ఉపాధ్యాయుల నుండి నేర్చుకున్న పాఠములను నిరూపణ చేసుకొనవలెను. అట్లే ఉపాధ్యాయులు గూడ తమ సిద్ధాంతములను ఆచరణ యోగ్య మొనర్చుటకును మరి కొన్ని నూతన పరిశోధనలు చేయుటకున్నూ ఉత్పత్తి విధానములో ఫ్యాక్టరీలో పనిచేయు కూలితోపాటు పనిలో పాల్గొనవలెను. అప్పుడే సిద్ధాంతము అనుకరణీయముగ నుండునని గట్టి దృఢ విశ్వాస మేర్పడును,

మామూలుగ కాలేజీలలోను, విశ్వవిద్యాలయములలో లేబరేటరీలలో పని చేయు విధానమునకూ ఉత్పత్తి కేంద్రములలో స్వయముగ పాల్గొని కండ్లార తాము నేర్చుకొన్న సిద్ధాంతములు సమాజమున కెంత ఉపయోగకరములో తెలుసుకొనగలడు. అదీ గాక యీ విద్య యెవరో కొందరి గుత్తగ నుండక సార్వజనికమైనప్పుడు ఉత్పత్తి యొక్క నైపుణ్యము అనేక రెట్లు హెచ్చును. అదే గాక ఉత్పత్తి యొక్క శక్తులను అందరు సమిష్టిగ అనుభవించి తద్వారా సౌఖ్యప్రద జీవిత మనుభవించుట కనేక అవకాశము లుండును.

ఈ విధానము వలన విద్యార్థి నేర్చుకొనుచున్న విషయ మేమో యెంతో కాలము అతి కష్టముతో మనస్సులోనే జ్ఞాపకముంచుకోవలెనన్న బాధ వెంటనే తొలగింపబడి వెంటనే ఉపాధ్యాయుడు చెప్పిన దానితో ప్రత్యక్షముగ వుత్పత్తి చేయుటకు దిగుటచే అట్టి నేర్చుకున్న పాఠము(abstract గా వుండక) నర నరములకు యెక్కి వంటబట్టును. ఆహారమును విడువకుండా గైకొనుటను యెట్లు మర్చిపోదో అట్లే యీ విధానములో నేర్చుకొను ప్రతి సిద్ధాంతము మీద తక్షణమే ఆచరణలో పెట్టవలసి యున్నది గాబట్టి విద్యను గూడ మర్చిపోజాలడు. కాబట్టి యీ సిద్ధాంతంతో ప్రతి స్కూలున్నూ ఒక ఫ్యాక్టరీకో, లేక మరి యొక ఉత్పత్తి స్థానమునకో అంటి యుండును. స్కూలులో చెప్పిన ప్రతి విషయములన్నీ వెంటనే ఆయా ప్రదేశములోని పనులలో పాల్గొనుట ద్వారా బాగుగ నేర్చుకొనును. అప్పుడు చదువుకోవడం, వ్రాసుకోవడం కొరకే గాక అన్ని శాస్త్రాలు (Sciences) ఉత్పత్తి యొక్క వివిధ కళలను ఆధారముగ గైకొని నేర్పబడుటకు స్కూలు కేంద్రముగా నుండును.



కేవలం వృత్తుల నేర్చుకొనుటకు తగిన ప్రారంభ నైపుణ్యమును పొంది అనంతరం యేదోయొక ప్రత్యేక విద్యను నేర్చుకొనుటకేగాక ప్రతిదానిలోను సంపూర్ణమైన జ్ఞానమును పొందుటకొరకే యిట్టి విధానమును మాధ్యమిక, ప్రాథమిక స్కూళ్ళ యేర్పరచడం. ఈదృష్టితో వుపాధ్యాయులు చెప్పు ప్రతిపాఠము యేదో యొక వస్తువును వుత్పత్తి చేయు విధానముగానే వుండును. విద్యార్థి ప్రక్కనున్న ఫ్యాక్టరీయో లేక మరియే వుత్పత్తి కేంద్రముయొక్క సహాయముతోనో, ఆవస్తువును వుత్పత్తిచేయ గలుగుతాడు. దానితో వుత్పత్తి యొక్క వివిధ కళలలో నొకకళ నేర్చుకోగలుగుతాడు. ఇట్లు సమస్తకళలు సిద్ధాంతరీత్యాగాక విద్య పూర్తి అయ్యేలోపల ఆచరణ యుక్తముగ నేర్చుకొనికళా పరిపూర్ణుడగును. ప్రక్కనున్న వుత్పత్తి కేంద్రాలలో, స్కూలులో నేర్చుకున్న సిద్ధాంతములను ఆచరణలో పెట్టుటకు కొంతకాలమువరకు స్కూలు బయట పనిచేయుచునే యుండును. ఈ కాలమంతా స్కూలు పిరీడు క్రిందనే లెఖ్ఖ వేయబడును. ఈ విధంగా వస్తువులను తానుగూడ తయారుచేయుటద్వారానే తాను వుత్తీర్ణుడైనదీ లేనిదీ తనంతటతానే ఏపబ్లిక్ పరీక్ష లేకుండా తెలుసుకోగలుగుతాడు. అందుచేతనే విద్యార్థులనుపీల్చి పిప్పిచేయుచున్న నిరర్థక పరీక్షలనేవిగాని శిక్షణలనేవిగాని, ఉపాధ్యాయుల నిరంకుశ పాలనమనేదిగాని యుండదు. కేవలం విద్యను మొట్టమొదటనుంచి చివరవరకు స్వేచ్ఛగా, ఐచ్ఛికముగా, వివేచనాజ్ఞానముతో నేర్చుకోగలుగుతున్నాడు. రష్యన్ విద్యార్థి, వస్తువును తాను ప్రత్యక్షముగ తయారు చేయుటచే తనకున్న శారీరక బలహీనతగూడ తెలుసుకొనగల్గి మానసిక శిక్షణతోబాటు శారీరక శిక్షణ గూడ అవసరమని, రెంటి యొక్క ప్రాముఖ్యతను గట్టిగ తెలిసికోగలుగుచున్నాడు. అందువలన ఈ విధానంవలన మానసిక, శారీరకశ్రమల మధ్యనున్న భేదము నానాటికి అంతమొందుతూ మానసిక, శారీరక పనుల విలువ యొకటిగనే పరిగణింపబడి యొక మాదిరిగనే గౌరవింప బడుచున్నది. ప్రతివస్తువు యెట్లు తయారగుచున్నదో యేపద్ధతుల నవలంబించుచున్నారో సమస్త ప్రాథమిక విద్యాలయాలలో విద్యార్థులు నేర్చుకొనుచున్నారు. ఇందుకు వలయు వుత్పత్తిసాధనములు గూడ యెట్లు తయారగుచున్నవో వానిని ప్రత్యక్షంగా వుపయోగించుట ద్వారా తెలుసు కొనుచున్నారు. కోటానుకోట్ల విద్యార్థులు యిప్పటికి దేశముయొక్క వుత్పత్తి విధానము యొక్క వివిధ కళలను ఆమూలాగ్రంగా తెలుసుకోగల్గిరి. ఈ విధమైన సార్వజనిక విద్యాభివృద్ధి కేవలం పైపద్ధతి ద్వారానే రాగలదని రష్యన్ రెండవ ప్రణాళిక నిరూపించింది.

గాన సోవియటు స్కూల్ విధానము నానాటికి దేశంయొక్క సామాన్య జీవితంతో నింపివేయ బడుతోంది. అందుచే పని చేయజాలని, చేయని వానికి రష్యన్ స్కూలులో స్థానమే లేదు. 16, 17 సంవత్సరముల వయస్సుగల పిల్లవాళ్ళకు ప్రత్యేక ప్రత్యేక వృత్తులను వారి వారి శక్త్యానుసారము నవలంబించుటకు పూర్తి అవకాశము లేర్పరుప బడినవి. ప్రజలందరు యేదోయొకవిధముగ సమాజమునకుపయోగమైన పనిని చేయగల్గిననేగాని సోషలిష్టు సమాజము సృష్టింపబడజాలదనియు అందులకు రష్యన్ విద్యావిధానము తత్కార్యమును సాధించుటకుగాను నూతనముగ సృష్టించ బడినదని తెలుసుకొన వలెను,

## ఉన్నత విద్యావిధానము

ఈరకము విద్య నభ్యసించుటకు క్రింది రకపువిద్యలో అనగా 10 వ క్లాసువరకు విద్య నభ్యసించినవారినుండి విద్యార్థులను ఉన్నత విద్యకు గొంపోవుదురు. ఈవిద్యాలయములలో 18 సంవత్సరముల నుండి 23 సంవత్సరముల వరకూ విద్య నభ్యసించ వచ్చును. ఈ విద్యార్థులు ప్రత్యేకమైన పరిశోధన యేదో యొక శాస్త్రములోనో, లేక ఉత్పత్తి విధానములోనో కనుగొనుటకు కృషి చేయవలయును. ఈ విద్యాలయములపై అజమాయిషీ అంతా కేంద్ర పరిశ్రామికమంత్రి క్రింద వుండును. ఏ పరిశ్రమకు సంబంధించిన పరిశోధకులు ఆ పరిశ్రమల మంత్రి పరిపాలన క్రింద నుండి దానికగు ఖర్చు అంతా ఆ పరిశ్రమ చేతనే పొందుచుందురు. ఇట్టి ఉన్నత విద్యాలయములు మొత్తం మీద 1937 నాటికి 800 వరకు వున్నవి.

వాటికి శాఖలు, శాఖోపశాఖలుగూడ గలవు. 1935 వ సంవత్సరం నాటికి 5,09,000 మంది యింజనీర్లు టెక్నీషియనులు, 90,000 మంది డాక్టర్లు వున్నారు. 1930 తో 1,91,000 మంది విద్యార్థులు ఉన్నతవిద్య నభ్యసిస్తూ వుంటే 1935తో వారి సంఖ్య 5,22,000 వరకు పెరిగినది. ఈ ఉన్నత విద్యాలయముల ద్వారా శాస్త్రీయ పరిశోధనలను మరింత విస్తృత మొనర్చుటకు గాను 1937 వ సంవత్సరంలో 1455 కోట్ల రూపాయలు బడ్జెటులో ప్రత్యేకించారు. అఖిలరష్యన్ పరిశోధక కేంద్రాలయ మొకటి, ఎలక్ట్రిక్ పరిశోధనశాల యొకటి, లెనిన్ లైబ్రరీ అను నొక అఖిల యూనియను లైబ్రరీయు ఇత్యాది అఖిల యూనియన్ సంస్థలను నెలకొల్పుటకు తద్వారా దేశము యొక్క ఉత్పత్తిశక్తుల నభివృద్ధిపరచుటకు, వైజ్ఞానిక పరిశోధనలను మరింత హెచ్చుగావించుటకుగాను బొక్కసము నుండి 1455 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టుచున్నారు. ఈ సంస్థల ద్వారా హెచ్చుగా పరిశోధించు విషయములు: దేశీయ ఆర్థికసంపత్తిని మరింత అభివృద్ధి చేయు మార్గములు.

ఈ రకరకాల స్కూళ్ళలోనే గాక యింక యితర విధముల రష్యన్ ప్రజలు

విద్యనభ్యసించుకొనుచున్నారు. ముఖ్యంగా వార్తా పత్రికల ద్వారాను, శారీరక వ్యాయామ పాఠశాలల ద్వారాను, సాంఘిక క్లబ్‌ల ద్వారాను, సినిమా నాటకముల ద్వారా విద్య నభ్యసించుచున్నారు. ఇవి గాక ముఖ్యమైనవి రెండు రకాల స్కూళ్లు. 1. వయోజన విద్య. 2. రాజకీయ విద్య.

వయోజనవిద్య విషయమై హెచ్చుగా స్కూళ్ళలో నుండి తయారైన యువకులు, కాంసోమాల్సు (అనగా కమ్యూనిష్టు యువజన సంఘాలవారు) శ్రద్ధగైకొనుచున్నారు. ఈ రకపు విద్య మామూలు స్కూలులో చదువుకొనువిద్యార్థులకు గాక, ఫాక్టరీలలో పనిచేయుచు స్కూళ్ళలో చదువుకొనజాలని వృద్ధులలోను స్త్రీలలోను విద్యా విహీనతను పారదోలుటకు యువకులకు కొన్నిరకముల పాఠములు చెప్పుదురు. అట్టి స్కూళ్ళలో తర్ఫీదు పొందుచున్న విద్యార్థుల సంఖ్య 1937 లో ఒక కోటి 8 లక్షలు. ఈ విధమైన స్కూళ్లు హెచ్చుగా మిల్లులలోను, సమిష్టి వ్యవసాయ కేంద్రములలోను స్థాపించుటకు యేర్పాట్లు చేయబడినవి.

రాజకీయ విద్యను హెచ్చుగా వ్యాపింపజేయుటకు ప్రణాళికలలో హెచ్చు యేర్పాట్లు చేయబడినవి. ప్రతి గ్రామ సోవియట్‌కును పఠనాలయములు యేర్పరచి అచ్చట బాగుగా రాజకీయ చైతన్యము గలిగిన, స్కూలువిద్యను పూర్తిచేసిన వారిని అచ్చట ప్రజలకు, ముఖ్యంగా యువకులకు రాజకీయ విద్య యిచ్చుటకు నియమించుచుండిరి. ఈ విధంగా రాజకీయ విద్యకొరకై యేర్పరుపబడిన కేంద్రములు 1937 నాటికి 10,870 వున్నవి. సోషలిష్టు విజ్ఞానమును యిచ్చు జిల్లా కేంద్రములు 3000 వరకువృద్ధి పొందినవి. రీడింగు రూములు సంఖ్య 66000 వరకు వృద్ధియైనవి. ఇవి గాక యింక వివిధరకముల రాజకీయ జ్ఞానమును యిచ్చు కేంద్రములు 4,89,000. ఇవిగాక ప్రజల కొరకే యేర్పడ్డ సామాన్య గ్రంథాలయములు 25000, ఇందులోనున్న గ్రంథములు 30 కోట్లు. ఈ మొత్తమునకై బడ్జెటులో ప్రత్యేకించిన మొత్తం 20 కోట్ల రూపాయలు.

ఇవిగాక సినిమాలు, నాటకములు మొదలగు విజ్ఞానమును పెంపొందించు కళా సంస్థలకు రు. 350 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టుచున్నారు.

రష్యాలోనున్న విద్యావిధానము దేశీయ సర్వాంగములందును వ్యాపించి రష్యాలోనున్న విద్యావిహీనతను దూరముగ పారదోలుటే గాక అచ్చటి ప్రజలకు యొక నూతన ఉత్తేజమును కల్గించినది. ఈనాడు రష్యాలోనున్న విద్యావిధానమువల్ల ప్రతి కూలీ రైతు ప్రపంచములో యింతకాలం నుండి గల్గిన సర్వోన్ముఖాభివృద్ధిని గత 20 సంవత్సరముల నుండి పొంద గల్గినాడు. అటి మహోన్నత విజ్ఞానమును పొంది మహత్తరమైన రాజకీయ చైతన్యము పొందిన రష్యన్ శ్రమ జీవికి మరల బానిసత్వము గాని విద్యావిహీనత గాని రావడం కల్ల. బొందిలో ప్రాణమున్నంతవరకూ తను విజ్ఞానమును ఇతరులు హరించుటకు అంగీకరింపడు. అదేగాక ప్రపంచమంతటను రష్యాలోనున్న విద్యావిధానమును ఆచరణలోనికి తీసుకొని వచ్చువరకును, అట్టి తరుణం కలుగువరకు పశ్వప్రయత్వములు చేయును. ఈ మహత్తర ఆశా జ్యోతియే యితర బానిస దేశాలలోని ప్రజలను మేల్కొలుపుచున్నది. దానికెంతయు పీడిత ప్రజలు సోవియటు ప్రభుత్వమునకు ధన్యవాదము లర్పించవలసినదే. ముఖ్యంగా యీ అద్వితీయ మైన సర్వతోన్ముఖాభివృద్ధికి కారకులైన కమ్యూనిస్టు పార్టీ సదా అంతర్జాతీయ విప్లవోద్యమములకు తగిన సహాయ సంపత్తి గలిగించుచు చిరస్థాయిగ వర్ధిల్లు గాక!

[నోట్:— వ్యాసంలో సోవియటు రష్యా అని వచ్చిన చోటల్లా సోవియటు యూనియను అని అర్థం.]


పీడిత దేశాలకు నిష్కళంక దేశ సేవకులే దాస్య విమోచకు లవుతారు.
రోగ పీడిత దేహాలకు నిష్కళంకములైన ఔషధములే రోగ విమోచన చేస్తాయి.
ఆలాంటి ఆదర్శాలతో స్థాపితమైన దేశీయ సంస్థే

త్రిపుర సుందరీ ఔషధాలయము.

సుప్రసిద్ధములు ప్రతిభావంతములైన భస్మ, పంటఖజ్జలీ, లేహ్య, గుటిక, ఆసవారిష్టాది ఆయుర్వేద ఔషధములకు శాస్త్రానుభవములతో కూడిన ఆయుర్వేదీయ చికిత్సకు విశ్వసింప దగిన సంస్థ
వివరములకు మా కేట్లాగు చూడుడు.
బ్రాంచెస్:— ఏలూరు, అద్దంకి, నడిపూడి.

త్రిపురసుందరీ ఔషధాలయము.
భీమడోలు, (ప॥ గోదావరి జిల్లా.)

# జార్జియన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

## ★ — ముఖ్య పట్టణం — ట్బిలిసి




పూర్వం మిలటరీ ప్రభువుల దాడులకు గురి అయింది. అస్సీరియనులు, ఈజిప్షియనులు అడుగిడినారు దీనిలో. తూర్పు దేశాలకు తన సైన్యాలను పంపుకోనేందుకు ఈ దేశపు నడుమగా అలగ్జాండర్ ది గ్రేట్. బ్రిటీషులు రక్షించారు. "పాంపే" సైన్యాలు ఈ దేశంలో మెరిసాయి. ఓస్మాను పరాక్రమం దీని నగరాలపై ఎగిరింది. ఇక జారు ప్రభువులు దాని హృదయాన్నే కాజేశారు. ఇంతమంది దోపిడికి గురియైన ఈ దేశంలో స్వాతంత్ర్య వాంఛ చావలేదు. జార్జియన్ కార్మిక వర్గాన్ని స్టాలిన్ నడిపారు. ద్రోహులను తరిమి వేశారు. మెన్షివిస్టులు దొరికిన ధనంతో పారిపోయారు.

సముద్ర తీరాన విశ్రాంతి ఆరోగ్య ప్రదేశాలు వెలకొల్ప బడినాయి. పెద్ద పెద్ద ఎలక్ట్రిక పవర్ స్టేషన్లు నిర్మింప బడుతున్నాయి. జార్జియా కవి. చిత్రకళ, సంగీతములకు సోవియట్ యూనియన్ గర్వపడుతుంది.

# సోవియట్ యువజనోద్యమం

కామ్రేడ్ చంద్ర రాజేశ్వర రావు



కాంసోమాల్

రష్యన్ విప్లవము యొక్క 21 వ వార్షికోత్సవ సమయంలో రష్యాలోని యువజనులను గూర్చి తెలుసుకొందాం.

రష్యాలో విప్లవము తరువాత బుట్టినవారు అనగా 21 సంవత్సరాల లోపు వయస్సు గల యువకులు ప్రజలలో 100 కి 43 గ్గురు ఉన్నారు. కార్మికులలో 100 కి 34 గురు యువకులే. యువకకార్మికులయొక్క ఆదాయం 1931-35 సంవత్సరాల మధ్య $4\frac{1}{2}$ రెట్లు పెరిగింది. సమిష్టి వ్యవసాయ సంఘాలలో మరనాగళ్లు నడిపేవారిలో **(tractor drivers)** 100 కి 56 మంది యువకులే. పరిశ్రమలలోను, వ్యవసాయంలోనూ ముఖ్యమైన ఉద్యోగాలలో యువకులే ఉన్నారు. రాజ్యాంగ నిర్వాహణలో వృద్ధులకు యువకులు తీసిపోలేదు. రష్యాలో అన్ని రిపబ్లిక్కులలోనూ పెద్దదైన రష్యన్ సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కుల ఫేడరేషన్ యొక్క సుప్రీమ్ సోవియటులో 18-25 సంవత్సరముల మధ్య వయస్సు గల యువకులు 67 మంది ఉన్నారు. ఇంతేగాక యువజనులంతా ఆరోగ్యవంతులుగనూ, విద్యావంతులుగనూ ఉన్నారు.

యువజనులు భావి రష్యా పౌరులుగనూ, సోషలిస్టు సమాజ నిర్వాహకులుగనూ, ప్రపంచ కార్మిక విప్లవమునకు పోరాడువారుగనూ, తయారుజేయు నుద్దేశముతో రష్యా విద్యావిధానము తయారు చేయబడినది.

"విద్య లేకపోతే రాజకీయాలు రాజకీయాలు గావు. గాలి కబుర్లు, అర్ధంలేని ప్రసంగం మూఢ నమ్మకము" అని చెప్పాడు లెనిన్. ఈ అమూల్యమైన వాక్యం ప్రకారం 1918 అక్టోబరు 16, వ తారీఖున రష్యా ప్రభుత్వం ఒక శాసనాన్ని చేసింది. దాని ప్రకారం యువతులూ యువకులూ ఒకే స్కూలులో విద్య నభ్యసించాలి. 8 నుండి 17 సంవత్సరాల వరకు 10 సంవత్సరాలు రష్యాలోని ప్రతి యువతి యువకుడు విధిగా విద్య నభ్యసించాలి. ప్రభుత్వం యేటేట చాల ధనమును విద్యకోసం ఖర్చు పెడుతుంది.

జారు కాలపు రష్యాలో యువజనులు వ్యాయామం, ఆటలు, పాటలలో ఇతర దేశాలకు చాల వెనుకబడి ఉండిరి. ఆరోగ్యం బలంగానూ ఉన్నప్పుడే మానసికాభివృద్ధి ఉంటుంది అనే విషయాన్ని యువకుల్లో సోవియటు ప్రభుత్వం ప్రచారం గావించింది. 1923 లో కమ్యూనిస్టు యువజన సంఘం, ట్రేడు యూనియనులు, కమ్యూనిస్టు పార్టీ విద్య, ఆరోగ్య, రక్షణ శాఖల ప్రతినిధులతో గూడిన రష్యన్ వ్యాయామ సమితిని ఏర్పాటు చేసింది. ఆట పాటల అభివృద్ధి ఈ సమితి ద్వారా ప్రభుత్వం చాల పైకమును ఖర్చు పెట్టింది. స్పోర్టు, వ్యాయామం, ఆటలను గూర్చి పరిశోధన చేయడానికి ఆరు పరిశోధనాలయాలను ఏర్పాటు చేయించింది. ఆ విషయాలను గూర్చి వందల కొలదీ పుస్తకాలను ప్రచురించింది. ఇన్ని పుస్తకాలు ఇంగ్లండు జర్మనీ, అమెరికా దేశాలలో గూడ ప్రకటింపబడలేదు. యువకులకు విద్య ఎలా అవసరమో అలాగే ఆరోగ్యం, బలం గూడ అవుసరమని రష్యా కమ్యూనిస్టు యువజన సంఘం ప్రతి సభ్యునకు రోజూ వ్యాయామం చేయడం విధిగా జేసింది. వ్యాయామం చెయ్యాలని ప్రభుత్వ రేడియో డిపార్టుమెంటువారు ప్రతి దినం ప్రజలను హెచ్చరిస్తారు. ఇప్పుడు సోవియటు రష్యాలో తక్కిన అవుసరాలతో బాటు వ్యాయామము గూడా ఒక అవుసరం అయింది. పరుగు, మంచుమీద జారటం, పడవతోయటం, కర్ర కత్తి సాములు, వ్యాయామ ప్రదర్శనాలు, ఫుట్‌బాల్, వాలంటరీ మిలిటరీ డ్రిల్లు, తుపాకి కాల్పుల పోటీలు, విమానములమీద నుండి పేరచూటులతో దూకటం గత కొలది సంవత్సరాలలోనే అమితంగా పెరిగిపోయినయి. రష్యాలో ఇతర దేశాలలో లేని ఒక క్రొత్త విషయం ఉంది. ఇతర దేశాలలో వలె రష్యాలో ఆటలు, స్పోర్టు వృత్తిగా బెట్టుకొన్నవారులేరు. అయితే రష్యాలో అన్ని దేశాలలో కన్నా స్పోర్టుసమన్ చాల ఎక్కువ మంది ఉన్నారు. కారణం యువకులందరూ ఆట పాటలలో పాల్గొనడమే. ఇది రష్యాలో వ్యాయామ సంఘాలలో వారి సంఖ్య జూస్తే బోధపడుతుంది.

| సంవత్సరము | సభ్యుల సంఖ్య |
|---|---|
| 1927 | 20 లక్షలు |
| 1931 | 50 ,, |
| 1937 | 300 ,, |

1937 ఆఖరుకు రష్యాలో

30,000 వ్యాయామ సమితులు,
650 స్పోర్టుస స్టాడియంలు (ప్రేక్షకులు కూర్చొటానికి గాలరీలు గలవి)
7000 స్పోర్టుస స్థలాలు
350 నీటి ఆటల స్థలాలు
2500 మంచుమీద జారే చోట్లు ఉన్నవి.

1931 సం॥లో అంతర్జాతీయ రెడ్ (కమ్యూనిస్టు) స్పోర్టు సంఘం యొక్క 10 వ వార్షికోత్సవ సమయంలో మాస్కో రెడ్ స్క్వేరులో 50 వేల మంది యువకులు కవాతులో పాల్గొన్నారు. రష్యాలో యువకులందరికీ మిలిటరీ శిక్షణ ఈయబడుతోంది. ఇతర దేశాలలో కొన్ని ప్రత్యేక సైనిక దళాలు ఏర్పరుప బడతాయి. యువకు లందరికీ మిలిటరీ శిక్షణ

ఇయ్యబడదు. కారణం బూర్జువా ప్రభుత్వాలు కూలతాయని భయం. కష్టజీవులచే ఏర్పరుపబడిన సోవియటు రష్యా ప్రభుత్వానికి ఏమి భయం. మిలిటరీ శిక్షణలు బొందిన యువకులు సోవియటు రష్యాను కాపిటలిస్టు ప్రభుత్వాల దాడినుండి కాపాడుతారు. ప్రపంచ పీడిత ప్రజా సామాన్యం యొక్క స్వతంత్రం కోసం పోరాడుతారు.

రష్యా ప్రభుత్వము యువకులంటే ఎంత శ్రద్ధగా చూస్తుందో చూడండి. విశ్రాంతి భవనాలలో నూటికి 15 వంతు స్థలం, సేనెటోరియములలో 100 కి 50 వంతు స్థలం యువజనుల కోసం ప్రత్యేకించ బడుతుంది.

## రష్యా యువజనోద్యమం

రష్యా యువజనోద్యమం మనకు ఆదర్శప్రాయమైనది. ఆ ఉద్యమం యొక్క మంచి నిర్మాణం, శిక్షణ, కార్యదక్షత మన దేశపు యువకులు నేర్చుకోదగినవి. ఇప్పుడు రష్యా యువజనులు ప్రపంచ యువజనులకు అందరూ సౌఖ్యంగా ఉండగలిగే సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి దారి జూపుతున్నారు. ఇది ఈ సంవత్సరం న్యూయార్కులో జరిగిన రెండవ అంతర్జాతీయ యువజన సభలో రష్యా యువజన డెలిగేషన్ తీసుకొన్న ప్రాముఖ్యపాత్ర, జర్మనీ మొదలగు దేశాల ఫేసిస్టు ప్రభుత్వాలు ఆ కాంగ్రెసును బహిష్కరించడం మూలాన వ్యక్తమవుతున్నది.

రష్యా కమ్యూనిస్టు పార్టీ యువజనులను తర్ఫీదుచేయు విషయంలో చాల శ్రద్ధ తీసుకొంటుంది. తర్ఫీదు అయిన వారిని పార్టీలో జేర్చుకొంటుంది. యువజనులు మూడు సంస్థలలో సంఘటించబడినారు. 14-23 సంవత్సరాల మధ్యవారు కాంసొమల్ సంస్థలోనూ, 10-16 సం॥ మధ్యవారు పయినీర్ సంస్థలోనూ, 8-11 సం॥ల మధ్యవారు లిటిల్ అక్టోబరిస్టు సంస్థలోనూ ఉన్నారు. ఈ మూడిటిలో కాంసొమల్ సంస్థ ముఖ్యమైనది. రష్యాలో కమ్యూనిస్టు పార్టీ తరువాత ముఖ్యమైన సంస్థ ఇదే. కాంసొమల్ అంటే కమ్యూనిస్టు యువజన సంఘం అని అర్థం. లెనిన్ రష్యా యువజనులకు ప్రత్యేక సంస్థ ఉండాలని పట్టుబట్టి 1903 లోనే పార్టీ చేత ఒక తీర్మానం ప్యాసు చేయించాడు. తరువాత పారిశ్రామికాభివృద్ధి వలన రష్యాలోని ఫ్యాక్టరీలలో 1916 నాటికే 3 లక్షల మంది యువజనులు కార్మికులుగా ఉండిరి. 1916 రష్యా విప్లవములో వీరు ముఖ్యంగా మాస్కో, లెనిన్ గ్రాడులలో చిన్న చిన్న ముఠాలుగా కూడి ప్రాముఖ్య పాత్ర వహించారు. తక్కిన పార్టీలు ఈ ముఠాలను తమ క్రింద జేర్చుకోవాలని చాల ప్రయత్నాలు జేసినాయి. కాని తక్కిన పార్టీలు మితవాదములవటం వలననూ, కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం విప్లవకరంగా ఉండుట మూలాన, కమ్యూనిస్టు పార్టీ యువక ముఠాలను ఆకర్షించి రెడ్‌గార్డు సంస్థలో జేర్చింది.

మొదటి కమ్యూనిస్టు యువజన సభ 1918 అక్టోబరులో సమావేశమయింది. అప్పుడు సభ్యుల సంఖ్య 22000. 1920 లో జరిగిన మూడవ సమావేశానికి సభ్యుల సంఖ్య 4 లక్షలు. ఈ సమయానికి చాలమంది రైతు యువజనులు ఈ సంస్థలో చేరారు. ఇప్పటి వరకూ యువజనులు సైన్యంలో ఎక్కువగా జేరి విప్లవ విజయానికి తోడ్పడ్డారు. అంతర్యుద్ధం ముగిసింది. ఇక 1920 నుండీ విజ్ఞాన సంపాదన, రాజకీయాలు పరిశ్రమలలో పాల్గొనుట, చిన్న పిల్లల విద్యాభివృద్ధికి తోడ్పడుట, మొదలు పెట్టారు. 1922 లో ఐదవ కాంగ్రెసు సమావేశమయింది. ఇందులో కాంసొమాల్స ప్రవర్తనకు సంబంధించిన నియమావళి ఏర్పరుప బడింది. అప్పటి నుంచీ సంస్థ కట్టుదిట్టాలతో పని చేయసాగింది. సభ్యులు ఆటపాటలతో విరివిగా పాల్గొనసాగారు. వయోజనుల అవిద్యను రూపుమాపుటకు గట్టి ప్రయత్నాలు చేయసాగారు. షాక్ బ్రిగేడులలో చేరి పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడి సోషలిస్టు సమాజ నిర్మాణానికి తోడ్పడ్డారు. సోవియటు ఉద్యోగుల నిరంకుశత్వం పెరగనీయకుండా చూచారు. ఈ కాంగ్రెసు రష్యను యువజనోద్యమ చారిత్రలో ముఖ్య ఘటన ఈ విధంగా యువజన సమితి దినదినాభివృద్ధి బొందుతూ 1935 కు 55 లక్షలు సభ్యులు గల సంస్థ అయింది. ఇప్పటికి ఈ సంస్థలో రైతు యువకులు చాల మంది జేరారు. కార్మిక యువజనులలో 100 కి 90 మంది, రైతు యువకులలో 100 కి 20 మంది ఆ సంస్థలో జేరారు. సభ్యుల సంఖ్యలో నాల్గవ వంతు యువతులు.

కమ్యూనిస్టు యువజన సంఘం యొక్క నిర్మాణము చాల ఉత్తమమైనది. దీని నిర్మాణం కమ్యూనిస్టు పార్టీ నిర్మాణాన్ని పోలిఉంటుంది. దాదాపు 15 మందిగల సెల్లులుగా విభజింపబడుదురు. ఈ సెల్లులు ఫ్యాక్టరీలలోనూ, సమిష్టి వ్యవసాయ సంఘములలోనూ, కాలేజీ స్కూళ్ల విద్యార్థులలోనూ, పల్లెలలోనూ తదితర అన్ని ప్రజా సంస్థల యువకులలో స్థాపింపబడును. ప్రతి జిల్లాకు ఆయా జిల్లా సభలచే ఎన్నుకొనబడిన జిల్లా కమిటీ ఆఫీసర్లు ఉంటారు. రాజకీయంగాను తదితర విషయాలవల్లనూ పరస్పర సంబంధం గలిగిన జిల్లాలన్నీ కలిపి రాష్ట్రసమితులుగా ఏర్పాటు చేయబడుతాయి. జిల్లా కమిటీవలెనే రాష్ట్రకమిటీ రాష్ట్రసభచే ఎన్నుకోబడుతుంది. జిల్లా కమిటీలు రెండు సంవత్సరాలకు ఒకమారు ప్రత్యేకంగా నిర్మాణ సమస్యలను చర్చించడానికి సమావేశమయ్యే అఖిల రష్యా సమావేశానికి ప్రతినిధులను పంపుతాయి, ఇదిగాక రెండేడ్ల కొకమారు ప్రదర్శనార్థము పెద్ద సమావేశం జరుగుతుంది. ఈ సమావేశములో కమ్యూనిస్టు నాయకులు వివిధ విషయాలమీద ఉపన్యాసాలు ఇచ్చి యువక కమ్యూనిస్టులకు సలహాలనిస్తారు. ఈ సమావేశములోనే కేంద్ర కార్యనిర్వాహక వర్గం ఎన్నుకోబడుతుంది. యీ కార్యనిర్వాహక వర్గమే కమ్యూనిస్టు యువజన సంఘాన్ని నడుపుతుంది. కమ్యూనిస్టు పార్టీవలెనే ఆయా జిల్లా రాష్ట్రాలలో ప్రజా సంస్థలలో పని జేసేటప్పుడు ఒకొక సంస్థలో పనిజేసే యువక కమ్యూనిస్టులంతా ఒక ముఠాగా ఏర్పడి వారిలో వారు సంప్రదించుకొంటూ ఆయా జిల్లా రాష్ట్ర కమిటీలకు లోబడి పని జేస్తూ ఉంటారు.

1936 లో నూతన రాజ్యాంగ విధానం వచ్చే వరకూ లీగులో మెంబరులను జేర్చుకొనుట, కార్మి యువజనులకూ బీద రైతు కుటుంబంలోని యువజనులకూ సిఫార్సుగాని, ప్రొబేషను గాని ఉండేదిగాదు. వీరిని జేరమని ప్రోత్సహించే వారు. మధ్య తరగతి రైతు యువజనులనూ, కొంచం డబ్బు గల కుటుంబములలోని యువజనులనూ జేరమని ప్రోత్సహించేవారు గారు. కాని వారు జేరితే వద్దనేవారుగారు. ధనిక రైతుల యువజనులను సామాన్యంగా జేర్చుకొనేవారుగారు రైతు కుటుంబానికిగాని కార్మిక కుటుంబానికిగాని జెందని యువజనులను పార్టీ యొక్కయు కాంసొమల్లుల సిఫార్సులమీదనే చేర్చుకొనేవారు.

సెల్లులకు ఆఫీసర్లుగా పని జేసేవారు సామాన్య సభ్యులే అయి ఉంటారు. వీరు తమ విశ్రాంతి సమయంలో లీగుపని జేస్తూ ఉంటారు. ప్రాథమిక సభ్యులకు శిక్షణ ఇచ్చుట కొరకు ఈ ఆఫీసర్లు తరచుగా మారుతూ ఉంటారు. పై కమిటీల ఆఫీసర్లు ఎక్కువ బాధ్యత తెలిసిన వారయి ఉండాలి. జిల్లా కమిటీ సెక్రటరీ కనీసం ఒక సంవత్సరము నుండైనా పార్టీ కాంసొమల్ అయి ఉండటంగాక, ఒక సంవత్సరము నుండైనా పార్టీ సభ్యుడు అయి గూడ ఉండాలి. నూతన రాజ్యాంగ విధానమునకు పూర్వం రైతు యువజనులకు ఆఫీసరుగా పని జేయడానికి రెండు సంవత్సరాలనుంచీ కాంసొమల్‌గా అయి ఉండాలిసి ఉండేది. చదువుకొన్న మధ్య తరగతి యువకుడైతే 3 సం॥ కాంసొమల్ గనూ, 2 సం పార్టీ సభ్యుడయి ఉండాలిసి యుండేది. పార్టీ సభ్యుల ద్వారా కమ్యూనిస్టు పార్టీ ఆ సంస్థయుక్క దినచర్యను నడుపుతూ ఉంటుంది.

నూతన రాజ్యాంగ విధానానికి పూర్వము ఆ నిబంధన లుండటానికి చారిత్రక కారణాలున్నవి. కమ్యూనిస్టు పార్టీ కార్మిక వర్గము యొక్క పార్టీ. కార్మిక వర్గమే రష్యన్ బూర్జువాతో పోరాడి సోవియటు ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి సోషలిస్టు సమాజ నిర్మాణానికి పూనుకొంది. రష్యా రైతులు కార్మిక వర్గానికి సహాయం జేశారు. మధ్య తరగతివారు కొంత మంది బూర్జువాకునూ, చైతన్యం గలిగిన కొద్దిమంది కార్మిక వర్గానికి సహాయం చేశారు. రైతులు స్వతహాగా వ్యక్తిగత ఆస్తిని రద్దు చేయటానికి ప్రతికూలురు. అందువలన రైతు యువజనులకు ఉగ్గుబాలతో బోసిన భావాలు, అలవాట్లు ఒక్కసారిగా బోవు. ఇక చదువుకొన్న మధ్య తరగతివారు కాయకష్టం జేయు అలవాటు ఉండదు. బూర్జువాకు దోపిడీ విధానంలో సహాయం చేస్తూ ఉంటారు. బూర్జువాతోబాటు కాయకష్టం జేసేవారి శ్రమమీదనే ఆధారపడి వారిమీద పెత్తనం చేస్తారు. మెదడు పనికీ, కాయకష్టానికీ ప్రత్యేకించి వ్యక్తులు ఉండనీ, అందరూ పనిజేసి అనుభవించే సోషలిస్టు సమాజం వీరికి గిట్టదు. కార్మికులకు వేరే సొంత ఆస్తి ఉండదు. వారు స్వాభావికంగా సోషలిస్టు సమాజానికి అనుకూలురు. ఇందువలననే సోషలిస్టు సమాజ స్థాపనకు బూనుకొన్న కమ్యూనిస్టు పార్టీ రైతు మధ్య తరగతి వారి యువజనులను నెమ్మది నెమ్మదిగా మార్చింది. అంతేగాని వారిమీద ద్వేషభావముండిగాదు. ఈ భేదము కూడ 1936 లో నూ తన రాజ్యాంగ విధానంతో బోయింది. కారణం సోవియటు యూనియనులో వేరు వేరు వర్గాలు తరగతులు 1937 కు నెమ్మది నెమ్మదిగా నశించినాయి.

## సభ్యులు ఆచరించవలసినవిధులు, నిబంధనలు

1. ప్రతి సభ్యుడు సోషలిస్టు సమాజ నిర్మాణంలో మొక్కవోని సాహసిగా ఉండి ప్రజా సామాన్యానికి ఉదాహరణగా ఉండాలి.

2. ప్రతిరోజు క్రొత్త సభ్యులను జేర్చుకోటానికి ప్రయత్నం జెయ్యాలి.

3. కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని అనుసరించి పట్టుదలతో పని జెయ్యాలి. పార్టీ పోరాటములో సహాయకారిగా ఉండాలి.

4. మార్క్స్, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్‌ల రచనలను తప్పక చదివి అవగాహన చేసుకోవాలి.

5. ప్రతి సభ్యుడు ఏదో యొక ప్రధానమగు పనియందలి పూర్తి టెక్నిక్కును బాగా తెలుసుకోవాలి.

6. కార్మికుడుగా ఉన్న ప్రతి సభ్యుడూ ఆ శ్రేడు యూనియన్‌లో చురుకుగా పని జెయ్యాలి.

7. ప్రతి సభ్యుడూ వ్యాయామము ఆటలలో ఆరితేరి ఉండాలి.

8. సమయం వచ్చినప్పుడు అతడు సోవియటు రష్యాని రక్షించడానికి సిద్ధంగా ఉండాలి.

9. మిలిటరీ విషయాలు బాగా నేర్చుకొని ఉండాలి.

10. ప్రతి సభ్యుడు పయినీర్సును సోషలిస్టు నిర్మాణంలో పాలు తీసుకోవడానికి వారికి సహాయం జెయ్యాలి. ఇవిగాక ఇంకా చాల విధులు ఉన్నాయి.

## శిక్షణ (డిసిప్లిన్)

సోవియటు జీవితంలో శిక్షణ చాల ఎక్కువ. సభ్యులలో ఎవరైనా పైవిధులను పాటించక పోవుట, ఎక్కువగా త్రాగుట, వ్యభిచారము చేయుట మొదలైనవి కమ్యూనిస్టు నీతికి వ్యతిరేకం. ఈవిధంగా చేసేవారికి మొదట వార్నింగు ఇయ్యబడుతుంది. వినకపోతే లీగు నుండి డిస్మిసు చేయబడతారు. చురుకుగాలేని, మీటింగులకు హాజరుగాని సామాన్యంగా వారంతట వారే లీగునుండి విరమించుకొంటారు.

కాంసొమల్స రాజకీయ విజ్ఞానం పొందటానికి ప్రయత్నం జేస్తారు. వారికి చాల వార్తాపత్రికలున్నవి. అందులో ముఖ్యమైన "కాంసొమల్ ప్రవదా" వేలకొలది ప్రతులు అమ్ముడు బోతాయి. ప్రతి సభ్యుడు తప్పక అధ్యయన తరగతులకుగాని, ప్రత్యేక రాజకీయ పాఠశాలలకుగాని హాజరు కావాలి. మూడు సంవత్సరముల తరువాత అతడు సరిగా సిద్ధాంతముల నర్థము చేసుకొనలేదని తోస్తే లీగునుండి తొలగించ బడుతాడు.

రష్యా యువజనులు సోషలిస్టు పారిశ్రామిక నిర్మాణంలో బాగా పాలు తీసుకొన్నారు. 'స్టైఖనావు' ఉద్యమమును ప్రతి పారిశ్రామిక శాఖలోనూ ముందంజవేసి నడిపినది యువజనులే. స్టైఖనావు ఉద్యమములో 100 కి 50 మందికి పైగా యువజనులే.

## పయినీర్స్

సభ్యత్వపు గుర్తైన ఎర్ర బాడ్జీ, ఎర్ర జేబురుమాలు ధరిస్తారు. వీరు కాంసొమాలుల సలహా సహాయాలతో తమ పనిని చేస్తారు. 1922 అక్టోబరులో జరిగిన కంసమాల్ వార్షిక సమావేశంలో పయినీరు సంస్థ స్థాపించబడింది. 1923 అక్టోబరు నాటికి 5000 మంది సభ్యులు. అప్పుడు సోవియటు గవర్నమెంటు, కమ్యూనిస్టు పార్టీ పయినీర్ సంస్థ అభివృద్ధికి పయినీర్సకు తోడ్పడ్డారు. అందువలన 1925 నాటికి 10 లక్షలు 1935 కు 47 లక్షలు అయినారు. 1935 నాటికి రష్యాలోని యువజనులలో 100 కి 8 మంది రైతు యువజనులు చేరారు. చేరిన వారిలో సగం మంది రైతు యువజనులు. మూడవ వంతు కార్మిక యువజనులు, తక్కిన వారు తదితరులు. జేరిన వారిలో సగముకు తక్కువగా యువతులు ఉన్నారు. పయినీర్ సంస్థ నిర్మాణం గూడ ఆదర్శమయినది. 10 మంది ఒక 'లింకు' అవుతారు. 4 లేక 5 లింకులు ఒక బ్రిగేడు. అటువంటి బ్రిగేడులు 1935 నాటికి ఒక లక్ష ఉన్నవి. ప్రతి బ్రిగేడు ఒక కాంసొమాల్ సెల్లు క్రింద ఉంటుంది. ప్రతి బ్రిగేడుకు కాంసొమాల్ నాయకుడుగా ఉంటాడు. ప్రతి లింకుకూ పయినీరులలో నుండి ఎన్నుకొనబడిన నాయకుడుంటాడు. లింకు నాయకులు పయినీర్లు కావలసిన వారి తర్ఫీదుకు అవకాశం ఇస్తోంది. ఈ నిర్మాణ పద్ధతి. ప్రతి బ్రిగేడుకూ లింకు నాయకుల్ను, బ్రిగేడు నాయకునితో గూడిన సోవియటు

ఉంటుంది. ప్రతి జిల్లా కొంసొమల్ కమిటీ జిల్లాలో ఉన్న బ్రిగేడు నాయకులను నడుపుటకు ఒక కమిటీని నియమిస్తుంది. ఈ విధంగానే కంసొమల్ సంస్థ యొక్క కేంద్ర కమిటీ ఈ వివిధ జిల్లా కమిటీలను తనిఖీ చేయుటానికి మరియొక కమిటీని నిర్ణయిస్తుంది. ఈ పద్ధతి వలన కంసొమల్సు పయినీరులను సరిగా నడుపుతాను.

పట్నాలలోని బ్రిగేడులు ఫ్యాక్టరీలను కేంద్రంగా జేసుకొని పని చేస్తాయి. అలా వీలు లేని చోట్ల స్కూళ్ళలోనూ, బ్రిగేడుకు కార్మికుడు నాయకుడుగా ఉండాలిగాని, పంతులు ఉండగూడదు. బ్రిగేడులకు సాధ్యమయినంత వరకూ ఫ్యాక్టరీలను కేంద్రములుగా పెట్టడు. కార్మికునే నాయకునిగా బెట్టడంలోని ఉద్దేశ్యం స్థిర అభిప్రాయాలు ఏర్పడని ఈ యువకులను ప్రొలెటేరియన్ ప్రభావం క్రిందికి తీసుకొనివచ్చి వారిని కమ్యూనిస్టుగా తయారు చేయడమే.

## పయినీరు ప్రమాణం

"నేను సోవియటు రష్యా యొక్క పయినీరును. నా కామ్రేడ్సు యెదుట ప్రమాణం చేయునదేమనగా (1) నేను ప్రపంచ కష్టజీవులను స్వతంత్రులుగా జేయుటకు కార్మిక వర్గం చేయు పోరాటానికి పట్టుదలతో సహాయం జేస్తాను. (2) నేను విశ్వాసపాత్రునిగా ఎల్లప్పుడూ లెనిన్ ఆదేశాలను, పయినీర్ నియమాలను, ఆచారాలను అమలులో బెట్టుతాను."

## చట్టాలు, ఆచారాలు

చట్టాలు:— (1) పయినీరు కార్మికవర్గం, లెనిన్ యొక్క ఆశయాలకు విశ్వాసంగా ఉంటాడు. పయినీరు యువక కమ్యూనిస్టు యొక్కయూ, కమ్యూనిస్టు యొక్కయూ చిన్న తమ్ముడు, సహాయకారి. (2) పయినీరు తక్కిన బాల బాలికలను సంఘములోనికి తెస్తాడు. వారి జీవితంలో పాలు తీసుకుంటాడు. తక్కిన బాల బాలికలకు ఆదర్శప్రాయుడు. (4) పయినీరు తక్కిన పయినీర్లకు ప్రపంచ కార్మికుల, రైతుల బాల బాలికలకు కామ్రేడు. పయినీరు విజ్ఞానం సంపాదించడానికి ప్రయత్నించుతాడు. కార్మిక వర్గ పోరాటంలో విజ్ఞానం, అనుభవం గొప్ప బలముగల శస్త్రాలు.

ఈ పై చట్టాలలో అంతర్జాతీయత, సోదర భావం ఉట్టిపడు తున్నదని వేరే చెప్పనవసరం లేదు. చిన్ననాటి నుండీ సోవియటు బాల బాలికలకు అంతర్జాతీయ సోదరభావం పుట్టించి, సంకుచితమైన జాతి ద్వేషాలను పోగొట్టుతారని దీనివలన తేటతెల్ల మగుచున్నది.

ఆచారాలు :— (1) పయినీరు తన యొక్కయూ, ఇతరుల యొక్కయూ, ఆరోగ్యాన్ని కాపాడుతాడు, నెమ్మదిగాను ఆనందంగాను ఉంటాడు. ప్రొద్దుననే లేచి వ్యాయామం చేస్తాడు.

(2) పయినీరు తన యొక్కయూ, ఇతరుల యొక్కయూ కాలాన్ని జాగ్రత్తగా వాడుతాడు. తన పనిని త్వరగాను వెంటనే చేస్తాడు.

(3) పయినీరు ఎప్పుడూ పని చేసేవాడుగనూ, ఓర్పుగలవాడుగనూ ఉంటాడు. అన్ని పరిస్థితులలోనూ సమిష్టిగా పని చేయటం తెలుసుకొని ఉంటాడు. అన్ని పరిస్థితులలోనూ మార్గం కనిబెట్టుతాడు.

(4) పయినీరు ప్రజల సొమ్మును జాగ్రత్తగా కాపాడుతాడు. తన పుస్తకాలు బట్టలు, వర్కుషాపు పనిముట్లు జాగ్రత్తగా ఉంచుతాడు,

(5) పయినీరు ఒట్టుబెట్టుకోడు. సిగరెట్టు కాల్చడు. పయినీరు ఉద్యమమువలన లాభాలు లెనిన్ భార్య కృపస్కయా ఈవిధంగా వ్రాసింది. "బాల బాలికల వ్యక్తిత్వం స్థిరపడే వయస్సులో పయినీరు ఉద్యమం బాల బాలికల నాకర్షించుతుంది. అది బాలబాలికల సామాజిక అలవాట్లు **(social instincts)** ను వృద్ధి జేస్తుంది. నాగరక అలవాట్లను, సామాజిక చైతన్యాన్ని పెంపొందించడానికి తోడ్పడుతుంది, ఈ యుగము ముందుకు తెచ్చినట్లే. ప్రపంచ కార్మిక వర్గం దేనికి పోరాడుతున్నదో ఆగొప్ప ఆదర్శాన్ని వారి ముందు బెట్టుచున్నది. ఆ ఆదర్శము కష్టజీవులను స్వతంత్రులను జేయుట, వర్గాలులేని, దోపిడీ విధానంలేని, జనులందరూ పూర్తియైన, హాయియైన జీవితాన్ని గడిపే ఒక క్రొత్త సమాజాన్ని స్థాపించుట"

## లిటిల్ అక్టోబరిస్టులు

ఈ సంస్థలో 8—11 మధ్య వయస్సుగల బాలబాలిక లున్నారు. అక్టోబరు విప్లవం జ్ఞాపకార్థం ఈ పేరు పెట్టబడింది. వీరు పయినీర్లచే నడపబడుతారు. 1925 సంవత్సరంలో పయినీర్లకు తమ చిన్న సోదర సోదరీలను చిన్నచిన్న ముఠాలుగా ఏర్పాటుజేసే పని యీయబడింది. 1926 లో ఈసంస్థ సభ్యుల సంఖ్య $2\frac{1}{2}$ లక్షలు 1935 లో 13 లక్షలు. ఈ సంస్థ నిర్మాణంలో గూడ చాల విచిత్రమైనది. 5 మంది సభ్యులు ఒక లింకుగా ఏర్పడుతారు. 5 లింకులు ఒక గ్రూపు. ప్రతి లింకుకూ ఒక పయినీరు నాయకుడూ, అక్టోబరిస్టు ఉపనాయకుడుగనూ ఉంటాడు. ప్రతి గ్రూపుకూ పయినీరు యూనిటు ఏ కొంసొమల్ సెల్లుకు జోడించ బడుతుందో ఆ సెల్లులోని ఒక కొంసొమల్ ఈ గ్రూపుకు నాయకుడుగా ఉంటాడు. ప్రతి అక్టోబరిస్టు గ్రూపు ఒక పయినీరు యూనిటులో ఒక భాగముగా ఉంటుంది, ఈ నిర్మాణం గూడ అక్టోబరిస్టులు తర్ఫీదు అవటానికి, సరిగా నడపబడటానికి, ప్రజా సామాన్య హక్కులను ఉపయోగించుట నేర్చుకోవడానికి వీలు ఇస్తోంది.

## చట్టాలు - ఆచారాలు

1. లిటిల్ అక్టోబరిస్టులు పయినీర్లకు యువజన కమ్యూనిస్టులకు, కమ్యూనిస్టులకూ, కార్మికులకు రైతులకూ సహాయం జేస్తారు.

2. వారు పయినీర్లు అగుటకు కృషి జేస్తారు.

3. వారు శరీరమును, బట్టలనూ శుభ్రముగా ఉంచుటకు తగు జాగ్రత్త తీసుకొంటారు.

4. వారు పని చేయటం ప్రేమిస్తారు.

నేటి రష్యా యువజనులు ఒక క్రొత్త రకం మనుష్యులు. వారికి చురుకైన మెదడుంది. ఏ విషయాన్నైనా సమగ్రముగా ఆలోచించగలరు. ఎవరయినా ఏదయినా ప్రశ్న అడిగినప్పుడు వారు వెంటనే పెన్సిలు తీసి పూర్తి ప్రశ్నను వ్రాసుకొని చాల త్వరగా ఆ ప్రశ్నకు సరియైన సమాధానాన్ని ఇస్తారట. వారి దేహ సౌష్టవము, ఆరోగ్యము, మంచి ఆశయాలను ఆనందాన్ని విరజిమ్మే ముఖములను చూచిన వారు ఆనందాశ్చర్యాలతో మునుగక మానరు. వారు పని జేస్తూనే విజ్ఞానాన్ని సంపాదిస్తారు, విజ్ఞానాన్ని సంపాదిస్తూనే పని జేస్తారు. సంకుచితమైన స్వార్థము కోసం గాక సమాజానికంతకూ లాభము కొరకు పాటు బడుతారు. వారు సమాజం మంచే తమ మంచి అనుకొని పని జేస్తారు. రష్యా యువకులకు, తాము ఎక్కడికి పోతున్నారో, ఎలా పోతున్నారో, ఎందుకు పోతున్నారో తెలుసు.



# సోవియట్ యూనియన్‌లో ★ ★ పారిశ్రామిక అభివృద్ధి

కామ్రేడ్ పి. నరసింహమూర్తి

సంఘమంతా సర్వతోముఖంగా అన్ని రంగాల్లోను సమగ్రమైన మార్పును చెంది పురోభివృద్ధి గాంచాలంటే పారిశ్రామికంగా దేశాన్ని ముందుకు తీసుకొని పోవటం చాల అత్యవసరమని గ్రహించి, సోవియట్ ప్రభుత్వం విప్లవానంతరం ప్రభుత్వాధికారాన్ని స్వీకరించగానే పారిశ్రామిక సమస్యమీద తన దృష్టి నంతటిని కేంద్రీకరించింది.

విప్లవం అంతమొందిన వెంటనే కార్మిక నియంతృత్వం పారిశ్రామిక సమస్యను చేబట్టడానికి పరిస్థితులు పూర్తిగా చక్కబడలేదు. నూతనంగా అధికారంలోకి వచ్చిన యీ సోవియట్ ప్రజాతంత్ర ప్రభుత్వమును నాశనంచేసి తిరిగి రష్యాలో కాపిటలిస్టు ప్రభుత్వమును నెలకొల్పుటకు రష్యా చుట్టూ ఉన్నటువంటి కాపిటలిస్టు ప్రభుత్వాలునూ, వీటి ధన సైనిక సహాయాలతో చెలరేగుతున్న రష్యాలోని కాపిటలిస్టు భూస్వామ్య శక్తులునూ యేకమయి రష్యా ప్రభుత్వమును కూలదోయుటకు తీవ్రంగా దాడి వెడలుతున్న సమయమది.

దేశంలోని ఆర్థిక సైనిక బలాన్నంతా తమను ఎదుర్కొంటున్న విరోధి శక్తులన్నింటిని అణచివేయు నిమిత్తం వినియోగించవలసి వచ్చింది. 50 లక్షల సైనిక బలం కలిగిన 16 రెడ్ ఆర్మీలకు కావలసినసామాగ్రిని ఉత్పత్తి చేయుటకు దేశంలోనిఫ్యాక్టరీలన్నీ కేంద్రీకరించబడినాయి. ఇటువంటి చిక్కు పరిస్థితుల్లో ఉత్పత్తిని అభివృద్దిని చేసుకొనుటకు అవకాశాలు లేకపోవుటవల్లను, ఉత్పత్తి అవుతున్న కాస్త వస్తు సామాగ్రిని సైన్యానికి వినియోగించటంవల్లను, కాస్తో కూస్తో జరుగుతున్న ఉత్పత్తిని పాడుచేస్తూ, ఉత్పత్తిని అసలు సాగనివ్వకుండా కాపిటలిస్టు కుట్రదార్లు కుట్రలను సాగిస్తుండటంవల్లను, పారిశ్రామిక వ్యవసాయిక ఉత్పత్తంతా నానాటికి సన్నగిలే పరిస్థితులు సంభవించినాయి. దేశంలోని పారిశ్రామిక విధానమంతా తారుమారయింది. 1920 లో రష్యాలోని మొత్తపు ఉత్పత్తి 1913 లోని ఉత్పత్తిలో 3 వ వంతు కూడ లేదు.

ఉపద్రవకరమైన యీ పరిస్థితులన్నిటిని గ్రహించి, రష్యా కమ్యూనిస్టు పార్టీయొక్క 10 వ కాంగ్రెసు మార్చి 1921 లో సమావేశమయి వార్ కమ్యూనిజపు పద్ధతులనన్నిటిని విరమించుకొనుటకు నిర్ణయించుకొనెను.

### నూతన అర్థిక విధానము

1921 ఆగస్టు 12 లో కావించబడిన డిక్రీ వల్ల ప్రభుత్వ పరం కావించబడిన పరిశ్రమలకు పూర్తి స్వాతంత్రం యివ్వబడినది. ప్రభుత్వ పరమైన పరిశ్రమలన్నీ వాటికి కావలసిన యంత్ర సామగ్రిని, బొగ్గుని, ముడి సరకులను, మొదలగు వాటిని ఉంచుకోవచ్చును. కాని ప్రభుత్వం వాటికేమాత్రం జీతాల చెల్లించు నిమిత్తం డబ్బు సహాయం చేయదలచుకోలేదు ఆ పరిశ్రమలు ఏ గవర్నమెంటు డిపార్టుమెంటుకు డబ్బు చెల్లించనిది వస్తువులను సప్లయి చేయనక్కరలేదు. మార్కెట్టులో ముడి సరకులను కొనుక్కొనుటకు, పనివారల జీతాలను చెల్లించుటకు ఆహార పదార్థాలను కొనుక్కొనుటకు హక్కును సంపాదించుకున్నయి. 1921 అక్టోబరులో తాము తయారుచేసిన వస్తువులను మార్కెట్టులో అమ్ముకొనుటకు అదనపు హక్కును పొందినయి. ఈ విధంగా రష్యాలో నూతన ఆర్థిక విధానాన్ని **(New Economic Policy)** నిర్మించుటకు అవసరమైన పద్ధతుల నన్నిటిని అవలంబించ వలసివచ్చింది.

ఈ నూతన ఆర్థిక విధానంవల్ల ఒక అంగ వెనక్కు వేసినట్లు కనబడినా నిజంగా ఇదిముందుకు పోవడానికే దోహద మవుతుంది. తారుమారైన పరిస్థితుల్లోనుంచి ప్రశాంతమైన ఆర్థిక విధానంలోకి పోవలెనంటె వెనుకటి ఆర్థిక విధానాన్నే కొంతవరకు పురస్కరించుకుంటూ ముందుకు పోతుండవలెను. ఇది ఆలోచించియే కమ్యూనిస్టు పార్టీ ప్రధానమైన పెద్ద పెద్ద పరిశ్రమల నన్నిటిని ప్రభుత్వ పరంచేసి చిన్న చిన్న వ్యాపారస్తులను, సొంత ఆస్తి పద్ధతిని, ధనిక రైతుల ఆర్థిక విధానాన్ని **(Kulak Economy)** అమలునందు ఉండనిచ్చారు. బ్యాంకింగ్ విధానాన్నంతటిని, అంతర్జాతీయ వ్యాపారాన్ని, కమ్యూనికేషన్, ట్రాన్సుపోర్టు సాధనాలను, పట్టణాలకు సంబంధించిన భూమిని, కట్టడాలను, గనులను, ఎలెక్ట్రిక్ పవరును, యంత్రములను తయారుచేయు పరిశ్రమలను, వస్తువులను తయారుచేయు పరిశ్రమలను ప్రభుత్వం తన చేతుల్లో అట్టిపెట్టుకొని నడుపుతున్నంత కాలం, చిన్న పరిశ్రమదారులను, వ్యక్తిగత రైతులను ఎంతమందిని ఉండనిచ్చి నప్పటికీ, సోషలిస్టు ఆర్థిక విధానానికి ఏమాత్రం ఉపద్రవం లేదు.

1924 దేశంలోని ఆర్థిక విధానమంతా అసంఖ్యాకములైన చిన్న చిన్న పరిశ్రమాలయాలతో కూడుకొని యుండినది. వ్యాపారంలో కూడ కాపిటలిస్టులు (పెట్టుబడి దారులు) యెక్కువ భాగాన్ని ఆక్రమించుకున్నారు. 1923—'24 లో దేశంలోని వ్యాపారంలో సగంపైగా సొంత వ్యాపారస్తుల చేతుల్లో నుండేది.

1925 సంవత్సరంలో మొత్తపు పెట్టుబడి ధనం

(అప్పుడున్న ధరల ప్రకారం)

| | విలువ (రూబుల్సులో) | నూటికి |
|---|---|---|
| సోషలిస్టు ఆర్థిక విధానం | 22,67 కోట్లు | 49 |
| కాపిటలిస్టు సంస్థలు | 303 కోట్లు | 6 |
| చిన్న పరిశ్రమదారులు | 2079 కోట్లు | 45 |

ఈ నూతన ఆర్థిక విధానం అమలునందున్న సమయంలో సోవియట్ యూనియన్ యొక్క ఆర్థిక విధానంలో ధనిక రైతుల ఆర్థిక విధానం, మామూలు వాడుకకు పనికొచ్చే వస్తువుల ఉత్పత్తి పద్ధతి

(Small Commodity Production), కాపిటలిస్టు సొంత వ్యాపార పద్ధతి, స్టేటు కాపిటలిజం, సోషలిజం, యివన్నీ యిమిడి ఉన్నాయి. ఒక అడుగు వెనక్కు వేసినప్పటికి "నూతన ఆర్థిక విధానాన్ని" అవలంబించింది యెందుకంటే, పట్టణాలలో నూతనంగా అభివృద్ధి అవుతున్న సోషలిస్టు ఆర్థిక విధానానికి గ్రామములోని వ్యవసాయిక ఆర్థిక విధానానికి (Peasant economy) మధ్య సన్నిహిత సంబంధమును యేర్పర్చి, తద్వారా సోవియట్ ప్రభుత్వమునకు సోషలిస్టు నిర్మాణ విజయానికి అవసరమైన ప్రధాన పరిస్థితులను కల్పించుకోడానికి. వస్తువులను తయారు చేయు కార్మికులు తమ వస్తువులను రైతుల అవసరములను తీర్చుటకుగాను వారి కందించి, వారి ముడివస్తువులను తాము తెప్పించు కుంటూ నుండాలి. ఈ విధంగా సోషలిస్టు ఆర్థిక విధానం నిర్మింపబడ గలదు.

నూతన ఆర్థిక విధానంయొక్క మొదట ఫలితాలు వెంటనే ఉత్సాహ వంతంగా కాన్పించినాయి. 1920 లో యుద్ధానికి పూర్వపు ఉత్పత్తి మొత్తంలో నూటికి 18—20 కు తగ్గిపోయిన పారిశ్రామిక ఉత్పత్తి 1925-26 కల్లా యుద్ధానికి లోగడ ఉత్పత్తిలో నూటికి 99 కి హెచ్చింది. సుప్రీమ్ యెకనామిక్ కౌన్సిలుచేత కట్టుదిట్టంగా నడుపబడుతున్న ప్రభుత్వ పరంగానున్న పరిశ్రమ 1913 సంవత్సరంలోని మొత్తపు ఉత్పత్తి కంటె తన ఉత్పత్తిని నూటికి 8 వంతున యెక్కువ చేసుకుంది.

(1913 లోని మొత్తపు ఉత్పత్తి 100 గా తీసుకొన్నా 1927 కి ఈ దిగువ పరిశ్రమ లెంత అభివృద్ధి చెందినదీ తెలుస్తుంది.)

| | 1913 | 1927 |
|---|---|---|
| యినుము | 100 | 71 |
| ఉక్కు | 100 | 82 |
| రోల్డు అయిరన్ | 100 | 73 |
| యంత్ర నిర్మాణం | 100 | 135 |
| బొగ్గు | 100 | 113 |
| నఫథలీన్ | 100 | 102 |
| కాటన్ వీవింగ్ | 100 | 101 |
| పత్తి, జనపనార | 100 | 106 |

పెట్టుబడి పెట్టబడిన ద్రవ్యం యొక్క అభివృద్ధి వలన కూడ పరిశ్రమలోని అభివృద్ధి స్పష్టమగు తున్నది. 1924, 1925 లో యంత్ర పరిశ్రమ వృద్ధి కావటం మొదలుపెట్టింది. 1924 అక్టోబరుకు 34 కోట్ల రూబుల్సు విలువ గలిగిన యంత్ర పరిశ్రమ, 1927 అక్టోబరు కల్లా 40 కోట్ల రూబుల్సు విలువకు హెచ్చింది. పారిశ్రామిక సంపద ఆ మూడు సంవత్సరాలలోను 74 కోట్ల రూబుల్సు హెచ్చింది. పారిశ్రామికాభివృద్ధితో పాటు వర్తక వ్యాపారాలు కూడా అభివృద్ధి చెందినాయి. వ్యాపారానికి సంబంధించిన లెక్కలను చూద్దాం.

| | |
|---|---|
| 1924 | 978 కోట్ల రూబుల్సు |
| 1927 | 2440 కోట్ల రూబుల్సు |

ఈ లెక్కలను పట్టిచూస్తే వ్యాపారం నూటికి 25 చొప్పున అభివృద్ధి చెందిందని చెప్పవచ్చు. ఇదే విధంగా రాకపోకల సౌకర్యాలు కూడ అభివృద్ధి చెందింది.

| | |
|---|---|
| 1924 లో | 46160 మైళ్లు |
| 1927 లో | 47868 „ |

## పంచవర్ష ప్రణాళిక యొక్క అవసరం

నూతన ఆర్థిక విధానాన్ననుసరించి సొంత వ్యవసాయ పద్ధతిని సొంత వ్యాపారాలను సాగనిస్తూ నుండటంవలన, ఉత్పత్తి యెక్కువ అయినప్పటికీ, రైతులకు, శ్రామికులకు మధ్య వస్తువుల మారకం విరివిగా సాగుటకు అవకాశం కలిగినప్పటికీ, సొంత వ్యాపారాలను నడుపుకుంటూ లాభాలను పెంపు చేసుకుందామనే తృష్ణ ప్రజలలో యెక్కువయింది. దీని ఫలితంగా ఒక వైపు ధనిక రైతులును, మరియొక వైపు కాపిటలిస్టులు మెల్లమెల్లగా వృద్ధి అవుతూ వచ్చారు. దీనిని ఆపుచేయడానికి దేశంలోని సొంత వ్యాపారాలేమి, సొంత పరిశ్రమలేమి, సొంత వ్యవసాయాన్నేమి, అటు ప్రభుత్వ పరమునన్న వ్యాపారాలను, పరిశ్రమలను సమిష్టి వ్యవసాయాన్ని ఒక సుఘటితమైన ప్లానున్ననుసరించి (ప్రణాళిక ననుసరించి) నడిపించదలచుకున్నారు.

ఇదే కాకుండా మరియొక కారణమున్నది. "నూతన ఆర్థిక విధానం"వల్ల 1918—1920 సంవత్సరాలలోని ఆర్థిక దుస్థితిని, పారిశ్రామిక మాంద్యాన్ని జయప్రదంగా తొలగించుకోగల్గి దేశంలోని పారిశ్రామిక వ్యవసాయిక ఉత్పత్తిని యుద్ధానికి పూర్వపు స్థితికి పెంపొందించుకోగల్గారు. దీనితో సంతృప్తి పడకుండా దేశంలోని పరిశ్రమలను వ్యవసాయాన్ని యింకా తీవ్రంగా అభివృద్ధి పర్చుకోవలసి యున్నది. అందులోను ముఖ్యంగా యంత్ర పరిశ్రమను అభివృద్ధి పర్చుకోవలసి యున్నది. దేశంలో యంత్ర పరిశ్రమలేనిది, సమిష్టి వ్యవసాయానికి అవసరమైన యంత్ర సామగ్రి సప్లయి కావటం కష్టం. యంత్రాలులేనిది సమిష్టి వ్యవసాయం సాధ్యం కానేరదు. వ్యక్తిగత వ్యవసాయ పద్ధతిమీద ఆధారపడి ఉన్నంత కాలం రైతు ఆదాయం హెచ్చదు. కరువులు కాటకాలు వచ్చి పంటలు పాడయినపుడు రైతు మరీ నష్టపడుతూ ఉంటాడు. వాటి నుంచి తప్పించుకోలేడు. ధనిక రైతుల పోటీకి తాళలేక మరీ దరిద్రావస్థలో పడి కుంగిపోతూ ఉంటాడు. రైతులను ఆటువంటి కష్ట నష్టాల నుంచి తప్పించేది, రైతులకు లాభసాటిగా నుండేది ఒక్క సమిష్టి వ్యవసాయ పద్ధతే. దీని కవసరమైన యంత్రాలను సప్లయిచేయు యంత్ర పరిశ్రమ దేశంలో లేకపోతే యంత్రాల సప్లయి కొరకు యితర దేశాల మీద ఆధారపడి యుండవలసి వస్తుంది. దానికిగాను, ఆదేశాలు రష్యాకు సప్లయిచేయు యంత్ర సామగ్రికి బదులుగా రష్యా ఆదేశాలకు తన దేశంలోని ముడి వస్తువులను పంపించుకోవలసి ఉంటుంది. అటువంటి పరిస్థితుల్లో యిటు వ్యవసాయంమీద ఆధారపడియున్న రైతులకు, అటు పరిశ్రమలలో పనిచేయుచున్న కార్మికులకు తినుబండారాలు మొదలగు వస్తువులను సప్లయి చేయటం చాలకష్టం అవుతుంది. యంత్రసామగ్రికేమి, యితర వస్తువులకేమి యితర కాపిటలిస్టు దేశాలమీద ఆధారపడి యుండటం అంటె సామ్రాజ్యవాద ప్రభుత్వాల చేతుల్లో రష్యాను ఒక మార్కెట్టుగా నుంచటం అన్నమాట. ఇటువంటి ఉపద్రవం రష్యాకు పట్టకుండా చూచుకోవలెనంటే రష్యాలో సోషలిస్టు సంఘ నిర్మాణము విజయవంతం కావాలంటే, యంత్రాలను తయారుచేయు పరిశ్రమలేమిటి (heavy industry) వస్తువులను తయారుచేయు పరిశ్రమలేమిటి (light industry) యంత్రాల సహాయంతోటి సాగింపబడు సమిష్టి వ్యవసాయ పద్ధతేమిటి పూర్తిగా అభివృద్ధి కావాలి.

చుట్టూ ఉన్న కాపిటలిస్టు ప్రభుత్వాలు రష్యాపై బడి సోవియట్ ప్రభుత్వాన్ని నాశనం చేయుటకు యెప్పటికప్పుడు సిద్ధంగానే యున్నవి. 1927 వ సంవత్సరంలో తిరిగి రష్యా అంతర్జాతీయ పరిస్థితులు నిరాశాపూరితంగా నిరుత్సాహంగా నుండినాయి. ఇంగ్లండు మొదలగు దేశాలు రష్యాపై యుద్ధము చేస్తాయేమో అన్నట్లుండినది. ఋణ సహాయమేమి కూడ ఇతర దేశాలలో రష్యాకు పుట్టటం లేదు. ఇటువంటి సమయంలో యీ విరోధి దేశాల నన్నిటిని ఎదుర్కో గలిగే స్థితిలో నుండాలంటే సైనిక బలాన్ని చేకూర్చుకొని, దానికి కావలసిన యుద్ధ సామగ్రితోటి, ఆహార పదార్థాలు మొదలగు వస్తువులతోటి సిద్ధంగా నుండాలి. అందుకుగాను యుద్ధ పరిశ్రమల నేమి, మిగతా పరిశ్రమల నేమి, వ్యవసాయాన్నేమి అభివృద్ధి చేసుకోవలసి యున్నది. ఈ పరిస్థితులన్నీ ఏకమయి రష్యా ప్రభుత్వం మొదటి పంచవర్ష ప్రణాళికను (1928-'32) అమలు జరుపుటకు దోహదమయినయి. వ్యక్తిగత వ్యవసాయ పద్ధతి లేకుండా చేసి సమిష్టి వ్యవసాయ పద్ధతిని పెంపొందించి ధనిక రైతుల ఆర్థిక విధానం (Kulak economy) నిర్మూల మొనర్చటం యీ ప్రణాళికలోని ఒక ఉద్దేశం.

## ప్రణాళిక యొక్క ఫలితాలు:—

1928 సంవత్సరానికే ప్రభుత్వ పరమునన్న పరిశ్రమలలోని ఉత్పత్తిని అభివృద్ధి చేయటంవలననూ, మున్ముందు మరింత అభివృద్ధి యగుటకు పూర్తి అవకాశాలు కల్పించుట వలనను, సొంత లాభాలకు తోడ్పడు సొంత పరిశ్రమలు, సొంత వ్యాపారాలు, వాటిని నడుపుతున్న కాపిటలిస్టు వర్గం మాటుమణిగారు. ఈ విధంగా అటు వ్యవసాయంలోను, యిటు పరిశ్రమలలోను సమిష్టి విధానాన్ని అభివృద్ధి పర్చారు. పారిశ్రామిక ఉత్పత్తి యొక్క మొత్తం 1928 లో 157 కోట్లు రూబుల్సు ఉంటే, 1932 లో 343 కోట్ల రూబుల్సుకు హెచ్చింది. అనగా 1928 లోని ఉత్పత్తిలో నూటికి 284 హెచ్చింది. 1932 లోని ఉత్పత్తి, యుద్ధపు లోగడి ఉత్పత్తి స్థితి కంటె 3 రెట్లు హెచ్చింది.

పంచవర్ష ప్రణాళిక ప్రకారం సర్వతోముఖమైన యభివృద్ధి రష్యాలో సాధింపబడింది. 5 సంవత్సరాలలో పూర్తి చేయాలనుకున్న యీ ప్రణాళికను నాలుగుంపాతిక సంవత్సరాలలో పూర్తి చేయకల్గారు. దీని ఫలితంగా నిరుద్యోగాన్ని పూర్తిగా నిర్మూలించ గల్గారు. ప్రజాసామాన్యాన్నంతటిని, అందులోను రైతులను అంతులేని ప్రచారం, ప్రబోధం ద్వారా విజ్ఞానవంతులను చేసి కమ్యూనిజం యొక్క అవసరాన్ని పూర్తిగా తెలుసుకోగల్గే స్థితికి తీసుకొని వచ్చి సోషలిస్టు నిర్మాణానికి హృదయ పూర్వకంగా తోడ్పడేట్టుగా తర్ఫీదుచేశారు. వ్యవసాయంలో సమిష్టి విధానంతో పాటుగా, యంత్ర విధానాన్ని (mechanisation) ప్రవేశ పెట్టటం మూలకంగా పట్టణానికి గ్రామానికి మధ్య లోగడనున్న భేదాన్ని తుదముట్టించి సమాన ప్రతిపత్తి పరస్పర సంబంధములు స్థాపించ గలిగారు. సైన్సు సంబంధమైన, సారస్వత సంబంధమైన విద్యావ్యాప్తి పూర్తిగా జరిగింది. సభ్యతా విషయంలో కూడా రష్యా ప్రజలు చాల ముందంజ వేశారు. ఈ పంచవర్ష ప్రణాళికను సాగనివ్వకుండా చేసి రష్యా యొక్క ఆర్థిక పురోభివృద్ధిని అరికట్టటానికి, ఫ్రాన్సు మొదలగు కాపిటలిస్టు దేశాలతో రహస్య సంబంధాలు ఏర్పాటు చేసుకొని, రష్యా ప్రభుత్వమును, సోషలిస్టు ఆర్థిక విధానాన్ని కూలద్రోయుటకు, 1930 సంవత్సరంలో 8 మంది సోవియట్ యెంజినీర్ల కుట్రలు 1931 లోని 14 మంది ప్రొఫెసర్ల, ప్రభుత్వాధికార్ల కుట్రల్లు అనేకం జరిగినప్పటికీ, వాటి నన్నిటిని జంకుగొంకు లేకుండా అణచివేసి పంచవర్ష ప్రణాళికను అనుకున్న గడువుకంటె ముందరగానే పూర్తి చేసుకోగల్గారు. ఒక్క దేశంలోనే సోషలిస్టు నిర్మాణం సాధ్యపడదు, ప్రపంచమంతటా సోషలిజం స్థాపితమయితేనే రష్యాలో కూడా దాని స్థాపన సాధ్యమవుతుంది. అనే ట్రాట్స్కీ వాదన, "సమిష్టి వ్యవసాయ విధానం లేకుండానే, ధనిక రైతు ఆర్థిక విధానాన్ని (Kulak economy) రద్దు చేయకుండానే, వ్యక్తిగత వ్యవసాయ విధానం ద్వారానే రైతులు వారంతటవారు సోషలిస్టు ఆర్థిక విధానంలో మిళితమవుతారనే" బుఖారి మితవాద ధోరణిని అర్థరహితమని నిరూపించగల్గారు.

## రెండవ పంచవర్షీయ ప్రణాళిక

ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని యీ విజయ పరంపరలే 1933 లో రెండవ పంచవర్ష ప్రణాళికను తయారు చేసుకొని, దాన్నికూడ మరింత విజయవంతంగా సఫలీ కృత మొనర్చుటకు అనుకూల పరిస్థితులను, గట్టి పునాదులను తయారుచేసి పెట్టినాయి. ఈ రెండవ ప్రణాళిక యొక్క ముఖ్య కర్తవ్యాలు మూడు: 1. వర్గ రహితమైన సోషలిస్టు సమాజాన్ని నిర్మించటం; 2. జాతీయ ఆర్థిక విధానాన్ని పూర్తిగ యభివృద్ధి నొందించుటకుగాను యంత్రపునర్నిర్మాణాన్ని పూర్తి చేయటం; 3. సోవియట్ ప్రజల సుఖజీవనాన్ని, వారి సభ్యతాభివృద్ధిని పెంపొందించటానికి వారి జీవితావసరాలను తీర్చు వస్తువుల సరఫరా పరిమాణాన్ని అభివృద్ధి పర్చటం.

సోవియట్ ప్రజలలోని చైతన్యం, ఉత్సాహం స్వయంకృషి బ్రహ్మాండమైన ఉద్యమ రూపం తాల్చింది. ఈ ఉద్యమం మొదటి పంచవర్ష ప్రణాళికయొక్క మొదటి సంవత్సరంలోనే (1928) ప్రారంభమయింది. ఈ ఉద్యమానికే షాక్ బ్రిగేడ్ ఉద్యమం అని పేరు. దీనియొక్క ముఖ్య ఉద్దేశాలు ఉత్పత్తి పరిమాణాన్ని అభివృద్ధి చేయటం, చెత్త చెదారం మిగలకుండా చేయటం, యంత్రాలు విరగటం, తునగడం లేకుండా చేయడం, కాలాన్ని వృధా పుచ్చకుండా ఉండటం, అనవసరమైన నాగాలు లేకుండా చేసుకోటం. ఈ ఉద్యమం మొదటి పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా సాధించ గల్గుటకు యెంతో సహాయపడ్డది.

ఈ ఉద్యమమే రెండవ పంచవర్ష ప్రణాళికలో 1935 సంవత్సరం నుంచి సాగిన స్టాఖనోవ్ ఉద్యమానికి దారితీసింది. యంత్ర సంబంధమైన కౌశల్యాన్ని సంపాయించుకొని పనితనంలో ఒకరిని మరియొకరు మించిపోదామనే లక్ష్యంతోటి ఉత్పత్తిని వృద్ధి చేయటం దీని లక్ష్యం.

పెట్టుబడిదారీ దేశాలతో ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి యజమానులు, కార్మికులపై బలవంతంగా అనేక పద్ధతులను రుద్దుతారు. కాని స్టాఖానోవ్ ఉద్యమం ఉత్పత్తిని అభివృద్ధి చేయడానికి కార్మికులు తమంతటనే కొత్త పద్ధతులను కనిపెట్టి దాని ప్రకారము పని చేయడమే. ఈ ఉద్యమం సోషలిస్టు నిర్మాణ చరిత్రలో నూతన శకాన్ని ప్రారంభింపజేసింది. ఎందుకంటే, కమ్యూనిస్టు సమాజాన్ని (శక్తికొలదీ పని అవసరముకొద్దీ ఫలముగల సమాజాన్ని) నెలకొల్పడానికి కావలసిన మానవ స్వభావములోని మార్పు, ఉత్పాదకశక్తిలోని అభివృద్ధి, వీనియొక్క ప్రథమ చిహ్నముగాక ఇది మరేమి?

ఈ ఉద్యమం ప్రారంభం కాకముందు, 1934 లో పారిశ్రామిక ఉత్పత్తి నూటికి 11 చొప్పున హెచ్చింది. ఈ ఉద్యమం వలన 1935 నకే ఉత్పత్తి 100 కి 16 చొప్పున హెచ్చింది. 1936 లో స్టాఖానోవిజం ప్రజా ఉద్యమం అయినప్పుడు మామూలు పరిశ్రమలలోని ఉత్పత్తి 100 కి 21 చొప్పున హెచ్చింది, యంత్ర పరిశ్రమలో 100 కి 26 చొప్పున హెచ్చింది. 1937 లో 1929 లోని ఉత్పత్తితోటి పోల్చి చూచుకుంటే,

మొత్తపు పారిశ్రామిక ఉత్పత్తి 100 కి 430 చొప్పున హెచ్చింది. ఈ విధంగా సోషలిస్టు ఆర్థిక విధానంలోని అన్ని శాఖల్లోను ఈ ప్రణాళికను పూర్తి చేశారు.

1922—'26 సంవత్సరాలప్పటికి కూడ రష్యా యొక్క ఆర్థిక విధానంలోనున్న ఎగుడు దిగుడ్లను, ఎక్కువ తక్కువలను రెండవ ప్రణాళికను అమలు జరిపే కాలంలో పూర్తిగా నిర్మూలించారు. పారిశ్రామికాభివృద్ధి, పరిశ్రమకు, వ్యవసాయానికి మధ్య నున్న సంబంధాన్ని మార్చివేశింది. వ్యవసాయిక దేశాన్నల్లా పారిశ్రామిక దేశంగా మార్చివేశింది. రష్యాలోని సేద్య భూమి నంతటిని సమిష్టి వ్యవసాయంలోకి మార్చివేయు సమయంలో, ధనిక రైతు వర్గం పూర్తిగా అంతర్థానమయింది. రైతులు అధిక సంఖ్యాకులుగా సమిష్టి వ్యవసాయ ఆర్థిక విధానంలోకి పూర్తిగా ఆకర్షింప బడ్డారు. సోషలిస్టు ఆర్థిక విధానంలో 'యంత్రపునర్నిర్మాణం పూర్తి కావాలంటే, వ్యవసాయం పూర్తిగా యంత్రాలమీద, అధునిక సైంటిఫిక్కు పద్ధతులమీద ఆధారపడి యుండాలి. ట్రాక్టర్లు, కంబైన్లు, వ్యవసాయానికి సంబంధించిన యితర యంత్రాలు మొదలగు వాటితో కూడుకొనియుండు ప్రభుత్వపు మెషీన్లు, ట్రాక్టరు స్టేషన్లు వ్యవసాయంలో యంత్ర విధానాన్ని ప్రవేశ పెట్టటానికి ప్రధాన సాధనం. ఈ ప్రణాళికయొక్క మొదట మూడు సంవత్సరాలలోను 1904 మెషీను ట్రాక్టరు స్టేషన్లు నూతనంగా నిర్మించబడినాయి. 1932 ఆఖరుకు 2446 స్టేషన్లు ఉంటే. 1937 ఆఖరుకే 5617 దాక, హెచ్చినయి. ఇవి 1935 లో సేద్యమయ్యే సమిష్టి వ్యవసాయ భూమిలో ముప్పాతికవరకు వ్యవసాయ మరమ్మతులను చేసి పెట్టాయి. ఈ విధంగా సొంత వ్యవసాయ పద్ధతిని పూర్తిగా తగ్గించుకొని సమిష్టి వ్యవసాయ పద్ధతిని అభివృద్ధి పర్చుకుంటూ వచ్చారు.

ఇక వ్యాపార విషయంలో, 1934 నాటికే మొత్తపు వ్యాపారంలో కాపిటలిస్టు ఉత్పత్తిదారులు 1000 కి ఒకవంతుమాత్రమే వ్యాపారాన్ని నడుపుతున్నారు. మామూలు వాడుకకు పనికొచ్చే వస్తువులను తయారుచేయు ఉత్పత్తిదారులు 100 కి 4 వంతుల వ్యాపారాన్ని నడుపుతున్నారు. రెండవ ప్రణాళిక పూర్తి అయే లోపుగానే కొద్దిగా మిగిలియున్న కాపిటలిస్టు ఆర్థిక విధానం అంతమొందింది. ప్రభుత్వ ఆదాయాన్ని చూస్తే సోషలిజం యొక్క విజయం మనకు తెలుస్తుంది.

| | 1932 | 1938 |
|---|---|---|
| ప్రభుత్వాదాయం కోట్ల రూబుల్సులో | 4550 | 13270 |

సోవియటు యూనియనుయొక్క ఆర్థిక విధానంలో సోషలిస్టు ఆర్థిక పద్ధతి పూర్తప్రాబల్యంలో ఉన్నది కాబట్టే ఉత్పత్తి సాధనాలు కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో లేవు, సంఘపరమైన ఆస్తిగా మారింది.

యంత్ర పునర్నిర్మాణాన్ని పూర్తి చేయటం బ్రహ్మాండమైన నిర్మాణ కార్యక్రమం మీద ఆధారపడి యున్నది. యంత్ర పరిశ్రమను మొదటి ప్రణాళిక కంటె రెండవ ప్రణాళికలో చాల అభివృద్ధి పర్చారు.

ఈ క్రింది లెక్కల వల్ల పరిశ్రమలలో ఎంతెంత ఉత్పత్తి అధికమయిందో తెలియును.

జాతీయ ఆర్థిక విధానంయొక్క అన్ని శాఖలలోని సత్వర అభివృద్ధి, కొత్తకొత్త ప్రాంతాలను అభివృద్ధి చేయడం; దేశమంతటా ఆర్థిక జీవనం అభివృద్ధి గాంచటం, వీట్లతోటి రైలురోడ్డు పరిశ్రమను ట్రాన్స్పోర్టు పరిశ్రమను వృద్ధి చేసుకోవలసి వచ్చెను.

సోవియటు యూనియనులో పరిశ్రమలపైనను, రాకపోకల పరిశ్రమల మీద ఈక్రింది విధంగా డబ్బు ఖర్చుపెట్టారు.

| | మొత్తం పరిశ్రమలు | రాకపోకలు |
|---|---|---|
| 1928—32 | 5050 కోట్ల రుబుల్సు | 890 కోట్లు రుబుల్సు |
| 1933—37 | 13340 కోట్ల ,, | 2630 కోట్ల ,, |

ఆర్థిక విధానంయొక్క అన్ని రంగాల్లోను తీవ్రకృషితోటి అమితమైన అభివృద్ధిని పొందగల్గాము. 1936 లో ఉత్పత్తియొక్క అభివృద్ధి 1913 లోని ఉత్పత్తికంటె $1\frac{1}{2}$ రెట్లు యెక్కువైంది. 1913 లో వ్యవసాయం దేశంయొక్క మొత్తపు ఉత్పత్తిలో నూటికి 60 వంతులు సప్లయి చేస్తుండేది. పరిశ్రమ నూటికి 40 వంతులు సప్లయి చేస్తుండేది. 1936 లో పరిశ్రమ నూటికి 80 వంతులు మొత్తపు ఉత్పత్తిలో సప్లయి చేస్తున్నది. కాపిటలిస్టు దేశాలన్నిటి కంటే రష్యాదేశం నానాటికి అభివృద్ధి చెందుతూ మున్ముందుకు పరుగిడుతున్నది. కాపిటలిస్టు దేశాలలోని, రష్యా దేశంలోని అభివృద్ధిని పోల్చి చూద్దాం.

1913 లో కన్న 1936 లో కాపిటలిస్టు పరిశ్రమ మూడురెట్లున్నది 1936 లో సోవియట్ యూనియన్‌లోని పరిశ్రమలలో ఉత్పత్తి 1913 లో దానికంటె 7 రెట్లు యెక్కువ వున్నది. 1937 లో నూటికి 21 వంతులు హెచ్చింది. కాపిటలిస్టు దేశాలతో పోల్చిచూస్తే పారిశ్రామిక అభివృద్ధిలో అన్ని రంగాలలోను రష్యా నేడు యీ దిగువ వివరించినట్టుగా ముఖ్యస్థానాన్ని ఆక్రమించుకొని యున్నది.

ప్రపంచంలో ఏ స్థానము సోవియటుకు ఉండేది తెలుపు పట్టిక.

| | 1913 | 1928 | 1932 | 1937 |
|---|---|---|---|---|
| మొత్తపు ఉత్పత్తి | — | — | 3 | 2 |
| విద్యుచ్ఛక్తి | 15 | 10 | 7 | 2 |
| బొగ్గు | 6 | 6 | 4 | 4 |
| ఆయిల్ | 2 | 3 | 2 | 2 |
| యినుము | 5 | 6 | 5 | 2 |
| ఉక్కు | 5 | 5 | 5 | 2 |
| వ్యవసాయ యంత్ర ఉత్పత్తి | — | 4 | 2 | 2 |
| ట్రాక్టర్లు | — | 4 | 2 | 2 |
| మోటారు బండ్లు | — | 12 | 7 | 5 |
| సిమెంటు | — | 8 | 7 | 2 |
| బూట్సులు | — | 5 | 3 | 2 |
| సబ్బు | 6 | 5 | 5 | 2 |

అంతర్జాతీయంగా రష్యా యొక్క ఆర్థిక స్థితి బలిష్టమయింది. ఇతర దేశాలకు యివ్వకోవలసిన ఋణాలు అసలు 100 కోట్ల రూబుల్సు ఉంటే, యిప్పుడు 10 కోట్ల రూబుల్సుకు తగ్గినయి.

సోవియటు యూనియనులో పరిశ్రమల అభివృద్ధి ఈ క్రింది లెక్కలబట్టి తెలుస్తుంది.

| | 1932 | 1937 |
|---|---|---|
| ఎలక్ట్రిక్ పవరు (కిలోవాట్ గంటలలో) | 1339 కోట్లు | 8300 కోట్లు |
| బొగ్గు (టన్నులలో) | 643 లక్షలు | 1525 లక్షలు |
| క్రూడు ఆయిల్ ,, | 228 ,, | 468 ,, |
| కిరోసిన్ ,, | 42 ,, | 60 ,, |
| మాంగనీసు ,, | 18 ,, | 27 ,, |
| ఇనుము ,, | 62 ,, | 160 ,, |
| ఉక్కు ,, | 59 ,, | 170 ,, |

# అజర్‌బైజాన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

★ ముఖ్యపట్టణం — బకూ




నూనె, దూది, పండ్లు, సిల్కు విస్తారంగా ఉత్పత్తి అవుతాయి.

నోబెల్, మాంటాషెవ్ రాజుల్లాగా ఏలుతున్నప్పుడు, స్టాలిన్ ఇక్కడ విప్లవానికి దారి చూపాడు. లెనిన్‌తో కలిసి స్టాలిన్, ట్రాన్స్

కాకేషియన్ ఫెడరేషనును ఏర్పరచాడు. తర్వాత అది 3 యూనియన్ రిపబ్లిక్కులుగా చీలింది. 1. జార్జియా 2. అజర్‌బైజాన్ 3. ఆర్మీనియా

కిరావ్, ఆర్జోనికిడ్జ్, వాష్లిలావ్, ముప్పైమూడుయి కార్మికులను నడిపి ఇక్కడ అధికారాన్ని చేపట్టారు.

అన్ని పరిశ్రమలకు మూలాధారమైన ఆయిల్‌ను సప్లయి చేస్తుం దీ దేశం.

| | | |
|---|---|---|
| మోటారు కార్లు | 24 వేలు | 200 వేలు |
| ట్రాక్టర్లు (హార్సు పవర్లు) | 774 ,, | 2500 ,, |
| కోతకోసే యంత్రాలు | 10 ,, | 20 ,, |
| దున్నే యంత్రాలు | 180 ,, | 470 ,, |
| సైకిళ్లు | 128 ,, | 575 ,, |
| రేడియో సెట్లు | 29 ,, | 500 ,, |
| బూట్లు (రబ్బరు) | 648 లక్షలు | 1000 లక్షలు |
| బూట్లు (తోలుతో) | 8 కోట్లు | 18 కోట్లు |
| కాగితం (టన్నులు) | 471 వేలు | 740 వేలు |
| బట్టలు (దూది) గజాల్లో | 250 కోట్లు | 470 కోట్లు |
| సబ్బులు (టన్నులలో) | 357 వేలు | 1000 వేలు |
| అగ్గిపెట్టెలు (కేసులు) | 56 లక్షలు | 110 లక్షలు |
| సంగీత వాయిద్యాలు | 49 ,, | 110 ,, |
| వెన్న (టన్నులలో) | 65 వేలు | 180 వేలు |
| జున్ను (టన్నులలో) | 13 ,, | 37 ,, |
| సిగరెట్టులు | 6700 కోట్లు | 10.000 కోట్లు |
| టీ. (టన్నులు) | 13 వేలు | 45 వేలు |
| చేపలు ,, | 1333 వేలు | 1800 ,, |
| మాంసం ,, | 435 ,, | 1200 ,, |

రష్యా పొందిన ఈ అమోఘమైన పురోభివృద్ధి ఫలితంగా. 1924 లో అమల్లోకి తీసుకొని వచ్చిన పాత రాజ్యాంగాన్ని మార్చి. 1937 లో పూర్తి సోవియట్ ప్రజా తంత్రంతో కూడుకొనియుండు నూతన రాజ్యాంగాన్ని అమల్లోకి తీసుకొని వచ్చారు. రైతులకు కార్మికులకు; గ్రామాలకు పట్టణాలకు; మెదడు పనిచేసే వారలకు, కేవలం కాయ కష్టం చేసే పనివారలకు (**manual labourers**); పరిశ్రమకు వ్యవసాయ్యానికి మధ్య నుండు పరస్పర భేదములు పోయి, పూర్తిగా వర్గ రహిత సోషలిస్టు సంఘం యేర్పడటం, అన్ని రంగాలలోను కాపిటలిస్టు ప్రపంచాన్నంతటిని తలదన్ని ఉండటం - యీ మొదలగు పరిస్థితులన్నీ నూతన రాజ్యాంగ ప్రవేశానికి దారి తీసినాయి.

---

జీవిత భీమా అవశ్యకత నానాటికి హెచ్చుచున్న ఈ రోజులలో.
మీకు ఎంతయు అందుబాటులో నుండి దినదినాభివృద్ధి గాంచుచున్న

ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీలో

వెంటనే మీ జీవితమును భీమా చేయండి.

ఎందుకంటారా? ఈ సంస్థ
వయస్సుకు మించిన బోనసు యివ్వగలుగుచున్నది. జయప్రదంగా మూడు వాల్యుయేషన్లు ముగించినది.
వ్యాపార పద్ధతులందును, పట్టాదార్లకు సౌకర్యములు గలుగజేయుట యందును పేరు బడసినది.

ఏజన్సీ తీసికొని పని చేయువారికి అనేక ప్రయోజనములు గలవు.

వివరములకు హెడ్ ఆఫీసునకుగాని, యీదిగువ నుదహరించిన బ్రాంచి లేక సబ్ ఆఫీసులకు గాని వ్రాయుడు.

బ్రాంచి ఆఫీసులు :—
లింగచెట్టి వీధి, మద్రాసు.
చౌరంగీస్క్వేర్, కలకత్తా.
ధంతోలి, నాగపూర్.
తిరుమల దేవస్వంరోడ్, ఎర్నాకుళం.

సబ్ ఆఫీసులు :—
గాంధినగర్, బెజవాడ.
మెయిన్‌రోడ్, విశాఖపట్నం.
ఎక్స్‌టెన్షన్స్, అనంతపురం.

యర్రమిల్లి మంగయ్య, బి. ఎ., బి. ఎల్., కార్యదర్శి, హెడ్డాఫీసు, (మచిలీపట్టణము)

---

ప్రొఫెసర్సు అశోక అండ్ పైలీజు

అశోక:—ప్రాచ్యపాశ్చాత్య మతాను గుణ్యముగ సిద్ధము చేయబడిన ఈ యౌషధము స్త్రీలకు గలుగు సర్వవ్యాధులను నిర్మూలింప జేయుటయేగాక వంధ్యలను సంతాన వతులుగ జేయుటలో ప్రసిద్ధి చెందినది. సీసా రు 2—4—0.

పైలీజు:—శస్త్ర చికిత్సకు లొంగని మూల వ్యాధులు సైతము మా పైలీజు వలన కుదురగలవు 20 రోజులకు సరిపోవు మందు పైపూతకు కూడా కలసి రు 2—8—0.

ఆయుర్వేద కుటీరము, గుంటూరు.

ఉడిపి శ్రీకృష్ణ భవనం
హోటల్, గుంటూరు.

లాడ్జింగు అండ్ బోర్డింగు.

కాఫీ, భోజనాదులు, గది సదుపాయములు ఏవేళ లందైనను గలుగజేయు హోటలు కావాలంటే గుంటూరు మున్సిపల్ ఆఫీసు వద్ద యున్నది.

బోర్డింగు లాడ్జింగు చాల సౌకర్యముగా నుండును.

# ★ రెడ్ ఆర్మీ ★

కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ

నవంబరు 1917 లో రష్యా విప్లవం జరిగిన వెంటనే, కార్మిక కర్షకుల సహాయంతో, బోల్షివిక్ పార్టీ బలమైన సోవియట్ సైన్యం ఒకదాన్ని, సృష్టించింది. కారణం ఏమంటే, ఓడించబడ్డ జమీందార్లు, పెట్టుబడిదార్లు మొదలైన దోపిడీ వర్గాలు శాంతంగా వూరుకోరని బోల్షివిక్ పార్టీకి బాగా తెలుసు. విదేశ దోపిడీగాండ్ర సహాయంతో తిరిగి తమ ఆధిపత్యాన్ని రష్యాలో స్థాపించుకోవడానికి, సోవియట్ ప్రభుత్వాన్ని కూల ద్రోయడానికి, ఎన్నెన్నో యద్ధాలు చేయిస్తారని ముందే తెలుసుకుంది.

జరిగిందికూడా యింతే దేశంలో యించుమించు అన్నిరాష్ట్రాలలోను పరాజయముపొందిన ధనికవర్గాలు, మొదట జర్మన్ సామ్రాజ్యవాదులకూ, అటు తరువాత ఇతర విదేశ సామ్రాజ్య వాదులకూ తమ దేశాన్ని, దేశ స్వాతంత్రాన్ని అమ్మివేయడానికి పూనుకున్నారు. తమ అధికారాన్ని తిరిగి సంపాదించు కోవడానికి ఎన్నియెత్తులైనా వేశారు.

కాబట్టి, నవంబరు విప్లవంవల్ల రష్యా ప్రజలకు లభించిన స్వాతంత్ర్యాన్ని, వారు చేబట్టిన కొత్త అధికారాన్ని, కాపాడుకోవటానికి బోల్షివిక్ పార్టీ ఒక కొత్త సైనిక దళాన్ని, సృష్టించ వలసి వచ్చింది. లెనిన్ యీ విధంగా చెప్పాడు.

"ఆయుధబలగంతో సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని మనం రక్షించకపోతే, మనం బ్రతికే వాళ్ళమేకాము. పాలకవర్గం తన అధికారాన్ని యెన్నటికీ ప్రజల స్వాధీనం చేయదు. కాబట్టి దోపిడీ వర్గాల్ని ప్రజలు అణచివేయడమే కాకుండా, స్వరక్షణకై ఎన్ని త్యాగాలైనా చేయగలరని క్రియారూపంలో నిరూపించాలి....శ్రామిక వర్గం నిజంగా పరిపాలించాలంటే, సైనిక సంఘటనద్వారా, ఈ విషయాన్ని ప్రదర్శించాలి...."

ఈ విధంగా ఏర్పడ్డసైన్యం దాదాపు, 11 దేశాలు 6000 మైళ్ళ సరిహద్దుపై దాడివెడలితే తరిమివేసింది.

## సోవియట్ సైన్యం అంటే, విముక్తిపొందిన కార్మిక, కర్షకుల సైన్యం.

సోవియట్ సైన్యం యొక్క ఈ బలానికి, ఈ శక్తికి, ఈ ధైర్యానికి మూలకారణం యేది?

మొట్టమొదటి కారణం: సోవియట్ సైన్యం అంటే విముక్తిపొందిన కార్మిక కర్షకుల సైన్యం. ఇతర దేశాల్లో యీ విధం కాదు. ధనికవర్గాల అధికారాన్ని కాపాడటానికే అక్కడి సైన్యాలు ఉపయోగిస్తున్నాయి. సైన్యానికీ రాజకీయాలకూ ఏమాత్రం సంబంధం లేదని బూర్జువా రాజనీతిజ్ఞు లంటారు. అది పచ్చి అబద్ధం. తమ తమ హక్కులకై కార్మికులు, రైతులు, పరాధీన దేశాల ప్రజలు, చేసే పోరాటాలను నిర్దాక్షిణ్యంగా అణచడానికే బూర్జువాప్రభుత్వాల సైన్యాలు. కాని, సోవియట్ సైన్యం అంటేనో? కొత్తగా స్థాపించ బడిన కార్మిక, కర్షక ప్రభుత్వాన్ని రక్షించటానికై ఇదొక సాధనం; విముక్తిపొందిన ప్రజల స్వాతంత్ర్యాన్ని కాపాడే ఒకకోట.

సాధారణంగా, పెట్టుబడిదారీ దేశాల్లో, సైన్యం అంటే ప్రజలకు విపరీతమైన భయం. ప్రజలకూ, సైన్యానికీ మధ్య ఎత్తైన ఒక గోడ ఉంది. ఇద్దరినీ అది వేరు చేస్తూంది. కాని, రష్యాలోనో? ప్రజలు - సైన్యం ఒక కుటుంబంమాదిరిగా అన్యోన్యముగా, ఉంటారు. ఇక్కడఉన్న సుహృద్భావం, ప్రేమ మరొక దేశంలో లేనేలేదు. సోవియటు సైన్యాన్ని ప్రజలు ఆప్యాయంగా ప్రేమిస్తారు. గౌరవిస్తారు; కాపాడుతారు. ఎందువల్ల? మానవ చరిత్రలో మొదటిసారి, కార్మికులు, కర్షకులు తమదైన ఒక సైన్యాన్ని తామే సృష్టించుకున్నారు. ఈ సైన్యం తమ శ్రమను దోచుకొనే ధనికవర్గాల ఉపయోగానికైగాక, కొత్తగా స్థాపించుకొన్న స్వాతంత్ర రాజ్యాన్ని కాపాడ్డానికి ఏర్పడియుంది. ప్రపంచ కష్టజీవుల హక్కులకోసం పోరాడ్డానికి యేర్పడియుంది. ఇట్టి సోవియటు సైన్యానికి ఎవరూ జయించలేనంతటిబలం శక్తి ఉండడంలో ఆశ్చర్యములేదు.

## కృత్రిమ దేశాభిమానంలేదు.

సోవియటు సైన్యానికున్న ప్రత్యేక లక్షణం మరొకటిఉంది. పెట్టుబడిదారీ. దేశాల్లో, సైనికుల్ని కృత్రిమదేశాభిమానంతో రెచ్చగొడతారు. ఇతరరాజ్యాలను జయించడం అంటే ఒక గొప్ప విషయంగా ప్రచారం చేస్తారు, వాటిని జయించడం యెంతో అవసరమని దొంగకారణాలన్నీ చూపిస్తారు. సోవియటు సైన్యం యిట్టిదికాదు. అన్నిదేశాలకూ, అందరు ప్రజలకూ, సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఉండాలని సోవియటు సైన్యంయొక్క ఆశయం. రష్యాలోనే వేర్వేరు జాతులున్నాయి. ప్రతిజాతికీ స్వపరిపాలనాహక్కు ఉండాలని సోవియట్ ప్రభుత్వం వాంఛిస్తోంది. సోవియటు సైన్యం ఈ వాంఛకు దోహదమిస్తుంది. వివిధ ప్రజల స్వాతంత్ర్యాన్ని సోవియటు సైన్యం కాపాడగలదని ప్రజలు ధైర్యంతో ఉంటారు.

## అంతర్జాతీయ భావం.

సోవియట్ సైన్యం యొక్క బలానికి ప్రబలమైన కారణం మరొకటి కూడా ఉంది. అది ప్రతి సైనికునికీ ఉన్న అంతర్జాతీయ భావం. ఇతర దేశాల ప్రజల్ని అసహ్యించుకొనే స్వభావం పెట్టుబడిదారీ దేశాల సైనికుల్లో పాలకవర్గం కలుగజేసి విజృంభింప జేస్తుంది. ఎందువల్ల నంటే, ఆ సైనికులు గొర్రెల మాదిరిగా తమను అనుసరించాలని పాలక వర్గం యొక్క కోరిక. కాని, సోవియట్ సైన్యం ఇతర దేశాల ప్రజల్ని గౌరవిస్తుంది. ఆవిధంగా గౌరవించేటట్లు ప్రభుత్వం ప్రోత్సాహమిస్తుంది. వివిధదేశాల మధ్య అన్యోన్య భావం పెంపొంది, ప్రపంచ శాంతి ఏర్పడాలని సోవియట్ ప్రభుత్వం యొక్క ఆశయం. ప్రపంచంలో ఉన్న పీడిత ప్రజలంతా ఏకం కావాలనీ, ప్రపంచవిప్లవానికి వారు తోడ్పడాలనీ సోవియట్ ప్రభుత్వం ఆశిస్తోంది. అట్టి ప్రతిజ్ఞనే సోవియటు సైనికు లందరు చేయాలి కూడ. అట్టి ఆశ నెరవేరడానికి సోవియటు సైన్యంలో అంతర్జాతీయ భావాన్ని రోజు రోజుకూ వృద్ధి చేస్తోంది.

## సోవియట్ సైన్యం ఒక విద్యాలయం

పెట్టుబడిదారీ దేశాలలో సైనికులు యుద్ధానికి మాత్రమే తరిఫీదు చేయబడతారు. వారికీ, బయట ప్రపంచానికీ యెట్టి సంబంధం ఉండదు. రష్యాలో యిట్లు కాదు. "సైన్యం అంటే ఒక మిలిటరీ విద్యాలయం మాత్రమే కాదు, విజ్ఞాన సంపదను వృద్ధి చేసుకొనే విద్యాలయం" అని సోవియటు నాయకులు గుర్తించారు. పరిశ్రమలలో గాని, వ్యవసాయంలోగాని, ఆరోగ్యశాఖలో గాని, విద్యాశాఖలో గాని, పని చేసే యితర పౌరులకంటె తాము గొప్పవారమని గాని, అతీతులమని గాని సోవియటు సైనికులు అనుకోరు. సైనికాధికారులు కూడా అంతే. మిలిటరీ తరిఫీదు పొందే కాలంలో, సైనికులు—సైనికాధికారులు తాత్కాలికంగా తమ తమ కార్మిక సంస్థల సభ్యత్వం నుంచి తప్పుకుంటారు. కాని, అన్ని ప్రజా సంస్థల ఎన్నికలలోను యితర పౌరుల వలె వోట్లిచ్చి, నాయకుల్ని ఎన్నుకుంటారు. సైనికులకు ప్రత్యేకమైన సహకార సంస్థలుంటాయి. వాటిల్లో సభ్యులుగా ఉండి, మేనేజ్‌మెంటు కమిటీలను ఎన్నుకుంటారు. సైనికులు వారి వారి గ్రామ వాసులతో గాని, నగరవాసులతో గాని ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకో వచ్చు. వార్తా పత్రికలకు స్థానిక విలేఖరులుగా కూడ ఉండవచ్చు. తాము పనిచేసే ప్రదేశంలో సైనికులు ఎక్కువ పలుకుబడి సంపాదించ వచ్చును. సోవియటు సైన్యంలో పనిచేసిన రైతు సాధారణంగా ఇతర రైతుల గౌరవ మర్యాదలకు పాత్రుడై ఉంటాడు.

## సైనిక శిక్షణ.

కార్మిక, కర్షక కుటుంబాలకు చెందిన వారినే సోవియటు సైన్యంలో చేర్చుకుంటారు. పూర్వపు జమీందార్ల యొక్కగాని, సామంతరాజుల యొక్కగాని. కుటుంబాల లోనుంచి చేర్చుకోరు. పెట్టుబడిదారీ దేశాల మాదిరిగానే రష్యాలోకూడా నిర్బంధ సైనిక శిక్షణ ఉన్నమాటనిజమే. కాల్బల శిక్షణకు 2 సంవత్సరాలు, వైమానిక శిక్షణకు 3సంవత్సరాలు, నౌకాశిక్షణకు 5సంవత్సరాలు ప్రతివ్యక్తీ తరిఫీదు పొందాలి. ఇట్టి శిక్షణపూర్తి అయాక. మొత్తం సంఖ్యలో మూడవవంతుమంది మాత్రమే సోవియటు సైన్యంలో చేర్చుకోబడతారు. మిగిలినవారందరినీ(Territorial Militia) "టెరిటోరియల్ మిలీషియా" అనేదళంలో చేరుస్తారు. వీరు తమ తమ సాధారణ వృత్తులలో పనిచేస్తూనే ఉంటారు. కాని, కొన్నివారాల కాలం ఇతరులకు శిక్షణ నీయాలి. 5 సంవత్సరాల కాలంలో 8లేక 10 మాసాలు వారీవిధంగా సహాయం చేస్తారు. 24 సంవత్సరాల వయస్సు గలిగినవారిని మొదటి రిజర్వులోనూ, 24 మొదలు 40 సంవత్సరాల వయస్సుగల వారిని రెండవ రిజర్వు దళములోనూ చేర్చుకొని, అత్యవసరమైనప్పుడు పిలుస్తారు.

రష్యాలో నిర్బంధ సైనికశిక్షణ ప్రజలలో వ్యతిరేక భావాన్ని కలిగింపదు. ప్రతిసంవత్సరం ఒక సైనికాధికారి కొన్ని గ్రామాలకు వెళ్లి, ఒక్కొక్క గ్రామంలో ఉన్న యువకులందర్నీ సమావేశపరుస్తాడు. పెద్దవారుకూడా సమావేశానికి హాజరుకావచ్చును. ఆసమావేశంలో సోవియటు సైన్యం ఏ విధంగా దేశానికి లాభకారిగా ఉన్నదో బోధిస్తాడు. ఏమైనా సందేహాలుంటే అడగమని ప్రోత్సహిస్తాడు. ప్రశ్నలకు చక్కని సమాధానమిస్తాడు. ఈ సమాధానాలను విన్న తరువాత సాధారణంగా యెవరూ అభ్యంతర పెట్టరు. యువకులూ, పెద్దవారూ తామే ముందుకువచ్చి, పేర్లిస్తారు.

సైన్యంలోచేరాక, సామాన్య సైనికులను అధికార్లు తక్కువ దృష్టితోచూడరు, యుద్ధ భూమిమీదా, డ్రిల్లుసమయంలోనూ సైనికులు కఠినమైన శిక్షణకు లోబడియుండాలి. కాని, అది పూర్తికాగానే అందరూ కలసికూర్చుంటారు. నాటకాల్లోనూ సినీమాలలోనూ ఎక్కువ తక్కువ భేదాలుండవు. కలసి ప్రయాణం చేస్తారు! కలసి ఆటలాడుకుంటారు; నాటకాలలో వేషాలేస్తారు.

ఇట్టి స్వేచ్ఛతోబాటు విద్య లేకపోయినట్టయితే, —న్యం ఎందుకూ పనికిరా

కుండా పోతుంది. ప్రతి మిలిటరీ కేంద్రములోను క్లబ్బులు, స్కూలు భవనాలు, ఉపన్యాసపు హాలులు, గ్రంధాలయాలు, నాటక శాలలు, సినీమాలు ఉంటాయి. సైనికులు ఉపయోగించే గ్రంధాలయాలలో నేడు మొత్తం 2 కోట్ల గ్రంథాల వరకు ఉన్నవట! శిక్షణ కాలంలో, జాగ్రఫీ, చరిత్ర మొదలైన సాధారణ విషయాలే కాకుండా అర్థ శాస్త్రం, రాజనీతి శాస్త్రం మొదలైన వాటిని, తరిఫీదు పొందిన ఉపాధ్యాయులు, సులభమైన భాషలో చెపుతారు. దీనికి ప్రత్యేకం ఒక "సిలబస్" ఉంటుంది. అక్షర జ్ఞానం లేని సైనికుడు ఉండనే ఉండడు. ప్రతివానికీ సంగీతం నేర్పుతారు. ఫిడేలుపై గాని, పియానోపై గాని, మరొక సాధనంపై గాని చక్కగా పాడగలిగేటట్లు తరిఫీదు చేస్తారు. అంతే కాదు. అత్యవసరమైనప్పుడు, దగ్గరలో ఉన్న ఫ్యాక్టరీలకుగాని, "సమిష్టి వ్యవసాయ క్షేత్రాల"కు గాని సైనికుల్ని పంపి, పని చేయిస్తారు. సైనికులకు ప్రత్యేకమైన వార్తాపత్రికలు ప్రకటించబడతాయి. 2 లక్షలకు పైగా వాటికి చందాదార్లు ఉన్నారు. పారిశ్రామిక విద్య కూడా సైనికులకు విరివిగా ఈయబడుతుంది. రోడ్లు, వంతెనలు, రైల్వేలు, ఆనకట్టలు, టెలిగ్రాఫ్ స్తంభాలు, యంత్రాలు—వీటిపై కూడా సైనికులచేత నే పని చేయిస్తారు. ప్రతి మిలిటరీ దళంలోను, ఒకటి గాని—అంతకు మించిగాని కమ్యూనిస్టు పార్టీ యొక్క "కణా"లు (Cells) ఉంటాయి. పది లక్షల మంది గల మొత్తం పార్టీ మెంబర్లలో ఒక లక్ష యిరవై వేలమంది సైనికులే.

ప్రతి సంవత్సరం, యిట్టి తరిఫీదు పొందిన సైనికులు సుమారు 5 లక్షల మంది తమ తమ గ్రామాలకు తిరిగి వచ్చి, ఎవరి వృత్తులు వారు చేసుకొంటారు. గ్రామ సోవియట్లకు చాలా మంది అధ్యక్షులుగా ఎన్నుకోబడతారు. అనేక సమావేశాలకు డెలిగేట్లుగా ఎన్నుకొనబడతారు. సహకార సంస్థలకు, "సమిష్టి వ్యవసాయ క్షేత్రా"లకు మేనేజర్లుగా కూడా వస్తారు

# సోవియట్ సైనిక బలం

కామ్రేడ్ డాక్టర్ ఉప్పల లక్ష్మణరావు

" మెల్లీ సోలింగర్ లక్ష్మణరావు

రష్యాయొక్క సైన్యాల సంఖ్య-యుద్ధసామగ్రి సరంజాం- ఏరోప్లేన్ల లెక్క-ఫిరంగుల వివరాలు - వీటిగురించి సరిగా ఎవ్వరికీతెలీదు. అయినా అనేక చోట్ల నుంచి జాగ్రత్తచేసినవిషయాలనిబట్టి యీక్రింది అంచనా ఒక విధంగా సరీగానే వుండవచ్చుననీ నమ్మిక.

సైన్యమే వృత్తిగా ఎంచుకొని, యుద్ధం కోసరమే తర్ఫీదుచేయబడి, తీవ్రంగా శిక్షణపొందినసైనికుల సంఖ్య (Standing army) అప్పుడప్పుడు తర్ఫీదు పొందిన స్వచ్ఛంద సైనికులిని కలుపుకోకుండా (Territorial army.)— 14,00,000

18 యేళ్ళ వయస్సునుంచి 40 యేళ్ళ లోపుగా వయస్సుండి మిలిటరీ శిక్షణ పొంది, అవుసరం అయితే యుద్ధానికి తయారవగలిన వాళ్ళసంఖ్య1,40,00,000 యువకులందరూ నిర్బంధముగా సైన్య శిక్షణ పొంది తీరుతారు - బలవంతం లేకుండా అతి వుత్సాహముతో.

శాంతి సమయంలో సైన్య నిర్మాణం:— 100 ఇన్ఫెంట్రీడివిజన్లు, 30 అశ్వసైనికుల డివిజన్లు, 130 ఫిరంగి డివిజన్లు. (Artillery)

ఏరోప్లేన్ల బలం మొత్తంమీద-యీ మధ్య జర్మను మిలిటరీ పత్రికలలో ప్రచురించిన సంఖ్యలనిపట్టి9000 ప్లేన్లు. వీట్లో 5000 ప్లేన్లు మీడియం బోంబర్లు (Medium Bombers) 2000 హెవీ బాంబర్సు (Heavy Bombers) శత్రువుల రాజ్యంలోనికి హఠాత్తుగావెళ్ళి, వాళ్ళ ముఖ్య పట్టణాల మీద బాంబులువేసి నాశనంచేసి మహావేగంతో తిరిగి స్వదేశం చేరుకోగల శక్తిగలదు వీటికి. ఒక్కొక్క హెవీబాంబరు ఒకమాటు గాలిలోనికి ఎగిరితే - 1250 మైళ్లు పెట్రోలు కోసం ఆగకుండా సంచారము చేయగల్గుతాయి. ఒక్కొక్క ప్లేనులో 8 టన్నుల బాంబులుంటాయి.

రష్యాదేశంలో ఏరోప్లేను ఫ్యాక్టరీలు 70 ఉన్నాయి. ఒక్కొక్క ఫ్యాక్టరీ సంవత్సరానికి 4,000 నుంచి 5,000 లప్లేన్ల వరకు తయారు చేయగలిగే శక్తి వుంది.

నవీన పద్ధతుల మీద తయారు చేసి, మర ఫిరంగులతో నింపబడిన మోడరన్ టాంకులు 7,000, ఇవి కాక ఆర్మర్డు ట్రాక్టర్లు (armoured tractors) 1,70,000.

పూర్తిగా శిక్షణ పొందిన ఏరోప్లేను పైలట్లు: 1,35,000.

నావికా దళం: 1911 సం॥లో కట్టిన యుద్ధ నావలు (Battle-Shipps) ఒక్కొక్కటి 23,000 టన్నులు, 12 ఇంచిల ఫిరంగీలు 12 కలిగిన నావలు 4. (ఈ తరువాత కొత్త యుద్ధ నావ లేవీ కట్టినట్టు కనుపించదు)

ఒక్కొక్కటి 7000 టన్నులు గల క్రూజర్లు 7.



డిస్ట్రాయర్లు: 40 (అంచనా).

సబ్‌మరైన్లు: 60 కి తక్కువ కాకుండాను, 100 లోపుగాను. (ఈ మధ్యనే ఒక బ్రహ్మాండమగు నావికా సైన్యాన్ని తయారు చేయడానికి పూనుకొన్నారు.)

పైన వివరించిన సైన్యం కాక— తూర్పున—సైబీరియాలో—ఒక వేళ రష్యా మీదికి జపాను దండెత్తితే—కాపాడుకోడానికి—ప్రత్యేకంగా "తూర్పు సైన్యం" ఒకటుంది.

ఈ సైన్యం—మూడు ముఖ్యమైన ప్రదేశాల్లో వుంటుంది: ఖాబారోవుస్కులో 2,50,000 నుంచి 3,00,000 వరకు సైనికులు.

ఆమూరునదిని అంటిపెట్టుకొని-బ్లాగోవ యష్‌షెలకు ముఖ్య పట్నంగా ఏర్పరుచుకుని 1,50,000 సైనికులుగల వక సైన్యంవుంద.

ఉత్తర మంగోలియా పరిసరాలలో- బైకల్ సరస్సు ప్రాంతాలని కాపాడ్డానికి ఊలన్ బాటోర్‌ను ముఖ్య పట్నంగా చేసుకొని 70,000 సైనికులుగల వక సైన్యం.

తూర్పున జపానుకు అతి దగ్గరగా వున్న వ్లాడివాస్టాక్ - నికోల్సు - ఉస్సురిస్కూ ప్రాంతాల్లో - 60,000 సైన్యం.

ఈ తూర్పు సైన్యానికి - మంచి ఫిరంగులు, మోటారుయూనిట్లు - కాక 800 మోడరన్ ట్యాంకులు, 500 ట్రాక్టర్లు 900 ఏరోప్లేన్లు - దానిలో 100 హెవీ బోంబర్లు - వున్నాయి.

ఈ 4 లక్షల సైన్యానికి - సుప్రసిద్ధుడైన బ్లూఖర్ సేనాని మహానాయకుడు ఈ మధ్య జపాను వాళ్ళకి శాస్తిచెప్పింది ఇతడే.

ఇక ట్రాన్సుసైబీరియను రైల్వేగురించి చెప్పాలి. ఈ రైల్వే పడమటనిలెనిన్ గ్రాడునుంచి తూర్పున వ్లాడి వాస్టకు- సుమారు 5 వేల మైళ్లు పైచిల్లర-వరకూ వెళ్ళుతుంది. పడమటి రష్యానుంచి తూర్పు రష్యాకి సైనికులినికాని, సామాగ్రిని కాని నడపాలంటే ఈ యినుపదారి మీదెవెళ్ళాలి ఆఖరు వెయ్యి మైళ్లు మంచూకోదేశంగుండా వెళ్ళాలి. అంచేత ఎప్పుడేనా ప్రమాదమే అని ఈ రెండు మూడు సంవత్సరాల క్రిందే - మంచూకోతోవ వదిలేసి ఆమూరు నదికి ఉత్తరంగా ఖాబారోవుస్కు మీదనుంచి దక్షిణంగా వ్లాడివాస్టకు పట్నానికి - అంటే షుమారు 1,200 మైళ్లు సరికొత్త ఇనుపదారి వేశారు. అంతేకాదు ఇంతవరకూ లెనిన్‌గ్రాడునుంచి వ్లాడివాస్టక్కుకు ఇనుపదారి 5 వేలమైళ్లను ఒంటి జత రైలుపట్టాలే వుండేది. ఇప్పుడు రెండు సంవత్సరాల కిందట అంత యినుపదారి పొడుగునా - రెండో జత పట్టీ కూడా వేశేరు.

ఇంతే కాదు. యీ రైల్వే వుండే తూర్పున వుండే సగము భాగమున్నూ— మంగోలియా, మంచూకో దేశాలకిన్ని ఈ సైబీరియాకిన్ని వున్న సరిహద్దుని ఇంచుమించుగా బాగా దగ్గిరగా వెళుతూంది. ఎప్పుడేనా ప్రమాదమే—మరో రెండో దారి వుండడం క్షేమం అని నిష్నోయడిన్సుక్ నుంచి—సైబీరియా మధ్యగుండా—కోమ్‌సోమోల్సుక్ (నికొలావస్కు) వరకు—సుమారు రెండు వేల మైళ్ళపైమాటన—ఏకంగా సరాసరికొత్త ఇనుపదారే వేశేస్తున్నారు. ఎంత త్వరగా వేస్తున్నారంటే—ఖాబారోవుస్కు నుంచి కోమ్‌సోమోల్‌స్కు వరకూ వున్న 225 మైళ్ళను—రెండు జతల పట్టాలతో— రెండు సంవత్సరాల్లోపూర్తిచేశేసి—కిందటి సంవత్సరమే ప్రయాణీకులకి తెరిచారు.

ఇది ఇలా వుండగా సైబీరియానుంచి సోవియటు మధ్య ఆశియా అన్ని ప్రాంతాలకీ సైన్యం, బలగం, యుద్ధ సామగ్రి— సులువుగా ఏ వైపు కావలిస్తే ఆ వైపుకు వెళ్ళడానికి టర్కుసిబ్ రైల్వే—అనేక ఉప శాఖలతో కట్టేశారు. ఇందు వల్ల సోవియటు యూనియన్‌లో ఒక భాగం అయిన కాజకస్థానులో ప్రత్యేకంగా ఒక గొప్ప సైన్యంయొక్క కేంద్రస్థలం ఏర్పడింది. ఇక తూర్పు నుంచి, దక్షిణాన్నుంచి ఎలాంటి శత్రువు వచ్చినా, యూరపియను రష్యానుంచి కాని, సైబీరియానుంచి కాని ఎలాంటి సహాయం అవుసరం లేకుండానే, శత్రువులను ఎదుర్కొని, ఓడించడానికి శక్తిగల సైన్యం ఈ ప్రాంతంలో ఏర్పడుతూంది.

సోవియటుసైన్యం అంతా పదకొండు భాగాలుగా చేశారు. పదకొండు భాగాలకీ పదకొండు సేనానులు. ఒక సేన తూర్పున వున్న సైబీరియా సేన. ఐదు సేనలు సరిహద్దు ప్రాంతాల్లో వుంటాయి. మిగతా సేనలు దేశంలో వుంటుంది.

సోవియటు సైన్యం ఏమంటుంటుందంటే "మేం వకరి జోలికి వెళ్ళం—ఇతరులు మా జోలికి రాకండి— వచ్చారా — ఖబడ్దార్!"

# సోవియట్ మహిళా మణులు

కామ్రేడ్ గారపాటి సత్యనారాయణ ★★



లెనిన్ సతి కృపస్కయా

1917 లో జరిగిన కమ్యూనిస్టు విప్లవానికి పూర్వం సోవియటు యూనియన్ స్త్రీలు సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యం లేక బానిస జీవితం జీవిస్తూ ఉండేవారు. వారిలో ఏ కొద్దిమంది ఉన్నత వర్గ స్త్రీలకో తప్ప తక్కిన వారందరికి విద్యలేదు. స్త్రీలు యూనివర్సిటీలలో చదువుకోగూడదు. ఉద్యోగాలు చేయ గూడదు. ఆ విద్యవల్ల వారు మూఢ నమ్మకాలు, సనాతన ఆచారాలతో ఉండేవారు. వారికి తమంతట తాము ప్రేమించి పెండ్లి చేసుకోవడానికి వీలులేదు. పెండ్లి చేసుకొనే వరకు తండ్రి పెత్తనంక్రింద తరువాత భర్త పెత్తనంక్రింద పడి ఉండాలి. భార్య భర్తను విడిచిపెట్టిపోతే జుట్టుబట్టి ఈడ్చుకు రావచ్చు. భార్య నడత మంచిది గాకపోతే జైలుకు పంపవచ్చు. గాని భర్త ఏం జేసినా ఏమీలేదు. భాగ్యవంతుల స్త్రీలకు తప్ప బీద స్త్రీలకు విడాకుల హక్కులేదు. ఆ భాగ్యవంతుల స్త్రీలు అయినా విడాకులు ఇచ్చేటప్పుడు చాల అవమానకరమైన ప్రశ్నలు అడుగుతారేమో ననే భయంతో, కోర్టుకు ఎక్కడానికి జంకేవారు. స్త్రీలకు ఆస్థి హక్కులుండేవిగావు. పెండ్లి చేసుతున్న తరువాత వారి ఆస్తికిగూడ భర్తయే యజమాని అయ్యేవాడు. స్త్రీలు పరాయి మొగవాళ్ళతో మాట్లాడటానికి వీలులేదు. భర్త ద్వారానే మాట్లాడాలి. మహమ్మదీయ స్త్రీలు ఇంతకంటె హీనదశలో ఉండేవారు. బయటకి వచ్చేటప్పుడు ముఖంమీద ముసుగు వేసుకోవాలి. భర్త వెంబడి లేకుండా ఎక్కడికీ కదలగూడదు. భర్త చనిపోతే ఆ స్త్రీ భర్త దగ్గర బంధువు యొక్క ఆస్థి అవుతుంది. అతడు ఆమె [illegible]ర్త ఆస్తితోబాటు ఆమెనుగూడ అమ్మవచ్చు. ఇంక భోగంవాళ్ళ సంగతి చెప్పనే అవుసరంలేదు. పచ్చ టిక్కెట్లు కొనుక్కొని ఆ వృత్తిని సాగించవచ్చు. అలా టిక్కెట్లు కొనుక్కొని వారిని జైలులో బెట్టేవారు. యుద్ధాలు జరుగుతూ ఉంటే సేనల కోసం భోగంవాళ్ళను ఉంచేది జారు ప్రభుత్వం. "స్త్రీ దారి గడపనుండి పొయ్యి వరకే". "కోడిపిల్ల పక్షిగాదు స్త్రీ మనిషిగాదు" "ప్రొద్దునా సాయంత్రం నీ భార్యను కొట్టాలి". అని రష్యా ప్రజలలో వాడుకయందు సామెతలుండేవి. దీనిని బట్టే స్త్రీల స్థితి ఎంత హీనదశలో ఉండినదీ గ్రహించవచ్చును.

వీరాఫీనర్ లాంటి రష్యా స్త్రీలు, చాలమంది జారుల నిరంకుశత్వ ప్రభుత్వాన్ని పోగొట్టడానికి పోరాడి ఉరికంబాల నెక్కారు. సైబీరియా ప్రవాసాలు జేశారు. 1917 విప్లవంలో సోవియటు రాజ్య స్థాపనకు లెనిన్ సతి కృప్స్కయా లాంటి స్త్రీలు తోడ్పడ్డారు. "కమ్యూనిస్టు పార్టీ స్త్రీలు విముక్తులు కాబడనిదే సోషలిస్టు సమాజం స్థాపింపలేము. కనుక సోవియటు ప్రభుత్వం స్థాపింపబడిన వెంటనే స్త్రీలను దాస్యం నుండి విముక్తి జేస్తాం" అని ప్రకటించింది విప్లవానికి పూర్వం.

విప్లవం జయంబొందిన వెంటనే అన్ని విషయాలలోనూ స్త్రీలకు పురుషునితో సమాన హక్కులు గల చట్టాలను సోవియటు ప్రభుత్వం జేసింది. స్త్రీలకు కాలేజీ, స్కూళ్ళను తెరిచింది. స్త్రీలకు విడాకుల హక్కు గలిగించింది. తమ యిష్టం వచ్చిన వారిని వివాహం జేసుకొనే హక్కును ఇచ్చింది. ఆస్తి మీద హక్కును గలిగించింది. అన్ని వృత్తుల లోను ప్రవేశించ వచ్చునన్నది ఇంకా ఎన్నో హక్కులిచ్చింది.

కాని వీటి నన్నిటినీ ఆచరణలోనికి తీసుకు రావడానికి ముందు స్త్రీలకున్న మూఢ నమ్మకాలను పోగొట్టాలి. అందుకోసం మూఢ నమ్మకాలకు పుట్టినిల్లు అయిన చర్చినుండి (దేవాలయాల) స్త్రీలను ఆకర్షించడానికి, టూరింగు సినిమాలు, నాటక సమాజాలు, మిలిటరీ కవాతులు, బాండులు, ప్రదర్శనాలను చాల ఎక్కువ చేసింది. వారి మూఢ నమ్మకాలను, పూర్వపు ఆచారాలను పోగొట్టడానికి ప్రదర్శనాలు సహాయం జేసినవి. వాటిలో స్త్రీలు జారు ప్రభుత్వంలో ఎలా కష్టపడిందీ, మత ప్రచారకులు పిచ్చి ప్రజలను ఎలా మోసగించేదీ, సోషలిస్టు సమాజంలో సౌఖ్యంగా ఎలా ఉండవచ్చు. క్రెచ్చీలు, ఫాక్టరీలు మొదలైన వాటిని తెలిపే అందమైన బొమ్మలు ఉంచారు. స్త్రీలు వేలకువేలు ఆ ప్రదర్శనాలు, నాటకాలు, సినిమాలలో పాల్గొనేవారు.

స్త్రీలను సామాజిక ఉత్పత్తి విధానంలోనికి తీసుకరావడానికి ప్రయత్నం జేశారు. స్త్రీలకు పురుషులతోబాటు సమానమైన పనికి సమానమైన వేతనాలను ఇచ్చారు. స్త్రీలకు పరిశ్రమలలో సులభమైన పనులను ప్రత్యేకించారు. స్త్రీలు ఉత్పత్తిలో పాల్గొనలేక పోవడానికి ముఖ్యమైన కారణం, వారి కాలములో చాల భాగం పిల్లలను పెంచుట, వంట మొదలైన గృహకృత్యములను చేయుటలో సరిపోతుంది. ఈ పనుల నుండి వారిని విముక్తి జేయుట కొరకు పిల్లలను సమవాయించడానికి క్రెచ్చీలను, కిండరు గార్డనులను, సమిష్టి వంటశాలలను మొదలైన వాటిని నిర్మించారు. ఇవి ఫాక్టరీలలోనూ, స్కూళ్ళలోనూ, సమిష్టి వ్యవసాయ సంఘములలోనూ ఉంటాయి.



క్రెచీలలో 2 నెలలు మొదలు 5 సంవత్సరాలలోపు పిల్లలను ఉంచుతారు. పనికి పోయేటప్పుడు తమ పిల్లలను క్రెచ్చీలలో వదలిపెట్టి పోవచ్చు. అక్కడ పిల్లలను బొమ్మలు మొదలైన వాటితో ఆడించుతారు. ప్రతి మూడున్నర గంటలకు ఒకసారి వచ్చి బిడ్డకు పాలిచ్చుకో వచ్చు. సాయంత్రం కాగానే బిడ్డను తీసుకొని పోవచ్చు. వంటచేసుకో నవుసరం లేకుండానే సమిష్టి వ్యవసాయశాలలో భోజనం చేయవచ్చు. ఇటువంటి సౌకర్యాలు గలిగించడం మూలాన స్త్రీలు చాలామంది ఉత్పత్తి విధానంలోనికి ఆకర్షించ బడినారు. ఫాక్టరీలు, సమిష్టి వ్యవసాయ శాలలలో నున్న క్లబ్బులలో చేరారు. ప్రపంచంతో సంబంధం గలిగినది. వారి మూఢ నమ్మకాలు నెమ్మది నెమ్మదిగా పోజొచ్చినాయి. విజ్ఞానాన్ని సంపాదించ మొదలిడారు.

స్త్రీలలో అవిద్య పోగొట్టడానికి వారికి రాత్రి పాఠశాలలు మొదలైనవి పెట్టారు. విద్యగూడ అభివృద్ధి కాజొచ్చింది.

ఇంతవరకు ప్రపంచంలో ఏ దేశములోనూ స్త్రీలకు చేయని మహోపకారం సోవియటు ప్రభుత్వం సోవియటు యూనియన్ స్త్రీలకు చేసింది. ఇతర దేశాలలో వేశ్యావృత్తి నానాటికి పెరిగిపోతూంటే, ఇప్పుడు సోవియటు యూనియన్‌లో మచ్చుకైనా లేదు. జారునాటి వ్యభిచారమును చట్ట సమ్మతముజేసిన లా రద్దు చేయబడింది. వేశ్యావృత్తి నిషేధింప బడినది. వేశ్యలకు వృత్తులు నేర్పి, వారిని మార్చడం కోసం "ప్రాఫిలాక్టోరియా"లను ప్రతి పట్నం లోనూ పెట్టబడినవి. వానిలో వేశ్యలకు కుట్టుపని మొదలైన సులభమైన పనులు నేర్పబడుతాయి. రోగములు కుదుర్చబడుతాయి. ఇంకా విద్య, సంగీతం మొదలైనవి నేర్పబడుతాయి. వారు బాగుపడిన వెంటనే పోయి ఫ్యాక్టరీలు మొదలైన వానిలోజేరి కష్టపడి సంపాదించుకొని బ్రతుకుతారు. ప్రాఫిలాక్టోరియాలు 1936 నాటి రష్యాలో 17 ఉన్నాయి. జారు ప్రభుత్వంలో ఒక్క మాస్కోలోనే 20,000 మంది వేశ్య లుండేవారట. 1936 కి 400 ఉన్నారు. ఇప్పుడు మచ్చుకైనా లేరు. వేశ్యావృత్తిని మాన్పినందుకు సోవియటు రష్యా యొక్క వ్యతిరేకులు గూడ సోవియటు ప్రభుత్వాన్ని మెచ్చుకొన్నారు. నానాజాతి సమితి గూడ మెచ్చుకొంది.

సోవియటు ప్రభుత్వం స్త్రీలయందు శ్రద్ధ వహించి వారికి చాల సౌకర్యాలు చేసింది. 20 సంవత్సరాలలో వారికి పూర్తిగా విద్య గరపింది. పురుషులతోబాటు అన్ని ఉద్యోగముల లోనూ, పరిశ్రమలలోనూ, సమిష్టి వ్యవసాయం లోనూ, పాల్గొనేటట్లు చేసింది. స్త్రీలు రష్యాలో సోషలిస్టు సమాజ నిర్మాణానికి పురుషులతో సమానంగా తోడ్పడ్డారు. సోవియటు యూనియన్ స్త్రీలు ప్రపంచ స్త్రీలలో ఒక క్రొత్తరకం వారుగా తయారయినారు. వారు సమాజము యొక్క మంచి తమ మంచి అనుకొంటారు. స్త్రీలు అబలులు అనే భావాన్ని, వారు ఆటలలోనూ, పాటలలోనూ పాల్గొనుచూ, పురుషుడు చేసే ప్రతిపని చేసి, తప్పుఅని రుజువుచేశారు. ప్రపంచ స్త్రీలకు దాస్యవిముక్తి చేసుకొనుటకు దారి జూపుతున్నారు.

## సోవియటు యూనియనులో స్త్రీలకు సౌకర్యాలు.

సోవియటు ప్రభుత్వం పిల్లలను కనుట గూడ సమాజానికి కావలసిన అవుసరాలలో ఒకటి అని భావిస్తారు. అందువలననే స్త్రీలన్ననూ, ముఖ్యముగా గర్భిణీ స్త్రీలన్ననూ చాల శ్రద్ధగా ఉంటారు. స్త్రీలు గర్భిణితో నున్నప్పుడు సలహా తీసుకొనుటకు "సలహా గృహాలు ఏర్పరుప బడినవి. అక్కడ గర్భిణీ స్త్రీ తన ఆరోగ్యాన్ని ఏవిధంగా కాపాడుకోవాలి మొదలైన వానిని గూర్చి సలహాయిస్తారు. గర్భిణీ స్త్రీలకు తేలికయైన పనులు ఇవ్వబడుతాయి. ప్రసవ కాలానికి ముందుగా 2 నెలలు ముందు, తరువాత రెండు నెలలు, మొత్తం 4 నెలలు పూర్తి జీతంతో గూడిన శెలవు ఇవ్వబడుతుంది. 1935 లో 31 కోట్ల రూపాయలు ఇవ్వబడినది. ప్రసవించడానికి "మెటర్నిటీ ఆసుపత్రులు" విరివిగా నిర్మించబడినవి. 1913 లో 140 వేల మంచాలు ఉంటే, 1932 లో 340 వేలుఉన్నవి. ఇప్పుడు ఇంకా చాల ఎక్కువ ఉన్నవి. మాస్కో నగరములో ఉన్న "మెటర్నిటీ ఆసుపత్రిలో ఉన్న సౌకర్యాలు ప్రపంచములో ఏ ఆసుపత్రిలోనూ లేవు. ప్రతి పడకదగ్గరా తన భర్తతోనూ స్నేహితులతోనూ మాట్లాడడానికి ఒక టెల్లీఫోను ఉంటుంది. "వైర్లెస్" వినడానికి చెవుకు తగిలించుకొనే ఫోన్లు ఉంటాయి. హాస్పటలు నుండి విడుదల అయిన తరువాత పిల్లల పోషణార్థమై 9 నెలల వరకూ డబ్బు ఇస్తారు. ఒక 1985 లోనే 12 కోట్ల రూపాయలు ఇవ్వబడినది. పిల్లలకు మంచి పాలు సప్లయి చేయడానికి 'పాల గృహాలు' ఏర్పరుస్తారు. 1935 సం॥కు సోవియటు యూనియన్ మొత్తంమీద క్రెచ్చీలలో 56 లక్షల పిల్లలకు చోట్లుగలవు. ఈలాంటి క్రెచ్చీలు ఏ ఇతర కాపిటలిస్టు దేశంలోనూ లేవు.

సోవియటు యూనియన్ స్త్రీలు వేరే వంట జేసుకొనవలసిన అవుసరంలేదు. ప్రభుత్వం ఏర్పరచిన సమిష్టి వంటశాలలు ప్రతి ఫ్యాక్టరీ లోనూ, సమిష్టి వ్యవసాయ సంఘంలోనూ ఉంటవి. అక్కడ చవుకగా శుభ్రమైన [illegible], నాలు దొరుకుతవి. ఆ వంట శాలలలో 1932 నాటికి సంవత్సరమునకు ఒక్క పట్ణాలలోనే ఏడాదికి 148 లక్షలు భోజనం చేస్తున్నారు. ఇది వరకు రష్యా స్త్రీలు బట్టలుగూడ ఉతుకుకోవలసి వచ్చేది. కాని సోవియటు ప్రభుత్వం బట్టలు ఉతికే శాలలుగూడ సమిష్ఠిమీద ఏర్పాటు చేసింది.

విప్లవము వచ్చిన పిదప 1935 వరకు గర్భము పోగొట్టుకోడానికి స్త్రీలకు సోవియటు ప్రభుత్వం హక్కు ఇచ్చింది. ఉన్న బిడ్డలకు తగిన ఆహారము ఇవ్వలేనపుడు, బిడ్డలు ఎక్కువగా పుట్టుచున్నారని బాధపడే స్త్రీలకు ప్రభుత్వమప్పుడంతకన్నా ఏమీ చేయలేక పోయింది. కాని గర్భ స్రావము ఆరోగ్యానికి చాలా నష్టదాయకమని చెప్పి దానిని నిరుత్సాహపెట్టేది. అప్పటికి గర్భస్రావము చేసుకోవాలని పట్టుపట్టే స్త్రీలకు, ప్రభుత్వ వైద్యులే చాల నిపుణతతో హాస్పిటల్సులో శస్త్ర చికిత్స వలన చేసేటట్లు చేసింది. మరి ఎవరూ చేయకూడదు. హాస్పిటల్సులోనైనా గర్భము దాల్చి మూడుమాసాలు దాటకముందే చేస్తారు

కాని నేడు సోవియటు ప్రభుత్వం స్త్రీలకు ఎక్కువ మంది బిడ్డలు పుట్టితే, ధన సహాయము చేస్తుంది. పురిటి ఖర్చుల కోసం ఈ వరకు 48 రూపాయలు ఇచ్చేది. నేడు 67 రూపాయలు ఇస్తూ ఉండేది. ఈ వరకు బిడ్డకు 9 నెలలు నిండేవరకు నెలకు 7-8-0 రూపాయలు ఇచ్చేది. ఇప్పుడు 15 రూపాయలు ఇస్తూ ఉంది. అంటే ప్రతి సంవత్సరమూ 60 లక్షలు బిడ్డలు పుట్టుతూ ఉన్న సోవియటు యూనియనులో, దీనివలన ప్రభుత్వానికి 60 కోట్ల రూపాయలు ఎక్కువ ఖర్చు అవుతుంది. ఇంతేగాక ప్రభుత్వము 5 గురు బిడ్డలకు మించిన తల్లులకు సం॥నకు 3000 రూపాయల వంతున 5 సంవత్సరాలు ఇస్తూ ఉంది. 10 మంది బిడ్డలు తల్లులకు మొదటి సంవత్సరం 4500 రూ. లున్ను పిదప నాలుగు సంవత్స

రాలు సంవత్సరానికి 4500 రూ. లు వంతున ఇస్తూ ఉంది.

ఈ ఆర్థిక సహాయముతోపాటు సంతాన నిరోధక పద్ధతులను ఉపయోగించుకోడానికి నేర్పుకొన్నారు. అందుచే ఎక్కువమంది బిడ్డలను పశువుల్లాగ కంటూ ఉండాలసిన అవసరము లేద"ని, సంతానం తక్కువగా ఉండటానికి గర్భస్రావమే చేసుకోవలసిన అవసరము లేదని గ్రహించారు. ప్రభుత్వమూ, గర్భిణీ స్త్రీకి ప్రాణాపాయము కలిగేటట్లు ఉండినా, లేక తల్లి గర్భధారణ వల్లన ఎక్కువ బలహీన మయ్యేటట్లుండినా, లేక సంతానానికి వ్యాధులు సంక్రమించే టట్లుండినా తప్ప, మిగిలినపుడు గర్భస్రావము దండనార్హ మని శాసించింది.

పైగా భర్త భార్యను వదలిపెట్టితే పిల్లల పోషణార్థం కొంత తన ఆదాయంలోంచి ఇవ్వవలయును. నిరుద్యోగంలేదు. ఇటువంటి సమయంలో గర్భిణీ పోగొట్టుకోవడం అవసరం లేదు. పైగా రష్యాలో ఎక్కువ పిల్లలను,గలిగి ఉండటానికి గర్విస్తారు.

సోవియటు యూనియన్లో పెండ్లిండ్ల సమయాలలో కట్నాలులేవు. మొట్ట మొదటి రోజులలో విప్లవానికి పూర్వం అయిన పెండ్లిండ్లలో ప్రేమలేని దాంపత్యాలు చాల విడిపోయినవి. అందువల్ల మొదట విడాకులు ఇచ్చుకొన్న వారు చాలమంది ఉన్నారు. కాని రానురాను వారి సంఖ్య తగ్గింది. కారణం నిజమైన ప్రేమకు అడ్డుగా ఉండే వ్యక్తిగతఆస్తి తొలగిపోవటమే.

సోవియటు యూనియన్లో వివాహాలు రిజిష్టరు చేసుకోవచ్చు. కాని సోవియటు ప్రభుత్వం ఇద్దరు స్త్రీ పురుషులు ప్రేమతో కలిసి భార్యా భర్తలు లాగా ఉండటాన్ని గూడ వివాహంగా పరిగణిస్తుంది. ప్రేమయే ముఖ్యమయినది. భర్త భార్యకన్న ఎక్కువ అనే సిద్ధాంతాన్ని ఒప్పుకోదు. ఒకరితో ఒకరు సంప్రదించుకొని పనులు చేసుకోవాలిగాని ఒకరి మీద మరొకరి పెత్తనం ఒప్పుకోదు, కమ్యూనిస్టు నీతి. కాని ప్రేమయే ముఖ్యముగా ఉన్న వివాహాలు సరిగా ఉంటవి. ఎప్పుడు ఇష్టం లేకపోతే అప్పుడే విడాకులు ఇచ్చుకొంటారు. అట్టిచోట వ్యభిచారానికి తావు ఎలా ఉంటుంది? విడాకులు తక్కువ జరుగుతవి. దీనికి సోవియటు యూనియనే తార్కాణం.

స్త్రీల శరీర నిర్మాణం సుమారు 50 పనులు చేయటానికి పనికిరాదని పరిశోధనచేసి సోవియటు శాస్త్రజ్ఞులు కనుకొన్నారు. అందువలన ఆపనులలో పాల్గొనవద్దని ప్రభుత్వం శాసించింది.

గర్భిణీ స్త్రీలకు, పిల్ల తల్లులకు రాత్రిపని ఇయ్యగూడదని శాసించింది.

ఎక్కువ బరువులు మోయటం స్త్రీ శరీర నిర్మాణమునకు హాని చేస్తుందని కనుక్కోవటం మూలాన, అంత బరువు మోయించడం శాసన విరుద్ధం జేసింది. దీనివలన స్త్రీలంటే సోవియటు ప్రభుత్వం ఎంత జాగ్రత్తగా ఉంటుందో తెలుస్తుంది.

సోవియటు యూనియన్ స్త్రీలు, పారిశ్రామికోత్పత్తిలో మొత్తంమీద అన్ని పరిశ్రమలు కలిపితే పురుషులతో సమానంగా ఉన్నారు. బట్టలు, తోళ్ళు మొదలగు పరిశ్రమలలో పురుషులకన్నా ఎక్కువ మంది పనిజేస్తూ ఉన్నారు. జారు పరిపాలించే రోజులలో కన్నా చాల ఎక్కువ మంది పరిశ్రమలలో పని జేయుచున్నారు. జారు రోజులలో గనులు, లోహముల పరిశ్రమలలో చాల తక్కువమంది ఉండేవారు. ఇప్పుడు దానికి ఎన్నోరెట్లు ఎక్కువ మంది ఆ పరిశ్రమలలో పని జేయుచున్నారు. ఈ క్రింది లెక్కలలో వివరంగా కొన్ని పరిశ్రమలను గూర్చి ఉదాహరణకు వ్రాయబడినవి.

100 మంది పనిజేసే వారలలో
స్త్రీల సంఖ్య.

| | 1913 లో | 1935 లో |
|---|---|---|
| బొగ్గు గనులు | 4 | 24 |
| లోహములు | 4 | 26 |
| కొయ్యపరిశ్రమ | 10 | 40 |
| రొట్టెలు, బిస్కత్తులు | 22 | 50 |
| తోళ్లు, బూట్లపరిశ్రమ | 17 | 56 |
| బట్టల పరిశ్రమ | 56 | 70 |
| కాగిత పరిశ్రమ | 34 | 42 |
| కుట్టుపని | ? | 83 |

జారు పరిపాలించే రోజుల్లో రష్యాలో స్త్రీలు బట్టల పరిశ్రమ మొదలగు వాటిలో విరివిగా పనిజేసినా వారంతా తెలివితేటలు, చాకచక్యం ఎక్కువగా అవసరంలేని నూలు వడకే పనులే చేసేవారు. కాని ఇప్పుడు వారు విద్యుచ్ఛక్తి పరిశ్రమ మొదలగు చాకచక్యము ఉపయోగింపవలసిన పనులలో గూడ పురుషులతో కొంచ మించు మించుగా సమాన సంఖ్యలుగాఉన్నారు ఉదాహరణకు కొన్ని పరిశ్రమలు ఉదహరించబడినవి.

వ్యవసాయక యంత్ర నిర్మాణ పరిశ్రమ
100 పనిచేసే వారలలో స్త్రీలు

| | 1927 లో | 1934 లో |
|---|---|---|
| పాలిష్ యంత్రాలు | 8 | 40 |
| కంతలు బొడిచే యంత్రం | 10 | 74 |
| విద్యుచ్ఛక్తి పరిశ్రమలో లోహాలను చెక్కే యంత్రము | 11 | 59 |

ఇంతేగాక ఇంకా రైల్వేలోనూ, ట్రాములలోనూ ఇతర డిపార్టు మెంటులలో చాల మంది ఇంజను డ్రైవరులుగను, మెకానికులుగను, స్త్రీలు పనిచేయు చున్నారు. 1931 లో ట్రాము కండక్టరులలో స్త్రీలు నూటికి 61 మంది డ్రైవర్లలో నూటికి 14 మంది ఉన్నారు.

స్త్రీలు మామూలుగ చదువు నేర్చుకోవటమే గాక పై కాలేజీలలోనూ, టెక్నికల్ కాలేజీలలోనూ, స్కూళ్ళలోనూ చాలమంది చదువు చున్నారు. ఈ విధంగా జారు రోజుల్లో స్త్రీలు చదువుకోడానికి అవకాశం లేదుగదా, నాగరక దేశములని చెప్పుకునే అమెరికా, ఇంగ్లండు దేశాలలో కూడ స్త్రీలకు ఉన్నత విద్య చదవటానికి అవకాశాలు నేటికికూడ చాల తక్కువ. జర్మనీ మాట చెప్పనే అవుసరం లేదు. జర్మనీలో కాలేజీలలో చదవనే గూడదట!

రష్యాలో 1933 లో పారిశ్రామిక ఫాక్టరీ స్కూళ్ళలో చదువుచున్న స్త్రీల లెక్కలు

100 మంది విద్యార్థులలో స్త్రీలు.

| | |
|---|---|
| లోహాల ఇంజనీరింగు | 28 |
| ఎలెక్ట్రికల్ ఇంజనీరింగు | 35 |
| యంత్రములు తయారుచేయు ఇంజనీరింగు | 27 |

సమిష్టి వ్యవసాయ ఉత్పత్తి చాలమంది స్త్రీలు పాల్గొంటున్నారు. ఇంతమంది పాల్గొనడానికి కారణం పిల్ల కోసం క్రెచీలు, సమిష్టి వంటశాలలు విరివిగా సమిష్టి వ్యవసాయ సంఘాలలో ఏర్పాటు చేయడమే. వ్యవసాయ తరుణములో 10 లక్షల మంది వంటవాండ్రు సమిష్టి వ్యవసాయ శాలలో పని జేస్తారట.

ప్రభుత్వ సమిష్టి వ్యవసాయ సంఘాలలో పనిజేసే వారిలో 100 కి 85 మంది స్త్రీలు 1935 లో ఉన్నారు. ఇంతేగాక వారిలో 1000 మంది మరనాగలి (ట్రాక్టరు) నడిపేవారు ఉన్నారు. సమిష్టి వ్యవసాయ సంఘాలకు మానేజర్లుగా గూడ ఉన్నారు. 1935 లో 6861 సమిష్టి వ్యవసాయ శాలలలో స్త్రీలు ఎంత

# ఆర్మీనియన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

★ ముఖ్యపట్టణం — ఇరెవాన్




రెండున్నర వేల సంవత్సరాలు బానిసత్వంలోవున్న యీ దేశంకు సోవియటు పాలనలో స్వాతంత్ర్యం యివ్వబడింది. పూర్వం మంటలు పుట్టించే పర్వ ప్రదేశాలలో కాలువల ద్వారా నేడు ప్రత్తి, ద్రాక్ష సమృద్ధిగా పండించ బడుతూంది.

రసాయన కార్ఖానాలు, విద్యుత్‌శక్తి యంత్రాలు స్థాపించబడినాయి. వివిధ రకాల ఆర్మీనియా ద్రాక్షరసం సోవియటు యూనియన్‌లోనూ విదేశాలలోనూ ప్రసిద్ధి కెక్కినవి.

అదివరకు ఒక్క విద్యా సంస్థయులేని యీ దేశంలో ఇపుడు ప్రతివానికీ విద్య అందుబాటులో వుంది.

మంది ఏ ఏ పనులు చేయుచున్నదీ ఈ క్రింద పొందుపరుపబడినది.

| | 100 మందిలో స్త్రీలు. |
|---|---|
| అధ్యక్షులు, ఉపాధ్యక్షులు | 8 |
| మానేజింగు కమిటీలలో | 18 |
| పశువుల ఫారముల మానేజర్లు | 16 |
| క్లబ్బు మానేజర్లు | 11 |
| బ్రిగేడు నాయకులు | 21 |

స్త్రీలు సోవియట్ పారిశ్రామికాభివృద్ధికి చాల ఎక్కువగా తోడ్పడ్డారు. 'షాక్, బ్రిగేడు ల'లో చేరారు. ఎక్కువ ఉత్పత్తి జేసే 'స్టాఖనోవ్' ఉద్యమాన్ని బట్టల పరిశ్రమలోనూ, సమిష్టి వ్యవసాయములోని ట్రాక్టరు డ్రైవరులలోనూ మొదలైన వాటిలో మొదలుపెట్టి నడిపినది స్త్రీలే.

కాయకష్టము జేసే పనులలోనే గాక స్త్రీలు మెదడు పనుల (brain work) లో గూడపురుషులతో సమాన మవుతున్నారు. జారు రోజులలో కొద్దిమంది డాక్టర్లు, నర్సులు తప్ప కాలేజీ ప్రొఫెసర్లు, ప్రధానోపాధ్యాయులు, లాయర్లుగా ఉన్నవారు కొద్దిమంది. వీరుకూడ ధనికుల కుటుంబము నుంచి వచ్చినవారు మాత్రమే. సోవియటు యూనియన్ గొప్పతన మేమిటంటే, ఆ ఉద్యోగాలు చేయడానికి బీద స్త్రీలకు గూడ అవకాశం ఇచ్చింది.

ప్రాధమిక పాఠశాలలలో 1935 లో పల్లెలలో నూటికి 70 మంది పట్నాలలో 100 కి 90 మంది ఉపాధ్యాయులు స్త్రీలు. మాధ్యమిక స్కూళ్ళలో పల్లెలలో 100 కి 60 మంది, పల్లెలలో 100 కి 41 మంది స్త్రీలు. నర్సులు చాలమంది స్త్రీలే. మాస్కోలో 1935 లో 100 కి 72 మంది నర్సులు. స్త్రీలే డాక్టర్లుగా గూడ పురుషులతో సమానంగా ఉన్నారు స్త్రీలు, సోవియటు యూనియన్‌లో 1914 లో 1900 మంది స్త్రీ డాక్టర్లుంటే, 1935 లో 42,000 మంది ఉన్నారు. న్యాయ శాఖలో 1933 లో 100 కి 9 మంది స్త్రీలున్నారు. శాస్త్ర పరిశోధకులలో 1935 లో 100 కి 29 మంది స్త్రీలు.

ఈక్రింది "చార్టు"లో స్త్రీలు ఆర్థిక విధానంలో ఏఏ డిపార్టుమెంటులలో ఎంతమంది పని చేయుచున్నదీ వివరింప బడినది.

1937 సం॥ ఆఖరుకు 100కి స్త్రీల సంఖ్య

| | |
|---|---|
| మొత్తం ఆర్థిక విధానం | 40 |
| పరిశ్రమలు | 37 |
| పెద్ద పరిశ్రమలు | 38 |
| నిర్మాణ పరిశ్రమ | 18 |
| ప్రయాణ సౌకర్యములు | 16 |
| ఉపాధ్యాయులు | 58 |
| ఆరోగ్యశాఖ | 73 |
| వ్యవసాయం | 26 |
| సమిష్టి వంటశాలలో పనిచేయువారు | 69 |

ఈ చార్టులో చూస్తే 1937 ఆఖరుకు స్త్రీలు కొన్ని డిపార్టుమెంటులలో పురుషులకన్న ఎక్కువగాను, కొన్నిటిలో తక్కువగానూ ఉన్నారు. మొత్తంమీద ఆర్థిక విధానంలో పురుషులకన్న కొంచము తక్కువగా ఉన్నారు.

సోవియటు యూనియన్‌లో స్త్రీలలో పూర్తిగా అవిద్య రూపుమాపబడినది. అందువలన స్త్రీలు వార్తా పత్రికలు చదువుట మామూలయినది. వారికి రాజకీయాలు తెలిసినవి. వారియొక్క విజ్ఞాన ప్రమాణం ఎక్కువ అయ్యింది. వార్తా పత్రికలకు వ్రాసేవారు 1937 లో నూటికి 18 మంది స్త్రీలు. విజ్ఞానాభివృద్ధికి క్లబ్బులు చాల తోడ్పడుతాయి. అటువంటి కార్మిక క్లబ్బులలో నూటికి 33 మంది స్త్రీలు. నేటి రష్యా వాగ్మయములో స్త్రీలకు గమనింపదగిన స్థానం లభించింది.

సోవియటు యూనియన్ స్త్రీలు వ్యాయామము, మిలిటరీ శిక్షణ, ఆటపాటలలో బాగా ఆరితేరారు. రష్యా విప్లవములో రెడ్ ఆర్మీలో చేరి, సిపాయీలుగను, మషీన్‌గన్ కాల్చేవారుగను, టాంకు డ్రైవర్లుగను పనిజేసి విప్లవాన్ని జయం బొందించారు. రష్యా స్త్రీలు మిలిటరీ శిక్షణను పొందుతున్నారు. ఫ్యాక్టరీలలో ఉన్న "రసాయన విమాన యుద్ధములగూర్చిన" క్లబ్బులలో స్త్రీలు ప్రస్తుత యుద్ధము చేయు పద్ధతిని నేర్చుకొంటారు. గాస్ మాస్కు యొక్క ఉపయోగం, విమానదాడి నెదుర్కొను విధానం మొదలైన వాటిని నేర్చుకొంటారు. స్త్రీలు విమానములను నడుపుట గూడ విరివిగా నేర్చుకొంటున్నారు. పౌలినా ఓసిపెంకో అను నామె ప్రపంచ స్త్రీల కందరికన్నా విమానం మీద ఎక్కువ ఎత్తు ఎగిరింది. అంతేగాక స్త్రీలు పేరచ్యూట్‌లను గాలి గొడుగులతో విమానం మీదనుండి నేలమీదకు దూకటం చాల మామూలయింది.

జూను 17, 1935 లో 6 గురు స్త్రీలు దాదాపు 8౦౦౦ గజాల యెత్తునుండి దూకారు. రష్యాలో స్త్రీలు పేరచ్యూట్‌లతో దూకడం మన దేశంలో చిన్న పిల్లలు మొండి గోడల నుండి దూకేటంత సులువయిపోయింది మన దేశస్థులు పేరచ్యూట్‌లే యెరుగరు. మిలిటరీ స్కూళ్ళలో గూడ స్త్రీలు ప్రవేశించి కాల్బలము, గుర్రపు దళం, విమాన దళాలకు భావి కమాండరులుగా తయారవుతున్నారు.

స్త్రీలు, ఆటలలో పురుషులకంటే ఎక్కువగా ఉన్నారు. ఈ క్రింద వేసిన లెక్కలు రుజువు చేస్తాయి.

1935 వేసవిలో 100 కి

| | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| కసరత్ | 36 | 64 |
| ఫుట్‌బాల్ | 41 | 59 |
| టెన్నీసు | 39 | 61 |
| వాలీబాల్ | 42 | 58 |
| ఈత | 41 | 59 |
| చదరంగం | 70 | 30 |

తక్కిన ఆటలలో స్త్రీలకన్న తక్కువ మంది పురుషులు పాల్గొన్నారు. చదరంగంలో మాత్రం పురుషులే స్త్రీలకంటె ఎక్కువమంది పాల్గొన్నారు!

375 గజాలు, 500 గజాలు, 626 గజాలు పరుగులలోనూ, బల్లెము విసరుటలోనూ, 6250 గజాలు, 625 గజాల మంచుమీద జారుట (skating) పోటీ పందాలలో రష్యా స్త్రీలు ప్రపంచ స్త్రీలలో మొదటి వారుగా వచ్చారు.

సోవియట్ యూనియన్ స్త్రీలకు కొండలు కూడ ఎక్కడమంటే హుషారు. 1935లో 2120 మందిస్త్రీలు కాకేషియా పర్వతాన్ని ఎక్కుటకు ప్రయత్నించారు. వారిలో 265 మంది శిఖరం వరకూ ఎక్కారు.

సోవియటు యూనియనులో సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి కార్మిక వర్గానికి దారిచూపిన కమ్యూనిస్టు పార్టీలో స్త్రీలు అధికముగా ఉన్నారు. యువజన కమ్యూనిస్టు సంస్థలో గూడ అధికముగానే ఉన్నారు. 1933 సంవత్సరానికి కమ్యూనిస్టు పార్టీలో 100 కి 17 మంది స్త్రీలు. అప్పటికి కార్మిక స్త్రీల మొత్తంలో 100 కి 26 మంది పార్టీలో జేరారు. కాంసొమల్స్‌లో 1933 నాటికి 100 కి 32 స్త్రీలు ఉన్నారు.

జారు ప్రభుత్వంలో అల్ప సంఖ్యాకులు స్వాతంత్రం లేక అణచివెట్టబడి ఉండేవారు. సోవియటు ప్రభుత్వం స్థాపింపబడిన వెంటనే వీరిని దాస్యమునుండి తొలగించి వారికి నాగరికతను అభివృద్ధిజేసి అన్ని విధాల అభివృద్ధికి తీసుకొని వచ్చింది. పర్దా పద్ధతిని రద్దుజేసి స్త్రీలకు పురుషులతోపాటు సమాన హక్కుల నిచ్చింది. వారిలో విజ్ఞానాన్ని పెంపొందించటానికి క్లబ్బులు మొదలయినవి పెట్టింది. అవిద్యను రూపు మాపింది. 10,000 మంది టర్కీ స్త్రీలతో గూడిన క్లబ్బు నొకదానిని 1922 లో బకూలో స్థాపించింది. నెమ్మది నెమ్మదిగా స్త్రీలను పరిశ్రమలోనికి ఆకర్షించింది.

1934 కి ఆ వెనుకబడిఉన్న ప్రాంతాలలో 100 కి స్త్రీ కార్మికులు.

| | |
|---|---|
| జార్జియా | 28 |
| ఆర్మీనియా | 24 |
| టర్కోమనిస్థాన్ | 24 |
| కిర్‌గిజ్ | 21 |
| మెర్‌డొవియన్ | 31 |

ఆ ప్రాంతాలలోని స్త్రీలు గూడ చాలమంది సోవియటు ప్రభుత్వ నిర్వహణలో పాలు తీసుకొంటున్నారు.

# సోవియట్ విదేశ రాజ నీతి: ప్రపంచ శాంతి.

కామ్రేడ్ కె. సత్యనారాయణ, బి. ఏ. (ఆనర్స్) బి. యల్.

సోవియట్ యూనియనును గురించి చాలమందికి కొన్ని అపోహలు, అనుమానములు కలవు. కాపిటలిస్ట్ దేశములలో సంధులు చేసుకొనుచున్నదని, " ప్రపంచ సోషలిస్టు విధానమును స్థాపించాలి'' అనే ఎత్తుతో కొన్ని దేశముల నాకర్షించి తరువాత తన సొంత ఆశయములకు వాటిని ఉపయోగించుకొనుటకు ప్రయత్నస్తున్నదని, ఇంకా ఇతర వింత అభిప్రాయములు కొంత మందికి ఉన్నాయి. సోవియటు యూనియన్ యొక్క నిజ పరిస్థితులు వీరికి తెలియక పోవుటయే వీటి కన్నిటికి కారణము. సోషలిస్టు తత్వమునకు వ్యతిరేకులైన సామ్రాజ్యవాదులు సోవియట్ యూనియనును గురించిచేయు దుష్ప్రచారముగూడ ఇటువంటి అభిప్రాయములను కలుగ జేయుచున్నది.

సోవియట్ ప్రభుత్వము స్థాపింప బడినప్పటినుంచి విదేశములలో సోవియటుయూనియనుకు గల సంబంధములను వివరంగా పరిశీలించినచో పైన చెప్పిన అనుమానముల కేమాత్రము తావు వుండదు. అంతేగాక, ఒక్క సోవియట్ యూనియనే నిజమైన ప్రపంచ శాంతిని స్థాపించుటకొరకు సర్వ ప్రయత్నములు చేస్తున్నదనిగూడ తెలుస్తుంది. సామ్రాజ్యములు, ఒకదేశము ఇంకొక దేశమును దోపిడిచేయుట, ప్రపంచములో ఉన్నతకాలము యుద్ధములు తప్పవని నమ్మిన సోవియటు యూనియను సామ్రాజ్య వ్యతిరేక పోరాటమును వృద్ధిచేసి ప్రపంచ సోషలిస్టు విధానమున కేవిధముగా దారితీయుచున్నదో తెలియజేస్తుంది సోవియటు యూనియను విదేశీరాజ్యాంగ వైఖరి. ఈ విషయములన్నియు నిరూపించుటయే ఈ వ్యాసముయొక్క ఉద్దేశ్యము.

## సోవియటుల "శాంతి ఘోషణ"

1917 వ నవంబరు 7 వ తేదీన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద సోవియటు ప్రభుత్వం స్థాపించబడెను. ప్రభుత్వ అధికారము స్వాధీన యిన మరునాడే, అనగా నవంబరు 8 వ తేదీన, సోవియట్ ప్రభుత్వం యుద్ధములో పాల్గొనుచున్న అన్ని దేశములకు, వెంటనే యుద్ధము చాలించి సంధి చేసుకొనుట ప్రపంచ శాంతికి అత్యవసరమని హెచ్చరించెను. సంధి పరిస్థితులలో నష్ట పరిహారములు గాని, ఒక దేశమును ఇంకో దేశము అక్రమించుకొనుట గాని పనికిరాదని సూచించెను. ఇదియే నవంబరు 8 వ తేదీ (Peace Decree) "శాంతి ఘోషణ" అని చరిత్రలో ప్రసిద్ధి గాంచినది. యుద్ధములో శక్తు లన్ని ఉడిగిపోయినా, సామ్రాజ్య వాదులకు ఈ మాటలు నచ్చ లేదు. తరువాత 1 సంవత్సరం 3 రోజులకు, జర్మనీ కాలనీలన్నీ జయించి, 1918 నవంబరు 11 వ తేదీ ఒక సంధి (Armistice) ని చేసుకొన్నారు. 1914 సెప్టెంబరు 14 వ తేదీన జర్మనీకి వ్యతిరేకముగ పోరాడు దేశము లన్నిటికి జరిగిన రహస్యపు టొడంబడికకు, 1917 నవంబరులో సోవియటు ప్రభుత్వం సంధి సూచన వ్యతిరేకమని, ఇంగ్లండు ఫ్రాంసులతు సోవియటు ప్రభుత్వం ద్రోహం చేసినదని, అందువలన జర్మనీతో ప్రత్యేక సంధి చేసుకొన్నచో, సోవియటు ప్రభుత్వమును గుర్తించమని బెదిరించారు.



## బ్రెస్ట్ లిటోవస్క్ సంధి

సోవియట్ ప్రభుత్వపు విదేశ రాజ్యాంగ వైఖరి యొక్క చరిత్రలో "బ్రెస్ట్ లిటోవస్క్ సంధి" ఒక మహత్తర ఘట్టమని చెప్పవచ్చును.

రష్యను కార్మికులు సామ్రాజ్యవాదుల లాభముకై ఎంత మాత్రము ఇక మీద తమ రక్తమును ధారపోయుట అసంభవమని తలచిన సోవియటు ప్రభుత్వము జర్మనీతో ప్రత్యేక సంధి చేసుకొని, యుద్ధములో నుంచి విరమించుకొనుటకు నిర్ణయించెను. సంధి సూచనలను అందుకొని జర్మనీ, రాయబారముల కొప్పుకొనెను. 1917 డిసెంబరు 26 వ తేదీన సంధి రాయబారములు ప్రారంభమగుటకు ఒప్పుకొని, ఈలోపల తిరిగి ఇంకొకసారి అన్ని దేశములను, సంధి చేసుకొని యుద్ధమును ఆపమని సోవియటు ప్రభుత్వం కోరెను. ఈ రాయబారములు జరుగుచుండగా, ఇంగ్లండులో బ్రాడ్ఫర్డ్ పట్టణమందు, "విజయము సమకూరు నంతవరకు సంధి ఎంత మాత్రము పనికిరా"దని చర్చిల్ (Churchill) గొంతెత్తి ఉపన్యసించాడు.

బ్రెస్ట్ లిటోవస్క్‌లో జరిగిన రాయభారముల ఫలితముగా రష్యాను, ఓడిపోయిన దేశముగా భావించి, కొన్ని కోట్ల ద్రవ్యమును నష్ట పరిహారము ఇవ్వవలెనని సైన్యము( Demobilise ) యుద్ధ సన్నాహముగా యుండకుండా చేయవలెనని, నావికా బలమును తగ్గించ వలెనని, పోలెండ్ ఇంకా కొన్ని రాష్ట్రములను రష్యావదలుకొన వలెనని, ఇంగ్లండుకు వ్యతిరేకముగా జర్మనీకి కొంతవరకు రష్యా సహాయము చేయవలెనని, మొదలైన షరతులను జర్మనీ సూచించెను. ట్రాట్‌స్కీ నాయకత్వము క్రింద వెళ్ళిన సోవియటు డెలిగేషన్ వీటికి ఒప్పుకొనలేదు. తిరిగి యుద్ధములో దిగుటకు బోల్షివిక్కుల కిష్టములేదు. శక్తిగూడ లేదు. ఈ పరిస్థితులలో జర్మనీ రష్యామీద దండెత్తింది. జర్మనీ షరతులకు ఒప్పుకొనిన యెడల, సోవియటు ప్రభుత్వమే నాశనమగునని, సోషలిస్టు విప్లవమును ఏలాగైనా కాపాడవలెనని, ఈ షరతులతో గూడిన సంధి తాత్కాలిక మైనదని, చిరకాలము అమలులో వుండదని, శాంతికొరకు కళ్ళుపొడుచుకొని వేచియున్న రష్యను సైన్యములకు విశ్రాంతి కావలెనని అందువల్ల షరతులకు ఒప్పుకొనమని లెనిన్ వాదించెను. సోవియటు ప్రభుత్వం షరతులకు ఒప్పుకొంది, సంధి సమయమునకు ఇంకా క్రొత్త షరతులను పెట్టింది జర్మనీ. 'అన్నిటికీ సిద్ధమే! సోవియటు ప్రభుత్వము నిలిచే పద్ధతిలో' అన్నాడు లెనిన్. తరువాత జర్మనీలో విప్లవం జరిగి, 1918 నవంబరు 9 వ తేదీ సోషల్ డెమాక్రిటిక్ ప్రభుత్వం వచ్చుటవలన వెర్సెయిల్స్ సంధి ప్రకారం బ్రెస్‌లిటోవస్క్ సంధిరద్దుఅయ్యెను. జర్మనీ షరతులు చాల అవమాన కరముగా నుండినను, ఎత్తుగడలకు ప్రఖ్యాతి నొందిన లెనిన్ సోషలిస్టు విప్లవ జ్యోతిని కాపాడుటకై తల ఊపాడు. సామ్రాజ్య వాదుల యుద్ధమునుంచి విరమించుటయే గాక, సోషలిస్టు విప్లవమును ఏపరిస్థితులలోనైనా, వెయ్యికండ్లతో కాపాడుటకు కమ్యూనిస్టులు కంకణము కట్టుకొన్నారని తెలియజేస్తుంది బ్రెస్ట్‌లిటోవిస్క్‌సంధి.

## 1919—1921

ర ప్రభుత్వమును నాశనము చేయుటకు బ్రిటన్, ఫ్రాంసు, అమెరికా దేశములు నిశ్చయించుకొని, వెర్సైల్స్ సంధికి పూర్వము, రష్యా జర్మనీ యొక్క ఏజంటు అని, సంధికి తరువాత బోల్షివిజం ప్రపంచమును నాశనం చేయుటకు బయలుదేరిన పిశాచమని, 1921 వ సంవత్సరము వరకు రష్యామీద యుద్ధం చేశారు. రష్యాలో మెన్షివిక్కులు (మితవాద సోషలిస్టులు) డెనికిన్, కోల్చాక్. రాంగెల్, మొదలైన విద్రోహులకు సహాయం చేశారు. జపాన్, ఇటలీ, జెకోస్లొవేకియా, సర్బియా, పోలెండుగూడ సోవియటుప్రభుత్వంమీదదండెత్తినాయి.

సోవియటు ప్రభుత్వము, అన్ని దేశములతో సంధి చేసుకొనుటకు సిద్ధముగా ఉన్నదని చెప్పినప్పటికి బ్రిటన్, ఫ్రాంసు ఒప్పుకొనలేదు. సోవియటు ప్రభుత్వమును కాపాడుటకు పూనుకొన్న రష్యన్ కార్మిక కర్షకసైన్యం, రెడ్ ఆర్మీ(Red Army), దండెత్తి వచ్చిన దేశము లన్నిటిని ఎదుర్కొన్నది. "విద్రోహులు, సామ్రాజ్య వాదులు నాశనము కావాలి" అనే నినాదముతో "కార్మిక ప్రభుత్వమును కాపాడాలి" అని ఇతర దేశములలో చేసిన ప్రచారం వలన బలము పొంది రష్యను సైన్యములు దండెత్తివచ్చిన వారందరిని అన్నిటక్కుల ఓడించాయి. సోవియటు ప్రభుత్వమును నాశనం చేయుట అసాధ్యమని తోచి, బ్రిటిష్, ఫ్రెంచి, జపాన్ సామ్రాజ్యవాదులు 1921 లో.నిరోధించటం మానుకున్నారు.

1919—21 లో సోవియటు ప్రభుత్వం ఇతర దేశములతో వీలైనంతవరకు సంధులు చేసుకున్నది. ఇస్థోనియాతో ఫిబ్రవరి 1920 లో: లిథూనియాతో జూలై 1920 లో; లాట్వియాతో ఏప్రిల్ 1920 లో; ఫిన్‌లాండుతో అక్టోబర్ 1920 లో; సంధి చేసుకొన్నది. ఫ్రాంస్సు, ఇంగ్లండు జపాన్ దేశములు సంధికి ఒప్పుకొనలేదు. పోలెండుతో 1921 మార్చి 18 వ తేదీన సంధి చేసుకొన్నది.

పూర్వపు జారుప్రభుత్వమునకు ఈదేశములన్నీ ఇవ్వవలసిన అప్పులు రద్దుచేసింది. సోవియటు ప్రభుత్వం పైగా ప్రతి దేశమునకు సంధిప్రకారం కొన్నిలక్షల రూబుల్సును నష్టపరిహారంగా చెల్లించింది. సోవియటు ప్రభుత్వము నాశనంగాకుండా ఉండటమే ప్రధానం!

అదేవిధముగా, ఆఫ్ఘనిస్థాన్, పర్షియాలతో గూడ 1921 లో, సోవియటు ప్రభుత్వం సంధి చేసుకొన్నది.

సోవియటు యూనియన్‌ను ఆర్థికముగా పునరుద్ధరించుటకు, యంత్రములతో ప్రకృతి సంపత్తును **Natural resonrces** ను ఉపయోగించుటకు ఇగ్లండు, జర్మనీ మొదలైన దేశముల సహాయం కావాలి. కాని ఈ వరకు చక్రవర్తి చేసిన అప్పుల నన్నింటిని రద్దుచేయుటచే పెట్టుబడిదారీ ప్రభుత్వాలు సోవియటు యూనియనుకు అప్పు నివ్వ నిరాకరించాయి.

ఈ సమయంలో, జినో **(Genoa)** పట్టణంలో వివిధ దేశాలు యుద్ధానంతర సమస్యలను పరిష్కరించడానికి కలసికొన్నాయి. ఆసమావేశములో జర్మనీరాయబారి రపల్లో **Rapallo** లో, సోవియటు విదేశాంగ మంత్రి చిచిరన్ ఒక ఒడంబడిక చేసుకొని, జర్మనీ సోవియటు సంబంధాలను స్నేహ పూర్వకముగా ఉండేటట్లు చేశాడు. దీనివలన సోవియటు యూనియనుకు కావలసిన యంత్రి సామాగ్రిని జర్మనీనుండి తెప్పించుకోవడానికి వీలైయింది. యుద్ధములో ఓడిన జర్మనీకి సోవియటు సహాయము, సానుభూతి దొరికింది. ఈసంబంధాలు హిట్లరు జర్మనీ నియంతగా వచ్చేవరకు సాగాయి, ఇకలాభములేదని ఇంగ్లండు, ఫ్రాంసు దేశాలుకూడ,సోవియటు యూనియనుతో వర్తకవ్యాపార సంధులు చేసుకొనుటకు సంసిద్ధములైనవి. దానిఫలితముగా ఇంగ్లండు, జర్మనీ, స్వీడెను, ఫిన్‌లెండు, ఇస్థోనియా, లిథూనియా, ఇటలీ, జెకోస్లావేకియా, ఆస్ట్రియా, ఫ్రాంసు మొదలైన దేశములతో వర్తక ఒడంబడికలు జరిగినయి.

## జాతిసమితి: సోవియటుయూనియన్

ప్రపంచ శాంతి "కొరకై" "జాతిసమితి" ని స్థాపించామన్నాయి ఇంగ్లండు, ఫ్రాంసులు. జాతిసమితి నిజమైనజాతిసమితి, కాదనియు, యుద్ధంలో జయముపొందిన దేశముల గూడుపుఠాణీయనియు, ప్రపంచ శాంతికొరకు స్థాపించబడలేదనియు ఇప్పుడు అందరికి తెలిసినది, జాతిసమితిని స్థాపించినప్పుడు,జర్మనీ,ఆస్ట్రియా సోవియటుప్రభుత్వానికీ,హంగేరీ,టర్కీ దేశములకు ఆహ్వానము పంపలేదు. కాలనీలతరపున సామ్రాజ్యవాదులు జాతిసమితిలో ప్రాతినిధ్యము వహించారు. ముఖ్యముగా 3 ఉద్దేశ్యములతో జాతిసమితి,ఇంగ్లండు,ఫ్రాంసుల నాయకత్వము క్రింద బయలుదేరింది. [1] యుద్ధములో స్వాధీనము గావించుకొన్న దేశములను చెక్కుచెదరకుండా, దోపిడిచేయుటకు [2] కాలనీలలో స్వతంత్రపోరాటముల నణచుటకు, సోవియటు ప్రభుత్వమును అణచివేయుటకు, [3] వెంటనే యుద్ధములేపి జరుగకుండా శాంతి స్థాపించుటకు.

అహ్వానింపకపోయినా, సోవియటు ప్రభుత్వం, ప్రెసిడెంటు విల్సన్‌కు ఈ క్రింది సూచలపైన నిజమైన జాతిసమితిని స్థాపించవలెనని ఉత్తరం పంపినది. సూచనలు:–[1] అన్నిదేశములకు స్వాతంత్రముండాలి. [2] యుద్ధపు అప్పులన్నీ రద్ధు కావాలి. [3] కాలనీల పద్ధతి నశించాలి [4] అంతర్జాతీయ ఆయుధ విసర్జనము,— ఈ సూచనలకు జాతిసమితి నాయకులు ఒప్పుకొనలేదు. కారణములుపైననే చెప్పబడినవి. సోవియటు ప్రభుత్వము మట్టుకు జాతిసమితి నిజస్వభావమును ఈ విధముగా ప్రపంచానికి తెలియపరచి, ఇంగ్లండు, ఫ్రాంసులు చేయుచున్న మోసమును వెల్లడించెను.

తరువాత, 1932 లో హిట్లరు అధికారమునకు వచ్చినపుడు, తల మొత్తుచున్న ఫాసిజమునకు భయపడి, ఫ్రాంసు 1933 లో సోవియటు ప్రభుత్వమును జాతిసమితిలోనికి తీసుకొనివచ్చుటకు ప్రయత్నము చేసింది. 1933 లో జపాను జాతిసమితినెదిరించి వదలిపెట్టింది. యుద్ధ తత్వముతో పొగరెక్కిన దేశములకు జాతిసమితితో పనిలేక, దూరముగా పోతున్నప్పుడు, వెంటనే యుద్ధమునకు ప్రతికూలమైన దేశములు జాతిసమితిలో ఉండుట సంభవించినది. ఆ పరిస్థితులలో సోవియటు 1934 లో జాతిసమితిలో చేరినది. లిట్వినాఫ్ చెప్పినట్లు, సోవియటు ప్రభుత్వము తన సామ్రాజ్య వ్యతిరేకస్వభావమును వదలుకొని కాదు, జాతిసమితిలో చేరినది. జాతిసమితి లోపలనుంచి గూడ ఫాసిస్టు తత్వమును, యుద్ధ తత్వమును యుద్ధ ప్రతికూలమగు యూరపులోని చిన్న దేశముల ఐకమత్యముతో ఎదుర్కొని, ప్రపంచ శాంతికి తోడ్పడుటకు సోవియటు యూనియన్ యొక్క ఎత్తు ఇది. అప్పటి నుంచి, ఫాసిస్టులు చేసే యుద్ధాలకు వ్యతిరేకంగా పని చేసింది. వారి గుట్టు బయటపెట్టుతూ వచ్చింది జాతిసమితిలో సోవియటు రష్యా.

## లొకార్నో, కెల్లాగ్, ఒడంబడికలు.

బ్రిటను, ఫ్రాంసు, బెల్జియం, జర్మనీ దేశములు కలిసి 1925 లో లొకార్నో సంధిని చేసుకొనినవి. ఈ నాలుగు దేశాలు, 1925 కు తమకు యూరపులో ఉన్న సరిహద్దులను అంగీకరించాయి. ఈ దేశాలపై ఏరాజ్యమైననూ దండెత్తిన మిగిలిన మూడుదేశాలు దానితో కలసి శత్రువుతో యుద్ధం చేయవలయును. ఇదే ఈ ఒడంబడికలోని ముఖ్య షరతు. దీని ఉద్దేశము జర్మనీని సోవియటు యూనియను పలుకుబడి నుండి, ఇంగ్లండు ఫ్రాంసుల పలుకుబడిలోకి తేవడమే. లొకార్నో సంధి చర్చలలో తనను గూడ చేరనీయవలసినదని, అడిగెను. కాని సోవియటు యూనియన్‌కు వ్యతిరేకముగా పై నాలుగుదేశములు ఒడంబడిక చేసుకొనుటకు, ఇంగ్లండు వేసిన ఎత్తు గనుక, సోవియటుప్రభుత్వమును లొకార్నోచర్చలలో పాల్గొననివ్వలేదు.

# టర్కోమన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

## ★ ముఖ్య పట్టణం — అష్ఖాబాద్




జార్ ప్రభుత్వంలో గుర్రాలు సప్లయి చేస్తూ "ప్రపంచానికి ఎందుకూ కొరగాని" వారుగా యెంచబడే టర్కోమన్లకు నవంబరు విప్లవం స్వాతంత్ర్య మిచ్చింది.

సోవియట్ ప్రభుత్వం విద్యాలయాలు స్థాపించింది: విద్య నిచ్చింది. నీటి సరఫరా ఏర్పాటు చేసింది; ట్రాక్టర్లు యిచ్చింది: పంటలు అభివృద్ధి చేసింది. నాట్యరంగమే ఎరుగని ఈ దేశంలో నేడు సినిమాలు, థియేటర్లు విరివిగా ఉన్నాయి. ముసుగు తీయుటే ఎరుగని స్త్రీలు నేడు అన్ని కళలు పరిశ్రమల్లో పాల్గొంటున్నారు.

## 1928: కెల్లాగ్ పాక్ట్

అమెరికా సెక్రటరీ కెల్లాగ్ సూచనపై "ప్రపంచ శాంతి" కొరకు, "యుద్ధముల నరికట్టుటకు" 65 దేశములు పారిసులో ఒడంబడికలు చేసుకొన్నాయి. ఇంగ్లండు, ఫ్రాంసులు గూడ చేరినయి, కొన్ని మినహాయింపులతో అసలు ఒడంబడిక ఉద్దేశ్యము, ఎ దేశములకైనా తగాదా వస్తే యుద్ధము చేయకుండా, తగాదా తీర్చుకొనవలెనని సారాంశము. మినహాయింపు లన్ని కలిపి పరిశీలిస్తే, స్వదేశ రక్షణకు, కాలనీలను, ఇంకా ఇతర ప్రత్యేక లాభములను నిలబెట్టుకొనుటకై యుద్ధాలు చేయవచ్చును. ఈ మినహాయింపుల కెప్పుడైతే అంగీకరించారో, ఒడంబడిక యొక్క "శాంతి" ఉద్దేశ్యము ఎగిరిపోయిన దన్నమాట. అయినప్పటికి ఏ శాంతి ఒడంబడికనైనా బలపరుస్తుందన్న నిరూపించుటకయి సోవియటు యూనియన్ గూడ కెల్లాగ్ ఒడంబడికకు బద్ధురాలయింది.

## సోవియట్ యూనియన్ : చైనా

ఇంతవరకు సోవియటు యూనియనుకు యూరపులోని ఇతర దేశాలకు గల సంబంధములను పరిశీలించితిమి. తూర్పు దేశముల యందు, ముఖ్యముగా చైనాకును సోవియటు రష్యాకును ఎక్కువ సంబంధములు కలవు. సోవియటు ప్రభుత్వము వచ్చిన తర్వాత పూర్వపు జారుప్రభుత్వమునకు చైనా యివ్వవలసిన అప్పులన్ని రద్దుచేసి, జారుసామ్రాజ్యములోని చైనా రాష్ట్రములను తిరిగి చైనాకు ఇచ్చివేసెను. రష్యన్ విప్లవము చైనారాజకీయములను పూర్తిగా మార్చివేసినదని చెప్పచ్చును. 1924 లో ఇతర తూర్పుదేశములతోపాటు, చైనాతోగూడా సంధిచేసుకొన్నది. సోవియటు యూనియన్ 100 సంవత్సరములు చైనాతో సంబంధములు పెట్టుకొని ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ. అమెరికా, జపాను సామ్రాజ్యాలు చైనాను ఆర్థికముగా దోపిడిచేసి, యుద్ధముచేసి, యుద్ధములద్వారా చైనాలో చాల భాగము జయించి అవమానకరమైన స్థితిలోనికి తీసుకవచ్చినాయి. ఒక్క 5 సంవత్సరముల సంబంధముతో జరిగిన ఈ 1924 సంధి సోవియటు ప్రభుత్వమునకు చైనాకు చిరస్థాయిగా నుండు స్నేహము, పరస్పరనమ్మకము కలిగించినది.

తూర్పు ప్రాంతములలో వైరుధ్యములు ఈ విధముగా నున్నవి. ఫ్రాంసు, ఇంగ్లండు, అమెరికా, జపాను, జర్మనీలకు పరస్పరవైరుధ్యములున్నయి. ఒక దేశమంటే ఇంకొక దేశమునకు సరిపడదు. చైనాను అందరూ మ్రింగవలెననే ఆశయం. కాని జపాను, అమెరికా, చైనాకు దగ్గరగా వుండుటవల్ల. ఈ రెండు దేశముల వైరుధ్యము ఎక్కువైనది. అంతేగాక జపానుకు రష్యాకు పూర్వమునుంచీ వైరమే। సోవియటు యూనియన్‌లోని సోషలిస్టు సమాజము, జపాను ఫ్యూడల్ పెట్టుబడిదారీ ప్రభుత్వాల వైరాన్ని మరింత హెచ్చు చేసింది.

1912 లో మంచూ ప్రభుత్వమును (ఫూడల్‌ప్రభుత్వం) ను కూల ద్రోసి, ప్రజాప్రభుత్వమును స్థాపించాడు, సన్‌యాట్ సేన్ (Sun-yat.sen), కాని సామ్రాజ్య వాదులు దోపిడి చైనాలో అపరిమితమైపోయింది. స్వతంత్రదేశమైనా, కాలనీలకంటె అధోగతికి వచ్చింది. చైనా 1920 లలో.

ఈ పరిస్థితులలో సోవియటు ప్రభుత్వము, చైనా స్వతంత్ర పోరాటములో సహాయము చేయుటకు వాగ్దానము చేసెను. ప్రసిద్ధికెక్కిన సన్‌యాట్ సేన్ మూడు సూత్రములలో ఒకటి ఏ మనగా - సోవియటు ప్రభుత్వంతో స్నేహముగావుండి చైనా సామ్రాజ్య వ్యతిరేక పోరాటములో సోవియటు యూనియను సహాయము తీసుకొనుట, సోవియటు యూని యను దాని ప్రకారం సైన్య శిక్షను ఒసంగుటకు నిపుణులను, ద్రవ్యమును చైనాకు పంపి, అంతవరకూ గాలిలో ఉన్న "కొమింటాంగ్" (ప్రజాపక్షమును )ను ఒక విప్లవ పక్షంగా తయారు చేసి, కార్మిక కర్షక బలంతో క్రొత్త జాతీయ వుద్యమమును లేవదీసెను. కాని సన్‌యాట్‌టు సేన్ గతించినతరువాత, కొమింటాంగ్‌లో మితవాద, అతివాద పక్షములు బయలుదేరి, 1927లో జంకైషేక్ విద్రోహులకు నాయకత్వము వహించి కమ్యూనిస్టులను అణగ ద్రొక్కసాగెను. సోవియటు ప్రతినిధులను చీనా నుండి సోదాచేసి తరిమి వేసెను.

1927 మే 12 వ తేదీన, ఇంగ్లండు సోవియటు రష్యాల మధ్య వ్యాపారము ఏ కంపెనీ ద్వారా జరుగుతుందో ఆ "ఆర్కోస్" కంపెనీ(బ్రిటిష్)బిల్డింగులను, సోవియటు వ్యాపార డెలిగేషన్ యొక్క బిల్డింగులను అధికారులు లేనప్పుడు బ్రిటిష్ పోలీసు పెద్ద సిబ్బందితో ప్రవేశించి. పెట్టెల నన్నిటిని పగుల గొట్టి, 4 రోజులు స్వాధీనములో ఉంచుకొన్నది, ఇంగ్లండు రష్యాలకు 1921 మార్చి 16 వ తేదీన జరిగిన ఒడంబడిక ప్రకారము, సోవియట్ ట్రేడ్ డెలిగేషన్‌ను సోదా చేయుటకు వీలు లేదు. దానికి వ్యతిరేకముగా ఇప్పుడు జరిగినది. సోదా చేయుట వల్ల, అపాయకరమైన కాగితాలు ఏమీ దొరుకలేదు ఇంగ్లండులో చట్ట సమ్మతమైన కమ్యూనిస్టు ఉద్యమమును గురించి తప్ప. ఈ కాగితముల నాధారము చేసుకొని, ఆస్టిన్ ఛేంబర్లేన్ 1927 మే లో రష్యాకు ఇంగ్లండుకు ఏ విధమైన రాజకీయ సంబంధములు ఇక ముందు లేవని తెలియపరచాడు.

సోవియటు రష్యాకు వ్యతిరేకముగా ఒక సంయుక్త

సంఘటనను లేవదీయుటకు ఇంగ్లండు పునాది వేసెను.

ఈ పరిస్థితులలో పరస్పరం "దాడి వెడల కుండడము" (**Non-agression**) అనే ఒడంబడికలను 1927 లో రష్యా, చుట్టుపక్కల ఉన్న చిన్న దేశము లన్నిటితోను చేసుకొన్నది.

## ఆయుధ విసర్జన సభలు

ప్రపంచ శాంతికై ఆయిధ విసర్జనము అవసరమనే ప్రజాభిప్రాయాన్ని త్రోసివేయలేక ఈ సభలను జరిపారు. కాని ఇంగ్లండు ఫ్రాంసులకు నిజమైన ఉద్దేశ్యము లేకపోవుట వల్ల, సామ్రాజ్యవాద దేశములకు గల పరస్పర వైరుధ్యము వల్ల అన్ని సభలు విఫల మయినాయి. సోవియట్ ప్రభుత్వము జాతి సమితి స్థాపించబడినపుడే, 1918 లోనే, అంతర్జాతీయ సంపూర్ణ ఆయుధ విసర్జనమును సూచించెను.తరువాత 1922లో జినోవ్ మీటింగులో గూడ తిరిగి సూచించినది. 1929 సభలో కొంతవరకైనా విసర్జన చేయవలెనని పోరాడినది. ఇంగ్లండు ఫ్రాంసులు ఒప్పుకొనలేదు, 1933 లో మూడవ వంతు ఆయుధాలను విసర్జన చేయవలెనని యునైటెడ్‌స్టేట్సు సూచించినప్పుడు, సోవియటు ప్రభుత్వం బలపరచింది. కాని లాభము లేకపోయెను. 1934 సభతో విసర్జన ప్రయత్నము లన్ని నాశనమయ్యెను.

## జర్మనీలో హిట్లరు అధికారం

1933 లో హిట్లరు అధికారములోకి వచ్చిన తరువాత ఫాసిస్టు యుద్ధ తత్వం తల యెత్తింది యూరపులో. ఇతర దేశముల మీద యుద్ధము చేసి కాలనీలను సంపాదించుటయే ఫాసిస్టు యుద్ధ తత్వము యొక్క సారాంశము. అనగా వెంటనే యుద్ధమునకు తయారవుతుంది ఫాసిజం. కాలనీలతో తులతూగుచున్న సామ్రాజ్యవాద దేశములు వెంటనే యుద్ధమునకు దిగుటకు వెనుకంజ వేస్తాయి. హిట్లరు రాకతో యూరవు పరిస్థితులన్నీ మారిపోయినయి. జర్మనీ ఆయుధములను సమకూర్చుకొని యుద్ధ సన్నద్ధ మగుట వల్ల ఫ్రాంసుకు భయ మెక్కువయినది. జర్మనీ విదేశ రాజ్యాంగ వైఖరి "నా పోరాటము" అను హిట్లరు పుస్తకములో స్పష్టముగా వ్రాయబడి ఉన్నది. యూరపులోని చిన్న దేశములను ఒకటి తరువాత ఒకటి జయించి, ఇంగ్లండుతో స్నేహముగా ఉండి, ఫ్రాంసును జయించాలి అని హిట్లరు ఉద్దేశం. అంతే గాక కమ్యూనిస్టు సమాజాన్ని నెలకొల్పుతూన్న సోవియటు యూనియనును నాశనం గావించాలని కూడ హిట్లరు, పూనుకొన్నాడు.

జర్మనీ నానాజాతి సభ నుండి తొలగింది. ఆయుధ విసర్జన సభ భగ్నమయింది. హిట్లరు తిరిగి జర్మనీలో ఆయుధాలను విపరీతంగా వృద్ధి చేయ సాగాడు. వెర్సెయిల్సు సంధికి వ్యతిరేకంగా. లొకార్నోకు వ్యతిరేకంగా రైన్లాండును ఆక్రమించి కోటలను కట్టడానికి మొదలు పెట్టాడు.ఫ్రాంసు వీని నన్నింటిని చూచి భయపడింది. తన సంరక్షణ కోసం సోవియటు యూనియను సహాయం కోరసాగింది. కాని ఫ్రెంచి బూర్జువా ప్రభుత్వం ఒక వైపు జర్మనీని చూచి భయపడుతున్నా, రెండవ వైపు సోవియటులు కార్మిక ప్రభుత్వమగుటచే దానితో కలియడానికి సంకోచిస్తూనే ఉండ సాగింది. ఇటలీతో రాయబారాలు, సాగించసాగింది. మరియొకవైపు సోవియటు ప్రభుత్వంతో 1935 లో ఒడంబడిక చేసుకొన్నది.

ఈ ఒడంబడిక ప్రకారము మరి యేదేశమైనా వీనిపై దండెత్తినపుడు ఒకరికొకరు సైనిక సహాయము చేసుకోవాలి. అయితే ఈ రెండు దేశాలలో ఏదేశమైనా మరియొక దేశముపై దండెత్తినచో ఈ ఒడంబడిక రద్దు అయినట్లే భావించబడుతుంది. జర్మనీని అనేక పర్యాయాలు ఈ రెండు దేశాలు, ఇట్టి సంధియే చేసుకోమని కోరాయి. కాని జర్మనీ నిరాకరించింది. దీనిని బట్టే జర్మనీకి వ్యతిరేకంగా గాక ఆత్మ రక్షణ కోసం శాంతి రక్షణ కోసం ఈ ఒడంబడిక సోవియటు ప్రభుత్వం చేసుకొందని స్పష్ట మవుతుంది. కాని ఒడంబడికను, 1936 మే నెలలో బ్లూమ్, పాప్యులరుఫ్రంటు ప్రభుత్వం వచ్చేవరకు ఫ్రెంచి ప్రభుత్వం పార్లమెంటుచే అంగీకరింప జేయలేదు.

ఇంగ్లండు, జర్మనీ ఫాసిస్టు ఆశయములకు మొదటి నుంచి తోడ్పడుచున్నది. కారణములు మూడు. (1) యూరపులో ఫ్రాంసు బలమునకు పోటీగా జర్మనీని తయారుచేయుట, (2) ఫాసిస్టు దేశములో అణగ ద్రొక్కబడిన ప్రజాసామాన్యం చివరకు ప్రభుత్వమును పడత్రోయక తప్పదు. కనుక జర్మనీలో హిట్లరు ప్రభుత్వము నాశనమయితే, తరువాత వచ్చే ప్రభుత్వము తప్పక కమ్యూనిస్టు అగునని, వెంటనే యూరపు అంతా కావచ్చునని, అప్పుడు ఇంగ్లండుకు, బ్రిటిష్ సామ్రాజ్యమునకు ముప్పు వాటిల్లునని, ఇంగ్లండు ఉద్దేశ్యము. అందువల్ల హిట్లరు అధికారమును యెక్కువ చేయుటయే మేలని ఇంగ్లండు ఉద్దేశ్యము. (3) సోవియటు ప్రభుత్వాన్ని నాశనముచేయని యెడల దీనినిచూచి కాలనీలలోని ప్రజాసామాన్యము తిరుగబడిన బ్రిటిష్ సామ్రాజ్యమునకు అపాయకరమని బ్రిటన్‌కు తెలియను. కనుక ఫాసిస్టు జర్మనీయొక్క యుద్ధ ప్రయత్నములన్నీ సోవియట్ యూనియన్ వైపు మరల్చి ఇతర కాపిటలిస్టు దేశముల సహాయముతో సోవియటుయూనియన్‌ను నాశనము చేయవలెనని కూడా ఇంగ్లండు ఉద్దేశ్యము.



## అబిసీనియా స్పెయిను యుద్ధాలు.

ఫ్రాంసు, జర్మనీల అండ చూసుకొని 1922 లో స్థాపించబడిన ఇటలీ ఫాసిస్టు ప్రభుత్వం 1935 లో అబిసీనియాపై దండెత్తింది. జాతిసమితిద్వారా సోవియట్ యూనియన్, ఇంగ్లండు, జర్మనీ, ఇటలీల నిజ స్వభావమును ఎత్తులను ప్రపంచమునకు వెల్లడించి ఫాసిస్టు వ్యతిరేక పోరాటం నభివృద్ధి చేయుటకు తోడ్పడెను. తరువాత 1936 జులైలో స్పెయిన్ యుద్ధం వచ్చినప్పుడు ఇటలీ జర్మనీలు విద్రోహులకు సైనిక సహాయంకూడ చేశాయి. స్పెయిను ప్రభుత్వానికి ఇంగ్లండు ఫ్రాంసులు నష్టకరమైన తటస్థవిధానమును ప్రవేశపెట్టి దానిని పట్టుకొని నేటికిని వ్రేలాడుతున్నాయి. సోవియటు ప్రభుత్వము సాధ్యమైనంత వరకు అన్నివిధములా స్పెయిన్ ప్రజా ప్రభుత్వమునకు సహాయముచేసి, ఈ రోజువరకు ( 2 సంవత్సరముల 3 నెలలకు పైగా ) ఓడిపోకుండ, ప్రభుత్వమును నిలబెట్టింది.

హిట్లరు, ముసోలినీలు యూరపునంతా స్వాధీనము చేసుకొని, ఇంగ్లండు, ఫ్రాంసుల సహాయముతో తూర్పు ప్రాంతములలో జపాను సహాయముతో, సోవియటు యూనియన్‌ను సోషలిజమును నాశనం చేయుటకు ప్రయత్నిస్తున్నారు. సోవియటు యూనియన్‌కు వ్యతిరేకముగా జపాన్, ఇటలీ, జర్మనీ, ఒక ఒడంబడికను చేసుకొన్నాయి.

ఈ లోపల, 1931 చైనాలోని మంచూరియాను కబళించి దానితో ఊరుకొనక, జర్మనీ, ఇటలీలతో ఒడంబడిక చేసుకొన్న పిదప 1936 ఉత్తర చైనాపైకూడా దాడివెడలిందిజపాన్. జంగ్‌కైషేకు 1927 నుండి చైనా సోవియటులతోను, చైనాకమ్యూనిష్టు పార్టీలతోనూ యుద్ధముచేసాడు. జపాను ఈ విధంగా రోజుకు రోజుకు కబళించడానికివస్తే, జపానుపై యుద్ధం ప్రకటించి పోరాడుతూవున్న చైనా సోవియటులపైనను కమ్యూనిస్టుల పైనను, యుద్ధము చేయుటను చైనాప్రజాభిప్రాయం సహించజాలకపోయింది. జంగ్‌కైషేక్ ప్రజాభిప్రాయానికి లొంగి, చైనా కమ్యూనిస్టులతో యునైటెడ్ ఫ్రంట్ ఏర్పరచు కొన్నాడు. చైనా కమ్యూనిస్టులు తమ ప్రభుత్వాన్ని చైనా రిపబ్లికుతో కలిపి, జంగ్‌కైషేకు యాజమాన్యాననే జపానులో యుద్ధం చేయసాగారు. దీనితో చీనా రష్యాతో తిరిగి స్నేహసంబంధాలు ఏర్పరచుకుంది. చీనాకు గావలసిన ఆయుధసామాగ్రిని, టెక్నీషియన్సును, విమానాలను సోవియటు యూనియన్ పంపిస్తూంది,

హిట్లరు ఈ లోపల అష్ట్రియాను ఆక్రమించుకొన్నాడు. 1938 మార్చి నెలలో, 1938 సెప్టెంబరు నెలలో జెకోస్లోవేకియా యొక్క సరిహద్దులను సంపాదించాడు. జెకోస్లోవేకియాతోకూడ ఫ్రాంసుతో చేసుకొన్నట్లే సోవియటు యూనియను ఒక ఒడంబడిక చేసుకొనియుండినది. కాని జర్మనీ జెకోస్లోవేకియాపయి దండెత్త నవసరములేకనే, ఇంగ్లండు ఫ్రాంసుల ఒత్తిడి వలన, తాము జకోస్లోవేకియాకు సాయంచేయమని బెదరించడంవల్ల మ్యూనికులో సమావేశమైన హిట్లరు,ముసోలినీ, దలదీర్ (ఫ్రెంచి ప్రధానామాత్యుడు) ఛాంబర్లేను ఒడంబడికవల్లా, జెకోస్లోవేకియా ప్రభుత్వంలోని బూర్జువాల ద్రోహంవల్లా, జెకోస్లోవేకియా జర్మనీకి తన సరిహద్దుల నిచ్చివేసింది. దాడివెడలనిదే ఒక్కసోవియటుయూనియను సహాయం చేయడములో అర్ధములేదు. జెకోస్లోవేకియాలోని సరిహద్దులను జర్మనీ, పోలండు,హంగేరీలు అక్రమించుకొన్నాయి, జెకోస్లోవేకియా కేవలం జర్మనీ చేతులో కీలుబొమ్మయింది. దీని వలన బాల్కను రాజ్యాలలో జర్మనీ పలుకుబడి హెచ్చింది. జర్మనీ ఇటలీ, ఫ్రాంసు, ఇంగ్లండులు ఒక ఒడంబడిక రావడానికి ప్రయత్నిస్తున్నాయి. ఈఒడంబడిక సోవియటు యూనియన్ పయి దాడివెడలటానికే. సోవియటుయూనియను యొక్క రాజ్యాంగ వైఖరి నేటివరకు ఈ ప్రధాన దశలను దాటుతూ ఆత్మసంరక్షణ, సోషలిస్టు నిర్మాణాన్ని సాగించుచున్నది.

(1) 1917—22 వరకు. విదేశములు తనపై దాడివెడలుట, ఆహార పదార్ధాలు సైతము రానివ్వక బ్లాకేడు చేయుట. ఈ దశ రపల్లో ఒడంబడికతో ఆఖరయింది.

(2) 1922—25 వరకు. విదేశములతో రాజకీయ సంబంధములను నెలకొల్పుకొనుటకు ప్రయత్నాలు చాలవరకు జయప్రద మయినవి. అమెరికా 1933 వరకు సోవియటు యూనియనును గుర్తించలేదు.

(3) 1925—27 వరకు, పెట్టుబడిదారీ దేశములు ముఖ్యంగా బ్రిటను తనపై దాడి ప్రయత్నాలు చేసిన రోజులు.

(4) 1927-1933 రవకు,ప్రపంచ ఆర్ధిక క్షోభ, ఆయుధ విసర్జన సభలు,

(5) జర్మనీలో హిట్లరు అధికారానికి వచ్చుట, యుద్ధములు, విప్లవ కాలము, నానా జాతి సభ్యత్వము, ఫ్రాంసు జకోస్లోవేకియాలతో ఒడంటడిక, మ్యూనిక్ ద్రోహం వరకు.

ఈ వివిధ దశలను సోవియటు యూనియను ఏవిధంగా గడవ గల్గినది ?

సామ్రాజ్య వాద వ్యతిరేకముల మధ్య గల వైరుధ్యములను ఉపయోగించుకొంటూ అవసరమైతే ఆదేశములతో సంధులు (తాత్కాలికమైన) చేసుకొంటూ సామ్రాజ్యవాద నాశనమునకై పాటుపడడము వలన ప్రతి దేశములోను కష్టజీవుల సానుభూతి, సహాయము పొందుట వలన గడువ గల్గింది. దానిమూలముగా

ప్రపంచ సోషలిస్టు సమాజమును స్థాపించుటయే సోవియట్ యూనియన్ యొక్క ఆశయం. తాత్కాలిక సంధులు చేసుకొనక, చుట్టు ప్రక్కల నున్న కాపిటలిస్టు దేశములతో ఈ రోజు సోవియటు యూనియన్ యుద్ధమునకు దిగినచో, సోషలిస్టు సమాజము యొక్క మొదటి పునాది గూడ నాశనము కాదా? ఇతర దేశములలో కార్మికవర్గ చైతన్యము నభివృద్ధి చేయుట, సోవియట్ యూనియన్ యొక్క ముఖ్య బాధ్యతయై యున్నది. పరస్పర వైరుధ్యములవలన సామ్రాజ్యవాద దేశము లన్నీ ఐక్యమగుట సులభ సాధ్యము గాదు. అయినా సోవియటు యూనియనుపై దాడి వెడలుటకు తాత్కాలికముగా ఒడంబడిన చేసుకొనవచ్చును. కొంతకాలమువరకు పరస్పర భేదాలను పైకి రానివ్వక పోవచ్చును. అంతే గాక సోవియటు యూనియనును రూపు మాపి తమలో పంచుకొని తమ సమస్యలను పరిష్కరించుకొనుటకు ఆలోచించవచ్చును. ఈ ఆలోచనలు సాగునా? అను ప్రశ్నకు జవాబు బ్రిటిష్ ఫ్రెంచి కార్మిక వర్గముల వైఖరిపై ఆధారపడి యుండును. భారతీయులు బ్రిటిషు ప్రభుత్వమును ఈ దేశము నుండి తరుమడానికి చేయు ప్రయత్నములపై ఆధారపడి యుండును. ఈ లోపల సోవియటు యూనియను శాంతియుతమైన తన విదేశ రాజ్యాంగ వైఖరితో, తన బలము నభివృద్ధి చేసుకొనుచున్నది, ఫాసిస్టు మూక దాడిని ఎదుర్కొనుటకు ప్రపంచ విప్లవమును జయప్రద మొనర్చుటకు కావలసిన సన్నాహములు చేసుకొనుచున్నది. ప్రతి దేశములోను కష్టజీవులు తమ విధిని, లాభమును గుర్తించి సోవియటుకు సాయము చేయుదురా?....

——(:)——


## హెచ్చరిక

లేటు మా తండ్రి గారగు బాలేమర్తి లక్ష్మీ నరసింహంగారు రచియించిన పుస్తకములను గురించి, నాకున్నూ, మా తల్లిగారికిన్నీ జరిగిన వ్యాజ్యములో గుంటూరు జిల్లా కోర్టువారు O/S 5/37 రులో ది 1-10-38 న, యిచ్చియున్న రాజీనామా తీర్పు ప్రకారం ¾ వంతు భాగమును అమ్ముకొనుటకు హక్కు కలిగి యున్నాను. కనుక సదరు పుస్తకములు కావలసినవారు నా పేర కూడ వ్రాసి తెప్పించుకొనవచ్చును.

అడ్రసు:—

బాలేమర్తి నాగభూషణరావు,
అరండల్ పేట, గుంటూరు.

## ఉమామహేశ్వర ఫార్మశీ
## గుంటూరు

1. వసంత కుసుమాకరం తులం రు. 40/—
2. సిద్ద మకరధ్వజ „ రు. 40/—2
3. షడ్గుణ బలిజారిత మకరధ్వజ „ రు. 10/—
4. అభ్రక భస్మం 100 పుట రు. 5/—
5. రాయల్ కస్తూరి పిల్సు 50 మా॥ 0-8-0
8. వంగరాజీయ కాంపౌండు పిల్సు 25 మా॥ 1-4-0

ప్రొప్రయిటరు:
యం. అఘోరయ్య అయ్యవారు.

## ప్రకటన

ఆంధ్ర దేశములో 80 సం॥ నుండి విఖ్యాతితో వెలువడుచున్న బాలేమర్తి లక్ష్మీనరసింహముగారి గ్రామకర్ణ (జమీందారి గవర్నమెంటు) మునసబ్ పరీక్షాదర్శిని పుస్తకముల యందలి కాపీరైటు హక్కులన్నీ మావని యు లోగడ వార్తాపత్రికలలో ఎడ్వర్టయిజు చేసిన బాలేమర్తి నాగభూషణరావు సదరు పుస్తకములను అచ్చువేయించి ప్రచురణ చేయకుండా శాశ్వత ఇంజెక్షను ఇచ్చుచూ గుంటూరు జిల్లా కోర్టువారు O/S 5/37 రులో 1-10-38 తేదీ డిక్రీ యిచ్చియున్నారు. కనుక సదరు పుస్తకములు వలయువారు యీ క్రింది విలాసమునకు వ్రాయవలెను.

బాలేమర్తి శేషమ్మ,
ప్రొప్రయిటరు,
పోస్టు బాక్సు నెం 36 అరండల్ పేట,
గుంటూరు.




# సోవియట్ ఆరోగ్య రక్షణ



కామ్రేడ్ పి. అనంతం

సోవియట్ ప్రభుత్వము స్థాపించబడి 20 సంవత్సరములైంది. ఈ 20 సంవత్సరములలో, 17 కోట్ల సోవియట్ ప్రజల జీవితాలను పూర్తిగా మార్చివేసింది ప్రభుత్వం. వివిధ శాఖలలో కొద్ది కాలములో జరిగిన మార్పులు అత్యద్భుతము లైనవి.

ఆరోగ్య శాఖలో జరిగిన అభివృద్ధి, ఇతర దేశముల కాదర్శప్రాయమై యున్నది,

వ్యక్తుల ఆరోగ్యమును కాపాడుటయే గాదు సోవియట్ ప్రభుత్వము యొక్క బాధ్యత. ఇతర దేశములో మాదిరి, ధనవంతుల ఆరోగ్యమునకు మాత్రమే ప్రాముఖ్యత నివ్వదు సోవియట్ యూనియన్ యొక్క వైద్యశాఖ. ఆర్ధికముగా హెచ్చుతగ్గు లున్నప్పటికి, ప్రతి వ్యక్తి యొక్క ఆరోగ్యమునకు సమాన ప్రాముఖ్యతనిచ్చి, నూతన తేజస్సుతో కూడిన ఆరోగ్యవంతమైన జాతిని పునర్నిర్మించుటయే సోవియట్ ప్రభుత్వము యొక్క ఆశయం. అందువల్ల జాతి, మత, పురుష, స్త్రీ, భాగ్యము పేదరికము అనేక భేదములు పాటించక, రోగు లందరికి ఉచిత చికిత్స నిస్తుంది సోవియట్ ప్రభుత్వం.

సోవియటు యూనియన్ ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ నికొలై అలెగ్జాండ్రొవిష్ సిమాష్కో, 1907-17 వరకు 16 సంవత్సరంలు లెనిన్‌తో పాటు ప్రవాసము ననుభవించెను. అతడు అధికారమునకు వచ్చిన వెంటనే, వైద్య శాఖనంతా 'సోషలైజ్' చేశాడు. అనగా, ప్రైవేట్ ప్రాక్టీస్ నిర్మూలము చేయుటకై, వైద్య శాఖనంతా ప్రభుత్వమే వశముచేసుకొని ప్రజలందరికి ఉచిత చికిత్స నేర్పాటు చేయుటలేదు. జారు కాలమునుంచి పాతుకొని పోయిన ఆరోగ్యమును, దీర్ఘ వ్యాధులకు, జాడ్యములను, విష రోగములను నిర్మూలించుటయేగాక, సౌష్టవమైన ఆరోగ్యము (postive health) ను కలుగజేయుట మొదలు పెట్టినది. ఆరోగ్య శాఖ మొదటి 3 సంవత్సరములతో కరువు, అంతర్యుద్ధాలవల్ల అభివృద్ధి ఎక్కువ కాలేదు. 1921 నుంచి, తీవ్రమైన మార్పులు వచ్చినవి. హాస్పిటల్స్, శానిటోరియములు, మందుల షాపులు అన్నీ ప్రభుత్వ పరమయినవి. డాక్టర్లు, నర్సులు, అందరూ ప్రభుత్వోద్యోగులయినారు. పట్టణములకేగాక, పల్లె ప్రాంతములన్నిటికి చికిత్స నందజేయుటకై వేయబడిన ప్లానులు అమలులోకి వచ్చినయి. బిడ్డల పోషణ రక్షణకు, వ్యాదుల నిరోధనకు, క్షయ మొదలయిన ప్రత్యేక జాడ్యములను నిర్మూలించుటకు తగిన యేర్పాట్లు సోవియట్ యూనియనులో అన్ని దిక్కులా, పూర్తి అయినవి.

## చికిత్స ఏర్పాట్లు

సోవియట్ యూనియన్‌లోని ప్రతి రిపబ్లిక్‌నకు ప్రత్యేక ఆరోగ్యశాఖ గలదు. ఈ ఆరోగ్య శాఖలకు ప్రత్యేక ఆరోగ్య శాఖాధికారులు (commissars) గలరు. ప్రతి అధికారి క్రింద ఆ రిపబ్లికునకు చెందిన సుప్రీం మెడికల్ కౌన్సిల్ ఉన్నది. 1934 వరకు ఈ కౌన్సిల్‌లో ప్రత్యేక పరిజ్ఞానము గలగినవారు 30 వైద్య నిపుణులు మెంబర్లు ఉండేవారు. 1934 తరువాత ఈ మెంబర్ల సంఖ్యను 70 కి హెచ్చించారు. వీరందరు గూడ వివిధ వైద్యశాస్త్ర సంస్థ యొక్క డైరక్టర్లయి ఉంటారు. వైద్యశాఖ యొక్క పనినంతా 30 ప్రత్యేక శాఖలక్రింద అన్ని వ్యాధులకు, అన్ని ప్రాంతములలోను చికిత్స గరపుటకు వీలుగ సాగించబడినది.

సోవియట్ ప్రభుత్వమునకు పూర్వము జారు కాలములో 13000 డాక్టర్లు ఉండేవారు. అనగా 7000 ప్రజలకు ఒక డాక్టరుగూడ లేడన్నమాట. అదిగూడ పట్టణాలలో. పల్లెటూళ్ళలో 21000 మందికి ఒక డాక్టరుగూడ ఉండేవాడు కాదు. ఇప్పుడో! 1937 నాటికే సోవియట్ యూనియన్‌లో 9,70,000 డాక్టర్లు తయారైనారు. ఈరోజు ప్రతి 2000 మందికి ఒక డాక్టరు ఉన్నాడు. ప్రతి వెయ్యమందికి, లేక 250 కుటుంబములను ఒక ప్రభుత్వపు డాక్టరును సప్లయి చేయుటకు ప్రభుత్వము తగిన ఏర్పాటులను చేయుచున్నది. ఇందుకొరకు దేశమునకంతకు కావలసిన డాక్టర్ల సంఖ్యను, ప్లాను ప్రకారము, నిర్ణయించి అందరికీ స్కాలర్షిప్పుల నిచ్చి, ఉచిత అధ్యాపన ద్వారా వైద్య పాఠశాలలో ప్రతి సంవత్సరము వేలకువేలు డాక్టర్లను తయారు చేస్తున్నది ప్రభుత్వం. ఉత్సాహవంతులై, వైద్య శాస్త్రమునకు తగినటువంటి యువకులు ట్రేడ్ యూనియన్ల నుంచి, ఇతర సంస్థలనుంచి తీసుకోబడతారు. 1935 నాటికే స్థాపించబడిన 62 వైద్య పాఠశాలల్లో ప్రతి సంవత్సరము 9000 మంది క్రొత్త విద్యార్థులను చేర్చుకొనేవారు. మొత్తము వైద్యశాస్త్ర విద్యార్థుల సంఖ్య 50000. జారు కాలమునాడు



1871 లో పారిస్ కమ్యూన్ (ఫ్రెంచివిప్లవము)లో పాల్గొన్న 'లీజియు'న్ కువిశ్రాంతి ఇస్తున్న నేటి సోవియటు ఉద్యానవనం!

1912 లో 6 వైద్యపాఠశాల ఉండేవి రష్యను సామ్రాజ్యమంతా వెదకిచూస్తే!

వైద్య పాఠశాలలకు తోడుగ వైద్య శాస్త్ర పరిశోధన (**Medical Research**) సంస్థలు స్థాపింపబడినవి. పరిశోధనకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తుంది సోవియట్ ప్రభుత్వం..

## హాస్పిటల్స్, చికిత్సాలయములు

ఒక్క రష్యను రిపబ్లిక్‌లోనే 1935 వ సంవత్సరమునకే 6 వేల హాస్పిటల్స్ నిర్మించబడినవి. రష్యాలోని పెద్ద పట్టణములు అనగా మాస్కో, లెనిన్ గ్రెడ్‌లోని పెద్ద హాస్పిటల్స్ ప్రపంచములో కల్లా పెద్దవి. ఇతర దేశములలో అంత పెద్ద హాస్పిటల్స్ ఎక్కడ లేవు. ఒక్కొక్క హాస్పిటల్‌లో 2000 "**బెడ్స్**" (పడకలు) ఉన్నాయి. వైద్య చికిత్సగూడ **చాలా** నిపుణ మయినదని ఇతర దేశముల **డాక్టర్లు** ఒప్పుకొని యున్నారు.

మాస్కో, లెనిన్ గ్రాడ్ పట్టణముల **లోని** ప్రజసంపదిని, కొన్ని, "యూనిట్లు" క్రింద భాగించారు. ప్రతి యూనిట్‌లోను 2000 మొదలుకొని 3000 వరకూ ఉంటారు. ప్రతి యూనిట్‌కు యిద్దరు లేక ముగ్గురు డాక్టర్లు, కావలసిన నర్సులు, ఏమగాక ఆరోగ్య పరీక్షకులు (**Health Visitors**) ఉంటారు. లెనిన్‌గ్రాడ్‌లో పెద్దవాళ్ళకు ప్రత్యేక డాక్టరు. పిల్లలకు ఇంకో డాక్టరు. మాస్కోలో చికిత్స ఏర్పాట్లు ఇంకా ఆశ్చర్యమును కలుగ జేస్తాయి. తల్లులకు మూడు సంవత్సరాల క్రింద పిల్లలకు కలిసి ఒక డాక్టరు. 3—16 సంవత్సరముల వయస్సుగల గల వారికి ఇంకో డాక్టరు. మిగిలిన వారికి ఇంకొకరు. అవసరమైతే ఇంటికి వెళ్ళి ఉచిత చికిత్స నిచ్చుటకు ఏర్పాట్లున్నాయి. ఇంతేగాక ప్రతి వైద్యశాలలలోను ఆరోగ్యమునకు సంబంధించిన బొమ్మలు, ఛార్టులు, గోడలనిండా అతికించబడి ఉంటయి. సంతాన నిరోధము, నిరోధమునకు అవసరమైన పనిముట్లు వాటిని ఉపయోగించే విధములను గురించి చెప్పుటకు ప్రత్యేకస్థలము ఉంటుంది. ఈ ఏర్పాట్లు, సోవియట్ యూనియన్‌లో అన్ని హాస్పిటల్స్‌లోను గలవు.

ఇంగ్లండు, అమెరికా మొదలయిన దేశములలో "చికిత్సాలయములు" అనే పదం, హాస్పిటల్స్ మటుకే ఉపయోగిస్తారు. సోవియట్ యూనియన్‌లో చికిత్సా గారమునకు ప్రత్యేక అర్థమున్నది. ప్రతి ఫ్యాక్టరీకి, పరిశ్రమాలయమునకు ఒక్కొక్క చికిత్సాలయ ముంటుంది. ఇతర దేశములలో ఎక్కడా లేని ఏర్పాటు ఇది. అక్కడ పనిచేయు వారులందరికి. అవసరమైతే, నిమిషములమీద చికిత్స నిచ్చుటయే వీటి ఉద్దేశ్యం.

పల్లెటూళ్ళలోగూడ, రైతుల అందుబాటులో వెంటనే చికిత్స జరుపుటకు, అవసరమయిన చికిత్సాలయములు స్థాపింపబడినవి. పూర్వము, కాలు విరిగితే, చికిత్సకొరకై, కనీసము రెండు రోజులయిన ప్రయాణము చేయవలసి వచ్చేది పల్లెలలోని ప్రజలు.

## విమాన చికిత్సాదళం

## The Flying Squad

పల్లెటూళ్ళ యందు చికిత్స జరుపుటకై అర్జంటు కేసులలో, విమానములపై డాక్టర్లు, నర్సులు, అవసరమైన పనిముట్లు, మందులు తీసుకొని వెళ్ళి చికిత్సచేయుటకు విమానములు ఏర్పాటు చేయబడినవి. విమానములమీద వెళ్ళినప్పటికి చికిత్స ఉచితమనే సంగతి మరచి పోగూడదు! ఏవిధమైన దోపిడిలేని సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్‌లలోని ఈ ఏర్పాట్లు కాపిటలిస్టు దేశములలో సాధ్యమగుననే మాట కల్ల.



## ప్రత్యేక వ్యాధులు ; క్షయ

క్షయ, ప్లేగు, టైఫస్, స్ఫోటకం (**Small Pox**) సుఖవ్యాధులు, మలేరియా మొదలైన ప్రత్యేక వ్యాధులు నివారించుటకు ఎక్కువ శ్రద్ధ తీసుకుంటుంది ఆరోగ్యశాఖ. వీటిని గురించి, వ్యాధి నిరోధన (**Prevention**) కై మార్గములు చూపు పరిశోధనా సంస్థలు విరివిగా స్థాపించబడినవి. ఒక్క క్షయ వ్యాధిని గురించి ప్రభుత్వము ఎంత శ్రద్ధ వహించినదో ఈ క్రింది సంఖ్యలు తెలియజేస్తయి.

క్షయ నివారణా వైద్యశాలలు

| | సంఖ్య |
|---|---|
| 1918 | 4 |
| 1933 | 404 |

క్షయవల్ల కలిగిన మరణములు 10,000 కు

| | |
|---|---|
| 1920 | 40 |
| 1924 | 16 |
| 1931 | 11 |

ఇప్పుడు ఇంకను తగ్గినవని తెలుస్తుంది

క్షయ చికిత్సాలయములకు, ఇతర హాస్పిటల్స్‌కు భేదము కలదు. రోగియొక్క వృత్తి ఆర్థిక పరిస్థితులు మొదలైన విషయములన్ని గ్రహించి, నివారణకై అవసరమైతే వేరు వృత్తిని కలుగజేస్తుంది ఈశాఖ. మందులకు కావలసిన ధనసహాయము నిస్తుంది. అతడు పనిచేయు తావులలో అనారోగ్య పరిస్థితులున్నచో, వాటిని వెంటనే నిర్మూలముచేయుట కూడ, చికిత్సాధికారుల బాధ్యతదే! ఇంతేగాక నిరంతరం క్షయ నివారణపై ఉపన్యాసములు ఏర్పాటు చేయబడును. క్షయ రోగులకు సముద్రము ప్రక్కనుండుటకు శానిటోరియములు, సూర్యకిరణ స్నానములు, శుభ్రమైన గాలివీచు తావులు ఉన్నాయి.

| క్షయ రోగమునకు | 1928 | 1933 |
|---|---|---|
| హాస్పిటల్స్ | 2757 | 4007 |
| శానిటోరియములు | 10,505 | 15,242 |
| ఇతర అనుకూలమైన తావులు | 7,637 | 10181 |

## రాత్రులందు శానిటోరియం.

పైన చెప్పబడిన నివారణ పద్ధతులే ఆశ్చర్యమును కలుగజేస్తయి. ఇతర దేశముల ఇంత ప్రమాణములమీద క్షయ నివారక ఏర్పాట్లులేవు. సోవియట్ యూనియనులోని "రాత్రి శానిటోరియములు" ఇంకే దేశములోను లేవు.

సాధారణముగా క్షయ మొదలయిన అంటు వ్యాధులు క్రిక్కిరిసి ఉన్న పెద్ద పట్టణములలో బయలుదేరును. ఇక్కడ నివసించు వారికి ఏ జబ్బు అయినా వస్తే రాత్రి 12 గంటలయినా ఆరోగ్య ప్రదేశములో నుండుటకై, రాత్రులకై "రాత్రి శానిటోరియములు" ఏర్పాటు చేయబడినవి. పగలు పని కాగానే, అస్వస్థగా ఉన్న వ్యక్తి, రాత్రి శానిటోరియమునకు వెళ్ళినచో, వేడినీరు స్నానం, శుభ్రమయిన, దుస్తులు, ఆరోగ్యమునిచ్చు భోజనము ఇవ్వబడును. తరువాత జీవితమునకు హాయి కలుగజేయు సంగీతము విన వచ్చును. లేనిచో ఉపన్యాసములు విన వచ్చును. శుభ్రమయిన గాలి వీచు గదులలో, కొన్ని గంటల కాలము వస్తే మరచిపోవునట్లు నిద్ర పోవచ్చును. ఈ రాత్రి శానిటోరియములయొక్క విలువ ఇంతంతయని చెప్ప నలవికాదు. ఆరోగ్యము కలుగు వరకు అస్వస్థతగాఉన్నను, లేక బలహీనముగాఉన్నా, వీటిలోనే ఉండ వచ్చును. ఒక్క మాస్కో పట్టణములోనే ఇటువంటివి 10 శానిటోరియములు కలవు. విప్లవమునకు పూర్వము కట్టబడిన భాగ్యవంతుల సౌధములన్నీ, ఈ విధముగా ప్రజలందరికి ఉపయోగపడుచున్నాయి!

## వైద్యశాస్త్ర పరిశోధన ;

## ఇతర విషయములు.

శాస్త్ర పరిశోధనకు ఎంతో శ్రద్ధ తీసుకొను సోవియట్ ప్రభుత్వం, ఒక రష్యను రిపబ్లిక్కు లోనే 200 పరిశోధనాలయములను స్థాపించింది. వీటిలో శరీరమునకు ముఖ్యముగా మెదడుకు సంబంధించిన విషయము లెన్నో పరిశోధింపబడును. శాస్త్ర పరిశోధనలే మానవాభివృద్ధికి నిజముగా తోడ్పడును. పరిశోధన లేనిచో అభివృద్ధియే ఉండదు; ఏ శాఖలోనైనా అందువల్లనే, నూతన మానవ సమాజమును స్థాపించుటకు పూనుకొన్న సోవియట్ ప్రభుత్వం, మానవుని వివిధ వ్యాపృత్తులను గురించి పరిశోధనకు ఏర్పాట్లు చేసింది. వ్యక్తి ఆరోగ్యముపై జాతి ఆరోగ్యము ఆధారపడి యున్నది. నూతన సోషలిస్టు సమాజమును స్థాపించుటకు ఆరోగ్యవంతమైన సోవియట్ ప్రజలుండాలి. కాపిటలిస్టు దేశములలో 100 కి 99 మందికి ఆరోగ్యములేదు; అభివృద్ధి లేదు. సోవియట్ యూనియనులో ఆరోగ్యము కలుగజేయు ఏర్పాట్లవల్ల అన్ని విధముల సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా అభివృద్ధి కలుగుచున్నది ప్రజలందరి క్షేమం కోసం ప్రజా ప్రభుత్వమైన సోవియట్ ప్రభుత్వం ఉన్నది కాబట్టి. ఇతర దేశములలో కొద్దిమంది ధనవంతుల ఆరోగ్యమును కాపాడుటకు మాత్రమే సాధ్యమవుతుంది. అచ్చటనున్న కొద్ది హాస్పిటల్స్, వైద్యశాస్త్రం, శాస్త్ర పరిశోధనలు ద్వారా అనారోగ్యకరమైన పరిస్థితులు కాపిటలిస్టు దేశములలో ప్రతిచోట ఎవరికైనా కనబడేటంత స్పష్టముగా తాండవమాడుతూ ఉంటయి. సోషలిస్టు దేశములోనో ఎక్కడ చూసినా ఆరోగ్యమే!

# కజాక్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

★ ముఖ్య పట్టణం — ఆల్మా — అటా




పూర్వం ఎడారులుగా గాన్పించే యీ దేశంలో నేడు రైలు మార్గాలు వేశారు. గోధుమ, వడ్లు విరివిగా పండుతున్నాయి. ఈ పంటలలో సోవియట్ యూనియన్లో మూడవస్థాన మాక్రమించు తూంది.

నూటికి ఒకరైనా చదువురాని ప్రజలలో ఇపుడు 10 లక్షల విద్యార్థులు వివిధ విద్యాలయాల్లో చదువు కొంటున్నారు.

మాంసం, చేపలు నిలువచేయు పరిశ్రమ, పొగాకు, పంచదార పరిశ్రమలు వృద్ధిపొందాయి.

ఆవలిస్తాడు. "ఇక పడుకుందాం. ఆఁ? ఎందుకనో ఇవాళ చాల డల్‌గాఉంది." అని పడక పైకి వెళ్ళిపోతాడు.... అని వ్రాస్తే.

ఇంకా ఉద్వేగ భావ కల్పనాశక్తి కోసం ఆక్రందన!

ఔను, జెంటిల్‌మన్. కామ్రేడ్స్-ఔను. ఆ భావనా శక్తిని మనమెక్కడి నుంచి పొందాలి? అది వాస్తవిక జీవనానికి ఎలా ఉపయుక్త పరచాలి? చెప్పండి. మిమ్మల్ని బ్రతిమాలుతాను. ఈ కాస్త భిక్ష మాకు దయ చేయండి.

మనమిక పట్టణానికి వెళ్ళదాం. మంచి కాంతివంతంగా విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. తాము మనుష్యుల మనే ధీమాను గుర్తించుకొని జనం అటూ ఇటూ, వెనక్కీ, ముందుకూ నడుస్తున్నారు. అక్కడక్కూడా ఉద్వేగ భావకల్పనాశక్తి శూన్యం గనుక డల్‌గా ఉంది.

అచ్ఛా! పౌరులు నడుస్తున్నారు గదా! ఎవడో ఒకడి వెనుకబడు పాఠక మహాశయా! ఫలితం? నాన్సెన్సు....

వాడెవరి దగ్గరో 3 రుబుల్సు అప్పు తెచ్చికొంటానికో, లేక ఏదో స్త్రీని కలిసికోడానికో వెళ్ళుతున్నట్లు కన్పిస్తుంది.

అతడు వస్తాడు. తాను ప్రేమించిన స్త్రీకి ఎదురుగా కూర్చుని ప్రేమను గూర్చి ఏదో వాగుతాడు. లేదా మాటాడకుండానే కూర్చుంటాడు. లేక ఆమె భుజంపై చేయివేసి, ఆమె కళ్ళలోకి చూస్తాడు.

లేదూ-ఇంకొకడు తన భూస్వామితోపాటు కూర్చుంటాడు. అతని చేతిలో ఒక గ్లాసెడు టీ వుంటుంది. దానిలో తన నీడను చూచుకొని "ఏం ముఖం! అంతా ముడతలు పడింది" అని అనుకుంటాడు. టేబిల్‌క్లాత్ మీద ఒక 'జామ్' ముక్క పడేసి పండ్లిగిలిస్తూ, టోపీని అటూ ఇటూ సర్దుకొని వెళ్ళిపోతాడు.

వాణ్ణి - ఆ వెధవను - అడుగు ఎందుకు వచ్చాడో? వాడి రాకలో జగత్ సంబంధ భావంగాని, మానవత్వానికి కలిగే మంచిగాని ఏమున్నది? ముందు అతనికి తెలుసునా?....

పట్టణ జీవితంలోని ఈ 'డల్' చిత్రంలో రచయిత,తన లాంటి-అంతగాప్రాముఖ్యతలేని-మనుష్యుల గురించే చిత్రించు తున్నాడు. కాని, పట్టణాల్లో తిరిగే (ఏమంత ముఖ్యమైన పనిమీద తిరుగుతారో దేవుడికి తెలియాలి.) రాజకీయ వేత్తల గురించిగాని, విద్యాధిపతుల గురించిగాని వ్రాయడు.

రచయితకు వీరు మనస్సులో ఉండనే ఉండరు. ఉదాహరణకు ఆ స్త్రీ భుజంపై చేయి వేయడం గాని, టీలో తన నీడను చూచుకోవడంగాని వ్రాసినపుడు-పై రాజకీయ వేత్తలు రచయిత మనస్సులో లేనేలేరు. రాష్ట్ర జీవిత వాస్తవాన్ని ఛిన్నా భిన్నం గావించాడని తిట్టే అహంకార పూరితులయిన, విమర్శకులకోసరమే ముందుగా రచయిత, తన రచనను రద్దుపఱచుకుంటాడు.

ప్రియ విమర్శకులారా, రచయితలు విషయాలను-వాస్తవాన్ని-ఛిన్నా భిన్నం గావించడములేదు; అందుకు వాళ్ళకి డబ్బివ్వడంలేదుగా!

కాని నిజానికి ఇది రాష్ట్ర పట్టణ జీవిత చరిత్రను మార్చదు. సమస్యను పరిష్కరించదు.

రచయిత ఒకానొకప్పుడు ఒక పట్టణవాసిని ఎరుగును. అందరిలాగానే ఆ నివాసి ఉంటున్నాడు. అతడూ భోంచేస్తాడు. త్రాగుతాడు. తాను ప్రేమించిన స్త్రీ భుజంపై చేయివేసి ఆమె కళ్ళల్లోకి చూస్తాడు. టేబిల్ క్లాత్‌పైని "జాం" ముక్క పడవేస్తాడు. 3 రుబుల్సు అప్పు తీసుకొని ఎగగొడతాడు....

అతణ్ణి గురించే ఈ చిన్నకథ వ్రాయబడినది. లేక వాడిదగ్గర నుంచి బలవంతంగా 25 రుబుల్సును గుంజిన వెధవ ఘటనను ఒకదాన్ని గురించి వ్రాయబడిం దనుకోండి.

మనమీ ఘటనను కల్పనాశక్తితో రంగులు వేయవలెనా? దానిచుట్టూ మనం ఒక వినోద వివాహ ఉదంతం అల్లవలెనా? అక్కర్లేదు. దాన్నిగురించి ఫ్రెంచివాళ్లను వ్రాయమనండి. మనం మన కథను నెమ్మది నెమ్మదిగా కొద్ది కొద్దిగా రష్యా జీవిత ఘట్టాలతో కాలాన్ని కలిపి నిర్మించుదాం.

ఎడ్వెంచర్లు, ఆహ్లాదకరమైన విషయాలతో గూడిన ఉద్వేగ భావ కల్పనాశక్తి కోసం పాఠక మహాశయుడు లొట్టలువేస్తుంటే అతడు పరదేశ రచయితల కోసం వెదుక్కోవాలి.

## II

ఈ చిన్ని కథ బోరిస్ ఇవనోవిచ్ కోటోఫెయెవ్ యొక్క సంపూర్ణ జీవిత వివరాలతో ప్రారంభ మవుతుంది.

బోరిస్ వృత్తిలో గాయకుడు. ఆర్కెస్ట్రా స్వర మేళనంలో ఒక వాయిద్యం వాయించాడు. గుండ్రని భుజాలూ-జారిపోయిన దవడా గల ఓ మనిషి ఆర్కెస్ట్రా మధ్య కుడి ప్రక్కగా కూర్చొనడం. పాఠకుడు గమనించే ఉండాలి. ఆర్కెస్ట్రా మధ్యను కొంచెం కుడి ప్రక్కగా కూర్చుని అవుసరం వచ్చినపుడు తన వాయిద్యాన్ని విషాదంగా వాయిస్తాడు కండక్టర్ సాధారణంగా తన కుడి కన్నును గీటుతాడు గుర్తుగా.

కొన్ని వృత్తులు నిజంగా లెక్కింప దగనవి. ఉదాహరణకి ఒక మనిషి ఒక తాటిపైన నడవడానికి యత్నించాలి? ముక్కుతో ఏందుకు ఈల వేయాలి? వాయిద్యం వాయించాలి.

కాని బోరిస్ అంత పిచ్చాడు కాడు. మంచి హృదయ ముంది. సెకండరీ విద్య అభ్యసించాడు.

అతడు పట్టణ సమీపంలో ప్రకృతి యొడిలో నివసించాడు. ప్రకృతి అంత పెద్ద అద్భుతంగా లేదుకాని, ప్రతి ఇంటి ముందూ ఒక తోట ఉంది. గడ్డి కందకాలు, పొద్దు తిరుగుడు పూవు విత్తనాల పొట్టు పడివున్న కొయ్య బెంచీలు, దానిని చాలా ఆకర్షవంతంగా చేశాయి. ఆనందాన్ని చేకూర్చాయి.

వసంత ఋతువులో మరీ కన్నుల పండువుగా ఉంటుంది.

బోరిస్, లుకేరియా ఇంట్లో నివసించుతున్నాడు.

ఒక చిన్న కొయ్య ఇల్లు: దానికి పసుపు రంగు: ఊగులాడుతున్న కంచె, పసుపు రంగు పూసిన ఒక పెద్ద ముసలిగేటు, వెనుక ఒక పెరడు. ఈ పెరట్లోనే, ఒక చిన్నపాక ఉంది. విరిగిపోయిన పళ్ళతో ఒక దంతి. ఒకటి "కాథరిన్" కాలంనుండి పడివుంది. అదొట్లోనే మరొక బండి చక్రం, ఒక బండ ఉన్నాయి.

మెట్లల్లో అడుగు మెట్టు కాస్తాలేదు. ఆ మెట్లెక్కిపోతే చాపతోకప్పిన ఒక తలుపు వద్దకు పోతాం. మసక మసకగా ఉండే ఆ నడవలో ఒకపీపా. ఆ పీపాపైన ఒక బల్ల చెక్క దానిపైన చిన్న చెంబు ఉన్నాయి.

మూడు చెక్కలతో అమర్చబడిన ఒక తలుపుంది. మఱుగుదొడ్డికి కొయ్య ముక్క ఒకటి అటూ ఇటూ తిరగడానికి వీలయేటట్లు అమర్చబడి ఉంది. బూజుపట్టిన ఒక అద్దం కిటికీలాగ ఉంది.

ప్రసిద్ధిచెందిన ఒక చిత్రం హృదయానికి ఆహ్లాదం ఇస్తుంది.

ప్రశాంతంగాను, మందంగాను, గందరగోళంలేని ఆ జీవితం చుట్టూ రామణీయకత తిరుగుతూ ఉంటుంది.

ఆ పగిలిపోయిన అద్దం-విసుపుపుట్టే ఆకృతి

గల్గినా—అదికూడా ఏదో ఊహా పరవశతను దింపుతుంది.

ప్రతిసారీ, బోరిస్ ఇవానావిచ్ మెట్లన్ని ఎక్కుతాడు. విసుగుతో ఉమ్మివేస్తాడు. ఆవిరిగిపోయిన మెట్టువంక చూస్తూ తల త్రిప్పుతాడు.

15 ఏండ్ల క్రింద బోరిస్ ఆ వాకిటవద్ద నిలబడ్డాడు. ఆగడప దాటాడు. అదే మొదటిసారి ఆ ఇంట్లో ప్రవేశించడం. యజమానురాలైన లుఖేరా పెట్రోవనా ట్లాథినానుపెండ్లాడి అక్కడే పీఠంవేశాడు. ఆ ఇంటి యజమానియై కూర్చున్నాడు. బండి చక్రం, పాక, బండ, దంతి—అన్నీ అతని స్వంత ఆస్థి అయినాయి.

లుకేరియా నవ్వుతూ అతడు ఆస్తి నాక్రమించుకోవడం చూచింది. కాని కోపం వచ్చినపుడు మాత్రం ఊరుకొనేదికాదు. అతణ్ణి చిన్నగా ఉంచాలని పాత చరిత్ర తవ్వేది. బోరిస్ ఎందుకూ పనికిమాలినవాడనీ, కనీసం ఒక ఇల్లయినాలేదని, పొయ్యిమీద కుండ ఎక్కించే గతిలేదనీ, తన దయా ధర్మ భిక్షం వల్లనే అతడింతవాడయ్యాడనీ అనేది.

'కాస్త కష్టం కల్గినా బోరిస్ మెదలకుండా ఉండేవాడు. కాలక్రమేణా, తన ఇల్లూ దొడ్డీ-రాయీ రప్పా-లను ప్రేమించ సాగాడు. 15 ఏండ్లు గడిచాక అక్కడ ఉండటం బాగుందను కొన్నాడు.

ఈ విధంగా, వాప్య గర్భంలో నుంచి భూమిమీద పడ్డపుడు తెలియకుండా ఏడ్చిన క్షణం లగాయతు, మరణం వరకూ, మనుష్య జీవితాలను పది నిమిషాలలో వర్ణింపవచ్చు.

ఈ కొద్ది కాలంలో రచయిత బోరిస్ జీవిత గాథను క్లుప్తంగా-కాని వివరంగానే-చెప్పడానికి ప్రయత్నిస్తాడు.

నిజానికి చెప్పేదేమి లేదు, ఎందుకంటే బోరిస్ జీవితం హాయిగా, ప్రశాంతంగా గడిచి వచ్చింది.

శీర్షికల క్రింద విభజిస్తే, 5, 6 భాగాల క్రింద వస్తుంది.

మొదటిది బోరిస్ సెకండరీ స్కూలు విడిచిపెట్టి జీవితంలో ప్రవేశించాడు. గాయకుడయ్యాడు. ఆర్కెస్ట్రాలో వాయిద్యాలను వాయిస్తాడు. ఒక కోరస్‌బాలికతో ప్రేమ పుట్టం-ఆ తర్వాత తన యజమానురాలును పెండ్లాడటం.

తన పల్లెలో నిప్పంటుకొంటుంది. విప్లవం ప్రారంభమవుతుంది.

ఇదంతా అర్థం చేసుకోడం అతనికి చాలా సులభం. అనుమానాలకేమీ తావు లేదట. అందులో ఆకస్మిక ఘటనేమీ లేదు. అతని ప్రపంచం గట్టిగా యథావిధిగానే నిలబడివుంది.

మొదట్లో బోరిస్‌కు గంద్రగోళంగా కన్పడ్డది విప్లవం. కాని, పూర్తిగా నిజమైన, అద్భుతమైన, ఖచ్చితమైన అభిప్రాయాలకై అన్వేషించే ఆ విప్లవం చాల సాధారణంగా కన్పించింది తర్వాత.

అతని స్థిర జీవితాన్ని బహుశా తాడుమాడు చేసింది, ఒక్క ప్రేమ ఘటనయే.

బోరిస్‌కు తన గాయక జీవిత ప్రారంభంలో పట్టణపు కోరస్ గరల్‌తో సంబంధం ఉండేది. ఆమె యువతి. సొగసు కత్తె. ఏదో తెలియని రంగుగల తేలిక కళ్లు.

బోరిస్‌కూడ 20 ఏండ్ల ప్రాయపు యువకుడు. అందగాడుకూడా. కాని బహుశా చెడగొట్టినదంతా అతని జారిపోతున్న దవడ అయివుండొచ్చు. అది అతని ముఖం డల్‌గా, అందవికారంగా ఉండేటట్లు చేసింది. అదృష్ట వశాత్తు ఈ విషాదకర దృశ్యాన్ని అతని మీసాలు కొంత వరకు కప్పి వేశాయి.

అతని ప్రేమ ఘటన విచిత్రమైనదే. ఎందుకంటే అతడు ఎపుడూ ఆర్కెస్ట్రాకో మధ్యను కూర్చునేవాడు. కండక్టర్ ముఖంవంక చూస్తూ ఉండేవాడు. తప్పిపోతే తన వాయిద్యాన్నికూడ తప్పు వాయించుతాడేమో నని భయం. అందుకని అతడా కోరస్ గరల్ కన్ను గీట్లను ఎపుడందుకొన్నాడా అనేది చాల కష్టమైన పని.

నిజానికి ఆ రోజులలో బోరిస్ వెలిగిపోయాడు. సాయంకాలపు సమయాలలో క్లబ్బులకూ, డాన్సింగ్ హాల్సుకూ పోతుండేవాడు. అలాంటి సమయాలలో, మంచి పేరు పొందిన నర్తకుల పచ్చని రిబ్బన్ తన గుండీలలో ఇరికించుకొని ఒక్కొక్కపుడతడు సీతాకోక చిలకలా ఎగురుతూ, డాన్సింగ్‌ను పూర్తి చేసేవాడు.

బహుశా అలాంటి డేన్సు హాల్సులో ఎక్కడో ఆ కోరస్ గరల్‌ను కలిసి ఉంటాడు.

ఏది ఎలాగున్నా, ఆమెతో పరిచయం బోరిస్ కేమీ బాధకరం కల్గించలేదు. ఒక నెలయాక, ఆ అందకత్తె, అతని జారిపోయిన దవడను ఎగతాళిచేసి, వదలిపెట్టి వేసింది.

బోరిస్ ఆవిడ మాటలకు నొచ్చుకొన్నాడు. అతడు ప్రేమించిన స్త్రీ పలాయన మంత్రమవలంబించి నందులకు చింతించాడు. అయిపోయిందేదో అయిందనుకొని, తన ప్రఖ్యాత జీవనం మానేసి, ప్రశాంత జీవితాన్ని గడపాలనే భగ్న ప్రేమమూర్తిగా మారాడు.

బోరిస్ ఇవనావిచ్ పట్టణ సమీప గ్రామానికి పోయి ఒక గదిని అద్దెకు తీసుకున్నాడు. ఒక టేబిల్‌కూడ ఉంది. వెచ్చనిగది. అద్దెకూడా తక్కువ.

తర్వాత పెండ్లి చేసుకొన్నాడు.

ఆ తర్వాత గ్రామం తగులబడింది. అగ్ని వలన సగం ఊరు కాలిపోయింది. బోరిస్ వళ్ళంతా చెమట పట్టేటట్లు ఫర్నిచర్, బాటు వెంట్రుకలూ, ఒక కంచెవద్దను భద్రమైన స్థలానికి మోసుకపోయాడు.

ఎలాగయితే నేం ఆ ఇల్లు తగలదలేదు. అద్దం మాత్రం పగిలింది. గోడల బెతికలు మాత్రం ఊడిపోయాయి. మరుసటి ఉత్సాహంతోను, సంతోషంతోను బోరిస్ సామానంతా మళ్ళా ఇంటికి మోసుకుపోయాడు.

ఇది అతని జీవితంలో ఒక ముద్రవేసింది. చాల సంవత్సరాల వరకు తన స్నేహితులతోను, పొరుగువారితోను, ఈ విషయం చర్చించాడు బోరిస్. కాని కాలక్రమేణా ఈ సంభాషణకూడ అదృశ్యమయి పోయింది.

కాబట్టి అతని కర్తవ్యం ? అగ్ని, వివాహం, విప్లవం, సంగీతం, తన వక్షస్థలంపైన పచ్చని బాడ్జీ—అన్నీ మాసిపోయాయి. ప్రేమ ఘటనకూడా మరుగు పడిపోయింది. అది తలచుకొంటే కఠినం, నిస్సారమైన గాథ. పాలిష్‌చేసిన తోలుపెట్టెను కోరస్‌గరల్ అడగటం, దానికోసం రుబులువెనుక రుబులు బోరిస్ కూడబెట్టడం—అదంతా ఒక పాతపురాణం.

నాడు మొదలుకొని ఒక విచిత్రఘటనకై కోర్టులో 25 రుబుల్సు చెల్లించుకొనే క్షణం వరకు—అతడు అక్కడ 37 ఏండ్లు నివసించాడు.

III

బోరిస్ 37 ఏండ్ల ప్రాయానికి ఆరోగ్యవంతమైన, పెద్ద, దృఢకాయుడు. అతనింకా ఎక్కువ కాలం బ్రదకవచ్చు. అతడు కొద్దిగా కుంటుతున్న మాట నిజమే. జార్ కాలంలో కొద్ది గాయం పొందుట వల్ల అది వచ్చింది.

కాని కుంటివాడవడం అతని జీవితానికేమీ అడ్డురాలేదు. అతనికి కావలసినదల్లా తిండి ప్రశాంతంగాను, చక్కగాను జీవితం గడిపాడు.

అతనికి ఒకే ఒక సందేహం, అది జీవిత స్థిరత్వాన్ని గురించి.



ఇది అతడు యువకుడుగా నున్నపుడే కల్గింది. ఇదివరకే రచయిత చెప్పినట్లు కోరస్ గరల్‌తో ప్రేమ వ్యవహారం భగ్నం అయినప్పటి నుండీ అతని జీవితం గురించి బుర్రలో తుపాను రేగింది.

తరుచుగా, తన స్నేహితుల ముఠాతో తన సందేహాన్ని బోరిస్ ఏదో అస్పష్టంగాను, గంద్రగోళంగాను వెలిబుచ్చేవాడు.

"అంతా విచిత్రం సుమా! ఈ ఉదాహరణ చూడండి. నాకు కోరస్ గరల్ లిజోబ్కాతో సంబంధం ఉండేది. ఆ వ్యవహారం 'లిజోబ్కా'తోనే ఎందుకు కావాలి? 'మెషెంకా'తో ఎందుకు కాగూడదు? ఇది నా ప్రశ్న." అని అనేవాడు బోరిస్.

ఈ ప్రశ్న అడగ్గానే సాధారణంగా వాళ్ళు పొట్ట పగిలేటట్లు నవ్వేవారు. ఆ సంబంధ వివరాల గురించి నిర్బంధించి అడిగేవారు. 'మెషెంకా'తో అతనితో ఏమన్నా సంబంధం ఉన్నదా అని కనుగొన ప్రయత్నించే వారు.

అపుడు బోరిస్ కొంచెం కించపడి, తన సంజ్ఞలతో వాళ్ళ ప్రశ్నల్ని ఆపివేసేవాడు. కొంచెంసేపు మౌనంగా కూర్చుని జీవితం యొక్క అస్పష్టతను గురించి ఆలోచిస్తూ కూర్చునేవాడు.

జీవితం ఒక అదృష్టం యొక్క ఆట అనడం ఎవరూ కాదనరు. మన పుట్టుక, మన బ్రదుకు, చివరకు మన మరణం, ఆకస్మికం. నిజానికి ప్రతిదీ అస్పష్టం. ప్రపంచంలో కఠినమైన 'లా' ఏమీ లేదు.

ప్రజలు దీన్ని ఒప్పుకోడానికి ఎందు కిష్ట పడటం లేదు? మానవత్వానికి ఒక విచిత్రమైన కారణాన్ని ఎందుకు కల్పిస్తారు? చాలామంది ఈ విషయమై ఆలోచించారు. వాళ్ళకే తమ నమ్మకాల గురించి ధైర్యమే వుంటే ప్రతి వాడికీ జీవితం చాలా సులభంగా ఉండాలి కాని నేడో-అంతా నాన్సెన్సు.

మన కండ్లముందర అంతా మారుతున్న—ప్రతిదీ కంపిస్తున్న—గొప్ప గొప్ప దేవుడూ, ప్రేమా అనే వాటితో ప్రారంభమయి మానవుని చిన్న చిన్న కుట్రలతో అంతమయ్యే—ఈ ప్రపంచంలో, ఉద్దేశ్యాల కలయిక లేదు.

ప్రేమ ఉందనీ, భగవంతుడున్నాడనీ, రాజు ఒకరకపు అసామాన్య వ్యక్తిఅనీ చెప్పే నమ్మకాలతో తరతరాలనుండి మనుష్యులు పెంచబడినారు. అయినా—ఈ రోజుల్లోకూడ—తన విషయాన్ని బాగా ఎరిగిన తత్వవేత్త, దానికి వ్యతిరేకంగా ఒక్క కలంపోటుతో నిర్ధారణ చేయగలడు. సైన్సు వృద్ధిఅయిన ఈ ప్రపంచంలో-ప్రతిదీ ప్రత్యక్ష ప్రమాణంగా కన్పించే ఈప్రపంచంలో-నీవు వెను దిరిగిచూస్తే ప్రతిదీ తప్పని, కాలానితోపాటు మారుతుందని తెలుసుకొంటావు....

బోరిస్ కిలాంటి విషయాలేమీ తెలియవు; అతడేం మూర్ఖుడుకాదు, సెకండరీ విద్య ప్యాసయ్యాడు. కొందరు రచయితలభివృద్ధి పొందినట్లు వృద్ధి పొందలేదు.

అయినా అతని నిత్యజీవనంలోని ఏదో కొద్దిపాటి విషయంలోనే, అతడు జీవితంలో ఏదో ఒక రకమైన వ్యాధి ఉందని గుర్తించాడు. తన అదృష్టాన్ని గురించి భయపడ సాగాడు.

అతడింకా యువకుడుగా ఉండగానే ఈ సందేహం ఒక్కసారి జ్వాలగా భగ్గు మంటానికి అతని ఆత్మలో ప్రవేశించింది.

అది ఇలా తటస్థించింది. అతడింటికి వస్తుండగా ఒక టోపీ పెట్టుకొన్న నల్లటి విగ్రహాన్ని ఢీకొంటం తటస్థించింది. అతడు ఆగి బోరిస్‌ను దీనంగా భిక్ష అడిగాడు.

ఆ బిచ్చగాడికి బోరిస్ తన కోటు జేబులో నుంచి ఏదో కొంత దీసి ఇచ్చాడు. అతని వంక చూడగానే అతడేదో సిగ్గుపడుతున్నట్లు తోచింది. తన మెడను చేతులతో కప్పుకున్నాడు. కాలర్, టై, లేనందుకు క్షమాపణ కోరుతున్నట్లున్నదావైఖరి. మళ్ళా అదే దీన స్వరంతో, తాను పూర్వ మొక భూస్వామియనీ, రాజకీయ విభేదాల వలన తనను కాల్చారనీ చెప్పాడు. ఒకానొకప్పుడు తానుకూడ బిచ్చగాండ్రకు వెండి నాణ్యాలిచ్చాడట; కాని ఇపుడు ఈ నూతన ప్రజా స్వామ్య జీవిత ప్రవాహంలో కొట్టుకుపోయి అతడొక బిచ్చగాడయి పోయాడట.

బోరిస్ ఆ బిచ్చగాణ్ణి ప్రశ్నించ ప్రారంభించాడు.

బోరిస్ శ్రద్ధకా బిచ్చగాడు ఉబ్బిపోయి ఈ విధంగా చెప్పాడు. "నేను పూర్వం మంచి ధనిక భూస్వామిని. డబ్బు విషయమా? మా కోడిపిల్లకూడ వాసన చూచేదికాదు; నేడో నేను బీదవాణ్ణి. దుర్బలుణ్ణి. ఇంక తినడానికా ఏమీ లేదు. ప్రియ స్నేహితుడా, జీవితంలో ప్రతిదీ కాల క్రమేణా మారుతుంది."

బోరిస్ ఆ బిచ్చగాడికి మరో నాణెం పారవేశాడు. తన యింటికి నెమ్మదిగా వెళ్ళిపోయాడు.

ఇంటికి వెళుతూ వెళుతూ ఈ దయార్ద్ర హృదయుడు — బోరిస్—"ప్రతిదీ కాలక్రమేణా మారుతుంది" అని గొణుక్కున్నాడు.

బోరిస్ ఇంటికి రాగానే భార్య లుకేరియాకు ఈ సంగతి చెప్పాడు. ఆ చెప్పడంలో తన ఊహకు అందినవేవో కల్పించి చెప్పాడు. ఆ భూస్వామి బిచ్చగాండ్రకు బంగారం విదజల్లేవాడనీ — ఒక్కొకపుడు ఆ నాణాలు విసరడంవల్ల బిచ్చగాండ్ర ముక్కులు కూడ బ్రద్దలయ్యేవని చెప్పాడు.

బోరిస్ పెండ్లాం ఇలా జవాబు చెప్పింది. "దీనిలో విచిత్రమేముంది? ఒకప్పుడు బాగా బ్రతికేవాడు. ఇపుడు బీదవాడయ్యాడు. అందాకా ఎందుకు? మన పొరుగాయన్ని చూడండి. అతడు కూడా చాలా నికృష్ట స్థితిలోఉన్నాడు." లుకేరియా "ఇవాన్ సెమెనోవిచ్ కుషకావ్"ను గురించి చెప్పడం ప్రారంభించింది. "అతడు పూర్వం బడిపంతులు. పూర్వం బాగా బ్రదికాడు. చుట్టలుకూడా కాల్చాడు. ఇపుడో, ఒక దమ్మిడీ అప్పు పుట్టదు." అని ఆమె ముగించింది.

బోరిస్‌కు ఆ స్కూలు మాష్టర్ని గురించి తెలుసుకోవాలని అభిలాష కల్గింది. అతడెందుకు ఎలా అలాంటి దారిద్ర్యానికి మున్గి పోయాడని ఆమెను అడిగాడు.

బోరిస్ అతన్ని చూడాలనికూడా తలిచాడు. అతని దరిద్ర జీవనంలో తక్షణం తాను కొంత అభిరుచి గల్గించుకోవాలని తలిచాడు. తన భార్యను ఆ మాష్టరును త్వరలో టీకి ఆహ్వానించమని బ్రతిమాలు కొన్నాడు.

అలవాటు ప్రకారం, లుకేరియా భర్తగారిపైన కాస్త "స్టీమ్" వదిలింది. అతనికి బుద్ధి ఏమీ లేదన్నది. కాని కుతూహలం కొద్దీ, ఒక రుమాలు వేసుకొని ఆ స్కూలు మాష్టరును తీసుకరావడానికి పోయింది.

ఇవాన్ సెమెనోవిచ్ తక్షణం వచ్చేశాడు, జుట్టంతా నెరసిపోయింది. ముడుతలు పడ్డ శరీరం, వెయిస్ట్ కోటన్నా లేకుండా ఒక మురికి ఫ్రాక్ కోటును తగిలించాడు. కాలర్ లేని ఒక మురికి చొక్కా అతని వక్షస్థలం మీద ముద్దగా పడివుంది. ఒక భయంకరంగా కన్పించే టాసీ ఒకటి గుండీలాగా అమర్చబడింది. అది ముందుకు తొంగి చూస్తున్నది. క్షవరం చేసి కొని ఎన్నాళ్ళో అయినట్లు తెలుస్తుంది. పొదలాగా గడ్డం పెరిగి ఉంది.

స్కూల్ మాష్టర్ చేతులు నలుపుకుంటూ...

ఏదో నవులుకొంటూ గదిలో ప్రవేశించాడు. నెమ్మదిగానే కాని, మందహాసంతో, టోపీతీసి నమస్కారం చేశాడు. అతనివంక జాలి ఏదో తెలియని కారణంతో కన్నెగురవేశాడు.

టేబిల్ ప్రక్కను కూర్చొన్నాడు. ఎండు రొట్టె, ఒక ప్లేటు ఒకటీ, ఎండు ద్రాక్షపళ్ళు దగ్గరకు లాక్కొన్నాడు. ఎప్పుడూ నవ్వుతూనే తినడం ప్రారంభించాడు.

స్కూలు మాస్టర్ తినడం పూర్తి అయాక బోరిస్ ఎంతో కుతూహలంతో అతని పూర్వ జీవితాన్ని గురించి, అడిగాడు. అతడు అలాంటి దారిద్ర్య దశకు ఎందుకు వచ్చిందీ మురికి చొక్కాకు ఒకే గుండీ తగిలించుకొని కాలరైనా లేకుండా తిరిగే హీనస్థితికి ఎందుకు వచ్చిందీ తెలియజేయ మన్నాడు.

స్కూలు మాస్టర్ కళ్ళల్లో చిలిపి తనాన్ని వెలిగ్రక్కుతూ, "నేను పూర్వం బాగా బ్రదికాను. చుట్టలుకూడా కాల్చాను. కాని మంచి దస్తూరి కావాలనే డిమాండ్‌తో ఉద్యోగం పోయింది. స్కూల్ సిలబస్ నుంచి దాన్నితొలగించాలని పీపిల్సు కమిసార్ ఆజ్ఞాపించాడు"

"కాని దాని కెలాగో అలవాటు పడ్డాను నేను జీవితాన్ని గురించి కంప్లయింటుచేయను. ఈ ఎండురొట్టెను ఆకలిపై తినడంలేదు, ఏదో అలవాటు చొప్పున" అని అన్నాడు మాస్టరు.

లుకేరియా, స్కూల్ మాస్టర్ ధోరణి ఇష్టం వచ్చినట్లు పోతున్నదని గ్రహించి చేతులు మడుచుకొని నవ్వ నారంభించింది. అతనివంక ఏదో దురభిప్రాయాన్ని మనసులో పెట్టుకొని చూడ నారంభించింది. అతడు ఏదో పెద్ద రహస్యాన్ని బయట పెడతాడనే ఆదుర్దాతో ఎదురు చూచింది.

బోరిస్ తనతలను తిప్పుతూ, ఏదో గొణుగుతూ, మాస్టర్‌గారు చెప్పే సంగతులు విన్నాడు.

అనవసరంగా నవ్వుతూ మళ్ళా టీచర్ ప్రారంభించాడు, "మన జీవితములో ప్రతిదీ మారుతుంది. ఇవ్వాళ దస్తూరిని రద్దుచేశారు, రేపు డ్రాయింగ్ రద్దుచేస్తారు, క్రమక్రమేణా మీవంతు కూడా రాకతప్పదు"

బోరిస్ "మీ భావం ఏమిటి? కాలం మారటంవల్ల నాకేం నష్టం కల్గుతుంది? నేను ఆర్టిస్టును. నేను ఆర్కెస్ట్రాలో వాయిస్తాను." అన్నాడు ఉలిక్కిపడుతూ.

"అయితే మాత్రం ఏం. ఈ రోజులలో సైన్సు, టెక్నికల్ నాలెడ్జి వృద్ధి అవుతున్నది. నీవు వాయించే వాయిద్యం బదులుగా ఏ ఎలక్ట్రిక్ వాయిద్యాన్నో కనిపెడతారు. అంతటితో నీవూ, నీ ఉద్యోగమూ-ఫైసల్-" అన్నాడు స్కూలు మాస్టర్ ద్వేషపూరితంగా.

బోరిస్ ఎగ పీలుస్తూ, తన భార్య వంక చూశాడు.

"ఇందులో ఏ మున్నది. చాల సాధారణ మయిన సంగతే. సైన్సు, టెక్నికల్ నాలెడ్జి త్వరితంగా వృద్ధి పొందు తున్నాయి." అన్నది భార్య.

బోరిస్ హఠాత్తుగా లేచి గదిలో అటూ ఇటూ తిరగ ప్రారంభించాడు.

"అయితే అయింది. కానీ - కానీ" అని అన్నాడు.

"కానీయాలట! కానీయడం. నేను నీకు తిండి పెట్టినన్నాళ్లు నీకేం భయం. శుద్ధమొద్దూ! నీ సంగతి నాకు—" అన్నదా వీరనారి

స్కూలు మాస్టర్ కుర్చీలో అటూ ఇటూ కదులుతూ, ఇలా అన్నాడు. "కాబట్టి అసలు విషయం అది. ఇవాళ వ్రాత, రేపు డ్రాయింగ్, ప్రతిదీ మారుతుంది బాబుల్లారా!"

బోరిస్ మాస్టర్‌గారిని సాధ్యమైనంత త్వరలో మరొకసారి విందకు రమ్మని ఆహ్వానించి 'గుడ్‌నైట్' చెప్పాడు. గేటు దాకా పంపి వచ్చాడు.

మాస్టర్ సంతోష పూర్వకంగా చేతులు నులుముకుంటూ వంగి వంగి నమస్కారాలు గావించి వెళ్ళిపోతూ పోతూ ఇలా అన్నాడు, "నేడు దస్తూరి—రేపు డ్రాయింగ్—తర్వాత క్రమేణా నీవంతుకూడ."

బోరిస్ తలుపువేసి పడకగదిలోకి వచ్చాడు. మంచం పైన మోకాళ్ళ పైన చేతులుపెట్టి కూర్చున్నాడు.

లుకేరియా గుడ్డ 'స్లిప్పర్స్' వేసికొని పక్క సర్దుకొని నిద్రకు సిద్ధమవు తున్నది.

"ఇవాళ వ్రాత-రేపు డ్రాయింగ్"-అంటూ బోరిస్ ప్రక్కపైన ఒరిగాడు. 'కాబట్టి ఇగ జీవితం....' అంటూ గొణిగాడు.

లుకేరియా భర్తవంక చూచింది. మాటాడకుండా, తల దువ్వుకోసాగింది. పగలల్లా చిక్కుపడ్డ ఆ జుట్టులోనుంచి, చిన్న చిన్న గడ్డి పరకలను బయటికి లాగి పారేసింది.

"లూషా! వాళ్లు ఎలక్ట్రిసిటీతో ఒకటి కొత్తది కనిపెడతారనుకో. నా అవసరం లేకుండానే, కండక్టర్ తన బల్లమీద ఒక మీటనొక్కితే, ఆ వాయిద్యం మ్రోగుతుందనుకో, అలాంటి దానిని కనిపెడితే "అని అన్నాడు బోరిస్.

"నిజం. అదేమంత బ్రహ్మాండమైన పని? చాలా సులభం. అపుడు నీ ఉద్యోగం పోతుంది. నాకు నీవు తగలాటం. తప్పదు. నాకు భవిష్యత్‌లో అలా జరుగుతుందని స్పష్టంగా కన్పడుతున్నది."

బోరిస్ ప్రక్కపై నుండి లేచాడు. కుర్చీ వద్దకు పోయాడు. ఏదో ఆలోచనలో పడిపోయాడు.

"నీకు కష్టంగా ఉంది. నిజమే. నీవేదో ఆలోచిస్తున్నావు. నీకూ విషయాలు అవగాహనం అవుతున్నాయి. నీకే పెండ్లాం ఇంటివద్ద లేకపోతే, దమ్మిడీకి పనికిరాని వెధవ్వి. నీవెక్కడుండే వాడివి? నిన్నా ఉద్యోగం నుండి ఊడబెరికితే ఏం జేస్తావు." అన్నది లుకేరియా.

"అదికాదు, లూషా! ప్రతిదీ అశాశ్వతం.... ఛాన్సు....అందుకనే నేను వాయిద్యం వాయించుతున్నా....నేను జీవించడానికి కారణం....నేనా పదవిని కాలదన్నితే నన్నీ పదవిలో నుంచే దేమీ లేదు." అన్నాడు బోరిస్.

లుకేరియా పడుకొని, భర్త మాటలు విన్నది. వాటి అర్థంకూడా గ్రహించింది. తన ఆస్తి విషయమై అందులో ఏదో ఉన్నదని, తనను అవమానపరచాడనీ, ఏదో అనుకొంది. "నీవు నాకు భారమవుతావు. తగలాటం-గాడిద కొడుకా!" అని తిట్టింది.

"నేను నీకు భారంకాను" అన్నాడు బోరిస్ మళ్ళా ఒక నిశ్వాసము విడుస్తూ, కుర్చీ నుండి లేచి అటూ ఇటూ గదిలో తిరగటం మొదలు పెట్టాడు.

మహా విసిగిపోయాడు. తలపై చెయి పెట్టు కొన్నాడు. ఏదో స్పష్టమైన అఆలోచనల నన్నిటినీ త్రోసి పారవేస్తున్నట్లుగా కన్పడు తున్నాడు మళ్ళా కూర్చో బడ్డాడు.

చాలాసేపు నిశ్చైతన్యుడై నిలబడ్డాడు. లుకేరియా గురకలు పెడుతూ, నాసికా రంధ్రాల ద్వారా చిన్న చిన్న ఈలలు వేస్తున్న సమయంలో బోరిస్ గదిలో నుంచి బయటకు వెళ్ళి పోయాడు.

బోరిస్ హ్యాట్ తగిలించుకొని, మామూలుగా ఉన్న ఆదుర్దా స్థితితో నే వీధిలోకి పోయాడు.



## IV

ఆగస్టు మాసపు రాత్రి, పదిగంట లయింది. ప్రశాంతంగాను, అద్భుతంగాను ఉన్నదారాత్రి. బోరిస్ చేతులు గట్టిగా ఊగులాడించు కొంటూ మైన్ రోడ్డుపై నడిచాడు. ఏదో వింతయైన ఆదుర్దా అతన్ని పీడింపసాగింది, అది గమనించకుండానే, స్టేషన్ చేరాడు. ఒక గ్లాసెడు బీర్ సేవించి నెమ్మదిగా తలవూపాడు. ఊపిరాడనట్లుంటే, మళ్ళా బజారులోకి పోయాడు.

నెమ్మదిగా తల క్రిందికి వ్రేలాడుతున్నట్లుగా వంచుకొని నడిచాడు. ఏదో ఆలోచిస్తున్నాడు. "నీవేమి ఆలోచిస్తున్నావయ్యా" అని అడిగితే అతడే సమాధానం చెప్పలేడు. అతనికే తెలియదు,

స్టేషన్‌నుంచి టౌన్ గార్డెన్‌గుండా చెట్ల మధ్యకు వచ్చాడు. అక్కడ ఒక బెంచిపైన కూర్చున్నాడు, టోపీ దీసివేశాడు. ఓఅమ్మాయి ఒకసారి బోరిస్‌ను చూస్తూ వెళ్లింది. రంగు "స్టాకింగ్స్" వేసుకుంది. చిన్న చొక్కా వేసుకుంది. పెద్ద పెద్ద పెదవులు, ఒకసారి చూస్తూ పోయింది; మళ్ళా వచ్చింది, మళ్ళా వెళ్ళింది. చివరకు ఎదురుగావచ్చి, కూర్చుని అతనివంక చూస్తున్నది. బోరిస్ కంపించాడు. ఆమె వంక చూచాడు. తలవూపాడు. వెళ్ళిపోయాడు.

హఠాత్తుగా ప్రతిదీ అసహ్యకరంగా కన్పడింది. భరింపరానిదిగా తోచింది, జీవితం అంతా "డల్"గాను "స్టుపిడ్"గాను కన్పించింది.

"నేనెందుకు బ్రతికాను. రేపు నేను పనికి పోగానే వాళ్లు 'మేం దాన్ని కనిపెట్టాం. నీవవసరం లేదు.' అంటారందరూ" అని అనుకొన్నాడు.

ఇంకోసారి వణికిపోయాడు. పరుగెత్తాడనే అనాలి. చర్చ్ కంచెవద్దకు వచ్చి ఆగాడు. గేటును తడిమి, తెరచి, లోపలికి వెళ్ళాడు.

చల్లనిగాలి, చెట్లు, సమాధిరాళ్ళు, అన్నీ బోరిస్‌ను ఓదార్పుతున్నట్లు కన్పించాయి. ఒక సమాధి రాయిపై కూర్చొని అతడాలోచింప సాగాడు. తర్వాత బయటికే మాటాడం ప్రారంభించాడు.

"ఇవాళ వ్రాత–రేపు డ్రాయింగ్ – అలాగే మన జీవితం అంతా" బోరిస్ సిగరెట్టు వెల్గించి ఏదైనా తటస్థించితే తనెలా బ్రదకడమా అని ఆలోచింప సాగాడు.

"బ్రదకడం-ఎలాగో బ్రదకకలను. నేను లూషా వద్దకు ఇక తిరిగి వెళ్ళను. ప్రజల కాళ్ళవద్ద దుమ్ములోపడి 'ఇదిగో ఇక్కడొక మానవుడు నాశనం అవుతున్నాడు. అతన్ని అలా దిక్కులేకుండా చేయకండి. అని అయినా అంటాను గాని లూషా (భార్య) వద్దకు వెళ్లను" అని అనుకొన్నాడు.

చలి. నరాలను కూడా గడ్డకట్టినట్లు తోచింది. హఠాత్తుగా అతనికో భావం తోచింది. "ఎలక్ట్రిక్ వాయిద్యం ఇదివరకే కన్పెట్టబడింది. కాని ఆ పరిశోధనను దాచారు. ఒక్క దెబ్బతో తక్షణమే నన్ను నాశనం చేయడానికి దానిని పరమ రహస్యంగా ఉంచారు." అని అనుకున్నాడు.

బోరిస్ అక్కడనుండి ఒక్క పరుగుతీశాడు, అతడు విపరీతంగా క్రుంగిపోయాడు. గబగబ నడిచిపోయాడు. వీధిలో ప్రశాంతంగానే ఉన్నది. కొంతమంది వాళ్ళ వాళ్ళ ఇంటికి త్వరత్వరగా పరుగెత్తుతున్నారు.

ఒక మూలకు పోయి నిల్చున్నాడు మొదట. తర్వాత తను ఏమి చేస్తున్నాడో తెలియకుండానే ద్రోవంబడి పోయే వారివద్దకు పోయి, దీన స్వరంతో ఇలా అన్నాడు.

"మహాశయా!....దయఉంచండి. ఈక్షణమే ఒక మనుష్యుడు నాశనమగుచున్నాడు...."

త్రోవంబడి పోయేవారు, బోరిస్ వంక విపరీతంగా చూచి తమ త్రోవను తాము పోయారు.

ఆ కొయ్య త్రోవపైన చదికిలబడి "మహాశయులారా! దయ వుంచండి....నా దురదృష్టం నా దుఃఖాన్ని....'

చాలామంది బోరిస్‌ను చుట్ట వేశారు. ఆశ్చర్యంతోను, భయంతోను, అతన్ని చూడసాగారు. సిపాయి చేతిలో రివాల్వర్ పట్టుకొని, బోరిస్ భుజాన్ని ఊగించాడు.

"త్రాగుబోతు" అని గుంపులో నుంచి ఒకడు కేక వేశాడు. "వెధవ! ఇలాంటి వాళ్ళకు 'లా' లేదు." అని మరొకడన్నాడు.

విచిత్రంగా ఒక గుంపు గుంపు అతన్ని చుట్టు ముట్టింది. ఎవరో దయార్ద్ర హృదయుడొకాయన బోరిస్‌ను లేవదీసి కూర్చో పెట్టాలనుకొన్నాడు. కాని త్రాగుబోతు బోరిస్, తానే వాళ్ళనుండి తప్పించుకొని దూకి వేశాడు. గుంపు విడిపోయింది. బోరిస్ గాబరాపడి అటూ ఇటూ చూస్తూ, భీతితోగూడిన ఒక అఱపు అఱచి పారిపోయాడు.

"పట్టుకోండి. ఆపండి" అంటూ ఎవడో ఒకడు అన్నాడు. సిపాయి ఈల వేశాడు, ఈలతో బజారు బజారు కదిలింది.

బోరిస్ వెనక్కైనా తిరిగి చూడలేదు. తల భుజంపైకి వ్రేలాడ వేసుకొని ఇంకా త్వరగా పరుగెత్తాడు. అతని వెనుక ప్రజలు పిచ్చికేకలు వేస్తూ వెంబడిబడ్డారు. బోరిస్ ఒకమూల తప్పుకొని "చర్చి" కంచెలోకి దుమికాడు.

'ఇదిగో ఇక్కడ' అని అదేధ్వని. "ఇదిగో ఇక్కడ ఉన్నాడు రండి".

బోరిస్ చర్చి మెట్లవద్దకు పరుగెత్తి వెనక్కి తిరిగిచూచి మూల్గాడు. తలుపునెట్టాడు. తలుపు వచ్చింది. లోపలికి పరుగెత్తాడు.

ఒక్క సెకండు వరకూ, నిశ్చేష్టుడై పోయాడు. తరువాత తన తలను రెండు చేతులతో పట్టుకొన్నాడు. కూలిపోతున్న కిర్రు కిర్రుమంటున్న మెట్లవైపుకి పరుగెత్తాడు.

"ఇదిగో ఇక్కడ పట్టుకోండి. పట్టుకోండి" అని ఆ వెంటబడ్డ ఆయన అఱచాడు.

చర్చిలోకి ఒక వందమంది దాకా త్రోవను బోయేవాళ్ళు, పొరుగువాళ్ళు ఆచర్చిలోకి దుమికారు. అంతా చీకటిగా ఉంది. ఒకడు నిప్పుపుల్ల వెల్గించి దీపస్తంభం మీద కొవ్వువత్తిని వెల్గించాడు.

పెద్ద నున్నని గోడలు, చర్చి సామానులు అంతా పచ్చని, మినుకుమినుకుమనే దీపపు కాంతితో క్రమ్మివేయ బడినయి. బోరిస్ 'చర్చి'లో లేడు. అరుస్తూ కేకలేస్తూన్న గుంపు ఒక విధంగా భయపడింది. హఠాత్తుగా శిఖరపు గంటలు మ్రోగాయి.

మొదట్లో నెమ్మదిగాను, తర్వాత త్వరత్వరగాను, ప్రశాంతంగా ఉన్న ఆ రాత్రిలో రాగాలాపన హెచ్చింది. బోరిస్ ఎంతో శ్రమపడి పట్టణాన్ని యావత్తూ మేల్కొల్పాలి అన్నట్లుగా, ఆ పెద్ద గంటను మ్రోగించాడు. ఒక నిమిషం అలా జరిగింది.

మళ్ళీ అదే ధ్వని. "ఇదిగో. ఇదిగో. మీరితన్ని విడచిపెట్ట దలచుకొన్నారా? పైకి ప్రాకండి. పట్టుకోండి." చాలామంది పైకి ఎక్కారు. బోరిస్‌ను చర్చినుండి బయటకు నడిపిస్తున్నపుడు, దుస్తులు గూడా సగం సగం వేసుకొన్న అనేకమందీ సిపాయీలూ, ఫైర్ బ్రిగేడ్ 'చర్చి' సమీపంగా నిలబడి ఉన్నారు.

బోరిస్‌ను నెమ్మదిగా గుంపులో నుంచి నడిపించి, మిలీషియా హెడ్ క్వార్టర్సుకు లాక్కెళ్ళారు.

## V

చాలా దినాలు గడిచాయి. ఆతడలా చర్చి గంటలు ఎందుకు మ్రోగించాడని ప్రశ్నించితే

కోపంగా మెదలకుండా కూర్చునేవాడు. తానేమి చేశాడో వివరాలు తెలియవు. ఎవరైనా జ్ఞప్తి చేస్తే కించపడి, ఆ విషయాన్ని ఎత్తవలదని బ్రతిమాలేవాడు.

కాని ఆ రోజున తెల్లవారేదాక స్టేషన్‌లో ఉంచారు. తెలివి తక్కువయైన-అస్పష్టమయిన వాఙ్మూలం ఒకటి ఇచ్చాడు. ఇంకెప్పుడూ పట్టణం విడిచిపోనని ఒక ఖరారునామా వ్రాసియిచ్చిన తరువాత, బోరిస్‌ను ఇంటికి వెళ్ళడానికి అనుమతి నిచ్చారు.

చిరిగిపోయింది కోటు. టోపీ పోయింది. ప్రొద్దున ఇంటికి నెమ్మదిగా చేరుకున్నాడు. ఉకేరియా పెట్రోన్నా బొమ్మ బాదు కొన్నది. తన జన్మ నక్షత్రాన్ని తిట్టుకొంది. బోరిస్ లాంటి విచార కరమైన మానవుణ్ణి పొంది తన జీవితాన్ని దుఃఖ పఱచుకొన్నందులకు తిట్టుకొంది.

అదే సాయంత్రం బోరిస్ స్ట్రాఆర్కెలో మధ్యన కూర్చున్నాడు. పరిశుభ్రమైన బొచ్చు కోటు నొకటి వేసుకొన్నాడు. ఆవేళ తన వాయిద్యాని ఏదో విషాదస్వరంలో వాయించాడు.

అతడు గడపిన ఆ భయంకర రాత్రిని సూచించే చిహ్నాలేమీ అతని వేషంలో కన్పించ లేదు. కాని రెండు గీరలు మాత్రం ముక్కు-హా-పెదవులకూ మధ్య కన్పడుతున్నాయి. క్రొత్తగా గూని వొకటి ఏర్పడి భుజాలు వంగిపోయాయి.

అయినా బోరిస్ ఇవనావిచ్ చాలా కాలం బ్రదుకుతాడు. పాఠక మహాశయా! నీ చావూ, నా చావూ కూడా చూస్తాడు. దిగులుపడకు.


తెనాలిలో

పరిశుభ్రమగు భోజనము, రుచికరములగు ఫలహారములు.

ఎక్కడ?

దొరుకుతాయని మీరు విచారించ పనిలేదు. వేలకొలది ధనమును వెచ్చించి నిర్మించిన

# గోల్డెన్ కేఫ్

మీ సందేహమును తీర్చి, ఆనందమును, సౌఖ్యమును కలిగించును.

మీరు తెనాలి వచ్చినపుడు గోల్డెన్ కేఫ్ కొరకు విచారించండి.

త్వరపడుడు! ధర స్వల్పము!! ఫలమధికము!!!

# చాందివెండికి గ్యారంటీ!

స్థాపితము—1920.

పెందోట వెంకటరత్నం

సిల్వర్ అండ్ గోల్డువేర్ మ్యాన్యుఫాక్చరర్.

రహదారి బంగళా రోడ్డు—తెనాలి.

గుంటూరు జిల్లా — యం. యస్. యం. రైల్వే.

P.V.R. (రిజిష్టర్డు)




# రష్యా కమ్యూనిస్టు పార్టీ చరిత్ర



నేటి అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి డిమిట్రాఫ్.

సోవియటు ప్రభుత్వాన్ని, సోషలిస్టు సమాజాన్ని స్థాపించి కమ్యూనిస్టు సమాజాన్ని నెలకొల్పడానికి పని చేస్తూ ఉన్న రష్యను కమ్యూనిస్టు పార్టీ చరిత్ర ఏమిటో తెలుసుకొందాము.

ఒక వర్గము యొక్క హక్కులను కాపాడటానికి, ఆవర్గముపై యితర వర్గాల అధికారాన్ని తొలగించడానికి సంఘాజమంతటిపై తన పెత్తనం స్థాపించడానికే ఒక వర్గ పార్టీ ఏర్పడుతుంది. అందుచే రష్యన్ కార్మిక వర్గ పార్టీ అయిన బోల్షివిక్ (కమ్యూనిస్టు) పార్టీ ప్రారంభం కూడా రష్యాలో పరిశ్రమలు ప్రారంభమయిన 19 వ శతాబ్దపు రెండవ భాగంలోనే.

1861 లో వ్యవసాయకుల బానిసత్వం తొలగించుటతోనే రష్యను కేపిటలిజం దిన దిన ప్రవర్ధమానం కాసాగింది. అపుడే జారు చక్రవర్తి చేతను, జమీందారుల చేతను పీడింపబడుచున్న మధ్య తరగతి ప్రజల యొక్క, రైతుల యొక్క తిరుగుబాటు భావాలు తెలియజేయు "నరోడ్నిక్" పార్టీ బయలుదేరింది. వీరు అస్పష్టమైన సోషలిజం బోధిస్తూ గతించిపోయిన గ్రామ కమ్యూన్‌ను ఆదర్శంగా ఎంచేవారు. పట్టణ కార్మికులను నిర్లక్ష్యం చేసేవారు. రైతులలో పునాది యేర్పరచుకొన్న ఈ పార్టీయే తర్వాత సోషల్ రివల్యూషనరీ పార్టీగామారింది. జారును నాశనం గావించి అధికారాన్ని చేపట్టి కాన్స్టిట్యుయెంటు అసెంబ్లీ ద్వారా రష్యన్ రాజ్యాంగ విధానాన్ని నిర్ణయించుటే వీరి ఆశయం.

ఈ ఉద్యమంతో సంబంధమున్న దేశాంతరగతు అయిన కొందరు, పశ్చిమ యూరపులోని కార్మికోద్యమాన్ని గమనించి, తమ అభిప్రాయాలను మార్చుకొన్నారు. మార్క్సిజం వైపుకు క్రమంగా మొగ్గుచున్న ప్లెఖానావ్, అక్జిల్‌రాడ్, వీరా జుస్‌లిచ్, డూట్జ్, ఇగ్నటోవ్‌లు కలసి "కార్మిక రక్షణ సమితి"ని (Emancipation of Labour Group) ఏర్పరచారు. విప్లవకారుల దృష్టి మొదటిసారి కార్మిక వర్గం వైపు మరలింది.

1884 లో "కార్మిక రక్షణ సమితి" కార్యక్రమం మొదటిసారి ప్రకటించింది. దానిలో మార్క్సు భావాలు, నరోడ్నిక్

భావాలు, కలగలుపుగా వున్నా విప్లవోద్యమములో కార్మిక వర్గం యొక్క ప్రాధాన్యత గుర్తించబడింది. 1887 లో ప్రకటింపబడిన కార్యక్రమంలో రైతులు కార్మిక వర్గానికి సహాయకులని చెప్పబడింది. వీరు కార్మిక వర్గంలోనే ప్రధానంగా పని చేయసాగారు.

ఈ రోజుల్లో మార్క్సు గ్రంథాలు, భావాలు రష్యాలో వ్యాపించ సాగాయి. పారిశ్రామికాభివృద్ధి తప్పనిసరియని రుజువు చేయడానికి తరువాత సుప్రసిద్ధ బూర్జువా నాయకులైన వారు సైతం మార్క్సు వాదాన్ని ఉపయోగించ మొదలిడారు.

వివిధ పట్టణాల్లో ఏర్పడిన కార్మిక రక్షణ సమితులు కార్మికుల ఆర్గనైజు చేయుట, సమ్మెలలో కార్మికులకు నాయకత్వం వహించుట ప్రారంభించాయి. పెట్రోగ్రాడ్‌లో లెనిన్ నాయకత్వాన పోరాటం సాగింది. 1895 లో లెనిన్ అరెస్టు అయ్యాడు. అప్పుడే జరిమానాలపై (on fines) ఒక కరపత్రం వ్రాసాడు.

## ప్రథమ పార్టీ కాంగ్రెసు

వివిధ పట్టణాల్లో కార్మికుల మధ్య పనిచేయుచున్న సోషలిస్టు భావా లున్నవారంతా 1897 మార్చి 14 వ తేదీ సమావేశమయ్యారు. అదియే మొదటి సోషల్ డిమాక్రేటిక్ పార్టీ సమావేశం. "కాపిటలిజంతోపాటు వృద్ధి పొందుచున్న కార్మికవర్గమే రాజకీయ స్వాతంత్ర్యంకొరకు జరుగు పోరాటంలో నాయకత్వం వహిస్తుందని," మ్యానిఫెస్టోలో ప్రకటించింది.

కాంగ్రెసులో పాల్గొన్న ప్రతినిధులందరు ఇండ్లకు చేరగానే అరెస్టు చేయబడ్డారు. ఇంకా అన్ని స్థలాల్లోని ముఖ్యులందరు కూడా జైలుకంప బడ్డారు. నూతనంగా ఏర్పడిన రష్యన్ సోషల్ డిమాక్రేటిక్ లేబర్ పార్టీ నిర్మాణం అణచివేయబడింది. ఈ దెబ్బ నుండి కోలుకొనుటకు అయిదు సంవత్సరాలు పట్టింది పార్టీకి. బయట వున్న వారిలో కొందరు ఉద్యమాన్ని ఆర్థిక పోరాటంగా మాత్రమే వుంచడానికి ప్రయత్నించారు. లెనిన్ జయిలు నుండి విడుదల అగుటతోనే, ప్రథమ కాంగ్రెసు ఎన్నుకొనిన సెంట్రల్ కమిటీని పునరుద్ధరించడానికి, "రబోచయా గజెట్" (కార్మికుల గజెటు) పత్రికను పార్టీ ప్రధాన పత్రికగా చేయుటకు ప్రయత్నించాడు. కాని విఫలు డయ్యాడు.

## ఇస్క్రా

1900 సం॥ మే లో 'ప్స్కోవ్' నగరంలో పార్టీ రహస్య సభ జరిగింది. దీనికి లెనిన్, మార్టోవ్, పోట్రెసోవ్ వగైరాలు, మార్క్సు తత్వాన్ని బూర్జువాను బలపరుస్తుందనే(లీగల్) మార్క్సిస్టులు కొందరు కూడా హాజరయ్యారు. పార్టీ కేంద్ర పత్రిక ప్రకటించాలని తీర్మానించబడింది. తీర్మాన ప్రకారం లెనిన్, పొట్రెసోవ్, విదేశాలకు వెళ్ళారు. ప్లెఖనోవ్, మొదట వ్యతిరేకించాడు. కాని, కడకు అతనితో కూడ రాజీపడి స్టట్‌గార్టు నుండి ఇస్క్రా (అగ్నికణం)అను పేపరును "అగ్నికణంనుండి యేజ్వాల" అను నినాదంతో ప్రకటించారు. పత్రిక ప్రధాన సంపాదకుడుగా లెనిన్ పని చేసాడు.

ఈ కాలంలోనే మొదటిసారి లెనిన్ విప్లవ పార్టీ యొక్క నిర్మాణం ఎలా వుండాలో చర్చించాడు. ఇదియే తర్వాత పార్టీ సభ్యుల మధ్య వివాదాలకు కారణమైంది. కొందరు పార్టీ నిర్మాణములో ప్రజాతంత్ర సూత్రాలను పూర్తిగా అవలంబించాలనియూ, పార్టీ కమిటీల నన్నిటిని ఎప్పుడూ ఎన్నుకొంటూ ఉండాలనియు వాదించారు. లెనిన్ నిరంకుశ జార్ ప్రభుత్వంలో అట్టిది అపాయకరమును ఆకాశ సౌధాలు నిర్మించుట అని అన్నాడు. ఎన్నికసూత్రముపై నిర్మింపబడిన పార్టీలో సభ్యులకు, నాయకులకు సన్నిహిత సంబంధ ముండు మాట నిజమే అయినా, ఆ విధానం వలన పార్టీ అంతా పోలీసులకు ఎరుక పడుటచే వారు దానిని నాశనం గావించడం అతి సులభం. "ఎన్నిక" హక్కు కొరకు పార్టీ నాశనం గావించుటకు ఒప్పుకోడం మూర్ఖత అన్నాడు. అందుచే పైనుండియే పార్టీని ఆసమయములో నిర్మించాలన్నాడు. సెంట్రల్ కమిటీ పట్టణ కమిటీలను ఏర్పరచి, ప్రతి కమిటీకి సభ్యులను చేర్చుకొనే హక్కు యివ్వాలన్నాడు. ప్రధాన నాయకత్వం సరియైన రాజకీయ పాలసీ ప్రకారం నడుస్తూ ప్రజలతో సంబంధం వుంచుకొని నడుపగలిగి వుండాలన్నాడు. ఈ విధానంపైనే బోల్షివిక్ పార్టీ నిర్మించబడింది.

## పార్టీయొక్క రెండవ కాంగ్రెసు.

ఈ కాంగ్రెసులో 26 శాఖల ప్రతినిధులు 44 గురు పాల్గొన్నారు. నల్గురు కార్మికులు, నలుబది మెదడు కష్టము వారు (Intellectuals) ఒకటవ కాంగ్రెసులో పార్టీతో కలసినబండ్ (పోలిండు జూయిష్‌పార్టీ) లోని సోషల్ డెమోక్రటిక్‌లు ఇస్క్రా గ్రూపులో నిర్మాణ విషయంలో ఏకీ భవించలేదు. జాతులననుసరించి కార్మికులను ఆర్గనైజు చెయ్యాలన్నారు,'బండ్' జ్యూకార్మికుల ప్రతినిధి అని అంగీక రించాలన్నారు. దీనికి ప్రత్యామ్నాయంగా లెనిన్, కేంద్రీకరింపబడిన పార్టీవుండాలనియు, పనిచేసే స్థలమునుబట్టి శాఖలుండాలని వాదించాడు.

లెనిన్ సూచించిన నిర్మాణ విధాన మంగీకరింప బడింది, ప్లెఖానోవూ, లెనినూ సూచించిన కార్యక్రమం అంగీకరించింది. ఈ కాంగ్రెసు చారిత్రికమయింది. దీనినే బోల్షివిక్‌పార్టీ ( నరి పుట్టుకగా చెబుతారు. ఈ కార్యక్రమంపై మాట్లాడుతూ ప్లెఖానావ్, బూర్జువా డిమాక్రసీ కోర్కెలే తమ గమ్యస్థానం కాదన్నాడు. కాన్‌స్టిట్యుయెంట్ ఎశెంబ్లీకొరకు సార్వజనిక ఓటింగుకొరకు, సమ్మెచేయు హక్కుకొరకు, వాక్ పత్రికా, సభా స్వాతంత్ర్యముకొరకు బూర్జువా ప్రజాస్వామికములోని మరి ఇట్టి ఇతర హక్కులన్నిటి కొరకు తాము పోరాడు మాట నిజమే, కాని అవసరమైనచో తమవర్గ శత్రులవుకు ఆ హక్కులు నిరాకరించ బడుటకూడ సాధ్యమే నన్నాడు.

జాతీయసమస్యపై అన్ని జాతులకు స్వయం నిర్ణయాధికారమును విడిపోవుటకుహక్కును అంగీకరిస్తూ తీర్మానించారు. పొట్రేసోవు ప్రభుత్వాన్ని వ్యతిరేకించే లిబరల్సును బలపరచాలని తీర్మానం తెచ్చాడు.

పార్టీ కార్యక్రమము అంగీకరించి సహాయంచేస్తూ వ్యక్తిగతంగా పార్టియిచ్చిన ఏదో ఒక పనిచేయువారే సభ్యులగుటకు అర్హులని లెనిన్ వాదన. ట్రాట్‌స్కీ, మార్టోవ్‌లు కార్యక్రమం అంగీకరించిన వారందరిని చేర్చుకోవాలని వాదించారు. ఈ సమస్యపయినా, "బండ్" మూతా సూచించిన ఫెడరల్ నిర్మాణము అంగీకరించనందునా.వ్యతిరేకులందరు పార్టినుండి చీలిపోయారు. లెనిన్ అతని సహచరులును సెంట్రల్ కమిటీకి ఎన్నుకోబడ్డారు. పోలీసులకు అందుబాటులో నుండకుండుటకు విదేశాల్లో వుండాలిసి వచ్చుటచే, ఒక నిశ్చిత కార్యక్రమాన్ని ఎప్పటికప్పుడు ఇస్తూవుండిన ఎడిటోరియలుబోర్డు, సెంట్రల్‌కమిటీకన్న పయిదిగా ఎంచబడుతుండేది.

ఎడిటర్లుగా లెనిన్, ప్లెఖానొవ్, మార్టోవ్‌లు ఎన్నుకోబడ్డారు. సెంట్రల్ కమిటీకి, లెంగ్నిక్, ఝసోవస్కీ నాస్కోవలు ఎన్నుకోబడి తక్కినవారిని కోఆప్టు చేసుకొనే అధికారమివ్వ బడ్డారు. కాంగ్రెసు అయినవెంటనే ప్లెఖానోవ్ మెన్షివిక్కులతో కలయుటచే లెనిన్ రాజీనామాయిచ్చి, వెపిరాయిద్ పత్రిక స్థాపించాడు,

1904లో రషియా జపాను యుద్ధాన్ని గురించి, "ప్రజలు యుద్ధానికి వ్యతిరేకులు. ప్రజలలోవున్న అసంతృప్తి యుద్ధాన్ని ప్రభుత్వ నిరంకుశత్వము పై యుద్ధంగా మార్చుతుంద"ని లెనిన్ వ్రాశాడు. మెన్షివిక్కులు దీన్ని పారుబోతు (Defeatest) భావాలని వర్ణించారు.

1905 విప్లవ స్వభావాన్ని పోరాటాన్నినడిపే విధాన్ని గురించి, సాయుధ తిరుగుబాటును గురించి, తాత్కాలిక విప్లవ ప్రభుత్వాన్ని గురించి, బోల్షివిక్కులు, మెన్షివిక్కులు భేదించారు. రేగుచున్న విప్లవానికి నాయకత్వం కార్మికవర్గానిదా లేక బూర్జువాదా? అనేది ముఖ్యమైన భేదం. అది డిమాక్రేటిక్ విప్లవమే అయినా ప్రాతినిధ్యము కార్మికులదే. జారునూ ప్యూడలిజమును నాశనముగావించుట బూర్జువాయొక్క కర్తవ్యము అయినా, కేపిటలిజం అభివృద్ధిపొందిన నేటి ప్రపంచంలో ఆ విప్లవ అగ్రగాములు కార్మికులేనని లెనిన్ వాదించాడు. మెన్షివిక్కులు డిమాక్రిటిక్ హక్కులకై జరుగునదిగాన విప్లవ నాయకత్వం బూర్జువాదే (పెట్టుబటిదారులదే) అని అన్నారు. బూర్జువా కార్మికుల రైతుల సాయంతో సాయుధ తిరుగుబాటుచేసి అప్రతిహతమగు విజయంపొందినట్లయితే తాత్కాలిక విప్లవప్రభుత్వంలో కార్మికులుకూడా పాల్గొనాలని లెనిను అన్నాడు. మెన్షివిక్కులు ఆ పనంతా బూర్జువాదే. సోషల్‌డిమాక్రెట్స్ ఆ ప్రభుత్వానికి పార్లమెంటరీ వ్యతిరేక పక్షంగా వుండాలన్నారు.



## మూడవ కాంగ్రెసు.

ఈ కాంగ్రెసుకు 20 బోల్షివిక్‌లు 9 మెన్షివిక్ కమిటీలు ప్రతినిధులను పంపినవి. కాని మెన్షివిక్కులు, 'ఇస్క్రా' ఎడిటర్లు విడిపోయి వేరు వేరు సభలు జరుపుకున్నారు. అందుచే మూడవ కాంగ్రెసు పూర్తిగా బోల్షివిక్కుల కాంగ్రెసే, తిరుగుబాటు ఎత్తుల గురించి, లెనిన్ సూచనలు అంగీకరించ బడ్డాయి. ప్రజలకు హక్కులొసంగ బడుననే ప్రభుత్వ ప్రకటన ప్రజలను చల్లబరచుటకు మాత్ర మేనని, నిర్బంధ విధానాన్ని ఎదుర్కొడానికి విప్లవోత్సాహులగు ప్రజలను సాయుధులను చెయ్యాలని తీర్మానించారు. భూస్వాములు ఎస్టేటులన్నీ లాక్కొని విప్లవ కర్షక కమిటీలస్వాధీనంచేసి భూమిదున్నుచున్నవారి ఉపయోగానికివ్వాలని తీర్మానించింద.

ఆర్గనైజేషనులో మార్పులు కావించింది, సర్వసామాన్యమైన సెంట్రల్ కమిటీని ఎన్నుకోవాలి.అదియే ఎడిటోరియల్ బోర్డును ఏర్పరచుతుంది. పార్టీ కౌన్సిలు రద్దుచేయబడింది. "ప్రొలిటరీ" అను పార్టీ పత్రిక ఏర్పరచబడింది.

మెన్షివిక్ సభలో, ప్రజలను సాయుధులచేయడం, సైన్యంలో ప్రచారంచేసి తిరుగుబాటుతీసుకరావడం వీనిని గురించిన తీర్మానాలు పైములేదనిచర్చించలేదు. ఆర్థికహక్కులనుగురించియు, జారు ప్రసాదింపనున్న శాసనసభా ఎన్నికలలో పాల్గొనాలనీ తీర్మానించింది. కార్మిక కర్షకుల విప్లవ నియంతృత్వానిన్నాదాన్ని నిరాకరించింది. విప్లవము డిమాక్రసీ దశనుండి సోషలిస్టు దశలోనికి మారుతుందనే విషయాన్ని గుర్తించ లేదు.

దేశంలో తిరుగుబాటు జరుగుతూంది. జారుడ్యూమా ( శాసనసభ )ను ప్రసాదిస్తూ ప్రకటన చేసాడు. బోల్షివిక్కులు, సాయుధ పోరాటం సాగించాలసిన సమయంలో డ్యూమాఎన్నికలు ప్రజల దృష్టిని కాన్‌స్టిట్యూషనల్ నమ్మకాలవైపు మరల్చుతాయి. కాన వానిని బహిష్కరించాలన్నాడు. ప్రత్యక్షపోరాటం జరుగుతున్నపుడు ఎన్నికలలో పాల్గొనటం విప్లవ వ్యతిరేక మే. కత్తి దూనవలసిన సమయంలో దస్త్రం పట్టుట తగదు. కాని ఈ అంచనాలో బోల్షివిక్కులు విప్లవం అప్పటికే చరమదశలో వున్నదని గ్రహించలేకపోయారు.

ట్రాట్‌స్కీ, పార్వూస్‌లు మెన్షివిక్కులతో ఏకీభవించక

బూర్జువా ప్రజాస్వామికవిప్లవమే అయినా, కార్మికులదే ప్రధాన భాగం అనిచెప్పినారు.కాని రైతు ఉద్యమానికి విలువ యివ్వలేదు, విప్లవ వెల్లువలే తనంత తానే వస్తుందనే కాని ఆర్గనైజుచేసే ప్రయత్నాలు చేయలేదు. బోల్షివిక్కు పార్టి స్పష్టమైన కార్యక్రమం యెత్తులతో సిద్ధమయింది.

విప్లవం ఓడిపోయింది. జారు డ్యూమాను రద్దుచేశాడు. అసమ్మతి తెలియ జేయడానికి పెట్రోగ్రాడులో సర్వవ్యాపక జనరల్ సమ్మెను మెన్షివిక్కులు పిలిచారుకాని ప్రజలు పాల్గొనలేదు. ప్రభుత్వాన్ని నాశనం గావించడానికి గానపుడు జనరల్ సమ్మెమరెందుకని కార్మికులు నిర్లక్ష్యంచేశారు.

## నాల్గవ కాంగ్రెసు.

ఇది 1906 ఏప్రియల్ లో స్టాక్ హోమ్‌లో జరిగింది. దీని తరువాత మెన్షివిక్కులు బోల్షివిక్కుల మధ్య వివాదం తీవ్రమయింది. కార్యక్రమ మంగీకరించు వారినందరిని జేర్చుకొని కార్మిక ప్రజా పార్టీని చెయ్యాలని మెన్షివిక్కులు ప్రచారం చేసారు.

నవంబరులో అఖిల రష్యా పార్టీ కాన్ఫరెన్సు జరిగింది. డ్యూమా ఎన్నికల గురించి చర్చ చేసారు. మెన్షివిక్కులు బూర్జువా లిబరల్ పార్టీ అయిన కాడెటు పార్టీతో రాజీ పడాలన్నారు. బోల్షివిక్కులు దాన్ని తీవ్రంగా యెదుర్కొంటూ ఆయుధ సహిత తిరుగుబాటును బలపరచు, సోషల్ రివల్యూషనరీలు, ట్రూడోవిక్ (కార్మిక) పార్టీలతో కలసి పని చేయాలని సూచించారు. కాని మెజారిటీ మెన్షివిక్కులదే. వారే సెంట్రల్ కమిటీకి వచ్చారు.

బోల్షివిక్ పార్టీ ఆధీనంలో వున్న పెట్రోగ్రాడ్ కమిటీని సెంట్రల్ కమిటీ "కాడెట్ పార్టీ"తో ఎన్నికలలో రాజీ పడవని సూచించింది. "కాడెటు"లు రాజీని నిరాకరించుటతో మెన్షివిక్కులు మెజారిటీగా ఉన్న సెంట్రల్‌కమిటీ తెల్లమొగం వేసింది,

## రెండవ డ్యూమా

రెండవ డ్యూమా ఎన్నికలలో పార్టీ పాల్గొంది. 64 గురు సోషల్ డిమాక్రేటులు జయం పొందారు. పార్టీలో మెన్షివిక్కులే మెజారిటీ. వారు లిబరల్సు అయిన "కాడెటు"పార్టీతో స్నేహం అభిలషించే వారు గాని కర్షక పార్టీ అయిన సోషల్ రివల్యూషనరీలతో కాదు. అందుచే అతివాదులను కేడెటులు డ్యూమాలో ఓడించేవారు.

## ఐదవ కాంగ్రెసు

1907 మే నెలలో లండను నగరంలో సమావేశమయినది. 105 బోల్షివిక్కులు, 97 మెన్షివిక్కులు,44 పోలిష్, 29 లాట్వియన్ సోషల్—డిమాక్రేటులు, 57 బన్డ్ పార్టీవారు హాజరయ్యారు. ఈ కాంగ్రెసు వివాదాల వల్ల దీర్ఘకాలం జరిగి సోవియటు ప్రభుత్వం ఏర్పడువరకుతీర్పుని అప్పు పార్టీ నెత్తినపడింది. జరిగిన మూడు వారాలలో సెంట్రల్‌కమిటీ, డ్యూమాపార్టీల రిపోర్టులపై చర్చ రెండువారాలు పట్టింది. బోల్షివిక్కుల తరపున బేగ్డనావ్ సెంట్రల్ కమిటీ యొక్క తడబాటును (oppurtunism) విమర్శిస్తూతెచ్చిన తీర్మానం ఓడిపోయింది. డ్యూమా పార్టీపై కాడెటులతో జేరినందుకు తెచ్చిన విమర్శన తీర్మానం కూడా ఓడిపోయింది. కాని వెనుకటి పాపాలకు మెన్షివిక్కులను నిరసించుటకు అంగీకరించకపోయినా పాలసీ నిర్ణయించడంలో ఇతర పార్టీలతో సంబంధము గురించీ, బోల్షివిక్కులు తెచ్చిన తీర్మానం నెగ్గింది. విప్లవ ప్రతికూలురైన 'కాడెటు'లను దాక్షిణ్య రహితంగా బట్టబయలు గావించాలనీ, రైతులలో పని చేయు "సోషల్ రివల్యూషనరీల లోట్లు చూపుతూ వారితో కలసి పని చేయాలనీ తీర్మానించారు.

ఈ కాంగ్రెసు ప్రతినిధులు 1 లక్ష 50 వేలు సభ్యులుగల కార్మిక సంఘాలలో పలుకుబడి గలవారు. పార్టీల బలం వృద్ధి అయిన దినా లవి. వెయ్యికి ఒక ప్రతిని వంతున యెన్నుకోవాలని నిర్ణయింపబడింది. దీని తరువాత ప్రభుత్వ తీవ్ర నిర్బంధ విధానం వలన పార్టీ దెబ్బ తిన్నది. మరుసటి కాంగ్రెసు జరుపడానికి పది వత్సరాలు పట్టింది.

రెండవ డ్యూమా రద్దు చేయబడి సోషల్ డెమాక్రేటు ప్రతినిధు లందరూ—రహస్యంగా తప్పించుకొన్నవారు తప్ప—అరెస్టు చేయబడ్డారు. ఉద్యమ తీవ్రత, క్రమంగా ఒడు దుడుకులతో క్షీణించింది.

## మూడవ డ్యూమా

సంకుచితమైన నూతన ఎన్నికల శాసనం ప్రకటించి మూడవ డ్యూమా ఎన్నికలు పెట్టింది ప్రభుత్వం. సెంట్రల్ కమిటీ అఖిల. రష్యను కాన్ఫరెన్సును పిలిచింది, ఎప్పటివలెనే బోల్షివిక్కులు ఎన్నికలలో పాల్గొనడానికి సుముఖులే. బోల్షివిక్కులు లెనిన్ తప్ప ఇతరులు విముఖులు. లెనిన్ ప్రత్యక్ష పోరాటం త్వరలో వచ్చే సూచనలు లేనపుడు ఎన్నికల బహిష్కరణలో అర్థం లేదన్నాడు. పార్టీ డ్యూమా ఎన్నికల్లో పాల్గొని, ప్రజలతో సంబంధం ఎక్కువ చేసుకోడానికి 'డ్యూమా' యిచ్చు సదుపాయాలను ఉపయోగించుకోవాలి. డ్యూమాను ఉపన్యాస వేదికగా, ఉపయోగించుకొంటూ పార్టీ ప్రతినిధులు పార్టీ వివిధ శాఖల మధ్య సంబంధం కూర్చువారుగా తయారుగావాలి అనే లెనిన్ తీర్మానం ప్యాసయింది.

పార్టీ పత్రికలు అణచివేయబడిన ఈ కాలంలో మెన్షివిక్కులు, బూర్జువా పత్రికలలో బోల్షివిక్కులను విమర్శిస్తూ వ్యాసాలు వ్రాయ సాగారు. పార్టీ సభ్యులెవరు పార్టీలోని తగవుల గురించి బూర్జువా పత్రికలకు వ్రాయకూడదని కాన్ఫరెన్సు నిషేధించింది. సెంట్రల్ కమిటీ 'ఫిన్ ల్యాండ్' వదలి స్విట్జర్లెండులో మకాం పెట్టింది.

ఈ రోజుల్లో పార్టీలోని బోల్షివిక్, మెన్షివిక్ చీలికలే గాకుండా బోల్షివిక్కులలో కూడ చీలిక వచ్చింది. సోషలిజం ఒక మతముగా యెంచువారు బయలుదేరిరి. బేగ్డనోవ్, లూనాచర్‌స్కీ, ఎలెక్జిన్‌స్కీ, గోర్కీ వగైరాలు, కాప్రీ దీవిలో స్కూలు పెట్టారు. స్కూలు విద్యార్థులు, పైవారు కలసి, "వెపరియాడ" అను పత్రికను స్థాపించి, సాహిత్యమును ప్రకటించారు. ఈ ముఠా లెనిన్‌తో భేదిస్తూ చాలా కాలం వేరుగా వుండినది. ఈ చీలికల గురించి లెనిన్, "బూర్జువా ప్రజా స్వామిక విప్లవ మార్గంలో సోషలిస్టులతో అనేకమంది పెట్టీ బూర్జువా తోడిప్రయాణీకులు కలుస్తారు. వారిపుడు మార్క్సిజం నుండి విడిపోతున్నారు" అన్నాడు.

ఇన్ని చీలికలు వచ్చిన పార్టీ 1908 - 10 లతో అఖిల రష్యను స్త్రీల మహాసభ, ఫ్యాక్టరీ డాక్టర్లసభ, ప్రజా విశ్వ విద్యాలయాల మహాసభ, మద్యపాన నిషేదసభ జరిపింది. వాని తీర్మానాలతోదేశం మారు మ్రోగింది. వీని ద్వారా ఏమాత్రము లీగల్ హక్కులులేని సమయములో పార్టీ ప్రచారాన్ని. పార్టీ సమావేశాలను జరిపారు, ప్లెఖనావ్ మెన్షివిక్‌లనుండి విడిపోయి ప్రత్యేక పేపరు పెట్టాడు. టా్రిట్‌స్కీ, తన పత్రిక "ప్రవడా" లో మధ్యరకం పాలసీ అవలంబించాడు. 1910 జనవరి సెంట్రల్ కమిటీ మీటింగులో లెనిన్ అన్నిశాఖల వారితో పోరాటం సాగించాలన్నాడు. కాని సెంట్రలు కమిటీ అన్ని గ్రూపులను, కలుపుకోడానికి మెజారిటీతో, తీర్మానించింది. బోల్షివిక్ పత్రికలు "పొలిటరీ, సోషల్ డిమాక్రెట్"లను ఆపుచేయాలనీ, ట్రాట్‌స్కీ పత్రిక ప్రవడకు పార్టీ పత్రికచేసి, ఫారన్ బ్యూరోవిదేశాల్లోనూ, సెంట్రల్ కమిటీ రష్యాలోనూ, వుండాలని తీర్మానించింది. రాజీ ప్రకారం మెన్షివిక్కులు నడచుకోలేదు. విభేధాలెప్పటిలాగే వుండినాయి. మెన్షివిక్కులు పెట్రోగ్రాడ్, మాస్కోలలో లీగల్ పత్రికలుపెట్టి రహస్యపు పని కూడదని, సోషల్ డిమాక్రేటిక్ పార్టీ యెన్నడో నశించిందని ప్రచారము సాగించారు. ప్లెఖానావ్, పైవారితో పోరాడుతూనే బోల్షివిక్ పాలసీతో భేదించేవాడు.

1910 లో మరల ప్రజాఉద్యమం ప్రారంభమయింది. 1912 - 14 లో రాజకీయ సమ్మెలు ప్రారంభమయ్యాయి,

1912 అగస్టులో మెన్షివిక్కులు ప్రేగ్‌లో సమావేశమయ్యారు. ప్లెఖానావు దానితో ఎట్టిసంబధం పెట్టుకోలేదు. దానిలో మార్టోవు, డాన్,ట్రాట్‌స్కీలు ప్రాముఖ్యం వహించారు.

## నాల్గవ డ్యూమా.

ఎన్నికల్లో అందరూ పాల్గొన్నారు. సంకుచితమైన ఓటింగు శాసనంవలన సోషల్ డిమాక్రేటులు 13 గురు మాత్రం ఎన్నుకోబడ్డారు. 1912 'క్రేకోవ్' లో సెంట్రలు కమిటీ యొక్కయు, ఇతర వర్కర్ల యొక్కయూ మీటింగు జరిగింది. ప్రజలలో అసంతృప్తివలన జరుగుతున్న సమ్మెలకు నాయకత్వం వహించి బోల్షివిక్కులు రాజకీయ, పోరాటంలోకి మార్చడానికి కార్యక్రమం వేశారు.

## అంతర్జాతీయ పార్టీ బోల్తా.

రష్యాలో మెన్షివిక్కుల వలెనే అంతర్జాతీయ సోషల్ డిమాక్రేటులు (2వ ఇంటర్నేషనలు) తమ తమ దేశాల బూర్జువా పార్టీలకు అనుచరులుగా తయారయ్యే దృక్పధము కల్గివుండేవారు. ప్రపంచ సంగ్రామపురోజులలో వారు సోషలిస్టు విప్లవం సంగతి దేవునికో - దయ్యానికో వదలి కష్టజీవుల మారణ యంత్రాలకు బలియొసంగు యుద్ధానికి తయారయిన తమదేశపు బూర్జువా ప్రభుత్వాలతో సహకారముచేసారు. జర్మనీ, ఫ్రాంసు, బెల్జియము మంత్రి వర్గాలలో స్థానాలు సంపాదించు కొన్నారు.

మెన్షివిక్కులు ఫ్రెంచి, జర్మను అన్నయ్యల పనే చేసేవారే మోగాని జార్‌ప్రభుత్వం వారినొక లెక్కలోకే తీసుకోలేదు. టా్రిటస్కీ ఆ రోజులలో సంయుక్తఫెడరేషను నిర్మించాలన్నాడు. సోషల్ డిమాక్రేటులను తనపాలసీకి త్రిప్పుకో ప్రయత్నించి విఫలుడై అతివాదులైన బోల్షివిక్‌లతో కలిసాడు. లెనిన్ ప్రాంభంనుండీ యుద్ధం వివిధ కాపిటలిస్టు ప్రభుత్వాలమధ్య కాలనీలకొరకు జరుగుచున్న సామ్రాజ్యవాద యుద్ధమనీ, కార్మికులు ప్రతిదేశంలోను తిరుగుబాటుచేసి అంతర్యుద్ధంగా (సివిల్‌వార్) మార్చాలన్నాడు. యుద్ధానికి కారణమైన పెట్టుబడిదారీ ప్రభుత్వాలను నాశనంగావించి కార్మిక కర్షకుల ప్రభుత్వమును, ప్రపంచ శాంతిని స్థాపించాలని హెచ్చరించాడు.

1917 మార్చి విప్లవంలో ప్రజాస్వామిక ప్రభుత్వం రైతులకు భూమి, కార్మికులకు 8 గంటల పని కావాలి" అనే బోల్షివిక్ నినాదాలతో ప్రజలు తిరుగుబాటు చేసారు. సైనికులు ప్రజలవైపుకువచ్చి జారు ప్రభుత్వాన్ని నాశనం గావించారు. అంటే లెనిన్ బోల్షివిక్ పార్టీపాలసీ సంపూర్ణంగా జయంపొందిన దన్నమాట.

మార్చి విప్లవం తరువాత ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వాన్ని పదచ్యుతం గావించాలనే భావం పార్టీలోని అతివాదులు వెల్లడించారు. అటు కమెనోవ్, జినీవీవ్ వగైరాకొందరు తాత్కాలిక ప్రభుత్వాన్ని రక్షించాలన్నారు. సైన్యాలను రద్దుచేయాలనీ యుద్ధం ఆపుచేయాలనే నినాదాలు "బానిసలపాలసీ" అని

తెలియజేస్తూ ఉన్నాయనీ. అన్నాడు. పార్టీ యీ ప్రకటనకు కమినోవ్ను సంజాయిషీ అడిగింది.

లెనిన్ ఏప్రియల్ 4వ తేదీకి రష్యావచ్చాడు. తాత్కాలిక ప్రభుత్వం ప్రజలదికాదనీ, వారికి శాంతి. రొట్టె, స్వతంత్రం ఇవ్వదనీ, ప్రకటించాడు. జమీందారుల భూమిలాక్కొని రైతు కమిటీల స్వాధీనం చెయ్యాలన్నాడు. ప్రజలను తమహక్కుల గుంజుకోడానికి తయారు గమ్మన్నాడు. మెన్షివిక్కులు, సోషలు రివల్యూషనరీలు భూమి సమస్య కానిస్టిట్యూయెంటు అసెంబ్లీయే పరిష్కరిస్తుందన్నారు. కాని రైతులు జమీందారులను నాశనంగావించి భూమి స్వాధీనంచేసికోసాగారు. తాత్కాలిక ప్రభుత్వం యుద్ధం కొనసాగించే ప్రయత్నాలుచేసి అపజయం పొందింది. జులై దినాలలో, శాంతికోరుచున్న సైనికులు, కార్మికులు అధికారమంతా, సోవియటుల స్వాధీనం కావాలంటూ ఊరేగింపు చేశారు తిరుగుబాటుకు సమయంరాలేదని బోల్షివిక్‌పార్టీ ఊరేగింపు శాంతియుతంగా, జరుగునట్లు చూచింది. సెప్టెంబరులో విద్రోహి జనరలు కార్నిలోవ్ యొక్క దండయాత్రనుండి పెట్రోగ్రాడ్‌ను కార్మికులు. సైనికులు, బోల్షివిక్కుల నాయకత్వం క్రింద కాపాడారు. తరువాత తాత్కాలిక ప్రభుత్వం రైతువిప్లవాన్ని అణచివేయడానికి విద్రోహసైన్యాలను పంపసాగింది. ప్రజా విప్లవఫలితాలు ప్రజలచేతినుండి జారిపోయేటట్లున్నాయి. లెనిన్ నాయకత్వాన బోల్షివిక్ పార్టీ తిరుగుబాటుకు సమయం ఆసన్నమయిందని తీర్మానించింది. రైతుల నణచిన కెరిన్‌స్కీ ప్రభుత్వం తరువాత కార్మికులను, చివరకు విప్లవాన్ని నాశనంగావించి, బూర్జువా ప్రభుత్వాన్ని నెలకొల్పుతుందన్నారు. నవంబరు 7వ తేదీ సోవియటు కాంగ్రెసు జరుగునాటి రాత్రే సాయుధ తిరుగుబాటు గావించారు. సోషల్‌రివల్యూషనరీలే మెజారిటీకల్గిన కాంగ్రెసునే, "ఇదిగో అధికారంస్వీకరించం"డన్నారు.

## నూతన విప్లవ ప్రభుత్వం

లెనిన్ అధ్యక్షత క్రింద ఏర్పడిన కార్మిక వర్గ ప్రభుత్వం బ్యాంకులు, పరిశ్రమలను స్వాధీనం చేసుకొంది. భూమిపై కర్షక సోవియటులకు సంపూర్ణ అధికార మిచ్చింది. యుద్ధాన్ని ఆపుజేయ బూనింది.

జర్మనీతో రాజీ విషయమై ట్రాట్‌స్కీ, బుఖారిన్ వగైరాలు, జర్మనీ షరతులు ఒప్పుకొనుట అసాధ్యమని "రాజీ లేదు; యుద్ధం లేద"ను నినాదం లేవదీసారు. లెనిన్ ప్రజలు శాంతిని కోరుచున్నపుడు, సైన్యాలు యుద్ధము చేయు స్థితిలో లేనప్పుడు శత్రువులు కోరినదల్లా యిచ్చైన రాజీ చేసుకోవా లన్నాడు. "యుద్ధం లేదు; రాజీ లేదు" అనడం "గాల్లో దీపముంచి దేవుడా నీ మహిమ" అన్నట్లుంది. పార్టీ రాజీకే అంగీకరించింది.

కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీకి నవంబరులో ఎన్నికలు జరిగాయి. కార్మికులలో బోల్షివిక్కులు జయ మొందినా చాలా పూర్వం తీసికొన్న నామినేషన్లపై రైతుల నుండి యెన్నికలు జరుగుటచే సోషల్ రివల్యూషనరీలు ప్రతినిధులుగా వచ్చారు. రైతులకు భూమి నిచ్చిన శాసనాన్నీ. యుద్ధ ముగింపు డిక్రీనీ, సోవియటు ప్రభుత్వాన్ని కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీ అంగీకరించకపోవుటచే రద్దు చేయబడింది. ప్రజలు కోరుతున్న శాంతిని రైతులు పొందిన భూమిని వద్దనే కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీని రద్దు చేస్తే కన్నీ రెవరికి ?

## కమ్యూనిస్టు పార్టీగా మార్పు

ఇతర దేశా లన్నిటిలోని సోషల్ డిమాక్రేటిక్ పార్టీలు. రష్యాలో మెన్షివిక్‌లు బూర్జువా అనుచరులై కార్మిక విప్లవాన్ని మోసం చేయుటచే. ఆ మురికి పట్టిన పేరు మార్చాలనే భావం ఏప్రిల్ కాన్ఫరెన్సులోనే బయలు దేరింది. 7 వ కాంగ్రెసులో కమ్యూనిస్టుపార్టీ అని నా కరణం చేసారు.

## అనార్కిస్టులు

బుఖారిన్ వగైరా అతివాదులు శ్రామికవర్గం జయించింది గాన ఇక ప్రజలపై అధికారం చలాయించే స్టేటు (ప్రభుత్వం) ఉండనక్కరలేదనే అరాచకుల వాదాన్ని తీసుకొచ్చారు. కాని ప్రజలలో యింకా వర్గా లున్నాయనీ, కార్మిక కర్షక నియంతృత్వముండి కష్ట జీవుల అధికారాన్ని కాపాడకపోతే. బూర్జువా తన ప్రభుత్వాన్ని స్థాపించుకోడానికి విద్రోహం లేవదీస్తుందనీ పార్టీ నిర్ణయించింది. 1918 నుండి 1921 వరకు జరిగిన విద్రోహుల తిరుగుబాట్లు, వారికి విదేశ బూర్జువాప్రభుత్వాల తోడ్పాటు పార్టీ నిర్ణయం సరియైనదని రుజువు చేసింది.

## ఎనిమిదవ కాంగ్రెసు

విప్లవం నాటికి పార్టీలో ఎక్కువమంది కార్మిక వర్గ సభ్యులే వుండేవారు. అనంతరము. రెడ్ ఆర్మీ నుండి కమ్యూనిస్టు యువజన సంఘాల నుండి గ్రామ శాఖల నుండి రైతులు ఎక్కువగా చేర్చుకోబడ సాగారు. వ్యవసాయ ప్రధానమైన దేశములో కమ్యూనిస్టు పార్టీలో కర్షకులు వుండక తప్పదు. కాని వీరితోపాటు అనేకమంది పార్టీ సూత్రాలనే గమనించనివారు. ప్రభుత్వం కొనసాగించే పార్టీ యగుటచే ప్రవేశించారు. వీరిని బయటకు తరుమడానికి ఎనిమిదవ కాంగ్రెసు సభ్యులందరిని పరీక్ష జేసి తిరిగి సభత్వ మివ్వాలని తీర్మానించింది. మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి సహాయం చేయ తీర్మానించింది. పార్టీ కార్యక్రమాన్ని రివైజు చేసింది.

పార్టీ యొక్క తొమ్మిదవ కాంగ్రెసు 1920 ఏప్రిల్‌లో

సమావేశ మయింది. పార్టీ సభ్యత్వము రెండింతలగుటచే పార్టీ నిర్మాణ విషయమందు చాల శ్రద్ధ తీసుకొంది. పరిశ్రమలను సరిగా నడిపించడానికి, అంతవరకు వలె అయిదుగురి మానేజ్ మెంటు క్రింద గాక ఒక వ్యక్తి మానేజ్‌మెంటు క్రిందనే ఉండాలని తీర్మానించింది. ఈ తీర్మానాల ననుసరించి పార్టీ పని చేయడము వలననే ఆ యుద్ధ కాలపు చిక్కుల నుండి సోవియటు ప్రభుత్వం బయట పడ గల్గింది. పార్టీ అంతా ఒకవిధమగు యుద్ధ యంత్రము లాగకఠిన శిక్షణ క్రింద పని చేస్తూ వచ్చేది.

10 వ పార్టీ కాంగ్రెసు 1921 మార్చినెలలో సమావేశ మయింది. సోవియటు ప్రభుత్వానికి, ట్రేడు యూనియనులకు ఎట్టి సంబంధముండాలి అనే విషయాన్ని చర్చించి నిర్ణయానికి వచ్చింది. ట్రాట్‌స్కీ వాదన, ట్రేడు యూనియనులు. ప్రభుత్వపు డిపార్టుమెంటులు కావాలని. అంతే గాక వాని నాయకత్వము వహించే కమిటీలనుకూడ పైనుండి ఎన్నుకోవాలన్నాడు, పార్టీలో "వర్కర్సు అపోజిషను" అనే మరియొక గ్రూపు, ప్రభుత్వమే ఉండగూడదనీ, ప్రభుత్వ డిపార్టుమెంటు లన్నీ ట్రేడు యూనియనుల పరము చేయాలనీ వాదించారు. లెనిను నాయకత్వాన పార్టీ ఈరెంటినీ నిరాకరించింది. ట్రేడు యూనియనులు కార్మిక వర్గం యొక్క హక్కులను రక్షించాలనీ.ప్రభుత్వంలో బ్యురాక్రసీ అభివృద్ధి కానివ్వకుండా కనిపెట్టుతూ ఉండాలనీ, సోషలిస్టు నిర్మాణమును నేర్పునట్టిది గాను కమ్యూనిజాన్ని నేర్పే పాఠశాలలగాను ఉండాలనే లెనిను వాదాన్ని బలపర్చింది.

అంతే గాక, ఈవరకు రైతుల నుండి కోటాల ప్రకారం ధాన్యమును తీసుకొనేవారు. ఇప్పుడా పద్ధతి మానేసి ఒక పన్ను విధించారు. ఈ పన్నును ధాన్యంలోనే వసూలు చేయాలి. ఈ తీర్మానము వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి, కార్మికులకు రైతులకు సామరస్య సంబంధాలను నెలకొల్పడానికి చాల అవసరమయినది. నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశ పెట్టింది. పార్టీ లో ఎట్టి గ్రూపులు కూడ ఉండకూడదని తీర్మానించి ఐక్యతను, శిక్షణను నెలకొల్పింది.

1922 మార్చిలో 11 వ పార్టీ కాంగ్రెసు సమావేశ మయినది. నూతన ఆర్థిక విధానమును ఆచరణలో పెట్టడాన్ని గూర్చి పార్టీలోని వర్కర్సు అపోజిషను గ్రూపులాంటి వానిని రద్దు చేయడాన్ని గూర్చి నిర్ణయాలు చేసింది.

1923 ఏప్రిలులో 12 వ పార్టీ కాంగ్రెసు సమావేశమయినది. పక్షానికి, ప్రభుత్వానికిని గల సంబంధాన్ని గూర్చి చర్చించింది. కొంతమంది పార్టీ నియంతృత్వము, శ్రామిక నియంతృత్వమునకు బదులు వచ్చేటట్లున్నదనే వాదనను నిరాకరించింది. పార్టీ శ్రామిక పక్షమైనపుడు, శ్రామిక నియంతృత్వమే గాని వేరేమి కాదని నిశ్చయించింది.

1924 ఆఖరున 13 వ కాంగ్రెసు, 1925 మధ్య 14 వ కాంగ్రెసు, 1927 డిసెంబరులో 15 వ కాంగ్రెసు, 1930 జూన్ 26 నుండి జూలై 26 వ తారీఖు వరకు 16 వ కాంగ్రెసు, 1934 ఫిబ్రవరి నెలలో 17 వ కాంగ్రెసు జరిగాయి. కాంగ్రెసుల మధ్య కాన్ఫరెన్సులు, జరిగేవి. 17 వ కాన్ఫరెన్సు 1932 లో జరిగింది. కాన్ఫరెన్సు కూడ, కాంగ్రెసులాగనే, అనేక విషయాలనుగూర్చి తీర్మానాలు చేయకోడానికి అధికారముంది. ఈ తీర్మానాలు కూడ సభ్యు లందరిపై వర్తిస్తాయి. అయితే పార్టీకి కొత్త కమిటీలను ఎన్నుకోవడము మొదలగు నిర్మాణ విషయాలన్నీ పార్టీ కాంగ్రెసే చేయవలసి యుంటుంది. విప్లవము అయిన పిదప నుండి నేటివరకు జరిగిన పార్టీ కాన్ఫరెన్సులు, కాంగ్రెసులు ప్రధానంగా, సోవియటు యూనియనులో సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పడానికి కావలసిన విషయాలను గూర్చి చర్చిస్తూ నిర్ణయాలు చేసేవి. కొన్నిటిపైన ఉదహరించాము. మిగిలిన కాన్ఫరెన్సులు, కాంగ్రెసులలో ప్రధానమైనవి. 14వ కాంగ్రెసు, 15 వ కాంగ్రెసులు. 14 వ కాంగ్రెసు ట్రాట్‌స్కీ గ్రూపు, బుఖారిన్, కామినీవ్, జినోవీవ్ మొదలగువారియొక్క సిద్ధాంతాలను ఖండిసూ తీర్మానాలు చేసింది. 15 వ కాంగ్రెసే, నూతన ఆర్థిక విధానమును పూర్తిగా వదలి మొదటి పంచవర్ష ప్రణాళికను ఆచరణలోకి తేవాలని నిర్ణయించింది.

## ట్రాట్‌స్కీ వాదన ఏమిటి?

నూతన ఆర్థిక విధానము ప్రవేశపెట్టుట పెట్టుబడిదారీ విధానానికి పోవుటేఅని ట్రాట్‌స్కీ. వర్కర్సు ట్రాత్‌గ్రూపు అభ్యంతరం చెప్పారు. ప్రధానపరిశ్రమలు. బ్యాంకులు శ్రామిక ప్రభుత్వం ఆధీనలోవుండగా అది జరుగదని పార్టీనిర్ణయించింది. కర్షకులకు సోషలిస్టు చైతన్యం కలుగుతుందనే నమ్మకమే ట్రాట్‌స్కీకి లేకుండెను. కర్షకులే యెక్కువగల్గిన రష్యాలో ప్రపంచ విప్లవం రానిదే సోషలిజం స్థాపించుట అసాధ్యము; కాన ఇతర దేశాలలో విప్లవ ఉద్యమాలను సైనిక సహాయంతో కూడ బలపరచాలని అన్నాడు. సోవియటు యూనియన్‌లో సోషలిస్టు ఆర్థిక విధానం జయంపొందుటే ప్రపంచ విప్లవమును బలపరుస్తుందనీ, సైనికసాయం పంపిన కేపిటలిస్టు ప్రభుత్వాలు ఏకమై ఒక్కకార్మిక ప్రభుత్వంపై తలపడుటేగాక ఆదేశ ప్రజల జాతీయభావంకూడ వారికి సాయపడుతుందని, ట్రాట్‌స్కీ వాదనను పార్టీ నిరాకరించింది. కార్మికవర్గ ప్రభుత్వం సోవియట్ ప్రజలకు కూర్చగలిగినమేలే ప్రపంచ కార్మికుల చైతన్యాన్ని వృద్ధిచేసి విప్లవోన్ముఖుల చేయగలుగుతుంది. అని స్టాలిన్ వాదించాడు.

పార్టీ స్టాలిన్ వాదనను అంగీకరించినా ట్రాట్‌స్కీ తన వ్యతిరేకతను మానుకోలేదు. అందుచే 15వ పార్టీకాంగ్రెసు అతని పార్టీనుండి తొలగించింది. పిదప దేశాన్నుండే ప్రవాసానికి పంపించాలని వచ్చింది. ఈ మధ్య సోవియటు యూనియనులో జరిగిన కేసులలో, ( 1935 లో కామినీవ్ జినోవీవ్ కేసు, 1936 లో కార్లరాడక్, రైకోవ్ కేసు, 1937 ఆరంభమున టుకచవస్కీ మొదలగు సేనానాయకుల కేసు, 1938మార్చి నెలలో బుఖరిన్, రకోవస్కీ కేసులలో ) ట్రాట్స్కీ అనుయాయులు, కడకు ఫాసిస్టు ప్రభుత్వాలతోకూడ కలసి సోవియటు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి చేసిన ప్రయత్నాలు, పరిశ్రమలను భగ్నము కావించడము, సోవియటు నాయకులను చంపడానికి ప్రయత్నించడము, గోర్కీని చంపడము. ఇవి అన్నీ బయట పడ్డాయి. అయినా ఇట్టి కుట్రలన్నింటిని అణచివేసి సోవియటు యూనియనులోని కమ్యూనిష్టులు, సోషలిష్టు సమాజాన్ని నిర్మించే పనిలో యధావిధిగ నిమగ్నులై యున్నారు.

ప్రస్తుతం సోవియటు కమ్యూనిస్టు పక్షములో 25 లక్షల సభ్యులకుపైనడున్నారు, సోవియటు యూనియను కమ్యూనిస్టు పక్ష కార్యదర్శి, స్టేలిన్.

పార్టీనుండి పనికిరాని వాళ్ళను ద్రోహులను అప్పుడప్పుడు విచారణచేసి తొలగిస్తుంది. ( Purge పర్జి చేస్తుంది ) ఇందు కొరకు కంట్రోలు కమిషన్లు యెన్నుకోబడతాయి. ఈ కమిటీలు ప్రజలముందు పార్టీ సభ్యులందరిని విచారణచేస్తారు. ప్రజలందరూ యీ విచారణలో పాల్గొని సభ్యుని మంచిచెడ్డలగురించి సాక్ష్యలిస్తారు. దీనిమూలంగా పార్టీనుండి తొలగించిన వారిసంఖ్యలను చూడండి.

| | 1922 | 1923 | 1923 |
|---|---|---|---|
| పెడలగొట్ట బడినవారు | 25,900 | 25,500 | 16,718 |
| రాజీనామాయిచ్చినవారు | 14,100 | 15,300 | 27,300 |

1931 పర్జిద్వారా నూటికి 20 మందిని తొలగించారు.

ఈ పర్జి ద్వారా పార్టీలో చేరిన కల్మషం కొట్టుకుపోతూంది. ప్రజలకు నాయకత్వం వహించాలసిన పార్టీ సభ్యులందరూ ప్రజలందరిముందు విచారింపబడుటచే అధికార దుర్వినియోగమున కవకాశముండదు.

## పార్టీకి సభ్యుల చేర్చుకొను విధము.

సోషలిస్టు నిర్మాణమునకు కృషిచేయు ప్రజా సంస్థలు కార్మిక సంఘాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు. రెడ్ఆర్మీ. కమ్యూనిస్టు యువజన సంఘాలు, వీనినుండి స్థానిక పార్టీ సంస్థలు, తమ సభ్యుల గ్యారెంటీపై క్రొత్తవారిని చేర్చుకొంటాయి. నేడు సోవియటు బాలబాలికలు 8 - 12 సంవత్సరాలమధ్య లిటిల్ అక్టోబరిస్టులు, 10 - 16 పయినీర్లు, 16-23 కంసోమాల్సు గా ప్రజాసేవయందు తరిఫీదు పొందుచున్నారు. సోషలిస్టు నిర్మాణాన్ని బలపరచడానికి నాయకత్వం తయారు చేయడానికి అవకాశాలు వీరందరికి యివ్వబడుతున్నాయి. వీరిలో పరీక్షలకు ఆగి కడకు నిలబడేవారే పార్టీలో చేర గలుగుతారు. ఇట్టి కమ్యూనిస్టులు, నూతన మానవ నాగరికతను శక్తి కొలది "పని అవసరముకొద్ది ఫలము," అనే సూత్రముపై నడిచే కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించడానికి పనిచేస్తున్నారు. నాయకత్వము వీరిదిగాక మరెవ్వరిది అగును ?

వీనస్ భీమాకంపెనీ

హెడ్డాఫీసు :
వీనస్ బిల్డింగ్సు, దర్యాగంజ్, ఢిల్లీ.

మానవుని జీవితభీమా అత్యావశ్యకత గుర్తింపుట ప్రధాన తమసమస్య. ఆర్థిక మాంద్యము గల యీరోజుల్లో యేమానవుని జీవితము మాత్రము క్లిష్టసమస్యయందు జేరియుండదు!! అట్టిది గుర్తించియే కుటుంబరక్షణకు, భీమాచేయింపవలయును.
జీవితమునుండి నన్నాళ్ళు ఎట్టి సమర్ధతతోడనో కుటుంబరక్షణకు లోటురానీయక కాపాడుచుందురు. అంతియే తదనంతరము తమ కుటుంబము విషమస్థితిని జిక్కుకొని వివిధవ్యధలు పొందుచుండుట కనులార గాంచుచుంటిమి గదా? ఆంధ్రసోదరా! నీభవిష్యత్తును నీవు గుర్తింపుము! క్షణభంగరములగు జీవితములు రక్షణ గావింప వలెనన్న భీమాయెట్టి అవసరమో యోచింపుడు. అదినీవు గుర్తింపకున్న నీచేతులతో నీకుటుంబమునకు ద్రోహముచేసినట్లే!! నేడే, గుర్తించి నీజీవితమును భీమా గావింపుము.

వివిధరక్షణముల కాటపట్టైన "ది వీనస్ భీమాకంపెనీ" వివరములను దెలిసికొనుడు.

చీఫ్ యేజన్సీ ఆఫీసు పవరుపేట, ఏలూరు



# సోవియట్ ★ ★ రాజ్యాంగ నిర్మాణం



కామ్రేడ్ కాలినిన్
సోవియట్ యూనియన్ అధ్యక్షుడు.

రష్యాను సోవియటు రష్యాయని అంటాము కారణము రష్యాలోని ప్రభుత్వము 'సోవియటు' పద్ధతిమీద జరుగుతూ ఉంది కాబట్టి. సోవియటు అంటే మామూలుగ "సభ" అని లేక "పంచాయతీ" యని అర్థము.

1871 లో ఫ్రెంచి దేశంలో పారిస్ పట్టణములో కార్మికులు తిరుగుబాటుచేసి రాజ్యాధికారం స్థాపించుకొన్నారు. 70 రోజులు పారిస్ కమ్యూన్ అనే పేరుతో తమ రాజ్యాంగాన్ని నడిపారు. ఈ "కమ్యూన్"కు పారిస్ పురవాసులందరూ ప్రతినిధులను ఎన్నుకొన్నారు. ఈ ప్రతినిధులు పారిసు పట్టణాన్ని పాలించడానికి ఏమేమి పనులు చేయాలో నిర్ణయించేవారు. ఆ పనులు సాగించడానికి. ఈ ప్రతినిధులే కొన్ని విభాగాలుగ ఏర్పడి పని చేసేవారు. పోలీసుల శాఖను నడపడానికి కొందరూ, వర్తక వ్యాపారాలు నడపడానికి మరి కొందరూ, పట్టణ ఆరోగ్య వసతుల జూడడానికి మరి కొందరూ. ఉండేవారు.

మామూలుగ ఇంగ్లండు, అమెరికాలలో పార్లమెంటు శాసనాలు చేస్తుంది. దాని పిదప పార్లమెంటు సభ్యులు తమ తమ నియోజక వర్గాలకు వెళ్ళి ఉపన్యాసాలివ్వడంతో తృప్తి జెందుతారు. వారు చేసిన శాసనాలను అమలు జరపడానికి ఏ 20 మందో మంత్రులుంటారు. వీరు ఒక్కొక్కరు ఒక్కొక్క డిపార్టుమెంటుకు బాధ్యత వహించి పని చేయిస్తారు.

ఈ రెండు పద్ధతుల్లోనూ ఉన్న ప్రధాన భేదమిదే. పార్లమెంటరీ ప్రభుత్వములో శాసనాలు చేసేదొకరు. అమలు జరిపేవారు వేరొకరు. సోవియటు పద్ధతిలో, శాసనాలు చేసేవారే వానిని అమలు కూడా జరపాలి.

పారిస్ కమ్యూనును ఫ్రెంచి ధనికులు, నాశనం గావించారు. కాని పారిస్ కమ్యూను ఉధాహరణ ననుసరించియే కార్మిక కర్షక రాజ్యము స్థాపించడానికి వీలవుతుందని మార్క్సు. సోషలిస్టు లందరికీ తెలియజెప్పాడు.

1905 లో రష్యాలో పెట్రోగ్రాడ్ (లెనిన్ గ్రాడ్)లో కార్మికులు తిరుగుబాటు చేశారు. వారు కూడ ఇట్టి సభనే ఏర్పాటు చేసి తమ పోరాటాన్ని సాగించ సాగారు. ఈ సభకే "సోవియటు" అని వారి భాషలో పేరు. 1905 విప్లవము భగ్నమయ్యింది. కాని 1917 లో తిరిగి రష్యాలో విప్లవము వచ్చింది, ఫిబ్రవరి నెలలో. అప్పుడు పెట్రోగ్రాడ్, మాస్కో, మొదలగు పట్టణాలన్నింటి యందునూ ఇట్టి సోవియటులే వచ్చాయి. గ్రామాలలో రైతులు కూడ ఇట్టి సోవియటులనే ఏర్పాటు చేసుకొని తమ హక్కుల కోసం, పొలము కోసం పోరాడ సాగారు. సైనికులు, నావికులు కూడ ఇట్టి సోవియటులనే ఏర్పాటు చేసుకొని తమ కష్టాలు పోగొట్టుకోడానికి, జర్మనీతో యుద్ధం ఆపుచేయమని పోరాడసాగారు. 1917 నవంబరులో బోల్షివిక్కుల నాయకత్వం క్రింద రష్యను బూర్జువా వర్గము నుండి అధికారాన్ని కార్మికులు కర్షకులు ఈ సోవియటులకే సర్వాధికారమన్న నినాదముతో లాగుకున్నారు, 1917 నవంబరు 7వ తారీఖున రెండవ అఖిల రష్యను సోవియటు కాంగ్రెసు, దేశపు ప్రభుత్వాధికారాన్ని కైవశము చేసుకొంది. అందుచే, అప్పటి నుండి రష్యాను, సోవియట్ రష్యాయని, రష్యా ప్రభుత్వాన్ని సోవియటు ప్రభుత్వమని ప్రపంచము అంటూ ఉంది.

సోవియటు యూనియను యొక్క పరిపాలనా విధానమేమిటో చూద్దాం,

## యూనియను సోవియటులు

సోవియటు యూనియను కంతా, రాజ్యాధికారంగల సభ సుప్రీము సోవియటు. ఇది రెండు భాగాలు. ఒకటి యూనియను కౌన్సిలు. రెండవది జాతుల సభ.

ఈ రెండు సభలకు సమాన అధికారాలున్నాయి. చిత్తు తీర్మానాలు ఈ రెండు సభలలోనూ అంగీకరించ బడిననే చట్టాలవుతాయి. వీనిలో ఏసభ అంగీకరించక పోయినా కాదు. ఆవిధంగా భేదాభిప్రాయాలు వచ్చినట్లయితే రెండు సభలనుండి సమానంగా ప్రతినిధులను వేసుకొని, రాజీ కోసం ఒక కమిటీ ఏర్పర్చబడుతుంది. రాజీ కుదరకపోయినా, కుదిరిన రాజీని, ఏ ఒక్క సభయైనా ఒప్పుకొనక పోయినను, రెండు సభలను రద్దుపరచి క్రొత్త ఎన్నికలు 2 నెలలలో జరుపుతారు.

యూనియను కౌన్సిలుకు సోవియటు యూనియనులోని పౌరులందరు, 3,00,000 జనాభాకు ఒక ప్రతినిధి వంతున ఎన్నుకొంటారు. ప్రస్తుత జనాభా ననుసరించి యూనియను కౌన్సిలుకు సుమారు 600 మంది సభ్యులుంటారు. జాతుల సభకు, సోవియటు యూనియనులోని 11 సోషలిస్టు రిపబ్లిక్కులూ, ఒక్కొక్కటి 25 మంది చొప్పున ప్రతినిధులను పంపుతుంది. ప్రతి స్వతంత్ర రిపబ్లిక్కూ 11 మందిని పంపుతుంది. ప్రతి స్వతంత్ర అబ్లాస్టు 5 గురిని పంపుతుంది. అంటే జాతుల సభలో 587 మంది సభ్యులు ఉంటారు.

యూనియను కౌన్సిలు జాతుల సభ ఆరు నెలల కొక పర్యాయము సమావేశము అయి తీరాలి. ఇవి రెండూ సంయుక్త సమావేశంలో ఒక ప్రెసిడియమును ఎన్ను కుంటాయి. ప్రెసిడియములో ఒక అధ్యక్షుడు, 11 ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, 24 మంది సభ్యులు ఉంటారు. ఇప్పుడు అధ్యక్షుడు కాలినిన్.

ఈ ప్రెసిడియము, సుప్రీము సోవియటు సమావేశము కాని మధ్య రోజులలో బాధ్యత వహించి పని చేస్తూ ఉంటుంది. సుప్రీము సోవియటు చేసిన చట్టాలను వివరించి తదనుకూలంగా ఆజ్ఞలు పంపగలదు. కొన్ని సమస్యలపై ప్రజల అభిప్రాయాలను తీసుకోడానికి రిఫరెండము తీసుకోగలదు. సేనా పతులను తొలగించగలదు. క్రొత్తవారిని ఏర్పరచగలదు.

1. సమిష్టి ఆర్థిక వ్యవహారాలు
2. ఫైనాన్సు, బడ్జెటు
3. విద్య
4. ఆరోగ్యము
5. సహకార వ్యాపారము

ఇదిగాక, పరిపాలన, న్యాయ, గృహ, కార్మిక, పరిశ్రమ, సోషల్ ఇన్సూరెన్సు సైనిక, కార్మిక పరిశీలన విభాగాలను సోవియటు ఏర్పరచుకో వచ్చును.

ప్రతి సభ్యుడు ఏదో ఒక కమిటీలో తన ఇష్టము వచ్చినదానిలో తప్పక చేరి యుండాలి. ఈ కమిటీలలో కార్మిక సంఘ ప్రతినిధులు గాని, స్త్రీల ప్రతినిధులుగాని, మరి యే యితర సంస్థల ప్రతినిధులుగాని, లేక వ్యక్తులుగాని అవసరము అయినపుడల్లా తీసుకోబడుతారు.

ప్రతి కమిటీ తన పనిని చక్కగా నెరవేర్చడానికి ఒక చిన్న బీరో తన సభ్యులలో నుండి ఎన్ను కొంటుంది. ఈ బీరోలో అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కార్యదర్శి ఉంటారు. ఈ బీరో దానిని ఎన్నుకొన్న కమిటీ (విభాగము) చేయాలసిన పనికి కావలసిన విషయాల నన్నింటి చేకూర్చి రిపోర్టులను తయారు చేస్తుంది. కమిటీ చేసిన తీర్మానాలను ఎవరికి పంపించాలో వారికి పంపించి, ఆచరణలోకి వచ్చేటట్లు చూస్తుంది.

అసలు కమిటీ చేయాలసిన పనులివి:—

1. తనకు వప్పజెప్పబడ్డ ఆర్థిక వ్యవహారములను గూర్చిగాని, పరిపాలనా వ్యవహారాలను గూర్చిగాని, పరిశీలించి నిర్ణయాలకు వస్తుంది. దీని కోసం వివిధ సంస్థలలో తన సభ్యులను పంపుతుంది. వారి ద్వారా ఆ వివిధ సంస్థలు చేసే పనిని తనిఖీ చేస్తుంది.

2. బీరో రిపోర్టులను, తన ముందు వివిధ వ్యక్తులూ, సంస్థలు తెచ్చిన సూచనలను పరిశీలించి నిర్ణయాలు ఇస్తుంది.

3. తనకు అప్పజెప్పబడిన పనికి కావలసిన ప్రణాళికను తయారు జేస్తుంది.

## ఎన్నిక పద్ధతి

గ్రామ సోవియటుల లగాయతు, అఖిల యూనియను సుప్రీము సోవియటు వరకు సోవియటుకు ఎన్నికలు జరిగేవి. నేను ఆలాగాకుండా, గ్రామములో ఉండే ఓటర్లందరూ, గ్రామ ప్రతినిధులనూ, జిల్లాలో నుండే ఓటర్లందరూ, ఆజిల్లా(ఓబ్లాస్టు)సోవియటు ప్రతినిధులనూ, సోషలిస్టు రిపబ్లిక్కులో నుండే ఓటర్లందరు, సోషలిస్టు రిపబ్లిక్కు యొక్క సోవియటు ప్రతినిధులనూ ఎన్నుకొంటారు. ముందు గ్రామాలలోను, ఫిర్కాలలోను, పట్టణాలలోను ఓటర్లందరూ సమావేశమై బహిరంగంగా చేతులు ఎత్తి ప్రతినిధులను ఎన్నుకొనేవారు. ఇప్పుడు బాలెటు కాగితాలను పెట్టెలలో రహస్యంగా



కామ్రేడ్ మాల్టావ్
పీపుల్సు కమిసార్సు అధ్యక్షుడు

రహస్య బాలెటు పద్ధతిని, డైరెక్టు ఎన్నికలు జరుగును. అంతే 1936 కు ముందు, గ్రామ సోవియటు నుండి ఫిర్కా సోవియటులకు, ఫిర్కా నుండి, జిల్లా సోవియటులకు (ఆబ్లాస్టులకు) ఆబ్లాస్టుల నుండి సోషలిస్టు రిపబ్లికులకు, అప్పటి నుండి అఖిల యూనియను సుప్రీము వేసే పద్ధతిని అమలులోనికి తెచ్చారు. బాలెటు పెట్టెలను ఈ వరకు ఉపయోగించక పోవడానికి, డైరక్టు ఎన్నికలు గాక, ఇన్‌డైరెక్టు ఎన్నికలు జరపడానికి కారణము, 9 కోట్లమంది, ఓట్లను పోలింగు చేయించడము అసంభవము, అదికూడ కాక, సోవియటు యూనియనులో

# ఉజ్ బెక్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్
★ ముఖ్య పట్టణం — టాష్కెంట్



సిల్కు, బట్టల యంత్రాలు, నూనె గనులు ముఖ్య పరిశ్రమలు. పూర్వం ప్రతియేటా వరదలు తెచ్చే "చిర్ చిక్" నదికి ఆనకట్టలువేసి దేశాన్ని సశ్య శ్యామలం చేసింది సోవియటు ప్రభుత్వం. నూటికి 1 లేక రెండు చదువు వచ్చిన వారుండే దేశంలో నేడు 189 వార్తా పత్రికలు, లక్షల కొలది చందాదార్లు ఉన్నారు. వ్యవసాయం యంత్ర సహాయంతో చేయుటకు 18 వేలు ట్రాక్టర్లున్నాయి. కొన్ని యుగాల తర్వాత స్త్రీలు పురుషుల సమాన హక్కు లనుభవించు తున్నారు.

# ఉజ్‌బెక్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

★ ముఖ్యపట్టణం — టాష్కెంట్



సిల్కు, బట్టల యంత్రాలు, నూనె గనులు ముఖ్య పరిశ్రమలు. పూర్వం ప్రతియేటా వరదలు తెచ్చే "చిర్‌చిక్" నదికి ఆనకట్టలువేసి దేశాన్ని సశ్య శ్యామలం చేసింది సోవియటు ప్రభుత్వం. నూటికి 1 లేక రెండు చదువు వచ్చిన వారుండే దేశంలో నేడు 189 వార్తా పత్రికలు, లక్షల కొలది చందాదార్లు ఉన్నారు. వ్యవసాయం యంత్ర సహాయంతో చేయుటకు 18 వేల ట్రాక్టర్లున్నాయి. కొన్ని యుగాల తర్వాత స్త్రీలు పురుషుల సమాన హక్కు లనుభవించు తున్నారు.

తగినంత విద్య లేకపోవడము కూడ దీనికి తోడ్పడింది.

1936 కు ముందు పట్టణాలలో, 200 మంది ఓటర్లు ఒక ప్రతినిధిని పంపుచుంటే, గ్రామాల నుండి 1000 మంది జనులు ఒక ప్రతినిధిని పంపుకొనేవారు. 1000 మంది జనులలో సగం మందికన్నా ఓటర్లు ఉండరు. అందుచే పట్టణాలకు, గ్రామాలకన్న మూడింతలు ప్రాతినిధ్యముండేది. ఇప్పుడు దానిని తొలగించి సమాన ప్రాతినిధ్యం ఉండేటట్లు చేశారు. 1936 వరకు సోవియటు ప్రభుత్వము కార్మికుల వర్గ చైతన్యము మీద ఆధారపడి ఉండినది. రైతులు అప్పటికి ఇంకను పూర్తిగ సోవియటు ప్రభుత్వ సిద్ధాంతాలను అర్ధము చేసుకోలేదు. అందుచే కార్మిక ప్రాతినిధ్యము స్యోవియటులలో ఎక్కువ ఉండనిచ్చారు. కాని సమిష్టి వ్యవసాయ సంఘాలు జయప్రదమయిన పిదప రైతుకు కూడ పనిచేసేవాని దృక్పథము అలవడుటచే, కార్మికుల మధ్య రైతుల మధ్య నున్న ఈ భేదాన్ని, తీసివేశారు.

ఈ వరకు సోవియటు యూనియనులో ఈ క్రింది తరగతుల వారికి ఓటింగు హక్కు ఉండేదికాదు-వారుఏసంఘానికిఎన్నుకోబడకూడదు

1. లాభం కోసం కూలీలచే పని చేయించుకొనే వారు

2. తమ సొంత శ్రమపైగాక, పెట్టుబడి పరిశ్రమ, భూస్థితివలన వచ్చే ఆదాయాన్ని అనుభవిస్తూ ఉండేవారు

3. సొంతంగా వర్తక వ్యాపారాలు చేసుకొనేవారు

4. మత గురువులు

5. ఈవరకు పోలీసు ఏజంట్లు, రహస్య పోలీసు శాఖోద్యోగస్థులు, రష్యను జారు వంశ సభ్యులు

6. మతిచెడిన వ్యక్తులు

7. అపఖ్యాతి కరమైన లేక ధనాశతోచేసిన నేరాల కోసం జ్యుడిషియల్ కోర్టులో శిక్ష విధించబడి శిక్ష ననుభవిస్తూ ఉండేవారు

వీరిసంఖ్య ఒకప్పుడు 100 కి 10 ఉండినది కాని, ఈ నూతన రాజ్యాంగ ప్రణాళిక ఏర్పరచబోయే సమయానికి నూటికి ఇద్దరుకన్న లేరు. ఈవరకు విప్లవానికి వ్యతిరేకంగా పని చేసిన వారిని, విప్లవోద్దేశాలకు భిన్నంగా కూలీల శ్రమను దోచుకొనేవారికి ఓటుహక్కు లేకుండ జేయడము, విప్లవంయొక్క లాభం కోసమేనని చెప్పవచ్చును. కాని నేడు ఆభేదాలు పోయాయి. ఆర్థిక పరిస్థితులే మారిపోయాయి. ఆ తరగతులే లేకపోయిన ఈ సమయములో కూడ వారి జన్మనుబట్టి వారికి ఓటింగు హక్కు లేకుండ జేయడము సరికాదు.

అందుచేతనే ఆహక్కు అందరికి ఇవ్వబడింది. నేడు, ఒకనికి అతడు ఏజాతికి చెందినా ఏ కులానికి చెందినా, ఏ మతానికి చెందినా, అతడెచట నివసించే వాడైనా, అతని విద్యాజ్ఞానంతో సంబంధం లేకుండా, అతని సామాజిక స్థానమును పరిగణించకుండా అతడీవరకేమి చేసేవాడనే విచారణ లేకుండా, అతని ఆస్థితో సంబంధం లేకుండా ఓటుహక్కు ఉంది. అట్లే ఎన్నుకోబడడానికి కూడ హక్కుఉంది. కేవలము మతి చెడినవారికి, కోర్టులు ఓటుహక్కు లేకుండ జేసిన వారికి మాత్రమే ఓటు హక్కు లేదు.

స్త్రీలకు పురుషులతో సమానముగా ఓటు హక్కు ఉంది. వారునూ పురుషులతో పాటు ఎన్నికలకు సమానంగా నిలబడవచ్చును. సైనికులకు కూడ ఓటు చేయడానికి హక్కు ఉంది. ఇది ఇతర దేశాలలో ఎచ్చటనూ లేదు.

అభ్యర్ధులను నిలబెట్టే హక్కు కమ్యూనిస్టు పార్టీ, యువజన సంఘాలు, ట్రేడు యూనియనులు, కో ఆపరేటివు సంఘాలు, విజ్ఞాన సంస్థలకు ఇవ్వబడింది.

ప్రతి ప్రతినిధీ, తాను చేసిన పనిని గూర్చి అప్పుడప్పుడు తన నియోజక వర్గానికి నివేదించు చుండాలి. అతనిని ఎన్నుకొన్నవారు అధిక సంఖ్య ఓటుచే తొలగించి క్రొత్త వారిని ఆ స్థానానికి ఎన్నుకోడానికి హక్కు ఉంది.

★ ★ ★

[ఈ క్రింది వచ్చు విషయమంతా, "సోవియటు విధానములో ముఖ్యంగా గమనించ వలసిన విషయాలు." అనే శీర్షిక వరకు, 76 వ పుటలో రెండవ పేరాలో "సేనాపతులను తొలగించ గలదు. క్రొత్తవారిని ఏర్పరచ గలదు." అను వాక్యాల పిదప ఉండవలయును. పాఠకులు ఈ సవరణను గమనించి చదువుకొన ప్రార్థితులు.]

★ ★ ★

యుద్ధము ప్రకటించడానికి, సైన్యములో చేరమని ఆజ్ఞలు ప్రకటించడానికి, ఇతర దేశాలతో చేసుకొన్న ఒడంబడికలను అమలులో పెట్టడానికి (Ratify) హక్కు ఉంది.

పీపుల్సు కమిస్సార్లను, వారి అధ్యక్షుడు కోరినపుడు తొలగించి వారి స్థానే క్రొత్త వారిని నియమించడానికి హక్కు ఉంది. కాని వీరి చర్యను సుప్రీము సోవియటు సమావేశమయినపుడు, దాని అంగీకారానికి పెట్టాలి.

## పీపుల్సు కమిస్సార్లు

సుప్రీము సోవియటు ఒక్క ప్రెసిడియమునే గాక, పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలును కూడ ఎన్ను కొంటుంది. ఈ ఎన్నికకూడ సంయుక్త సమావేశంలోనే జరగాలి. పీపుల్సు కమిస్సార్లు మన దేశంలో మంత్రుల్లాంటివారు. వారి కౌన్సిలు, మన దేశములోని కాబినెట్ లాంటిది.

సుప్రీము సోవియటును ఎన్నుకొనిన పిదప ఒక నెల రోజులలో అది సమావేశమై, పీపుల్సు కమిస్సార్లను ఎన్నుకోవాల్సి యుంటుంది. మన దేశములో లాగ 6 నెలలు గవర్నరు దయా భిక్షముల మీద ఉండదు. ఈ పీపిల్సు కమిస్సార్ల కౌన్సిలే (సభ) యూనియనులో రోజు రోజు పరిపాలన సాగించడానికి, సుప్రీము సోవియటు యొక్క చట్టాలననుసరించి పని చేయడానికి, అధికారము గల అన్నిటికన్న పై సంస్థ. వీరు, సుప్రీము సోవియటుకునూ, అది సమావేశము కానప్పుడు, సుప్రీము సోవియటు యొక్క ప్రెసిడియమునకునూ, తమ పనులకు ఉత్తరవాదులు.

## వారి అధికారాలు

పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలు, సోవియటు యూనియనులోని వివిధ రిపబ్లికులు పీపుల్సు కమిస్సార్ల (మంత్రి మండల) పనిని సమన్వయింపజేసి, పని చేయిస్తూ ఉంటుంది. సోవియటు యూనియనులో ఆర్థిక ప్రణాళికను జయప్రదంగా నెరవేర్చడానికి తగు చర్యలు తీసుకొంటుంది. యూనియను యొక్క (పరపతి, కరెన్సీ, మారక విధానాన్ని) ఫైనాన్సును కాపాడుటకు తగిన చర్యలన్నీ తీసుకొంటుంది. దేశములో శాంతిని నెలకొల్పడము, దేశ సంరక్షణ చేయడము, పౌరుల ప్రాధమిక హక్కులను సంరక్షించడము, విదేశ ప్రభుత్వాలతో సంబంధాలను తనిఖీ చేయడము, అవసరమయినప్పుడల్లా, ఆర్థిక, విజ్ఞాన, సైనిక నిర్మాణాల కోసం ప్రత్యేక కమిటీలను ఏర్పరచడానికి హక్కు ఉంటుంది.

వివిధ రిపబ్లికులకు చెందక సోవియటు యూనియనుకంతటికి సంబంధించిన పరిపాలనలో మాత్రము, వివిధ రిపబ్లిక్కుల పీపుల్సు కమిస్సార్ల తీర్మానాలను, రద్దు చేయుటకు హక్కు ఉంది.

# పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలు సభ్యులు

కౌన్సిలులో ఈ క్రింది వారుంటారు.

1. కౌన్సిలు యొక్క అధ్యక్షుడు.

నేడు ఆ పదవిలో మాలొటోవ్ ఉన్నాడు.

2. ఉపాధ్యక్షులు

3. సోవియటు యూనియను యొక్క ఆర్థిక ప్రణాళికను ఏర్పరచు ప్లానింగు కమిటీ అధ్యక్షుడు

4. సోవియటు కంట్రోలు కమిటీ అధ్యక్షుడు. ఈ కమిటీ 60 మంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులతో కూడి యుంటుంది. ఈ కమిటీని కమ్యూనిస్టు పార్టీ యొక్క సెంట్రలు కమిటీ ఏర్పరుస్తుంది. ఈ కమిటీ ఉద్దేశము, పీపిల్సు కమిస్సార్ల ఆజ్ఞలను ఆచరణలోకి తెస్తున్నారో లేదో చూడడము. ఈ పని కోసం, ఇది ప్రత్యేకంగా తన ఉద్యోగస్థులను దేశమంతటా ఏర్పరుస్తుంది. ఈ కమిటీ, కమ్యూనిస్టు పార్టీ సభ్యులు ఎవరైనా పని చేయకుంటే, పార్టీ యొక్క కంట్రోలు కమిషను చేత వారిని పార్టీ నుండి తొలగిస్తుంది. వివిధ సోవియటులకు పని చేయని సోవియటు ఉద్యోగస్థులపై చర్య తీసుకొనుటకు వదలివేస్తుంది.

5. పీపుల్సు కమిస్సార్లు. వీరిక్రింది డిపార్టు మెంటులను నడిపే వారుగ ఉంటారు.

1. సైన్యము, దేశరక్షణ
2. విదేశాంగ వ్యవహారాలు
3. విదేశ వ్యాపారము
4. రైలు మార్గాలు
5. కమ్యూనికేషనులు (టెలిగ్రాములు, టెలిఫోనులు. పోస్టుఆఫీసు, కేబిల్సు. రేడియో)
6. జలమార్గాలు
7. యంత్ర పరిశ్రమ (Heavy Industry)
8. ఆయుధ పరిశ్రమ

పై డిపార్టుమెంటులు సోవియటు యూనియనుకంతా చెందినవి. అంటే. సోవియటు యూనియనులోని 11 సోషలిస్టు రిపబ్లికులకు ఈ డిపార్టుమెంటు లుండవు. ఈక్రింది డిపార్టుమెంటులు, ఆ 11 రిపబ్లిక్కులకూ, సోవియటు యూనియనుకూ కూడ ఉంటాయి.

9. ఆహార వస్తువుల పరిశ్రమ
10. ప్రజలు వాడుకొనే వస్తువుల పరిశ్రమ
11. కలప పరిశ్రమ

# సోవియటు యూనియనులోని వివిధ సోషలిస్టు రిపబ్లిక్కుల జండాలు.



సోవియట్ యూనియన్
(అన్ని సోషలిస్టు రిపబ్లికులు కలిసి)



రష్యా



బైలో రష్యన్



యుక్రేనియన్



జార్జియన్



ఆర్మీనియన్



12. వ్యవసాయము
13. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు. పశుక్షేత్రాలు
14. ఫైనాన్సు
15. దేశీయ వ్యాపారము
16. దేశీయ వ్యవహారాలు (హోమ్ డిపార్టుమెంటు)
17. న్యాయపరిపాలన (Justice)
18. ఆరోగ్యము

6. వ్యవసాయపు పంటలపైని కమిటీ అధ్యక్షుడు

7. కళలపైని కమిటీ అధ్యక్షుడు

8. ఉన్నత విద్యపైని కమిటీ అధ్యక్షుడు

# సోషలిస్టు రిపబ్లికులలో

సోవియటు యూనియనున కంతటికి ఎట్లు ఒక సుప్రీము సోవియటు సభ ఉందో అలాగే సోవియటు యూనియనులోని 11 సోషలిస్టు రిపబ్లిక్కులకు కూడ ఒక సుప్రీము సోవియటు ఉంది. ఇదికూడ యూనియను సుప్రీము సోవియటువలె 4 ఏండ్ల కొకపర్యాయము ఎన్నుకోబడుతుంది. ఈ సుప్రీము సోవియటుకు ఎంత మందికి ఒకరిని ఎన్నుకోవాలసినదీ, ఏవిధంగా ఎన్నుకోవాలసినదీ, ఈ 11 సోషలిస్టు రిపబ్లికులు సోవియటు యూనియను కాన్స్టిట్యూషనుకు వ్యతిరేకము గాకుండ నిర్ణయించుకోవచ్చు. ఈ 11 రిపబ్లిక్కులలో నుండే స్వతంత్ర రిపబ్లికుల సరిహద్దులను నిర్వచించు (Define) అధికారము కూడ ఈ సోషలిస్టు రిపబ్లికుల సుప్రీం సోవియటులకు ఉంది.

సోషలిస్టు రిపబ్లిక్కుల సుప్రీము సోవియటులు ప్రెసిడియమును ఎన్నుకుంటాయి. 1. అధ్యక్షుడు, 2. ఉపాధ్యక్షులు వీరి సంఖ్య ఆయా సోషలిస్టు రిపబ్లిక్కులో ఉన్న స్వతంత్ర రిపబ్లికుల సంఖ్య ఎంతో అంత మామూలుగా ఉంటుంది. ఉదాహరణంగా: సోవియటు యూనియనులో 11 సోషలిస్టు రిపబ్లిక్కులు ఉన్నాయి. సోవియటు యూనియను యొక్క సుప్రీము సోవియటు యొక్క ప్రెసిడియమునకు 11 మంది ఉపాధ్యక్షులు ఉన్నారు. అదే విధంగా రష్యను సోవియటు సోషలిస్టు ఫెడరేషనులో 17 స్వతంత్ర రిపబ్లిక్కులున్నాయి. అందుచే రష్యను సోషలిస్టు ఫెడరేషనుయొక్క సుప్రీము సోవియటు ప్రెసిడియమునకు మామూలుగా 17 మంది ఉపాధ్యక్షులు ఉంటారు. 3. కార్యదర్శి 4. ప్రెసిడియమునకు ఎన్నుకో

[illegible] సభ్యుల వీరి సంఖ్యను నిర్ణయించేది [illegible] సోషలిస్టు రిపబ్లిక్కుల సుప్రీము సోవి[illegible].

[illegible] యూనియను సంతటికీ [illegible] ఒక పీపుల్సు కమిస్సార్ల కౌన్సి[illegible]. అల్లే వివిధ సోషలిస్టు రిపబ్లిక్కులకు వాటి వాటి పీపుల్సు కమిస్సార్ల కౌన్సిల్లు [illegible]న్నాయి. వీనిని ఆయా సోషలిస్టు రిపబ్లికుల [illegible] సోవియటులు ఎన్నుకుంటాయి.

[illegible] సోవియటునూ, ప్రెసిడియము[illegible]నూ, పీపుల్సు కమిస్సార్లకు, సోవియటు యూనియను కాన్స్టిట్యూషనులో ఎట్టి పరస్పర సంబంధముంటో అట్టి సంబంధాలే ఈ వివిధ సోషలిస్టు రిపబ్లికులలో కూడ వాటి వాటి సుప్రీము సోవియటులకూ, ప్రెసిడియములకూ, పీపుల్సు కమిస్సార్లకు కూడ ఉంటాయి.

యూనియను పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలు, యూనియనులో భాగమైన 11 సోషలిస్టు రిపబ్లిక్కుల పీపుల్సు కమిస్సార్ల నిర్ణయాలపై ఎట్టి అధికారము కల్గి ఉంటో, అట్టి అధికారాలనే, సోషలిస్టు రిపబ్లిక్కుల పీపుల్సు కమిస్సార్ల కౌన్సిల్లు, కూడ వీనిలో అంతర్భాగములుగ ఉండు స్వతంత్ర రిపబ్లిక్కుల పీపుల్సు కమిస్సారులపై కూడ చెలిగిస్తున్నాయి.

ఈ సోషలిస్టు రిపబ్లికు పీపుల్సు కమిస్సారుల కౌన్సిల్సులో ఈ క్రింది వారుంటారు.

1. అధ్యక్షుడు
2. ఉపాధ్యక్షులు
3. సోషలిస్టు రిపబ్లిక్కు వరకూ ఆర్థిక ప్రణాళికల నేర్పరచే కమిటీ అధ్యక్షుడు
4. ఈ క్రింది డిపార్టుమెంటులకు పీపుల్సు కమిస్సార్లు
   1. ఆహార వస్తువుల పరిశ్రమ
   2. ప్రజలు వాడుకొనే వస్తువుల పరిశ్రమ
   3. కలప
   4. వ్యవసాయము
   5. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, పశు క్షేత్రాలు.
   6. ఫైనాన్సు
   7. దేశీయ వ్యాపారము
   8. దేశీయ వ్యవహారాలు
   9. న్యాయ పరిపాలన
   10. ఆరోగ్యము
   11. విద్య
   12. స్థానిక పరిశ్రమలు
   13. మునిసిపల్ పరిశ్రమలు
   14. ప్రజా సౌకర్యాలు.


అజర్ బైజాన్


టర్కోమన్


కజాక్


ఉజ్ బెక్


కిర్ఘిజ్


తజిక్



# స్వతంత్ర రిపబ్లికులు

స్వతంత్ర రిపబ్లిక్కులకు కూడ ఒక సుప్రీము సోవియటు ఉంది. దీనిని కూడ నాలుగేండ్ల కొకసారి పర్యాయము ఎన్నుకొంటారు. ఎంతమంది కొక ప్రతినిధిని ఎన్నుకోవాలో ఎలా ఎన్నుకోవాలో స్వతంత్ర రిపబ్లిక్కే నిర్ణయిస్తుంది.

స్వతంత్ర రిపబ్లిక్కుయొక్క సుప్రీము సోవియటుకూడ ఒక ప్రెసిడియమునూ, ఒక పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలునూ ఎన్నుకుంటుంది.

ఈ స్వతంత్ర రిపబ్లికు పీపుల్సు కమిస్సారులే, స్వతంత్ర రిపబ్లికులలోని ఆబ్లాస్టులపై తనిఖీ చేస్తూ, పని చేయిస్తూ ఉంటారు.

సోషలిస్టు రిపబ్లిక్కులలో ఉండే ఆబ్లాస్టులపై తణిఖీ, సోషలిస్టు రిపబ్లిక్కుల కమిస్సారులది.

# స్థానిక సోవియటులు

కొన్ని గ్రామాలు కలసి రేయాన్లు (ఫిర్కాలు) అవుతాయి. ఇటువంటి కొన్ని రేయాన్లు, అస్థలములో ఉండే పట్టణాలతో కలిసి ఒక ఆబ్లాస్టు అవుతుంది.

ఈ గ్రామ సోవియటులకు, పట్టణ సోవియటులకు, రేయాన్ సోవియటులకు, ఆబ్లాస్టు సోవియటులకు, ఆయా స్థలములలో నుండే యుక్తవయస్సు వచ్చిన ప్రజలందరూ ప్రతినిధులను ఎన్నుకుంటారు. ఎన్నికలు రెండేళ్ళకొకపర్యాయము జరుగుతాయి. ఈ వివిధ సోవియటులకు ఎంత మంది ప్రతినిధులను, ఎన్నుకోవలసినదీ, ఇవి ఏ సోషలిస్టు రిపబ్లిక్కులో ఉంటాయో ఆ సోషలిస్టు రిపబ్లిక్కే నిర్ణయిస్తుంది.

ఈ వివిధ సోవియటులు ఒక కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకొంటాయి. ఈ కార్యనిర్వాహక వర్గములో ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు, కార్యదర్శి సభ్యులు ఉందురు.

ఒక్క గ్రామ సోవియటులో మాత్రము, అందులోనూ ఆ గ్రామము మరీ చిన్నదైతే కార్యనిర్వాహక వర్గానికి బదులు, అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, సభ్యులు మాత్రం ఉందురు.

ఆబ్లాస్టు సోవియటుకు లోబడే రేయాన్ సోవియటులు, పెద్ద పట్టణ సోవియటులు పని చేస్తూ ఉంటాయి. రేయాన్ సోవియటులు

క్రింద గ్రామ సోవియటులు, చిన్న పట్టణాల సోవియటులు పని చేస్తూ ఉంటాయి.

## గ్రామ సోవియటు

ఒక గ్రామ సోవియటుకు ఏమేమి అధికారాలున్నవో చూస్తాం.

1. పై కమిటీలకు సంబంధించిన విషయాలపై చర్చించి తన అభిప్రాయాన్ని తెలియజేస్తుంది. తన క్రింద ఉన్న సంస్థలను నడుపుతుంది. తనకు చెందని సంస్థల పనిని కేవలము తనిఖీ చేస్తుంది.

2. ప్రజా సామాన్యంలో ఆర్థిక రాజకీయ ప్రచారము చేస్తుంది. స్త్రీలను సోవియటు ఉత్పత్తి విధానంలో పాల్గొనేటట్లు చేస్తుంది.

4. గ్రామములో నుండే వివిధ జాతుల హక్కులను కాపాడి వారి అభివృద్ధి కోసం ప్రత్యేకంగా శ్రద్ధ వహిస్తుంది.

౫. గ్రామం యొక్క ఆర్థిక, విజ్ఞాన ప్రణాళికను తయారుచేసి ఆచరణలోకి తెస్తుంది. గ్రామములోని ఇండ్ల జాబితాను తయారు చేస్తుంది.

౬. సమిష్టి వ్యవసాయ సంఘాల, సహకార సంఘాల ప్రణాళికలను ఖాయపర్చే అధికారము దీనిది. వానికి అప్పులను రికమెండు చేస్తుంది. సమిష్టి వ్యవసాయ సంఘాలలో శిక్షణను కాపాడి పనిని విభజించడాన్ని తనిఖీ చేస్తుంది. క్రొత్త పొలాలు చేర్చడమా లేదా అని కూడ నిర్ణయించడానికి ప్రభుత్వానికి సాయము చేస్తుంది.

8. తన సరిహద్దులలో ఉండే బంకమట్టి, ఇసుక రాయిమీద హక్కు ఉంది. చేతి వృత్తి దారులకు సహాయము చేస్తుంది. స్థానిక ఉపయోగానికి పనికివచ్చే అడవులపై తనిఖీ చేస్తుంది. కలప పరిశ్రమను, కలప నుండి రసాయన పదార్థాలను తీసే పరిశ్రమను అభివృద్ధి చేస్తుంది. అడవుల సంరక్షణ దీనిదే.

9. స్థానిక వ్యాపారాన్ని, వెలలను నిర్ణయించడము చేస్తుంది సంతలు, బజారులపై తనిఖీ చేస్తుంది. అంగళ్ళకు పన్ను నిర్ణయిస్తుంది.

10. పన్నులు వసూలు చేస్తుంది. తన బడ్జెటు తయారుచేసి ఫిర్కా (రేయాన్) సోవియటుకు పంపుతుంది. ఋణాలు తీసుకొనే హక్కుంది. పన్నులు తగ్గించడము, జుల్మానాలు విధించడము, వసూలు చేయడము, వసూలు కాకపోతే వేలము వేయడం. ప్రభుత్వపు ఋణాలకు డబ్బు వసూలు చేస్తుంది. ఇన్స్యూరెన్సు స్కీములకు సహాయము చేస్తుంది.

11. పాఠశాలలపైనా, గృహ నిర్మాణముపైన, హాస్పిటల్సు మీద తదితర కట్టడాలపైన అధికారము.

12. రస్తాలను, వంతెనలను మరమ్మతు చేయడము

13. అక్షరాభ్యాసం ప్రతివారికీ కలిగేటట్లు చూస్తుంది. అనాధులకు తగిన సంరక్షణ ఏర్పరుస్తుంది.

14. టెక్నికలు విద్య, వ్యవసాయ విద్యను నేర్చుకోడానికి వివిధ పాఠశాలలకు పంపుతుంది

15. హాస్పిటల్సు, ఆరోగ్యవసతులకు తన బడ్జెటునుండియే నెలకొల్పుతుంది. పిచ్చివారికి సంరక్షలను నేర్పరుస్తుంది. వ్యాయామమును ఆరోగ్య విధుల నలవడ జేసుకోవడమును ప్రోత్సహిస్తుంది.

16. ఇన్స్యూర్ చేయబడిన వ్యక్తులకు వారికి రావలసిన (బెనిఫట్లు) సహాయ భృతిని ఇస్తుంది. గ్రుడ్డి, మూగవారికి సంరక్షకులను ఏర్పరస్తుంది. అంగ వికలులను సంఘాలుగ ఏర్పరచి వారికి కావలసినవి అందజేస్తుంది.

17. సైన్యంలో ఎవరు చేరాలసి ఉంటుందో వారి పేర్లలిస్టు ఉంచుకొంటుంది. గుర్రాలలెక్క, బండ్లలెక్క, యుద్ధానికి పనికివచ్చే మిగిలిన వస్తువులయొక్క లెక్కఉంచుతుంది. సైన్యాన్ని ప్రోగు చేస్తుంది. సైన్యంలో పనిచేసే వారి కుటుంబాల విషయమై శ్రద్ధ తీసుకొంటుంది.

18. గ్రామ కోర్టును ఏర్పరచి, దానికి జడ్జీలను ఎన్నుకొనేటట్లు చేస్తుంది. కోర్టు నిర్ణయాలను ఆచరణలో పెట్టుతుంది.

19. ప్రభుత్వానికి వ్యతిరేకముగా పనిచేసే వారిని అరెస్టు చేస్తుంది. ఇండ్లను సోదా చేస్తుంది. త్రాగుబోతు తనాన్ని, దొంగతనంగా కల్లు అమ్మడాన్ని ఆపుచేస్తుంది.

20. పత్రాలను రిజిస్టరు చేస్తుంది. మత సంస్థలకు చెందిన చట్టాలను అక్షరశ ఆచరణలో పెట్టుతుంది.

## పట్టణ సోవియటులు

1. పట్టణాలలో సోవియటు చేయాల్సిన పనులలో పాల్గొనేటట్లు చేయడానికి, పట్టణ సోవియటులు డిపార్టుమెంటులుగా విభజించ బడుతున్నవి.

2. పట్టణములో ఎన్ని విభాగాలున్నవో, అన్ని భాగాలుగానే సోవియటు కూడ విభజించబడుతుంది. వీని పని పట్టణ సోవియటుయొక్క పనికి సాయము చేయుటయేగాక, సోవియటు కార్య నిర్వాహక వర్గాల చర్యలను తనిఖీ చేయుడము కూడ. ప్రతి పట్టణ సోవియటులో ఈ క్రింది విభాగాలు (కమిటీలు) తప్పక ఉంటాయి

* *

సోవియటు విధానములో

## ముఖ్యంగా గమనించవలసిన విషయాలు

1. గ్రామ సోవియటు మొదలు, సోషలిస్టు రిపబ్లికు వరకు ఎచ్చటా ఒక వ్యక్తి పాలన అనేది లేదు. ప్రతిచోటా కార్యనిర్వాహక వర్గముగాని, పీపుల్సు కమిస్సార్ల కౌన్సిలుగాని ఉంది. మన దేశములో గ్రామానికి, గ్రామ మునసబు అధికారి. తాలూకాకు ఏ తహసీల్దారుడో లేక ఏ డిప్యూటీ మేజిస్ట్రీటో అయి ఉంటారు. జిల్లాకు కలెక్టరునూ రాష్ట్రానికి గవర్నరు అధికారులు. అచ్చట అలా కాదు. గ్రామ సోవియటులు తప్పు జేస్తే రేయాన్ సోవియటు కార్యనిర్వాహక వర్గముగాని, దానిపై సంస్థలుగాని దిద్దాలేగాని ఏ ఒక వ్యక్తికీ అధికారమూ లేదు.

2. ఈ వివిధ సోవియటులకు తమ తమ ప్రాంతాలలో, అన్ని శాఖలపై సర్వాధికారముంది. మన దేశములాగ, పోలీసు, రివిన్యూ, లాంటివి కొంతమంది ప్రత్యేక ఉద్యోగస్థుల చేతులలోలేవు. అచ్చట అన్ని రకాల ఉద్యోగస్థులు, ఏ యే స్థలములో పనిచేస్తూ ఉంటారో ఆయా స్థలములలోని సోవియటులకు లోబడియే యుంటారు.

3. ఈ సోవియటులు తాము చేసిన నిర్ణయాలను ఆచరణలో పెట్టడానికి తమ నుండి కమిటీలను ఏర్పరుస్తాయి. క్రింది సోవియటులలో ముఖ్యంగా గ్రామ, పట్టణ సోవియటులలో ఇది స్పష్టంగా కన్పడుతుంది.

4. ఏ సోవియటుకైనా సరే, ఎన్నుకొన్న ప్రతినిధిని ఎన్నుకొన్నవారు తమ ఇష్టము వచ్చినపుడు మెజారిటీ ఓటుతో తొలగించి క్రొత్తవారిని ఎన్నుకోవచ్చు.

సోవియటు యూనియనులో లాంటి పరిస్థితులు మన దేశములో ఉంటే మన పరిపాలనా యంత్రము ఈ విధంగా ఉంటుంది.

గ్రామ పంచాయితీ బోర్డు గ్రామానికి సర్వాధికారి. పన్నులు వసూలు చేయడము, కాలువలపై మరమ్మతులు, పొలాలు సాగుచేయడానికి తగు సౌకర్యాలు చేయడము ఇది అంతా పంచాయతీ చేస్తుంది. గ్రామ మునసబు, కరణాలు మాయమైపోతారు! లేదా పంచాయితీ బోర్డు గుమాస్తాలుగా ఉంటారు!

జిల్లాబోర్డులు, పోలీసులపై, తహసీల్దారులపై, అధికారము కలిగి ఉంటాయి. డిప్యూటీ మేజిస్ట్రేటు, కలెక్టర్లు వగైరా ఉద్యోగస్థులు ఉండరు. వారిస్థానాన్నే మనము ఎన్నుకొని పంపిన ప్రతినిధే ఒకడు ఉంటాడు. డిస్ట్రిక్టు సూపరింటెండెంటు ఆఫ్ పోలీసు మనము ఎన్నుకొని పంపినవాడే ఉంటాడు. వీడు సరిగా ప్రవర్తించకపోతే మన కిష్టము వచ్చిన రోజున ఊడబెరికి క్రొత్తవారిని ఎన్నుకోవచ్చు.

6,00,000 గ్రామాలు గల సోవియటు యూనియనులో, ప్రజా సామాన్యమంతా రాజకీయంగా ఎంతో అభివృద్ధి చెందేటట్లు చేస్తుంది సోవియటు రాజ్యాంగ ప్రణాళిక! మన కట్టి ప్రణాళిక ఎప్పటికో?-మనదేశములోని కూలీలు రైతులు కూడ రష్యాను అనుకరిస్తేనే.



# సోవియట్ కోర్టులు: జైళ్లు

కామ్రేడ్ దర్శి చెంచయ్య



పబ్లిక్ ప్రాసిక్యూటర్
కామ్రేడ్ విషిన్‌స్కి

న్యాయ పరిపాలనా విషయంలో సోవియటు యూనియనుకును, యితర దేశములకు ఎంతమాత్రము పోలికలేదు. ఇతర దేశాలలో, నేరస్థుడు ఎంత నష్టము కలుగజేశాడో అందుకు సరితూగు శిక్షను అనుభవించునట్లు చేయుటే ముఖ్యముగా యెంచుతారు. నేరస్థుడు చెయ్యాలనే నేరము చేశాడు, ఆ నేరం చేయకుండుటకు తగిన అవకాశాలున్నాయని యెంచుతారు. అందుచే నేరస్థునిపై కక్ష తీర్చుకొనుటే వారి శిక్షాస్మృతి ప్రధాన సూత్రము. శిక్షల భయము వలన, ఇచ్చను మార్చుకొని నేరములు చేయకుందురని వారి భావము.

సోవియటు శాసన నిర్మాతలు వ్యక్తులు ఏ సంఘములో పెరుగుదురో ఆ సంఘము యొక్క సద్గుణములు, దుర్గుణములు సాధారణముగా వ్యక్తుల స్వభావములో ప్రతిఫలించునని యెంచుతారు. అందుచే నేరస్థునిపై కక్ష తీర్చుకొనుట గాక, నేరముల చేసినందులకు మూల కారణముల నరసి, నేరస్థుని మంచివానిగా జేయుటయే సోవియటు శిక్షాస్మృతి ప్రధానోద్దేశము. అందుచేత సోవియటు కోర్టులు, జైళ్ళకును యితర దేశాలలోని కోర్టులు, జెయిళ్ళకును ఏమాత్రం పోలికలేదు.

—కోర్టులు, జడ్జీలు, జీతాలు—

సోవియటు యూనియను కంతకూ సుప్రీము కోర్టు వుంది. దీనిని రెండు శాసన సభలు కలసిన అఖిల యూనియను సుప్రీమ్ సోవియటు ఎన్నుకొంటుంది. ఐదు సంవత్సరాలు దీని జీవితం. 11 సోషలిస్టు రిపబ్లికులు, 22 స్వతంత్ర రిపబ్లికులకు కూడ ఆయా సోవియటులచే ఎన్నుకోబడు ఐదు సంవత్సరాల జీవితం గలిగిన సుప్రీమ్ కోర్టులుంటాయి. అటులే ప్రతి ఆబ్లాస్టుకీ (జిల్లాకూ) ఐదు సంవత్సరాలు పరిమితి గల్గి ఆ సోవియటుచే ఎన్నుకోబడిన కోర్టులుంటాయి.

ప్రతి ఫిర్కాకు (రేయాన్), గ్రామానికి, పట్టణానికి ప్రజలందరిచేత రహస్యపు ఓటింగు ద్వారా ఎన్నుకోబడిన పీపుల్సు కోర్టులుంటాయి. జడ్జీలలో ఒకరు మూడు సంవత్సరాలకు ఎన్నుకోబడిన ఖాయపు జడ్జి, తక్కిన యిద్దరు తాత్కాలికముగ ఎన్నుకోబడిన జడ్జీలు వుంటారు. సరిగా పనిచేయని యెడల ప్రజలు తమ యిష్టము వచ్చినపుడు మెజారిటీ ఓట్లతో వీరిని డిస్మిసు చేయవచ్చును. మెజారిటీ వచ్చిన ప్రతి పౌరుడు జడ్జీగా ఎన్నుకోబడ వచ్చును. జడ్జీలను ప్రజలే ఎన్నుకొనుటచే ప్రజలతో సంబంధము కలిగివుండి వారి క్షేమము కొరకే పని చేయుదురు.

తాత్కాలికముగా జడ్జీలగా పని చేయుటకు ఎన్నుకోబడిన వారికి ఇదివరకు వారు పనిచేయు ఫ్యాక్టరీలో యిచ్చు జీతమును యిస్తారు. అనగా సోవియటు పౌరుడు న్యాయ పరిపాలనలో పాల్గొనుట అవకాశాలు యివ్వబడినాయి. స్థానికమైన ఈ పీపుల్సు కోర్టులు ఆ జ్యూరిడిక్షన్‌లోని అన్ని కేసులను విచారించును. పై కోర్టులకు ఉచితంగా అప్పీలు చేసుకొను హక్కువుంది. ఖాయపు జడ్జీలకు నేర్పరులైన కార్మికులకు ఇచ్చు జీతమునే యిస్తారు.

సుప్రీమ్ సోవియటు యూనియన్ కంతకూ అటార్నీ జనరల్‌ను, ఏడు సంవత్సరాల కొకసారి నియమించుతుంది. ఇతడు రిపబ్లికు లన్నిటికినీ, ఆబ్లాస్టులకునూ, అయిదు ఏండ్లు కొకసారి ప్రభుత్వ అటార్నీలను నియమించుతాడు. వారు క్రింది జిల్లా, ఫిర్కా, పట్టణ అటార్నరీలను నియమించుతారు.

వకీళ్లు.

విప్లవానంతరం యిష్టము వచ్చిన వారంతా వకీళ్లగా యుండ వచ్చుననీ అనుమతి యివ్వబడింది. కాని 1922 లో శాసనమును మార్చి ప్రతి కోర్టుకు ఒక వకీళ్ళ సంఘమును ఏర్పాటు చేసిరి. ఇది ఒక ట్రేడ్ యూనియను వంటిది. రెండు సంవత్సరాలు న్యాయశాఖలో పనిచేసినవారుగాని, లా కాలేజీలో చదవినవారుగాని యీ సంఘములో చేర వచ్చును. కాని ప్రత్యేకముగా బోర్డు తగిలించుటకు వీలులేదు. పార్టీలు, వకీళ్ళ సంఘములో యిష్టము వచ్చిన వారికి తమ కేసును యిచ్చుకోవచ్చును. అలా యిచ్చుకొన్నను, పార్టీలు కోర్టులో స్వయముగా వాదించుకొను హక్కుండును. పార్టీ యివ్వవలసిన ఫీజును కేసు విషయలో గల కష్టము ననుసరించి కోర్టు తీర్మానించును. వాయిదాలమీద నెల జీతములోనుండి యిచ్చు చుండవలెను. ఇవ్వజాలని వారికి, కోర్టువారే ఫీజు యిచ్చుకోవలెను.

కామ్రేడ్సు కోర్టులు

శాసనం ద్వారా ఏర్పరుపబడిన సోవియటు కోర్టులు, పీపుల్సు కోర్టులేగాక ప్రాజాభిప్రాయం వ్యక్తుల లోపాలను సరిదిద్దుటకు యేర్పడు

చున్న కామ్రేడ్సు కోర్టులు ప్రభుత్వముచే ప్రోత్సాహ మివ్వబడుచున్నవి. ఒకడు ఫ్యాక్టరీలో నేరము చేసిరని అనుకొందము. ఆ ఫ్యాక్టరీలో పని చేయువారంచరు సమావేశమయి, ప్రెసిడెంటును ఎన్నుకొని నేరస్థుని విచారించి వెంటనే శిక్షింతురు. శిక్ష నేరస్థుని నెల జీతములో 10 వ భాగమును మించి యుండకూడదు. తనతోడి వారి యెదుట నేరస్థుడుగా నిలువబడుటకు ఎవరికి యిష్టముండదు.

ఒకడు తప్పత్రాగి అసభ్యంగా ప్రవర్తించుతాడు అనుకోండి. అతనికి ఈకోర్టు వింత శిక్ష వేస్తుంది. పార్కులోను, ఫ్యాక్టరీలోను, ఫలానావారు త్రాగి అసభ్యంగా ప్రవర్తించాడని గోడ వార్తా పత్రికలో ప్రకటిస్తారు. ఇటులే అనేక మార్గాలద్వారా ప్రజాభిప్రాయానికి వెరచి ప్రాత సమాజంను ండి వ్యక్తులకు అంటుకొన్న దురలవాట్లను తొలగించటానికి ప్రయత్నిస్తున్నారు. ప్రతి పౌరుని, ప్రజాస్వామ్య సూత్రాలకు అలవాటుపడి అందరి మేలులో తన సౌఖ్యముందని తలంచు సోషలిస్టు చైతన్యాన్ని కలుగజేస్తున్నారు. ఇంతేగాక వ్యక్తులకు ఆర్థికంగా చీకూ చింతా లేకుండా, విజ్ఞానాభివృద్ధికి ఎక్కువ శ్రద్ధ తీసుకొనుచున్నారు. మనఃస్తత్వ శాస్త్రజ్ఞుల సంఘము నేర్పరచారు. వీరు ఏవిధంగా సంఘ పరిస్థితుల మార్చిన యెడల మానవులు సున్నితమగు బుద్ధిగలవారై నేరముల చేయుటకు అసహ్యించుకొంటారో తెలిసికొని న్యాయ పరిపాలనా మంత్రికి తెలుపుచుందురు. వారి సలహాల ననుసరించి సంఘములో ఎన్నో విధముల మార్పు చేయుదురు.

పై విధంగా ప్రజాభిప్రాయం ద్వారాను, నేరకారణాలను తొలగించియు వ్యక్తులు చేయు నేరముల తగ్గించుటకు సోవియటు ప్రభుత్వం కృషి చేయుచున్నది. ఇక విచారణ, జైలు పరిపాలనా విధానం ద్వారా ఎటుల నేరము తగ్గించ ప్రయత్నించు చున్నదో చూదాం.

## నే ర ము ల స్వ భా వం.

నేరములను నాలుగు తరగతులుగా విభజించ వచ్చును.

1. ప్రభుత్వము శ్రామికులది. వీరే అధికార వర్గమువారు. ప్రభుత్వమును కూలద్రోయుటకు ప్రయత్నించువారిని నేరస్తులుగా యెంచుదురు. పూర్వపు ధనిక వర్గమువారు కొందరు, ఇంకను తమ పూర్వపు అలవాటులే గలిగినవారు, కుట్రలు చేయుచుందురు. విదేశ శత్రువులకు రహస్యముల తెలుపుచుందురు. ఇట్టి నేరస్తులను కఠినంగా శిక్షింతురు.

2. శ్రామిక జన సామాన్యమునకు కలుగజేసెడు నష్టము, రెండవ తరగతి నేరములు. ఫ్యాక్టరీలు, గనులు, పొలములు మొదలగు ద్రవ్యోత్పత్తి సాధనములన్నియు, శ్రామిక ప్రభుత్వానివి. ప్రభుత్వమును కూలద్రోయుకోరువారు ఆస్థికి నష్టం కలుగజేసి ప్రభుత్వ ప్లానులను భగ్నంచేసి ప్రజలలో అసంతృప్తి కలుగజేయుటకు ప్రయత్నింతురు. ఇట్టివారు కఠినముగా శిక్షింపబడుదురు.

3. ఫ్యాక్టరీలలో హీనమైన సరకులను తయారు చేయువారు మూడవ తరగతి నేరస్తులు—ఈ తరగతిని చెందినవారిలో లెఖ్కలు, జాపితాలు, ప్లానులు వగైరా విషయములలో మోసము చేయు ఆఫీసర్లుకూడ వస్తారు.

4. పోకిరితనంగా అల్లరులు చేసేవారు (Hooligans). ప్రజా సంస్థల ఆస్తిని దొంగిలించేవారు. వీరు నాల్గవ తరగతిలో వస్తారు.

## వి చా ర ణ ప ద్ధ తి.

నేరమును దాఖలు చేయగానే జడ్జీగారు రహస్యముగా పరిశోధించుటకు ఇన్వెస్టిగేటరును (విచారణ కర్తను) పంపును. అతడు కేసుకు సంబంధించిన ముఖ్య కారణములన్నీ తెలుసుకొని గవర్నమెంటు ప్రాసిక్యూటరుకు రిపోర్టు చేయును. అందులో నేరస్తునికి అనుకూలము, ప్రతికూలమగు కారణములన్నియు తెలియజేయును.

రిపోర్టు అందిన పిదప గవర్నమెంటు ప్రాసిక్యూటరు నేరస్థుని పిలిపించి రుజువు పత్రములను విచారణ కర్త నివేదికను యిచ్చి, తాను నేరము చేయలేదని రుజువు చేయుటకు సాధ్యమ యిన యెడల సాక్షులను, రుజువు పత్రములను తెమ్మని కోరును. సమాధానము తృప్తికరముగ యున్న యెడల కేసును కొట్టి వేయును. లేని యెడల విచారణకు జడ్జీ వద్దకు పంపును. ఎంత పెద్ద నేరమైనను ఒకే పర్యాయము విచారణ చేయవలయునుగాని వాయిదా వేస్తూ కాలం జరుపరాదు.

జడ్జీకి పంపు వరకు ముద్దాయి, ప్రభుత్వంవారు ఉచితముగా సలహా యిచ్చుటకు యేర్పరచిన వకీళ్ళ సంఘంనుండి సలహా పొంద వచ్చును. కోర్టులో వాదించుటకు ఆ కోర్టుకు సంబంధించిన వకీళ్ళ వృత్తి సంఘము (ట్రేడ్ యూనియన్) మరొకటి ఉండును. ఈ వకీళ్ల ఫీజు అడుగకూడదు. కేసు పూర్తి అయిన తరువాత కోర్టువారు ఫీజు నిర్ణయింతురు. పార్టీదారుడు వాయిదాలపై చెల్లించుకోవచ్చును.

విచారణ సందర్భంలో "కేసు లా" ఉపయోగించరాదు. అనగా అదివరకు ఏ జడ్జీగారు ఏకేసులో ఏలాగు తీర్మానించారు అనే విషయములను సోవియటు కోర్టులలో ఉపయోగించరాదు. ప్రతి జడ్జీయు, ప్రతి కేసును వేరు వేరుగా యోచనచేసి తీర్మానించ వలసినదే.

"ఎవిడెన్సు లా" అనగా ఏరీతిగా విచారణ జరుపవలెనో ఎప్పుడెపుడు ఏలాటి సాక్ష్యమును యివ్వవలెనో, ఏదిముందు, ఏదివెనకో అను నిర్ణయము అనే ఆటంకము సైతము లేదు. సత్యమును తెలిసికొనుటే ముఖ్య కర్తవ్యము. కేసులకు తరగతివారి లేదు; శిక్షలకు సైతము తరగతివారి లేదు. ఫలాని నేరమునకు ఫలాని 'శిక్ష' అని, నిర్ణయం లేదు. ఏమనగా ఒక ఖూనీ కేసు మరొక ఖూనీ కేసులాగ వుండదు? శిక్షించునపుడు సాధ్యమయినంత తక్కువ విధించవలెను.

## జ యి ళ్ళ లో జీ వి త ము.

జెయిళ్లు జెయిళ్ళుకావు; అవి గుణముల సంస్కరించుటకు ఏర్పరచిన ఆశ్రయములు (Houses of correction). జయిళ్ళలో బయటవలెనే జీవితమును గడుపవచ్చును. స్వాతంత్ర్యం మాత్రం పోయినది. ఓటు హక్కు వుండదు. భోజనము, బట్టలు, ఆటలు, పాటలు, వృత్తి, భార్యా బిడ్డలను కలుసుకొనుట వగైరా, అన్ని విషయములలోను బయట ఏలాగు జరుగుచుండెనో, అలాగే, జయిళ్ళలో నుండియు జరుపుకొనవచ్చును. లేనియెడల, మానవుడు పశువులాగు మారిపోవునేమో యని వారి భయము. ఒక పర్యాయము చేసిన నేరమును మరొక పర్యాయము చేయక వుండులాగున వారి స్వభావమును మార్పు చేయుటయే ప్రభుత్వమువారి ప్రయత్నము.

10 సంవత్సరములకు పైగా శిక్ష లేదు. ఇంతకాలము శిక్షించినను, త్వరగానే వాని స్వభావమును మార్పుజేసి, పంపివేయుదురు. 5 సంవత్సరములకు పైగా శిక్షించినపుడు మాత్రము పనిచేయుటకు లేబరు క్యాంపులకు (Labour Camp) పంపుదురు. అచ్చట పనులు కొంచము కష్టముగా నుండవచ్చును. అయితే క్యాంపుకు గోడలుండవు; చివరకు యినుప తీగలు అయినా ఉండవు. పై తనిఖీ, కఠినముగా నుండదు. పారిపోవలెనంటే, వెళ్ళవచ్చును. కాని, అచ్చటి పోలీసులు తిరిగి పట్టుకోగలరనియు, వెళ్ళిపోయినంత మాత్రమున తప్పించుకోజాలమనియు, ఖయిదీలకు తెలుసును. వ్యవసాయపు పనులు చేయవలసిన కాలములో సెలవు పుచ్చుకొని యింటికి వెళ్ళి రావచ్చును. భర్తకు శిక్ష విధించిన కారణము వలన, అతని భార్యా బిడ్డలకు ఆర్థికముగా ఏలాటి కష్టము లుండకూడదనియు, అతని నేరమునకు అతడు కష్టపడవలసినదే గాని భార్యా బిడ్డలు బాధపడుట న్యాయము కాదనియు, వారి అభిప్రాయము. ప్రభుత్వమువారు, వాని భార్యా బిడ్డలకు ఆర్థిక కష్టములు రాకుండా ఉద్యోగములను ఏర్పరుచ్చుదురు; లేదా భర్తకు విధించిన శిక్ష తగ్గించెదరు. జయిలులో ఉండగా, బయట వివాహము చేసికొని భార్య యింటికి వెళ్ళుచూ వచ్చుచూ ఉండవచ్చును.

జైళ్ళలోకూడ జీతాలిస్తారు. బయట 100 రూపాయలు సంపాదించేవాడు యిచట 20 మొదలు 50 వరకు సంపాదిస్తాడు. మూడింట రెండు పాళ్ళు వెంటనే ఖైదీకి చెల్లిస్తారు, తక్కినది విడుదల అయినపుడు చెల్లిస్తారు, జెయిళ్ళలో విద్య నేర్పుటకు ఏర్పాట్లు ఉన్నాయి. ప్రతి జయిలులోను కౌన్సిల్ ఆఫ్ కల్చరు (విజ్ఞానాభి వృద్ధి సంఘము) వుంటుంది. ఖైదీలే దాన్ని ఎన్నుకొంటారు. ఐదు రోజుల కొకసారి వెలువడే పేపర్లున్నాయి. ఖైదీల యిబ్బందులు తెలుపు గోడ వార్తాపత్రికలు ప్రకటించుతారు.

జయిలులో ఎవరి గుడ్డలు వారే ధరించవచ్చును. యూనిఫారం లేదు. పొగ త్రాగడం, సంగీతం పాడుట నేరంకాదు. ఒంటరిగా నిర్బంధించడం లేదు. కొందరు ఖైదీలు కలసి వుంటారు. చీట్లపేక, మద్యము త్రాగడం మాత్రం పూర్తిగా నిషేధించారు. ఖైదీలలో వచ్చిన తగవులు వారే యెన్నుకొనిన కామ్రేడ్సు కోర్టులు ద్వారా పరిష్కరించు కొంటారు. ఖైదీలకు తమకు సంఘముకోవున్న బాధ్యతను గుర్తించునటుల చేయడానికి ప్రభుత్వం అనేక ప్రయత్నాలు చేస్తుంది.



## సంఘము అభివృద్ధికి గురుతు

నేరములు ప్రతి సంవత్సరము క్షీణించుచుండ వలెనని వారి ఏర్పాటు. అవి క్షీణించుటే, సంఘము వృద్ధికి వచ్చుచున్నదని గుర్తు. గడచిన ఇరవై సంవత్సరములలో నేరములు మూడింటిలో రెండు భాగములు క్షీణించినవి. రషియా కధ ఆలాగుండగా; ఇతర దేశములలో ఆర్థిక క్షోభలు. నిరుద్యోగములు. నేరములు. ముఖ్యముగా కూలీలు, దొంగ తనములు, బ్యాంకుల దివాలాలు, కంపెనీల దివాలాలు, ధనవంతుల బిడ్డలను దొంగలించుట, పడుపువృత్తి, విడాకులు వగైరా పెరిగిపోవుచున్నవి.

## కమ్యూనిస్టుల ఆశయము: దృఢ విశ్వాసము.

సోవియటు యూనియన్‌లో నవీన సాంఘిక పద్ధతి నేర్పరచి, దాని జయముకొరకు విశ్రాంతి అయినను లేకుండా పని చేయుచుండెడు కమ్యూనిస్టు పార్టీవారి ఆశయము ప్రకారం, దృఢ నమ్మకము ప్రకారము, నేరములనేవి సోషలిస్టు సంఘములో ఉండవు. కొంత కాలము అయిన తరువాత కోర్టులు ఒక వేళ ఎవరయినా తప్పు చేసిన విచారణ మాత్రము చేసి, జడ్జీలు తమ అభిప్రాయమును మాత్రమే తెలుపుదురు. వ్యక్తులలో సాముదాయక సంఘ శ్రేయస్సునందు చైతన్యము ఏర్పడగానే, కోర్టువారి తీర్పు జన బాహుళ్యముయొక్క అభిప్రాయముగాను, సంఘముయొక్క ఆక్షేపణగాను, చివాట్లుగాను వ్యక్తులు భావించి తిరిగి అట్టి తప్పును చేయరు అను ఆశయమునందు కమ్యూనిస్టు పార్టీవారు దృఢముగా నమ్మియున్నారు. ఈ విధంగా ప్రజాభిప్రాయపు ఒత్తిడి మూలంగా నేరములు లేకపోయినపుడు కోర్టులే ఉండవు.

అట్టి సుఖము ఎప్పుడు ఏర్పడునో గదా!

రషియనులు స్వయం కృషిచేత జయించిరి; దైవికంగా కాదు. మనమున్నూ కృషి చేస్తే జయించలేమా?

—⁂—


విజయసింధూరము
రిజిష్టర్డు
స్త్రీల హిస్టీరియా వ్యాధిని, తెల్లబట్టు, ఋతువ్యాధులు
క్షయ, నరముల బలహీనత, నడుమునొప్పి, కాళ్లులాగుటను, శీఘ్రకాలములో అద్భుతంగా పోగొట్టి, బలము కలుగజేయును.
కేటలాగు, సలహా ఉచితము
శ్రీ కృష్ణ ఆయుర్వేద ఫార్మసీ, ఏలూరు

# సైన్సు: విజ్ఞానము

కామ్రేడ్ కె. యల్. నరసింహం, బి. ఏ.

యూరపు ఖండములో 17 వ శతాబ్దము నుంచి శాస్త్రపరిశోధన అభివృద్ధికా సాగింది. కొద్దిమంది శ్రమశక్తి చేత ఎక్కువ వుత్పత్తి సాగించటానికి నూత్నయంత్రాలు, మార్గాలు కనిపెట్టటం ప్రారంభమైంది. ధనికవాదంతో పాటు శాస్త్రపరిజ్ఞానముకూడా అభివృద్ధిచెందింది. ధనికవాద దేశాలలో యీ శాస్త్రపరిజ్ఞానము కొద్దిమంది సౌకర్యాలు, లాభాలకే వినియోగపడింది. రష్యా దేశములో శాస్త్రపరిజ్ఞానము నూతన స్థానము వహించింది.

సోవియటు పరిపాలకులు శాస్త్రపరిజ్ఞానము, విజ్ఞానం వీవి అభివృద్ధి మీదే మానవ జీవితం ఆధారపడిఉందని తెలుసుకున్నారు. భౌతిక ప్రపంచానికే ప్రాముఖ్యత యిచ్చి, భౌతికాతీతమైన మిధ్యవాదములకు తావివ్వక, శాస్త్రపరిజ్ఞానము యడల దృఢ నిశ్చయముతో శాస్త్రపరిశోధనలు ప్రారంభించారు. ఇతర దేశాలలోని శాస్త్రజ్ఞులకు, సోవియటు శాస్త్రజ్ఞులకు భేదమున్నదని చెప్పకతప్పదు. ప్రకృతి స్వాధీన పరచుకోడానికి శాస్త్రజ్ఞానమే మార్గమని బోల్షివిక్కులు నమ్ముతారు.

ఇతరదేశ శాస్త్రజ్ఞులు, శాస్త్రాలు, వాటి ఆచరణ భాగాలను విడదీసినట్టుగా బోల్షివిక్కులు ఎన్నడు జేయలేదు. శాస్త్రీయ పరిజ్ఞానము ఆచరణలో పెట్టినపుడే మానవులకు వుపయోగకరమని నమ్ముతారు. పరిశ్రమాభి వృద్ధిచేయటానికి శాస్త్రపరిశోధన విరివిగా సాగించుచున్నారు. సోవియట్ విద్యావిధానంలో శాస్త్రపరిశోధన చాలా ప్రాముఖ్యత వహించింది. పరిశోధన సంస్థలు అనేకము నెలకొల్పబడ్డాయి. అనేక లాబరేటరీలను నిర్మించారు. ఈ సంస్థలలోను, లాబరేటరీలలోను యువకులకు తరిఫీదు యివ్వసాగారు. ప్రతి సోవియట్ కమిస్సారుకు (మంత్రికి) సంభంధించిన శాస్త్రపరిశోధన సంస్థలు ఏర్పాటుజేస్తున్నారు. ఈ సంస్థలలో పరిశోధనలు సాగించి, ప్రజాసామాన్యమునకు వాటిఫలితాలను జెప్పుతున్నారు వెంటనే వీనిని ఆచరణలో పెట్టుతున్నారు.

సోవియట్ ప్లానింగు కమీషన్ వారి చేత శాస్త్ర పరిశోధనలకు గాను, కార్యక్రమము నిర్ణయించబడ్డది. ప్రదాన శాస్త్రీయ విద్యాశాల (Academy of Sciences) సోవియట్ కమజార్ల మహా సభ వారి యాజమాన్యము క్రిందికి తీసుకొనిరాబడ్డది. వారు పరిశోధన సంస్థలు ఎచ్చటెచ్చట నిర్మించాలసినది, ఏవిధంగా పరిశోధన సాగించాలసినది నిర్ణయించుకొని పని చేస్తున్నారు. వారు చేసే పనులు; (1) పరిశోధనకు గాను విషయములను నిర్ణయించుట. (2) పరిశోధన సంస్థలను నిర్మించుట. (3) పరిశోధన సంస్థలలో యువకులను తయారు చేయుటకు కార్యక్రమము నిర్ణయించుట. (4) ప్రజాసామాన్యమునకు శాస్త్ర పరిజ్ఞానములో ఉత్సాహము కలుగజేయుట. 1932—1933 లో ప్రధాన శాస్త్రీయ విద్యాశాలలో అనేకము మార్పులు జరిగినవి. పరిశోధనలకు, సోషలిస్టు నిర్మాణమునకు సంబంధము కలుగజేయబడెను. లాబరేటరీలలోను, పరిశోధన సంస్థలలోను జరిగిన పనిని పరీక్షించి వివిధ పరిశోధనలు సాగిస్తున్నారు. ఈ విద్యాశాల యాజమాన్యమున (1) ఆర్ధిక శాస్త్ర సంస్థ (2) రాజకీయ శాస్త్ర సంస్థ (3) సోవియటు ప్రణాళిక చట్టాలు (4) వ్యవసాయక శాస్త్ర సంస్థ (5) తత్వశాస్త్ర సంస్థ (6) లలిత, కళా శాస్త్ర సంస్థ (7) చరిత్ర, సారస్వతముల గూర్చిన సంస్థ నడపబడుచున్నాయి. ఈ సంస్థలలోని అనుభవాలు ప్రకటించబడుచున్నవి. ఉమ్మడి ఆస్తి యెడల ప్రతి మనిషి బాధ్యత తీసుకొనేటట్లు చేయబడుచున్నది.

ప్రజా సామాన్యమంతా శాస్త్ర పరిశోధనలలో శ్రద్ధ తీసుకొంటున్నారు. ఫ్యాక్టరీలో గాని, గవర్నమెంటు వ్యవసాయ శాలలలో గాని పనిచేసే కార్మికులు, వారు చేయు పనులలో క్రొత్త, క్రొత్త పరిశోధనలు జేస్తున్నారు. విద్యార్ధులు వారికి అవకాశా ముండు సమయాలలో వచ్చి, లాబరేటరీలలో పని చేస్తున్నారు. ప్రతి జిల్లాలో పిల్లలకు తరిఫీదు యిచ్చేటందుకు పరిశోధనా సంస్థలను ఏర్పాటు చేశారు. 12, 13, 14 సంవత్సరములు వయస్సుగల పిల్లలు గూడా ఉత్సాహంగా లేబరేటరీలలో పని చేయడానికి వస్తూఉన్నారు. వారెట్టి డబ్బునూ ఇవ్వక కేవలము తమ కుతూహలాన్ని నెరవేర్చుకోడానికి వచ్చి పరిశోధన చేసి పోతూ ఉంటారు. దీని వలన వారు ముందుముందు గొప్ప శాస్త్రజ్ఞులు కావడానికి అవకాశముందని కమ్యూనిస్టుల నమ్మిక. విమానాల యంత్రశాలలో పని జేసిన పిల్లలు విమానాలు నడుపుటలో నిపుణు లయ్యారు. ప్రతి ఫ్యాక్టరీలో లేబరేటరీ లుంటవి. కార్మికులు తమ పని చేయు గంట లయిన తర్వాత లేబరేటరీలలో పరిశోధనలు సాగించుతారు.

ప్రతి సంస్థ ఒక నిర్ణీత కార్యక్రమము నిర్ణయించుకొంటుంది. ప్రతివారు చేసిన పనిని పరిశీలించుతుంటారు. సోవియట్ యూనియన్‌లోని శాస్త్ర పరిశోధన సంస్థలు జూచిన ఇతర దేశ శాస్త్రజ్ఞులు తమ దేశములలో అట్టివి లేవు అని వారు అసూయ జెందుతారు!



సోవియటు యూనియన్‌లోని భౌతిక శాస్త్రపరిశోధన సంస్థలు ప్రపంచమంతటా విఖ్యాతిపొందినవి. లెనినుగ్రాడ్‌లో మానసిక శాస్త్రసంస్థలో మానవుల భావాలు ఏవిధంగా కలుగుచున్నవో వాటికి, ప్రపంచములోని వస్తువులకు గలసంబంధమును గూర్చి పరిశోధనలు సాగుతున్నవి. వైద్య సహాయంకోసం 200 వైద్యశాస్త్రసంస్థలు నిర్మించి వాటిలో ప్రజలకు గలుగుచున్న జబ్బులకు కారణాలు కనిబెట్టుచున్నారు. మాస్కోలోని శాస్త్రపరిశోధన సంస్థలలో మానవుల నడవడికను గూర్చి పరిశోధన జేసారు. మనుష్యులభావాలు, నడవడిక, వారువుండు ప్రదేశము, పరిస్థితులమీదనే ఆధారపడి వుంటుందని నిర్ణయించారు.

కేంద్ర విమానాల పరిశోధన సంస్థలో నూతన విమానాలు చేయు పద్ధతి, నూతన మార్గాలను పరిశోధనగావించారు. వ్యవసాయ శాస్త్రపరిశోధనాసంస్థలలో ఏప్రాంతములలో భూమిఎందుకు వుపయోగపడుతుందో పరీక్షించుచున్నారు. రోజురోజుకు పరిశోధనా సంస్థలలో పనిచేసేవారిసంఖ్య అభివృద్ధి జెందుతూన్నది. 1937 నాటికి ఇట్టి పరిశోధనాలయాలు 784 వున్నవి. 1932 నుండి 40 వేలు పరిశోధకులుంటే 1937 లో 50 వేలున్నారు.

సోవియటు యూనియనులో, నూతన సమాజాన్ని, నూతన మనిషిని నిర్మించడానికి పునాది, పూర్వపు సమాజాల్లోలాగ మూఢ నమ్మకాలు, మతవిశ్వాసము, సనాతన ఆచారాలు కాక, శాస్త్ర పరిశోధన వల్ల తెలుసుకొన్న సత్యాలు. సోవియటు యూనియనులో ప్రతి వ్యక్తికీ శాస్త్రీయ దృక్పధము అలవడేటట్లు చేసి, శాస్త్ర విజ్ఞానము మీదనే తమ జీవితమును నెలుపుకొనే టట్లు చేస్తున్నారు.

---

ఆంధ్రభూమియందు ప్రప్రధమున స్థాపింపబడిన

## ఆంధ్ర ప్రావిడెంటు కంపెని. లిమిటెడ్

స్థాపితము—1929 ప్రధాన కార్యస్థానము—బెజవాడ

స్వల్ప ప్రీమియములు! నవీన పద్ధతులు!!!

మేనేజింగు డైరక్టరు:
మ. రా. శ్రీ. దిట్టకవి వీరరాఘవయ్య పంతులు గారు.

జనన భీమా శిశు పోషణకు గొప్ప సహకారి.

ప్రత్యేక సౌకర్యములు.

1. స్త్రీ పురుషులకు సమానమైన ప్రీమియం రేట్లు
2. రు. 100 మొదలు రు. లు 500 వరకు పట్టాలు జారీ చేయబడును.
3. వైద్య పరీక్ష లేని భీమా పద్ధతులు.
4. క్లెయిములు గ్యారంటీ జేయబడినవి.
5. పట్టాదారులకు ఋణము లివ్వబడును.
6. జనన భీమాలో నెలకు 1 లేక 2 రూపాయిలు ప్రీమియం చెల్లించిన రు. 500 లు లేక 1000 లు వరకు క్లెయిము పొందవచ్చును. కవల పిల్లలు జనించిన రెండు క్లెయిములు యివ్వబడును.
7. వివాహపు భీమాలో నెల 1కి రు.5-0-0లు ప్రీమియము చెల్లించివలసిన కాలపరిమితి నాల్గు సంవత్సరములు, క్లెయిములు 1000 వరకు పొందవచ్చును.
8. వివాహపు భీమాలో వివాహము కాని స్త్రీ, పురుషులెల్లరు పట్టాదారులుగా జేరవచ్చును.
9. ఉత్తర ప్రత్యుత్తరములు తెలుగుభాషలో జరుపవచ్చును.
10. పట్టాదారులకు ఫలప్రదమును సహాయకరము నగు సేవయే ఆదర్శము.

ఏజంట్లకు ధారాళమైన కమీషను యివ్వబడును.

సర్దార్

## లెవండర్ పౌడర్

తల వెంట్రుకలకు సువాసనను, అందమును కలిగించి, మెదడుకు చలువ చేయును.

సర్దార్ పర్ ఫ్యూమరీ వర్క్సు.
హైక్లాస్ పర్ ఫ్యూమర్సు.
తెనాలి.

## గృహలక్ష్మి చారు బిళ్ళ

నవనాగరిక పద్ధతులతో సులభముగా చారు తయారు చేసుకొనుటకు కనిపెట్టబడినది. దీని వెల ఒక అణా. చారు తయారు చేయు విధము పాకెట్టులో వుండును.

యం. వెంకటరెడ్డి అండ్ కో.
మారీసుపేట, తెనాలి.

## వసంత కుసుమాకరము

మధుమేహము (Diabetes) అతిమూత్రము, శుక్లనష్టము, బలహీనత, తెల్లకుసుమ మొదలగు వ్యాధులకు దివ్యౌషధము. తు 1 కి 20—0—0.

## వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము

హెడ్డాఫీసు:—చింతలూరు

ఆలమూరు పోస్టు, తూర్పుగోదావరి జిల్లా.

బ్రాంచీలు:—కాకినాడ, రాజమండ్రి, పెద్దాపురం, ఏలూరు, అనకాపల్లి, విశాఖపట్నం, అమలాపురం, తుని, గుంటూరు, బెజవాడ, పాలకొల్లు, బందరు, రామచంద్రపురము.

బ్రాంచి:—పట్నంబజారు, గుంటూరు.

---

## పైల్‌సాల్ ఔషధము, క్యూరాల్ లేబరేటరి

(రిజిష్టర్డు)

బెంగుళూరు సిటి వారి, ఆస్తిస్నీ తయారుసూ అయి వున్నది.

పెద్ద బుడ్డి వెల రు. 5—0—0. అర్ధ బుడ్డి రు. 2—12—0. పోస్టేజి ప్రత్యేకము.




### పైల్‌సాల్

మలల జాడ్యమునకు శస్త్రము లేకనే పూర్తిగా నయమగును. గొప్ప, గొప్ప డాక్టరుల వలన ఆస్పత్రులలో మెప్పు బడసి వాడబడుచున్నది. బ్రిటిషు గవర్నమెంటు వారి వలన హిందూదేశములోను ప్రపంచమంతటను రిజిష్టరు చేయబడిన ఔషధము. పైల్‌సాల్, విలువగల, పై పూత ఔషధము, ఇది లోపల, వెలుపల, మలల కయినను, రక్తము, చీము పడుట, ఎంత తక్కువ, ఎక్కువ జబ్బులను వెంటనే కుదుర్చును.

పైల్‌సాల్ మందు చల్లగా వుండును. ఆసనమందు వ్రేలాడు, అశుద్ధ రక్త నాళములు, మందు పూత వలననే పైకి పోవును, ఆసనమందు, జిల, మంటలను వెంటనే ఆపును, పైల్‌సాల్: సుఖ విరేచనము కలుగజేయును. ఉపయోగించు విధానము ఔషధముతో పంపబడును. అనేక యోగ్యతా పత్రములు బడసి యున్నది.

వలయువారు యీ దిగువ విలాసమునకు వ్రాయుడు.

### ది మెడికల్ హాల్—గుంటూరు.

---

## జీవశక్తి

కృశించిన కండరాలను తిరిగి శక్తివంతం చేయడానికి, క్షీణించి పోయిన రక్తాన్ని వృద్ధి పరచడానికి, తేజోవంతమగు కళకాంతులు కలుగుటకు "మానినీ మకరధ్వజ లేహ్యం" కొత్త జీవశక్తిని ప్రసాదించి, జీవితాన్ని ఆనంద మయంగా జేస్తుంది. సీసా, రు. 2—0—0.

### క్షీరసముద్రం ఫార్మసీ, రాజమండ్రి.

---

## ఆరోగ్యప్రద

గుండెదడ, నిస్సత్తువ, రక్తదోషము నపుంసకత్వము నివారించి వీర్య వృద్ధి, జ్ఞాపకశక్తి, బలము, సంసార సౌఖ్యము కల్గించును.

### సూర్యాఆయుర్వేదఫార్మశి

ఏలూరు,

ఆయుర్వేదౌషధములన్నియు దొరకును.

---

## ఒక్క రూపాయికే అమోఘమైన ప్రచురణ

మొదటి పుస్తకం వెలువడింది. ప్రచురణ వివరాలు తెలుసుకోవలెనంటే అణా తపాలు బిళ్ళ పంపండి. బుక్కు పోస్టులో ప్రచురణమైన కాపీ పంపుతాం.

### 'ఉరిటి బ్రదర్సు'

ప్రచురణశాఖ, ఏలూరు.

---

గడచిన 40 సంవత్సరములుగా హిందూ దేశమంతటా సాటిలేని పేరు గాంచిన



అ. అప్పాదొర మొదలి అండ్ సన్స్‌వారి

## మేలయిన మద్రాసు నశ్యం

అ. అప్పాదొర మొదలియార్ అండ్ సన్సు

పోస్టు బాక్సు నెం. 189 మద్రాసు.

## కర్ఘిజ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

★ ముఖ్య పట్టణం — ఫ్రన్జ్






ఎన్నోసార్లు బంధ విముక్తు లవడానికి ప్రయత్నించిన యీ ప్రజలకు నవంబరు విప్లవం స్వాతంత్ర్య మిచ్చింది.

గుర్రాలకు ప్రసిద్ధి. ప్రత్తి, ఓటు పంచదార ముఖ్యమైన పంటలు. స్కూళ్లు, విశ్వవిద్యాలయాలు సోవియట్ పాలనలో నిర్మించబడ్డాయి. నూతన సాహిత్యం కవులు బయలుదేరారు.

పరిశ్రమలే యెరుగని దేశంలో నేడు బొగ్గుగనులు, పంచదార మిల్లులు నిర్మించబడ్డాయి.

# పబ్లిక్ ఫైనాన్సు : కరెన్సీ

కామ్రేడ్ నండూరి ప్రసాదరావు

"పబ్లిక్ ఫైనాన్స్" అంటే ప్రభుత్వ ధన మని చెప్పవచ్చును. సాధారణముగా ఏ దేశములోనైనా ప్రభుత్వము విధించు పన్నులు, శిస్తులు, సుంకములు, ఇవన్నీ కలసి ప్రభుత్వ ఆదాయ మనబడును. ఒక సంవత్సరమునకు అంచనావేసి ప్రభుత్వం తయారుచేయు ఆదాయ వ్యయ పట్టికయే, బడ్జెట్. ఈ ప్రభుత్వ ఆదాయ వ్యయములు, బడ్జెట్లు, సోవియట్ యూనియనులో ఏ సూత్రముల మీద ఆధారపడియుండును? రాజకీయముగా, ఆర్థికముగా, సాంఘికముగా ఇతర దేశములతో ఎంతో భేదము కలిగిన సోవియట్ యూనియన్ బడ్జెట్లకు, పెట్టుబడిదారీ ప్రభుత్వముల బడ్జెట్లకు ఏమిటి వ్యత్యాసము? సోవియట్ యూనియనులో బ్యాంకు, కరెన్సీ పద్ధతులు ఎలాఉంటాయి? పన్నులు విధించే మార్గములు—ఈవిషయములనుగురించి ఇప్పుడు పరిశీలించెదము.

## ప్రభుత్వ ఆదాయము

సోవియట్ యూనియన్‌లో పన్నుల ద్వారా ప్రభుత్వమునకు చాలా కొద్ది ఆదాయము వస్తుంది. పెట్టుబడిదారీ దేశములలో ప్రజ లందరికి పన్నులు, శిస్తులు విధించి, ఆదాయము నంతా ఎక్కువగా ధనిక వర్గములకు, మధ్య వర్గములకు ప్రయోజనకరముగా వ్యయము చేయుట సాధారణ మైనది. ప్రభుత్వము ధనికవర్గముల చేతులలో ఉండుటవల్ల, కష్టజీవుల నుంచి బలవంతముగా పోలీసుశాఖ సహాయంతో, "న్యాయ శాసనములను" దౌర్జన్యముగా అమలుపరుస్తూ వసూలు చేయబడిన పన్నులన్నిటిని అన్యాయముగా ఖర్చుపెట్టుట, ఏ ప్రభుత్వ బడ్జెటు చూసినా వెల్లడి అగును. పెట్టుబడిదారీ ప్రభుత్వముల బడ్జెట్లు ఆ దేశములలో గల వర్గభేదముల ప్రతిబింబమయి ఉండును.

సోవియట్ యూనియన్‌లో దోపిడికి ఏ మాత్రము తావు లేదు. ప్రభుత్వము, ఇతర దేశములలో వలె గాక, కష్టజీవులందరికి చెందినదై యున్నది. అందువలన పీడిత వర్గాలకు పన్నులు విధించి, దోపిడిచేయుట, పీడించే వర్గముల లాభము కొరకై వ్యయంచేయుటగూడా సోవియట్ యూనియన్‌లో లేదు. అయితే, ప్రభుత్వమునకు పన్నుల ద్వారా వచ్చే కొద్ది ఆదాయము ఏ యే పన్నుల వల్ల వస్తుంది? సోవియట్ యూనియన్‌లో మిగిలిపోయిన కొన్ని వ్యక్తిగతమయిన సొంత పరిశ్రమలకు, కొంతమందికి వచ్చు పెద్ద ఆదాయములకు, అపరిమితమైన పన్నుల విధిస్తుంది ప్రభుత్వం. వ్యక్తిగత వ్యాపారము మిగిలి ఉన్నదానిమీదకూడ అధికమైన పన్ను ఉన్నది. వీటిమీద ఎక్కువ పన్నులు విధించుటకు కారణం, క్రమేణా ప్రైవేటు వ్యాపారం, ప్రైవేటు పరిశ్రమ లేకుండా చేయుటయే. అయితే, సోవియట్ ప్రభుత్వమునకు ఆదాయం ఎక్కడ నుంచి వస్తుంది? సోషలిస్టు సమిష్టి ఆర్థిక విధానములవల్ల రోజు రోజుకు అభివృద్ధి అగునట్టి ఉత్పత్తి మీదనే ఆధారపడుతుంది సోవియట్ బడ్జెట్. సమిష్టి పరిశ్రములు, వ్యవసాయము ప్లాను ప్రకారము వృద్ధి చేయబడును. బడ్జెటులో వీని నుండి వచ్చిన ఆదాయమే ప్రభుత్వాదాయంగా చూపించబడును. ప్రజ లందరి బలము, అంగీకారము మీద ఆధారపడిన సోవియట్ ప్రభుత్వములో, ప్రత్యేకముగా ప్రజలందరికి పన్నులను విధించే అవసరము రద్దు అగుచున్నది. సోషలిస్టు సమితి పరిశ్రమల ద్వారా వచ్చు ప్రభుత్వ ఆదాయము రోజురోజుకు వృద్ధి అగుచున్నది, 1937 బడ్జెటు ప్రకారం 9660 కోట్ల రుబుల్స్, ప్రభుత్వ ఆదాయం; 1938 బడ్జెట్ ప్రకారం 13270 కోట్ల రుబుల్స్. పరిశ్రమ ఎంత తీవ్రముగా జరుగుతున్నదో గూడా తెలియజేస్తయి పై సంఖ్యలు.

## ప్రభుత్వ వ్యయం

పైన చెప్పబడిన మార్గముల ద్వారా ప్రభుత్వమునకు వచ్చు ఆదాయ మంతా సోవియట్ యూనియనులోని ప్రజలందరి యభివృద్ధి కొరకు వినియోగించబడును. ఇతర దేశముల వలె గాక, ఆదాయములో ఎక్కువ భాగము సోషలిస్టు ఆర్థిక విధానము వృద్ధి చేయుటకు, సాంఘిక వైజ్ఞానిక అభివృద్ధికొరకు, పాఠశాలలకు, క్లబ్బులకు, ప్రజల ఆరోగ్యము, విశ్రాంతికొరకు, వినియోగింపబడును. పెట్టుబడిదారీ దేశములలో, ఆయుధములకు, మారణయంత్రములు మొదలైన ప్రయోజనకరము కాని (unproductive) విషయముల కొరకే ఆదాయములోని ఎక్కువ భాగము ఉపయోగించబడును.

సోషలిస్టు నిర్మాణమునకై, మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రకారం 1928—1932 లో 8360 కోట్ల రూబుల్సు వ్యయముగావింపబడెను. 1932—37 లో 22,140 కోట్ల రూబుల్సు; మూడవ పంచవర్ష ప్రణాళిక అమలు చేయబడిన మొదటి సంవత్సరం అనగా 1938 లో, సోషలిస్టునిర్మాణమునకై 4720 కోట్ల రుబుల్సును ఖర్చుపెట్టుచున్నది.

1938 బడ్జెటు ప్రకారం, ఒక్క—

మాస్కో పట్టణమునకై 200 కోట్ల రుబుల్స్ అంచనా వేయబడినది. ఇందులో 39 కోట్ల, 1 లక్ష రుబుల్స్ విద్యాభివృద్ధికై. ప్రజారోగ్యాభి వృద్ధికై 42 కోట్ల 3లక్షల రుబుల్సు.

లెనిన్‌గ్రాడ్ నగరమునకు జారుప్రభుత్వ కాలములో, 1913 సంవత్సరములో 470 లక్షల రుబుల్సు ఖర్చుపెట్టబడెను. ఈ రోజున అనగా 1938 లో 1400 లక్షలు వినియోగపరుస్తున్నది సోవియటు ప్రభుత్వం.

మాస్కో లెనిన్‌గ్రాడ్ మొదలైన ముఖ్య పట్టణములలోనేకాదు. ఈ అభివృద్ధి. యూనియన్‌లోని అన్ని రిపబ్లిక్కులలోను, ప్రతిపల్లెలోను ప్రభుత్వ వ్యయము ఎన్నోరెట్లు ప్రతిసంవత్సరము ఎక్కువగుతున్నది. 'బైలో' రిపబ్లిక్‌లో జారుప్రభుత్వము ప్రతి వ్యక్తికి 60 కోపెక్కులు (ఒక రుబుల్ కు 100 కోపెక్కులు) ఖర్చు పెట్టేది. ఈ రోజు ఒక్కొక్కనికి 100 రుబుల్సు ఖర్చు అగుచున్నది.

బూర్యాట్ మంగోలియా రిపబ్లిక్‌లో జారు ప్రభుత్వము 70 కోపెక్కులను ప్రతి వ్యక్తికి ఖర్చుపెట్టేది. ఈ రోజు 74 రుబుల్సు 63 కోపెక్కులు వ్యయము గుచున్నది. ఎంతో వెనుకబడి ఉండేది జార్జియారాష్ట్రము జారు సామ్రాజ్యంలో. ఈ రోజు జార్జియా సోషలిస్టు సోవియటు రిపబ్లిక్‌లో 700,000 పిల్లలు చదువుకునే 4,437 ఎలిమెంటరీ పాఠశాలలు, 20,000 విద్యార్థులుకలిగిన 18 హైస్కూళ్ళుగలవు. పై సంఖ్యలన్నీ సోవియటు యూనియనుయొక్క సంపదను, అభివృద్ధికరమైన బడ్జెట్లను స్పష్టంగా సూచిస్తాయి.

## సోవియటు బడ్జెటు...

సోవియటు యూనియన్‌లోని రిపబ్లిక్కులన్నిటికి కలిపి ప్రతి సంవత్సరము బడ్జెటు తయారుచేయబడును. సోవియటు యూనియను కంతా వర్తించు బడ్జెటును ప్రభుత్వ ధనశాఖాధికారి (Commissar of Finance) తయారు చేయును. పెట్టుబడిదారీ దేశములలోవలె. ఇతనికి బడ్జెటుమీద సంపూర్ణ అధికారములేదు. ఇతడు తయారుచేయు బడ్జెట్‌ను, మొదట ప్రభుత్వ ప్లానింగ్ కమీషన్ (State Planning Commission) అంగీకారమునకు పంపవలెను. దీనితరువాత పీపిల్సుకమిస్సార్ల కౌన్సిల్ Central council of Commissars: Sovnarkm.) ఒప్పుకొన వలెను.

సోవియటు బడ్జెట్ యొక్క ఫెడరల్ వ్యవహారములకే సంబంధించక, అన్ని రిపబ్లిక్కులు, ఆ రిపబ్లిక్కులలోని ప్రతి జిల్లా, తాలూకా, పల్లెలకు వర్తించుచుంది. ఏపల్లెనుంచి ఎంత ఆదాయము వచ్చునో, ఎంతవ్యయము చేయునది తెలియజేస్తుంది సోవియట్ యూనియను బడ్జెటు. కాన ఈ రిపబ్లిక్ బడ్జెట్లన్నీ, గ్రామాల బడ్జెట్లతోసహా మొత్తముమీద తయారుచేయబడు. యూనియను బడ్జెట్‌నకు తోడ్పడును పన్నులద్వారా వసూలయ్యే ఆదాయముగాక, రైల్వే, పోస్టల్, టెలిగ్రాఫ్ మొదలైన కేంద్ర విషయముల మీద ఫెడరల్ ప్రభుత్వమునకు అధికారముగలదు. అవసరమునుబట్టి, సోవియటు ప్రభుత్వము, ప్రతిరిపబ్లిక్ అభివృద్ధికొరకు కావలసినధనమును గ్రాంట్ చేయును. బడ్జెటుఒకసారి నిర్ణయమైనచో సాధారణముగా తిరిగి మార్పుచేయుటకు వీలులేదు. ప్లాను ప్రకారం తయారగుట వల్ల, మార్పులకు అవసరముగూడ కన పడదు.

సోవియటు యూనియనులో ఏ మూల వసూలైనప్పటికి, పన్నులు ఇతర శిస్తులు వెంటనే ప్రభుత్వ బ్యాంకులో జమ కట్టవలెను. యూనియన్ ప్రభుత్వము గాని, రిపబ్లిక్కులు గాని ఏ ఖర్చుకైనా అవసరమయిన ధనమును ఈ ప్రభుత్వ బ్యాంకు నుంచి తీసుకొనును. దీని నంతా సరిగా నిర్వహించుటకై, ప్రభుత్వ ధన శాఖ 11 ఉపశాఖలలోనికి విభజించబడినది.

1. బడ్జెట్ 2. కరెన్సీ 3. ప్రభుత్వ ఆదాయం 4. పన్నులు విధించుట 5. ధనము, ఆర్థిక విధానము 6. ఆడిట్; కంట్రోల్ 7. స్థానిక ధనము 8. సెంట్రల్ ధన శాఖ 9. ప్రభుత్వ సేవింగ్స్ బ్యాంకు 10. కరెన్సీ, నాణెముల మింటు.

కరెన్సీశాఖమీద యూనియన్ ప్రభుత్వ శాఖాధికారికి పూర్తి అధికారము కలదు. సోవియటు కరెన్సీ, ఇతర దేశముల కరెన్సీ మీద ఆధారపడక, ఏ మాత్రము సంబంధము లేనిదై యున్నది.

## ప్రభుత్వ బ్యాంకు

ఈ ప్రభుత్వ బ్యాంకునకు యూనియన్ అంతా 2000 బ్రాంచిలు గలవు. ప్రభుత్వమునకు సంబంధించిన అన్ని వ్యవహారములు, వర్తక, వ్యాపారములు, పరిశ్రామిక వ్యవహారములు అన్ని ఈ ప్రభుత్వ బ్యాంకు ద్వారానే జరుగును. ప్రభుత్వ సంస్థలన్నిటికీ ఈబ్యాంకునందు 'కరెంట్' అక్కౌంటు ఉంటుంది. కరెంటు ఎక్కౌంటులో మార్పుల ద్వారా అమ్మకము, కొనుగోలు, ఇతర వ్యవహారములు జరుగును.

## ప్రభుత్వ సేవింగ్స్ బ్యాంకు

దీనికి 20,000 బ్రాంచిలు కలవు. ఈ బ్యాంకుకూడా ప్రభుత్వ ధనాధికారిక్రిందనే నిర్వహింపబడుచున్నది. రోజు రోజుకు ఇందులో డబ్బు కూడబెట్టుకొనుట ఎక్కువైనది. 1934 లో 250 లక్షలు పౌరులు దాదాపు 100 కోట్ల రుబుల్సును కూడబెట్టుకొనిరి. తరువాత వడ్డీని నూటికి 8 కి హెచ్చించుటవల్ల, సేవింగ్స్ బ్యాంకులో ప్రజలందరు కూడబెట్టుట మరీ ఎక్కువైంది. ఈ కూడబెట్టిన సొమ్ము నంతా, ప్రభుత్వము పరిశ్రమాభి వృద్ధి కోసం అప్పుగా తీసికొనును.



## పంచవర్ష ప్రణాళికలు: సోవియట్ ప్రభుత్వధనం

జయప్రదముగా అమలు పరుచబడిన మొదటి పంచవర్ష ప్రణాళిక (1928—32); రెండవ పంచవర్ష ప్రణాళిక (1932—37)ను పరిశీలించినచో సోవియటు ప్రభుత్వ ధన స్వభావము స్పష్టమగును.

టేబిల్ 1: రుబుల్సులో అంచనా. (తగ్గినవెలల ననుసరించి)

ఆ దా య ము.

| | 1932 | | 1937 | | 1928—32 | | 1932—37 | |
|---|---|---|---|---|---|---|---|---|
| | కోట్లు | నూటికి | కోట్లు | నూటికి | కోట్లు | నూటికి | కోట్లు | నూటికి |
| సోషలిస్టు ఆర్థిక విధానము. | 3380 | 76 | 6510 | 77 | 8360 | 70 | 27300 | 77 |
| పరిశ్రమలకు పెట్టినపెట్టుబడిలో డిప్రీషియేషన్ | 200 | 5 | 590 | 7 | 630 | 5 | 2020 | 6 |
| అప్పులద్వారా | 820 | 18 | 900 | 11 | 2150 | 18 | 4460 | 12 |
| ఇతరసిస్తులు | 60 | 1 | 410 | 5 | 870 | 7 | 1770 | 5 |
| మొత్తము | 4460 | 100 | 8410 | 100 | 12010 | 100 | 35550 | 100 |

1928—32 లో మొత్తము ఆదాయములో నూటికి 70 వంతులు సోషలిస్టు ఆర్థిక విధానమువల్ల వచ్చినది. 1932—37 ఇది 77 కు హెచ్చింది. కనుక గ్రహించవలసినది: ప్రభుత్వాదాయములో చాలభాగము సోషలిస్టు విధానమువల్లనే వస్తున్నదని ఇది రోజురోజుకు ఎక్కువగుచున్నదని.

టేబిల్ 2: వ్యయమును తెలియజేయును.

రు బు ల్సు లో అ ం చ నా.

| వ్యయము. | 1932 | | 1937 | | 28—32 | | 32—37 | |
|---|---|---|---|---|---|---|---|---|
| | కోట్లు | నూటికి | కోట్లు | నూటికి | కోట్లు | నూటికి | కోట్లు | నూటికి |
| జాతీయఆర్థిక విధానానికి | 3020 | 68 | 4680 | 60 | 8030 | 67 | 22140 | 65 |
| వైజ్ఞానికసాంఘికన అభివృద్ధికి | 950 | 21 | 2020 | 26 | 2390 | 20 | 7540 | 22 |
| ప్రభుత్వపరిపాల సైన్యానికి | 350 | 5 | 430 | 5 | 900 | 7 | 1900 | 6 |
| ప్రభుత్వఅప్పులకు | 100 | 2 | 280 | 4 | 200 | 2 | 1000 | 3 |
| ఇతర ఖర్చులు | 140 | 3 | 350 | 5 | 470 | 4 | 1570 | 4 |
| మొత్తం | 4460 | 100 | 7760 | 100 | 12010 | 100 | 34150 | 100 |

వైజ్ఞానిక, సాంఘిక, ఆరోగ్య అభివృద్ధికొరకు రెండవ పంచవర్ష ప్రణాళిక (1932-37)లో ప్రత్యేకించబడిన మొత్తము ఇదివరకు మొత్తమునకు ఎంత హెచ్చినదో గమనించవలెను. మూడు రెట్లకు పైగా హెచ్చింది! ప్రపంచములో ఫాసిస్టు యుద్ధ తత్వం, సోవియటు యూనియనుకు వ్యతిరేకముగా సామ్రాజ్య వాదుల కుట్రలు ఎక్కువగుటవల్ల, దేశ రక్షణకై ప్రభుత్వము చేసే వ్యయము గూడా కొంతవరకు హెచ్చింది. దీని వలన సామ్రాజ్యవాద దేశములవలె, ఇతర దేశముల మీద దండెత్తుటకు కాదని మటుకు సోవియటు యూనియను రాజకీయ సిద్ధాంతములను తెలుసుకున్న వారి కందరికి వెంటనే తెలుస్తుంది.

## సోవియటు కరెన్సీ

సోవియటు యూనియన్‌లో కరెన్సీ పద్ధతి (Currency System)కి ఇతరదేశములలో పద్ధతులకు వ్యత్యాసము కలదు. ఈ వ్యత్యాసమునకు ముఖ్య కారణము ఆర్థిక విధానములలో గల భేదమే.

క × ఖ = య × ర అనే సూత్రము పెట్టుబడిదారీ దేశముల ఆర్థిక విధానమునకు మూల సూత్రమై యున్నది. (క = దేశములో ఉన్న డబ్బు; ఖ = డబ్బు చలామణి యొక్క వేగము. య = వస్తువుల యొక్క సామాన్యసగటు ధర; ర = యావత్తు అమ్మకం) అనగా చలామణి యొక్క వేగము, యావత్తు అమ్మకం మార్పులు పొందనప్పుడు, దేశములోని డబ్బును (కరెన్సీ గాని, నాణెములు గాని) ఎక్కువ చేసినచో, ధరలు గూడా హెచ్చునని, డబ్బును తగ్గించినచో ధరలు గూడా తగ్గునని సూత్రము యొక్క సారాంశము. ఈ సూత్రము స్వలాభము మీద ఆధారపడిన వ్యక్తిగత పెట్టుబడి సంస్థలతో కూడిన పెట్టుబడిదారీ దేశములకు వర్తిస్తుంది. కాని సోవియటుయూని

యన్‌లో స్వలాభము మీద ఆధారపడిన సంస్థలకు తావు లేదు. పైగా అవి నేరములుగా ఎంచబడును. అంతేగాక అన్ని వస్తువుల ధరలను ప్రభుత్వము నిర్ణయించి ధరలలో మార్పులు వచ్చుటకు వీలు లేకుండా చేయును. అందువలన మొత్తం కరెన్సీని హెచ్చించినను, తగ్గించినను ధరలలో మార్పులు వచ్చుటకు వీలు లేదు. ఇతర దేశముల కరెన్సీలు సోవియటు యూనియనులోకి దిగుమతి చేయుట గాని సోవియటు యూనియన్ కరెన్సీ ఇతర దేశముల కెగుమతి చేయుట గాని ప్రభుత్వము నిషేధించుటవల్ల, ఇతరదేశముల లోని కరెన్సీలలో వచ్చే మార్పులు, సోవియటు యూనియన్‌లోని వస్తువుల ధరలలో ఏవిధముగా నైనా మార్పులు కలిగించలేవు. ఇంతేగాక, వివిధ పరిశ్రమలలో అవసరమైన పెట్టుబడిని నిర్ణయించినపుడు, ఈ నిర్ణయము కరెన్సీకి సంబంధము లేకుండా చేయుట వల్ల, కరెన్సీలో వచ్చే హెచ్చింపు గాని, తగ్గింపు గాని, ప్రభుత్వ పరిశ్రమలలో, ఇతర ఆర్థిక సంస్థలలో మార్పులు తీసికొని రావు. మామూలుగా, అన్ని దేశములలో అమలులో ఉన్న పోస్టల్ స్టాంపు పద్ధతికి సోవియటు కరెన్సీ పద్ధతికి చాలా పోలిక గలదు. స్టాంపుల సప్లయి హెచ్చు చేసినను, స్టాంపుల ఖరీదులో మార్పులు సాధారణముగా ఉండవు. సప్లయి హెచ్చించినను, వ్రాయవలసిన ఉత్తరములకన్న ఎక్కువ ఎవరూ వ్రాయరు. స్టాంపుల సప్లయి తగ్గించినను, పోస్టలు స్టాంపుల ఖరీదు హెచ్చదు. కారణమేమనగా ప్రభుత్వము ఖరీదులు నిర్ణయము చేయుటయే. అందువలన సోవియటు యూనియన్‌లో వస్తువుల ధరలు నిరంతరము ఒకటిగా ఉండునని కాదు. స్టాంపుల ధరలు మటుకు కొన్ని సంవత్సరముల కొకసారి కొన్ని కారణముల వల్ల మారవును లేదా? అలాగే సోవియటు యూనియన్‌లో మొత్తము కరెన్సీకి సంబంధించని ఇతర కారణముల వల్ల (ప్రజలకు లాభకరముగా ఉన్నయెడల కొన్ని వస్తువుల ధరలు తగ్గింపబడును) వస్తువుల ధరలు ప్రభుత్వము మార్పుచేయవచ్చును.

ఇతరదేశములలో కరెన్సీ మార్పులతో వచ్చే వస్తువులయొక్క మార్పులు, సోవియటు యూనియన్‌యొక్క కరెన్సీపద్ధతితోగాని, వస్తువుల ధరలతోగాని ఏ రకమైన మార్పులు తీసికొని వచ్చుటకు వీలు లేదని గ్రహించవలెను. కారణమేమనగా ఇతరదేశములతోగల వ్యాపార సంబంధములను ప్రభుత్వమే నిర్ణయించి తన స్వాధీనము గావించుకొన్నది. ప్రభుత్వం సోవియటుప్రజలందరికి అవసరమైన వస్తువులను ప్రభుత్వము తరఫునే దిగుమతి చేసికొని, వాటికి విదేశ పౌనులలోనో లేక డాలర్లలోనో చెల్లింపవలసినందువల్ల ఆ విలువకు సరిపోయే సోవియటు యూనియన్‌లో ఉత్పత్తిచేయబడు గోధుమలు, మాంగనీసు, ఇనుము, బంగారము లేక ఇతర వస్తువులను విదేశముల కెగుమతిచేయును. దిగుమతులమీద ఆధారపడి అవసరమైన ఎగుమతిని నిర్ణయించునే గాని ఎగుమతులమీద ఆధారపడి దిగుమతులను నిర్ణయించదు ప్రభుత్వం. కారణం వ్యాపారము, లాభము పొందుటమేకాదు ప్రభుత్వఉద్దేశ్యము. సోవియటు ప్రజలకవసరమైన వస్తువులనన్ని సమకూర్చుటయే ప్రధాన విషయం. అందువల్ల విదేశధరలలోని మార్పులు సోవియటు ధరలనుగాని, కరెన్సీనిగాని ఏ మాత్రము మార్పుచేయజాలవు.

వస్తువుల ధరలకుగాని, మొత్తము అమ్మకపు కొనుగోలుకుగాని సంబంధము లేకుండా కరెన్సీని ప్రభుత్వము సొంత సిద్ధాంతములమీద ఆధారపడ విచ్చినచో ఉత్పత్తి తగ్గినప్పుడు, లేక ఏ ఒక పంట సరిగా ఫలించనప్పుడు, ఏ మగుతుంది? డిమాండుకు (గిరాకీకలిగిన) సప్లయి (సరఫరా) ఏలా వుంటుంది? ఈ పరిస్థితులలో ఇతర దేశములలో వెంటనే ధరలు పెరుగుతాయి. ధనవంతులు మాత్రమే అరుదుగాయున్న వస్తువులను కొనగలిగెదరు. సోవియటు యూనియన్‌లో ధనవంతులు, బీదలు అనేభేదము లేనందువల్ల, అరుదుగాయున్న వస్తువులను పిల్లలకో, లేక ప్రత్యేక శాఖలలో పనిచేయు కార్మికులకో, కర్షకులకో అవసరమును బట్టి వినియోగించబడును. అంతేగాని ధరలు పెరుగుట యుండదు. ఇప్పుడు ఉత్పత్తి అభివృద్ధియగు పరిస్థితులలో, ఇటువంటి అనుమానములు కూడ కలుగుటకు అవకాశములేదు.

ఇంకొకవిషయం కరెన్సీలో ప్రజలకు 'నమ్మకము' కలుగజేయుటకు ఇతర దేశములలో కరెన్సీ విలువకు సరిపోవు బంగారమును కూడబెట్టుట సామాన్యమైన సూత్రం. ప్రజలకవసరమైన వస్తువులు పుష్కలముగా ఉత్పత్తి చేయనపుడు కరెన్సీనోట్లు అతివేగముతో చెలామణి యగుననే విషయం అన్ని దేశములవారికి ఇప్పుడు బోధపడినది. అప్పుడు ప్రజలలో నమ్మకముకలిగించుటకు ప్రభుత్వం బంగారమును కూడబెట్టుతుందా లేదా అనే ప్రశ్నరాదు. కనుక సోవియటు యూనియనులో ఈ గ్యారంటీ ఇవ్వనక్కరలేదు ప్రభుత్వం.

అయినప్పటికి బంగారమును సోవియటు ప్రభుత్వం ఎందుకు కూడబెట్టేది అని ప్రశ్నింపవచ్చును. కరువుకాటకముల నెదు[illegible] లేక దేశ రక్షణకు, లేక [illegible] వచ్చు ఇతర అవసరములకు, ఇతర దేశములనుంచి చేసుకొనేదిగుమతులకు బంగారములో చెల్లించ వలెను గనుక, ప్రభుత్వము జాగ్రత్తపడును.

ప్రజా ప్రభుత్వముగనుక, ఏ అమ్మకమైనా ప్రభుత్వశాఖల ద్వారా జరుగును గనుక, ఏ వస్తువులైనా కొనునప్పుడు ఎట్టిపరిస్థితులలోనైనా కరెన్సీ నోట్లను తీసుకొనరనే భయములేదు. సోవియటు యూనియన్‌లో అందువల్ల మోసముతో కూడిన గ్యారంటీల నివ్వనవసరం లేదు. అందువల్ల సోవియటు ప్రభుత్వము ఇతర ప్రభుత్వములవలె, తనకెంత బంగారము కలదో ప్రకటించదు.




# నార్లవారు రచించింది

నవయుగ ప్రచురణాలయం వారి ద్వితీయ ప్రచురణ.

## ఆస్ట్రియా ఆక్రమణ

అమ్మకానికి సిద్ధంగా వున్నది.

"ఆస్ట్రియాకు" యూరోపు రాజకీయాల్లో ఏ స్థానం వుందో;
బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ దేశాలు ఆస్ట్రియాను 'బఫర్ స్టేట్'గా ఎలా ఉపయోగించాయో;
'సోషల్ డెమాక్రెట్సు' తెలివి తక్కువ తనంవల్ల ఆస్ట్రియాలో "సోషలిజం" ఎలా దెబ్బతిన్నదో;
డాక్టర్ డోల్ఫస్‌ను 'నాజీలు' ఎందుకు హత్యచేశారో;
ఆస్ట్రియా ఆక్రమణకు హిట్లర్ పన్నిన పన్నాగాలు;
బ్రిటన్, ఫ్రాన్సు దేశాల ద్రోహం;
ఇటలీ, జర్మనీ డిక్టేటర్ల దురాలోచన,

మొదలైన విషయాలు — ఇంతవరకూ ఎక్కడా వెలువడని ఫోటోలతో — తెలుసుకోవాలంటే ఈ పుస్తకమే చదవాలి.



నార్లవారి

## 'స్వదేశ సంస్థానాలు'

కొత్త విషయాలతో
అఖిలభారత సంస్థాన ప్రజా సంఘాధ్యక్షులు డాక్టర్ పట్టాభిగారి పీఠికతో
ద్వితీయ ముద్రణ ప్రచురించాము.



## రష్యన్ కథలు

ఒక్కొక్క పుస్తకం వెల ఎనిమిది అణాలు.



**నవంబరులోగా రాబోవు ప్రచురణలు**

1. జపాను ప్రళయ తాండవం
2. డిక్టేటరు హిట్లర్
3. డిక్టేటరు ముసోలినీ

## నవయుగ ప్రచురణాలయం,

పెదననగల్లు, కృష్ణాజిల్లా.

# సోవియట్ సోషలిస్టు ఆర్థిక నిర్మాణము



కామ్రేడ్ తనికెళ్ల వెంకటచలపతి

పెట్టుబడిదారీ దేశాలలో, సరకుల ఉత్పత్తి, పంపకం, కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో ఉంటాయి. ఒక షాహుకారు ఒక పెద్ద పట్టణంలో బట్టల ఫ్యాక్టరీ ఒక దాన్ని స్థాపించాడంటే, ఆ ఫ్యాక్టరీవల్ల తనకు కొంత లాభం రావాలనే ఆశ అతన్ని ప్రోత్సహిస్తుంది. అంతేగాని, ప్రజలు కట్టుకోవటానికి బట్టలు తయారుచేసి యిద్దాం అనే ఉద్దేశంతో కాదు. ఏ సరకు తయారు చేసే సంస్థ అయినా యింతే! ఇదే విధంగా, ఒక వ్యక్తి బట్టల దుకాణంగాని, ధాన్యపు కొట్టుగాని, ఫ్యాన్సీ గుడ్సు స్టోర్‌గాని స్థాపించాడంటే, దానివల్ల లాభం సంపాదించాలనే ఉద్దేశమే అతనిలో ఉంటుంది. జాతీయ, అంతర్జాతీయ వ్యాపార విషయంకూడ ఇంతే. ఈ విధానంవల్ల జరుగుతున్నదేమంటే, దేశం మొత్తంమీద ప్రజలు కొనుక్కొన గలిగిన దానికంటె ఒక్కొక్కప్పుడు యెక్కువగాను, ఒక్కొక్కప్పుడు తక్కువగాను సరకులు ఉత్పత్తి అవుతున్నాయి. ఒక వైపున అసంఖ్యాక ప్రజలు నిరుద్యోగులై, ఆహార పదార్థాలు—బట్ట—యితర అవసరాలు తగినన్ని సంపాదించుకో లేక యిబ్బంది పడుతోంటే, మరొక వైపున పెట్టుబడిదార్లు సరకుల ధరలను పెంచి ఎక్కువ లాభాలు సంపాదించుకోవటానికి వేల కొద్ది టన్నుల సరకు నాశనం చేస్తున్నారు. ఉత్పత్తి విధానంలో ఈ విధంగా ఒక రకమైన అరాజకం వ్యాపించియుంది.

సోవియట్ యూనియన్‌లో యీ విధంగా కాదు. 18 కోట్ల మంది ప్రజలకు ఏ యే సరకు ఎంతెంత అవసరమో ప్రభుత్వమే ముందుగా నిర్ణయించి, ఫ్యాక్టరీలలోను ఇతర ఉత్పత్తి సంస్థలలోనూ అంతే సరకు ఉత్పత్తి చేయిస్తుంది. విదేశాలకు పంపవలసిన సరకులుకూడా ముందే అంచనావేసి, వానిని కూడా ఉత్పత్తి చేయిస్తుంది. ఈ సరకులన్నీ ప్రజలకు సులభంగాను, తక్కువ ధరలోను అందుబాటు చేయడానికి వివిధ రకాలయిన వ్యాపార సంస్థలుకూడ స్థాపింప జేస్తుంది. ఉత్పత్తి విధానం అంతా క్రమమైన ఒక ప్రణాళిక ప్రకారం జరుగుతుంది. వ్యక్తుల లాభాల కొరకు గాక, ప్రజల సౌకర్యము కొరకే వస్తూత్పత్తి జరుగుతుంది. ఉత్పత్తి విధానంలో అరాజక మనేది మచ్చుకైనా ఉండదు.

## స్టేట్ ప్లానింగ్ కమిషన్

సోవియట యూనియన్‌లో ఈ ఆర్థిక యంత్రాన్ని నడపడానికి స్టేట్ ప్లానింగ్ కమిషన్ లేక "గోస్ప్లాన్" అనే సంస్థ ఒకటి ఉంటుంది. ఇది ప్రభుత్వంలో ఒక శాఖ. దేశంలో పారిశ్రామికాభివృద్ధి ఏయే శాఖలలో ఎంతెంత అవసరమో: వ్యవసాయాభివృద్ధికి కావలసిన ట్రాక్టర్లు వగైరా యంత్ర సామగ్రి ఎంతెంత ఉత్పత్తి చేయబడాలో; ప్రజల విద్యాభివృద్ధికి ఎక్కడెక్కడ, ఎన్నెన్ని విద్యాలయాలు స్థాపించి యేవిధంగా వాటిని నడపాలో; ఆసుపత్రులు, పశువైద్య చికిత్సాలయాలు వగైరా సంస్థలు ఎన్నెన్ని, ఎక్కడెక్కడ నిర్మించాలో; సహకార సంస్థలు, ప్రభుత్వ వస్తు విక్రయశాలలు. ఉత్పత్తి సహకార సంస్థలు ఏయే ప్రాంతాలలో ఏర్పరచాలో, వాటికి ప్రభుత్వం ఎంతెంత సహాయం చేయాలో; సినీమాలు, నాటకాలు, వినోద క్రీడాసంస్థలు వీటన్నిటికీ ఎంతెంత పెట్టుబడి పెట్టాలో—ఇంకా యెన్నో విషయాలను గురించి ప్రణాళికలు తయారుచేసి, ఆ ప్రణాళికలు అమలు జరిగేటట్లు చూడ్డానికి యీ స్టేట్ ప్లానింగ్ కమిషన్ నియమించ బడింది. పీపుల్సు కమిస్సార్ (మంత్రి వర్గం) యొక్క ఉపాధ్యక్షులలో ఒకరు ఈ కమిషన్‌కి అధ్యక్షులు. 1935 వ సంవత్సరం నాటికి 158 గురు సభ్యులు ఈ కమిషన్‌లో ఉండేవారు. ఈ పద్ధతి ప్రకారమే, వివిధ రిపబ్లిక్‌లలో రిపబ్లిక్ స్టేట్ ప్లానింగ్ కమిషన్లు ఉంటాయి. ఇవి కేంద్ర సంస్థకు శాఖలుగా పనిచేస్తాయి. సోవియట్ యూనియన్‌యొక్క అన్ని మూలలనుంచీ రోజు రోజుకూ ఈ కార్యాలయానికి ఎన్నో లెక్కలూ, వివరాలు సమాచారాలు వస్తూ ఉంటాయి. ఇవన్నీ సరిచూసుకోడానికి వేయిమందికి పైగా నిపుణులతో కూడిన ఒక బ్రహ్మాండమైన ఆఫీసు, ఆ ఆఫీసులో కొన్ని వందలమంది గుమాస్తాలు ఎప్పుడూ పనిచేస్తూ ఉంటారు. 1935 లో ఈ స్టేట్ ప్లానింగ్ కమిషన్‌యొక్క మెంబర్ల సంఖ్య 158 నుంచి 70 కి తగ్గించ బడింది. కాని, వీరికి సహాయంచేసే వేర్వేరు నిపుణుల సంఖ్య 1000 నుంచి 2000 కు హెచ్చు చేయబడింది.

ఇంతమంది సభ్యులతో ఉన్న ప్లానింగ్ కమిషన్‌లో 10 వేర్వేరు డిపార్టుమెంట్లు ఉంటాయి. అవి:

1. వివిధ సరకుల ఉత్పత్తిని సమన్వయంచేసే డిపార్టుమెంటు.
2. వివిధ పరిశ్రమలకు కావలసిన బొగ్గు, ఇనుము మొదలైన సామాను సరఫరా చేయడానికి బ్యాలన్సింగ్ డిపార్టుమెంటు.
3. వివిధ పరిశ్రమలకు, వ్యవసాయానికి, రాకపోక మార్గాలకు, విద్యా సంస్థలకు ఎంతెంత పెట్టుబడి పెట్టాలో నిర్ణయించే డిపార్టుమెంటు.
4. సరకులకు ఖరీదు కట్టుట, ఆదాయ వ్యయ పట్టికను తయారు చేయుట, బ్యాంకింగ్, నాణెముల చెలామణి వీటికై పైనాన్సు (ఆర్థిక) శాఖ.
5. విదేశ వ్యాపారశాఖ
6. కార్మిక సమస్యలు
7. విజ్ఞాన సంపత్తి
8. కళలు
9. ఆరోగ్యం
10. శాంతి సంఘటన.

## ప్లానింగ్ పద్ధతి

ఈ విధంగా, దేశం అంతటికీ స్టేట్ ప్లానింగ్ కమిషన్, దానికి శాఖలుగా, ప్రతి రిపబ్లిక్‌కూ, ప్రతి స్వతంత్ర రిపబ్లిక్‌కూ, ప్రతి రాష్ట్రానికీ ప్రతి జిల్లాకు, ప్రతి తాలూకాకు, ప్రతి పట్టణానికి, ప్రతి గ్రామానికి ఒక్కొక్క ప్లానింగ్ కమిషన్ చొప్పున ఉంటాయి. ఇంతేకాదు. ఒక్కొక్క తరగతి పరిశ్రమకు ఒక్కొక్క ప్లానింగ్ కమిషన్ చొప్పున కూడా ఉంటాయి. పత్తి పరిశ్రమకు ఒకటీ, వ్యవసాయానికి ఒకటీ, బొగ్గు పరిశ్రమకు ఒకటీ, కో ఆపరేటివు శాఖకు ఒకటీ, ఉక్కు పరిశ్రమకు ఒకటీ, ఈ విధంగా ప్లానింగ్ కమిషన్లు ఉంటాయి. ఈ పరిశ్రమలలో ఉత్పత్తిచేయు వివిధ సంస్థలు, కంబైన్లు, ట్రస్టులు, ఫ్యాక్టరీలు, ఈ ఫ్యాక్టరీలలో ఉండే వేర్వేరు డిపార్టుమెంట్లు, వీటిలో కూడా ప్లానింగ్ కమిషన్లు పని చేస్తాయి. ఈ కమిషన్లన్నీ స్టేట్ ప్లానింగ్ కమిషన్ క్రింద శాఖలుగా పని చేస్తూన్నప్పటికీ, ఏ ప్రాంతంలో ఉన్న సోవియటు సంస్థ ఆ ప్రాంతంలో ప్లానింగ్ కమిషన్‌కు ఉత్తరువులిస్తూ ఉంటుంది. ఈ ఉత్తరువుల ప్రకారం ఏ రోజు నిర్వర్తించ వలసిన విధులు ఆ రోజు నిర్వర్తిస్తూ ఉండాలి.

## ప్రభుత్వము; ప్రజాభిప్రాయము.

దేశానికి ఆర్థిక ప్రణాళిక ఒకటి తయారు చేయాలంటే, అనేక దశలగుండా పని జరగాలి. నిరంకుశంగా ప్రభుత్వమే కొన్ని నిర్ణయాలు చేసి, అ నిర్ణయాలను ప్రజలమీద రుద్దుతుందని చాలామంది అభిప్రాయం. కాని, ఇది నిజం కాదు. ప్రజల అభిప్రాయాలను ప్రభుత్వం ముందుగా తెలుసుకుంటుంది. దేశంలో, ఉన్న వివిధ సంస్థలు ప్రతి సంవత్సరం స్టేట్ ప్లానింగ్ కమిషన్‌కు రిపోర్టులు పంపుతూ ఉండాలి. కేంద్ర ప్రభుత్వం యొక్క స్వాధీనంలో ఉండి, కేంద్ర ప్రభుత్వంచేత నడుపబడే ప్రతి ఫ్యాక్టరీ, మునిసిపాలిటీల స్వాధీనంలో ఉండే ప్రతి ఉత్పత్తి సంస్థ, రాష్ట్ర ప్రభుత్వాల స్వాధీనంలో ఉండే ప్రతి ఉత్పత్తి సంస్థ, ప్రతి ఫ్యాక్టరీ, ప్రతి గని, ప్రతి "సమిష్టి వ్యవసాయ క్షేత్రం." ప్రతి విశ్వవిద్యాలయం, ప్రతి ఆసుపత్రి, ప్రతి సహకార సంస్థ, ప్రతి సినిమా, ప్రతి ఆరోగ్యాశ్రమం, ప్రతి ఉత్పత్తి సహకార సంస్థ గత సంవత్సరం ఏ యే పని ఎంతెంత చేసిందో, జరుగుతూన్న సంవత్సరంలో ఎంతవరకూ ఉత్పత్తి అవుతుందో; వచ్చే సంవత్సరంలో ఎంతవరకూ ఉత్పత్తి జరుగునని ఆశ ఉన్నదో; ఏ యే శాఖల కార్మికులు ఎంతెంతమంది అవసరమో; బొగ్గు, ఇనుము, పత్తి—ఇత్యాది వస్తువులు ఎంతెంత అవసరమో; ఈ ఉత్పత్తి అంతటికీ పెట్టుబడి ఎంత కావాలో—మొదలయిన విషయాలను గురించి వివరంగా తెలియజేస్తూ రిపోర్టులు పంపాలి. ఇదే విధంగా, ప్రతి సహకార సంస్థ, ప్రతి ఉత్పత్తి సహకార శాఖ, ప్రతి రైల్వే వర్క్ షాపు, టెలిగ్రాఫ్ ఆఫీసు, పోస్టాఫీసు, రేడియో యంత్రాలయం, పరిశోధనాలయం రిపోర్టులు పంపాలి. ఈ రిపోర్టుల అన్నింటిని చూచి, వీని ననుసరించే సోవియటు యూనియను కంతటికి కావలసిన ప్రణాళికను స్టేటు ప్లానింగు కమిషను తయారు చేస్తుంది.

ఈ వేర్వేరు సంస్థలన్నీ సోవియట్ యూనియన్‌లో నేడు ఏ విధంగాపని చేస్తున్నాయో చూద్దాం.

## ప్రభుత్వ పరిశ్రమలు

దాదాపు దేశములోనున్న పరిశ్రమల నన్నింటిని ప్రభుత్వమే పెట్టుబడిపెట్టి, ప్రభుత్వమే నడిపిస్తుంది. బట్టల మిల్లులు, కర్మాగారాలు, బొగ్గుగనులు, బంగారు గనులు, పెట్రోల్ నూతులు, ఇంజనీరింగ్ వర్క్ షాపులు, ట్రాక్టర్లు తయారుచేసే స్టేషన్లు, విద్యుచ్ఛక్తి స్టేషన్లు—ఇవన్నీ ప్రభుత్వమే నడుపుతుంది. దేశంలోఉన్న ప్రధాన పరిశ్రమలన్నీ నేడు ప్రభుత్వం యొక్క యాజమాన్యం క్రిందనే నడుపబడు తున్నాయి. సాధారణంగా ఒక్కొక్క పరిశ్రమకు ఒక్కొక్క "ట్రస్టు"గాని, ఒక్కొక్క "కంబైన్"గాని ఉంటుంది. దేశంలోఉన్న బట్టల ఫ్యాక్టరీలన్నిటికీ ఒక ట్రస్టు, ఉక్కు కర్మాగారా లన్నిటికీ మరొక ట్రస్టు యీ విధంగా, పరిశ్రమకు ఒక్కొక్క ట్రస్టు చొప్పున ఉంటాయి. ప్రతి రిపబ్లిక్‌లోను, ప్రతి రాష్ట్రంలోనూ, ప్రతి జిల్లాలోనూ, ప్రతి పట్టణంలోను ఉన్న బట్టల ఫ్యాక్టరీలుగాని, ఉక్కు కర్మాగారాలుగాని యీ ట్రస్టులకు శాఖలుగా ఉండి పని చేస్తాయి. కంబైన్ అంటే, ప్రతి సంస్థయు, దానికి అవసరమైన ముడి పదార్థాలు, యితర సామానులు సప్లయిచేసే మరి కొన్ని సంస్థలతో కలిసి ఒకే సమితిగా యేర్పడి పని చేయడం అన్నమాట. ఉదా: ఉక్కు పరిశ్రమకు రాక్షసిబొగ్గు అవసరం. కాబట్టి బొగ్గుగనులు, ఉక్కు కర్మాగారాలు కలిసి ఒక కంబైన్‌గా ఏర్పడి, కలిసి పని చేస్తాయి. ఈ విధంగా దేశం అంతటికీ కొన్ని కంబైన్లు ఉంటాయి. వాటికి శాఖలుగా దేశంలో ఉన్న కర్మాగారాలన్నీ పనిచేస్తాయి. ఈవిధముగా. కేంద్ర ప్రభుత్వపు ఆధీనంలో ఎన్నో వందల పరిశ్రమలుంటాయి. ఇదేవిధంగా, రిపబ్లిక్ ప్రభుత్వాలచేత స్వయంగా నడుపబడే పరిశ్రమలు కూడా ఉంటాయి. వీటిపైకూడా ట్రస్టులు, కంబైన్లు ఉండి నడిపిస్తాయి. అంతేకాదు కొన్ని మ్యునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు ప్రత్యేకంగా నడిపే పరిశ్రమ లుంటాయి. వీటికి కూడా చిన్నచిన్న ట్రస్టులు, కంబైన్లు ఉంటాయి. తమ స్వాధీనంలో ఉండి పనిచేసే ప్రతి ఫ్యాక్టరీపై, ప్రతి కర్మాగారంపై అజమాయిషీ చేయడమే ఈ ట్రస్టులయొక్క, కంబైన్లయొక్క ప్రధాన కర్తవ్యం.

ఒక్కొక్క ట్రస్టుకు, కంబైన్‌కు ఒక ప్రెసిడెంటు, ఒక సెక్రటరీ, ముగ్గురు మొదలు 12 గురు వరకూ సభ్యుల చొప్పున ఉంటారు. వీరు ఆయా శాఖలకు సంబంధించిన మంత్రుల చేతనే నియమించబడతారు. సాధారణంగా ఇతర దేశాల్లో ఉండే కంపెనీల బోర్డ్ డైరెక్టర్లు చేసే పనే యీ ట్రస్టులు, కంబైన్లు చేస్తాయి. ఇంతేగాక ప్రతి ఫ్యాక్టరీకి, ప్రతి కర్మాగారానికి ఒక్కొక్క మేనేజరు చొప్పున యివి నియమిస్తాయి. ఇట్టి మేనేజర్లు సాధారణంగా కార్మికులకు అనుకూలమైన వారుగా ఉండి, ఆ శాఖ మంత్రిచేత అంగీకరించబడిన వారై యుంటారు. మేనేజరే ఫ్యాక్టరీలో కార్మికు లందరినీ నియమిస్తాడు; వారిని వేర్వేరు డిపార్టుమెంట్ల క్రింద విభాగించి, ఒక్కొక్క నాయకుని ఏర్పాటు చేస్తాడు. కార్మికులకు సకల సౌకర్యాలూ కలిగించే బాధ్యత మేనేజరుదే.

పరిశ్రమలే కాకుండా, ప్రభుత్వానికి అనేక "ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు" కూడా ఉంటాయి. అంటే, ప్రభుత్వమే ఫ్యాక్టరీలలో మాదిరిగా వ్యవసాయంలో కూడా, కూలీలను నియమించి, వారిచేత పని చేయించి, వారివారి పనికి తగిన కూలి యిస్తుంది. ఇట్టి సంస్థలు దేశంలో 10,000 కు మించి ఉన్నాయి.

# ఉత్పత్తి సహకార సంస్థలు

వ్యక్తుల చేతుల్లోనే ఉంది. వ్యక్తుల చేతనే నడుపబడే ఉత్పత్తి సహకార పరిశ్రమలు దేశములో కొన్ని ఉన్నవి. ఇవిగాక, వ్యవసాయంలో అత్యధిక భాగం సహకార పద్ధతిమీద నడుస్తోంది. "సమిష్టి వ్యవసాయ క్షేత్రా"లన్నీ సహకార సూత్రం మీదనే నడుస్తున్నాయి. ఎందువల్లనంటే. భూమి అంతా రైతుల సమిష్టి ఆస్తి; వ్యవసాయపు యంత్రాలు కూడా అంతే. పండించిన పంటను, ఖర్చులు గవర్నమెంటు పన్ను — పోను రైతులే పంచుకుంటారు. కూలికి పనిచేసే పద్ధతి యిక్కడ ఉండదు. సోవియట్ యూనియన్‌లో సుమారు $2\frac{1}{2}$ లక్షల "సమిష్టి వ్యవసాయ సంస్థ"లున్నాయి.

వ్యవసాయంలోనే కాకుండా, చిన్న చిన్న పరిశ్రమలలోకూడా ఉత్పత్తి సహకార సూత్రంమీదనే జరుగుతోంది. వాటికి ఆర్టెల్సు అని పేరు. చేపలు పట్టే పల్లెవాళ్ల 3 లక్షల మంది వ్యక్తులు, 1500 వివిధ సహకార సంస్థల శాఖల్లో సభ్యులుగా ఉన్నారు. వీరంతా సంవత్సరానికొకసారి డెలిగేట్లను ఎన్నుకుంటారు. ఈ డెలిగేట్లు సాంవత్సరిక సమావేశంలో తమ తమ ప్రదేశాలలో ఉన్న సమస్యలను గురించి చర్చిస్తారు. ఒక్కొక్క శాఖలో 100 మొదలు 300 వరకు సభ్యులు ఉంటారు. పడవలు, వలలు ఇతర సామాను వీరందరియొక్క సమిష్టి ఆస్తి. కొన్ని డజన్లమంది కలిసి ఒక బ్రిగేడ్‌గా ఏర్పడి చేపలు పడుతారు. ఒక్కొక్కసారి పట్టుకొన్న చేపల్ని రేవుకి తెచ్చి, ప్రభుత్వపు మార్కెటింగు శాలలలో చేరుస్తారు. మేనేజరు ఆ చేపల్ని శుభ్రంజేసి. పాడయిపోకుండా మంచులోగాని ఉప్పులోగాని ఉంచి, డబ్బాలలోపెట్టి, రవానా చేస్తాడు. 3 నెలలకొకసారి ప్రతి శాఖ కొంత నిర్దిష్టమైన సరకును యీ విధంగా సప్లయి చేస్తామని కంట్రాక్టుకు ఒప్పుకుంటుంది. దానికంటె ఎంత యెక్కువ లభించినా సభ్యులు ఇతర స్టోర్సులో అమ్ముకొని, వచ్చిన ధనాన్ని కలిసి పంచుకుంటారు. దీనికి ముందు, వచ్చే సంవత్సరానికి పెట్టుబడి కింద సొమ్మును ప్రత్యేకిస్తారు. పట్టిన చేపల విలువలో 100 కి 3 రూబుల్సు వంతున ప్రభుత్వానికి ఏటేటా పన్ను చెల్లించాలి. ఈ 1500 సహకార శాఖల్లో మొత్తం 65,000 పడవలు ఉపయోగంలో ఉన్నాయి. వీటిలో 5000 పడవలకు మోటార్ యంత్రాలు అమర్చబడి ఉన్నాయి. ప్రభుత్వమే వాటిని అద్దెకు యిస్తుంది. ఈ వృత్తిలో ఉన్నవారు సాధారణంగా ఒక్కొక్కనికి 2000 మొదలు 25000 రూబుల్సు ఆదాయం (1 సంవత్సరానికి) లభిస్తుంది.

ఇదే విధంగా, బొమ్మలు తయారుచేయుట, ఇండ్లు మరమ్మతు చేయుట, సబ్బులు చేయుట, బూట్సు కుట్టుట, చాపలు-బుట్టలు అల్లుట, కంబళ్లు నేయుట, నగిషీ పని మొదలయిన పరిశ్రమలన్నిటికీ సహకార సంస్థలున్నాయి. ఏయే పరిశ్రమలకు యంత్ర శక్తి (Fixed Capital) ఎక్కువగా అవసరంలేదో అట్టి పరిశ్రమలలో సహకారోద్యమం వ్యాపించింది. దీనికి ప్రభుత్వం పూర్తియైన ప్రోత్సాహమిస్తుంది. ఇట్టి ఉత్పత్తి సహకార సంస్థలలో మొత్తం 30 లక్షల మంది సభ్యులు ఉన్నారు.

# వినిమయ వ్యాపార సంస్థలు

ఈ విధంగా వివిధ ఉత్పత్తి సహకార సంస్థలలోను, అనేక ప్రభుత్వ పరిశ్రమలలోను సరకులు తయారౌతాయి. ఈ సరకు లన్నింటినీ 18 కోట్లమంది ప్రజలకు అందజేయాలంటే, వ్యాపార సంస్థలు అవసరం. వ్యాపారం అంటే సోవియట్ యూనియనులో ఇతర దేశాల మాదిరిగా లాభాల కొరకు కాదు; ప్రజల సౌకర్యం కొరకు.

దేశంలో ఉత్పత్తి అయిన యావత్తు సరకుకు, విదేశాల నుంచి దిగుమతి అయిన సరకుకు ప్రభుత్వం గాని, సహకార (కో ఆపరేటివ్) విక్రయ సంస్థలు గాని యాజమాన్యం వహిస్తాయి. వర్తకు లెవరూ ఉండరు. ప్రభుత్వం, కో ఆపరేటివ్ విక్రయ సంస్థలు, వ్యాపారాన్ని నడుపుతాయి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, సహకార విక్రయ శాఖలు: సప్లయి శాఖా మంత్రి ఆధీనంలో ఉండి పనిచేసే ప్రభుత్వ వ్యాపార శాఖలు: ప్రతి పెద్ద పరిశ్రమకు అనుబంధంగా చేర్చబడు వ్యాపార శాఖలు: చిన్న పరిశ్రమల ఉత్పత్తి సహకార సంస్థలు; "సమిష్టి వ్యవసాయ క్షేత్రా"లు; వివిధ ఫ్యాక్టరీలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోను కార్మికుల ఉపయోగానికై ప్రత్యేకంగా నిర్మించబడు సప్లయి డిపార్టుమెంట్లు - వీటిద్వారా దేశంలో ఉన్న సరకులన్నీ ప్రజలకు సరఫరా అవుతాయి. సోవియట్ ప్రభుత్వం దళారీ వ్యాపారస్థుల్ని శాసనం ద్వారా నిర్మూలించలేదు. కాని కో ఆపరేటివ్ విక్రయ సంస్థలకు, విరివిగా అప్పులిచ్చి. పన్నులు తక్కువ విధించి ఇంకా అనేక సౌకర్యాలు కలుగజేసినందున వీని పోటీకి, ప్రభుత్వ సంస్థల పోటీకి, దళారులు ఆగలేక పోయారు.

సోవియటు యూనియనులోని సహకార విక్రయ సంస్థలు మిగిలిన దేశాలలోవలే, తమ సభ్యులిచ్చిన వాటాలపై లాభాలు (డివిడెండులు) పంచిపెట్టవు. లేక సభ్యులు కొనిన సరకును బట్టి కూడ డివిడెండులను పంచిపెట్టవు. కేవలము సరకులను సరఫరా చేయుటమే దాని పని. అంతేగాక సోవియటు యూనియనులో, సహకార విక్రయ సంస్థల సభ్యులు మామూలుగా ఒక వాటానే కొనియుంటారు. ఈ వాటా కేవలము, ఆ విక్రయ సంస్థలో సామగ్రిని కొనుక్కోడానికి ప్రవేశ రుసుము లాంటిది తప్ప మరేమీ కాదు. ఈ సహకార విక్రయ సంస్థలకు కావలసిన పెట్టుబడిని ప్రభుత్వము, అప్పు రూపంగా ఇస్తుంది.

దేశంయొక్క వ్యాపార సంస్థలన్నింటిలో కో-ఆపరేటివ్ విక్రయ సంఘాలు ఎక్కువ ప్రధానమైనవి. ఇంచుమించు ప్రతి వ్యక్తి ఏవో ఒక విక్రయ సంఘంలో సభ్యుడై ఉంటాడు. మొదటి పంచవర్ష ప్రణాళికకు పూర్వం ఈ విక్రయ సంఘాలు మొత్తం 754 కోట్ల రూబుల్సు విలువ గలిగిన సరకులు సప్లయి చేయగా, ప్రణాళిక కాలంలో 1891 కోట్ల రూబుల్సు విలువ గల సరకు సప్లయి చేశాయి.

తరువాత స్థానం ప్రభుత్వ వ్యాపార సంస్థలు. వీటిపై బాధ్యత సప్లయి శాఖా మంత్రిది.

మూడవ స్థానం, వివిధ కర్మాగారాలలోను, వర్కు షాపులలోను పని చేసే కార్మికులచే స్వయంగా స్థాపించుకొనబడిన సప్లయి డిపార్టుమెంట్లది. ఆ తరువాత, చేతి పనుల ఉత్పత్తి సహకార సంస్థలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ప్రాముఖ్యత వహిస్తాయి.

ఏ యే జిల్లాలలో ఎన్నెన్ని కో-ఆపరేటివ్ విక్రయ శాలలుండాలో, ఎన్ని ప్రభుత్వ వ్యాపార శాఖలు ఉండాలో, ఎన్ని యితర సంస్థలు ఉండాలో ప్రభుత్వం నిర్ణయిస్తుంది. మొత్తం ఉత్పత్తి అయిన సరకులో ఎంతెంత భాగం ఏ యే సంస్థలకు పంచిపెట్టాలో కూడా ముందే నిర్ణయిస్తుంది. ప్రభుత్వ పరిశ్రమలలో ఉత్పత్తి అయిన సరకును ఎంత వరకు పంచిపెట్టగలదో, ఎంత సరకు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

# తజిక్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్

## ★ ముఖ్య పట్టణం — స్టాలినాబాద్




పండ్లతోటలు ఎక్కువ. ప్రత్తి ముఖ్యమైన పంట సోవియట్ పాలనలో 11 రెట్లు హెచ్చింది. రోడ్లు రైల్వేలు వేసారు. పామీర్ పీఠ భూమిలో బొగ్గు, నూనె, బంగారు గనులలో పని ప్రారంభమై పరిశ్రమలు వృద్ధి అవుతున్నాయి.

పూర్వం చదువు నామమాత్రమైన ప్రజలు నేడు విశ్వవిద్యాలయాలలో చదువుతూ వివిధ కళలలో ఆరితేరుతున్నారు.

మొదలయిన ప్రభుత్వేతర సంస్థల వద్ద కొనుక్కొనవలసి యుంటుందో కూడా ప్రభుత్వమే తీర్మానిస్తుంది.

ఈ విధంగా ఒక్కొక్క వ్యాపార సంస్థకు ఏయే సరకు ఎంతెంత అవసరమో స్టేట్ ప్లానింగ్ కమిషన్‌కు తెలియజేస్తాయి. వివిధ పరిశ్రమలు తాము ఏయే సరకు ఎంతెంత ఉత్పత్తి చేయగలవో కూడా తెలియజేస్తాయి. అప్పుడు ప్రభుత్వం వ్యాపార సంస్థలకు సప్లయి చేయవలసిన సరకును నిర్ణయిస్తుంది. ఈ నిర్ణయానికి లోబడి ప్రతి వ్యాపార సంస్థ పని చేయాలి. కాని వీటిని అతిక్రమించి ఏవైనా సంస్థలు అదనపు సరకు కావాలని కోరితే, గవర్నమెంటు అందుకై ఋణాలిచ్చి ప్రోత్సాహం యిస్తుంది. ఈ విధంగా, సరకుల ఉత్పత్తికీ, వాటి సప్లయికి మధ్య ఒక చక్కని సామరస్యం ఉండడం వల్ల, సాధ్యమైనంత దగ్గరలోను, సాధ్యమైనంత తక్కువ ఖర్చులోను సరకులు లభిస్తాయి. దళారీ వ్యాపారస్థుల అవసరం ఉండదు.

## టోకు వ్యాపారం—చిల్లర వ్యాపారం

దేశంలో టోకు వ్యాపారం అంతా, యించుమించు, పారిశ్రామిక సంస్థలే స్వయముగా చేస్తాయి. ఒక్కొక్క పరిశ్రమకు ఒక్కొక్క ట్రస్టు ఉంటుందని పైన చూచాము. బట్టల మిల్లులన్నిటికీ ఒక ట్రస్టు ఉంటుంది. తయారైన బట్ట అంతా విడుదల చేయడానికి ఆ ట్రస్టు పూనుకుంటుంది. ప్రభుత్వ వ్యాపార సంస్థలకు టోకు వ్యాపారం చేసే సహకార విక్రయ సంస్థలకు ట్రస్టు ఆ బట్టను అమ్ముతుంది. ప్రతి గ్రామంలో ఉన్న శాఖలకు వాటి ద్వారా బట్ట సప్లయి అవుతుంది. ఇవే గాకుండా, స్థానికంగా తయారయ్యే చేతి పరిశ్రమల సరకులు కూడా స్థానిక సహకార విక్రయ సంస్థలు కొంటాయి. తాము ఏయే సరకు ఎంత ఖరీదుకు ఎంతెంత కొంటాయో ముందుగానే సహకార విక్రయ సంస్థలు కంట్రాక్టులకు ఒప్పుకుంటాయి. టోకు వ్యాపార సంస్థలు పారిశ్రామికాధికారులతోను యీవిధంగా కంట్రాక్టులు చేసుకొంటాయి.

ఇతర వ్యాపార సంస్థలన్నిటికంటె సహకార విక్రయ సంస్థలలో యెక్కువ మంది సభ్యులున్నారు. 18 కోట్ల మంది జనాభాలో 7 కోట్ల మంది పైగా యీ విక్రయ సంస్థలలో సభ్యులు. పెద్ద పెద్ద నగరాల్లో ఫ్యాక్టరీ కొక కో-ఆపరేటివ్ స్టోర్ ఉంటుంది. చిన్న పట్టణాల్లో పట్టణమున కొక కో-ఆపరేటివ్ స్టోరు. 400 మంది కార్మికులు నివసించే ప్రతి చోట ఒక స్టోరు వంతున ఉంటాయి. పల్లెటూళ్ళలో అన్నిటికంటె చిన్న సంస్థ గ్రామ విక్రయ శాల. ఒక్కొక్క శాఖకు సభ్యులు 250 మందికి తక్కువ కాకుండా ఉండాలి. పెద్ద నగరాలలో ఉండే కో-ఆపరేటివ్ స్టోరుకు సరకు ఆ నగరంలో ఉండే ఫ్యాక్టరీలు, జిల్లా కో-ఆపరేటివ్ సొసైటీ సప్లయి చేస్తాయి. ఇదే విధంగా, గ్రామ విక్రయ శాలలకు జిల్లా సొసైటీ సప్లయి చేస్తుంది. జిల్లా సొసైటీలపైన రాష్ట్ర సొసైటీ ఉంటుంది. ఏ రాష్ట్రంలో ఉండే సొసైటీలకు ఆ రాష్ట్ర కో-ఆపరేటివ్ సొసైటీ టోకు బేరాలకు సరకు సప్లయి చేస్తుంది. అంతేగాక ఆ రాష్ట్రం మంతటిలోను ఉత్పత్తి అయే సరకులో కొంత నిర్దిష్ట భాగాన్ని ఆ పరిశ్రమల వద్ద కొనడానికి రాష్ట్ర సంస్థ ముందుగా కంట్రాక్టులు ఒప్పుకుంటుంది.

ఇట్టి రాష్ట్ర సొసైటీలపైన సోవియట్ యూనియన్ అంతటికీ "సెంట్రో సోయూ" అనే కేంద్ర సహకార సంస్థ ఉంది. సభ్యత్వం విషయంలోగాని, చేసే వ్యాపార విషయంలోగాని ఇంత పెద్ద సహకార సంస్థ మరే దేశంలోనూ లేదు.

## ప్లానింగ్

స్టేట్ ప్లానింగ్ కమిషన్ వద్దకు ఈ విధంగా, దేశములో ఉన్న ఉత్పత్తి, వ్యాపార సంస్థలన్నిటి వద్దనుంచి సంవత్సరాని కొకసారి రిపోర్టులు వస్తాయి. ఈ రిపోర్టులను ఆధారంగా చేసుకొని, కమిషన్ ప్రజలకు కావలసిన అవసరాలెన్నో, ప్రజలు తయారు చేయగల సరకులెన్నో కొన్ని ప్రధాన నిర్ణయాలకు వస్తుంది.

ప్రతి ఉత్పత్తి సంస్థకూ, ప్రతి కో ఆపరేటివ్ సంస్థకూ, ప్రతి ఇతర సంస్థకూ ఒక సంవత్సరంలో ఎంతెంత మంది కార్మికులు అవసరమో రిపోర్టులలో తెలియ జేస్తాయి. వీరందరూ ఎక్కడి నుంచి వస్తారు? వివిధ విద్యా సంస్థలలో ఎంతెంత మంది తరిఫీదు పొందాలి? వ్యవసాయ పరిశ్రమకో అదనంగా ఉండే రైతు లెంతమంది? ప్రతి పరిశ్రమకు ఎంత బొగ్గు కావాలి? ఎంత యినుము కావాలి? ఎంత ముడిసరకు కావాలి? ఇవన్నీ ఏ విధంగా సప్లయి అవుతాయో తెలుసుకొని, పరిశ్రమల అవసరాలకు సరిపోయే మాదిరిగా ప్లానింగ్ కమిషన్ వారు బ్యాలన్సు సమన్వయం చేయాలి.

ఉదా. ట్రాక్టర్లు తయారు చేసే కర్మాగారం ఒకటి ఉన్నదనుకొందాం. దానికి కొంత ఉక్కు, రాక్షసి బొగ్గు అవసరం, ప్లానింగ్ కమిషన్‌కి పంపే రిపోర్టులో, ఎంతెంత ఉక్కు బొగ్గు అవసరమో అది తెలియజేస్తుంది. ఈ విధంగా ట్రాక్టర్ స్టేషన్లన్నీ రిపోర్టులు పంపుతాయి. కాని, దేశంలో ఉన్న బొగ్గు గనులవల్ల, ఉక్కు పరిశ్రమలవల్ల తయారు అయే సరకు అంతకంటె తక్కువగాని ఎక్కువగాని ఉంటే, ప్లానింగ్ కమిషన్ ఉత్పత్తి సంస్థలకూ సప్లయి సంస్థలకు మధ్య సామరస్యం ఉండేలాగు నిర్ణయిస్తుంది.

ఒక్కొక జిల్లాలోనో, రాష్ట్రంలోనో ఉన్న పరిశ్రమలకు ఎంత బొగ్గు, ఇనుము, ముడి పదార్థాలు అవసరమో ఆ జిల్లాలోనే, ఆ రాష్ట్రంలోనే, సప్లయి అయేలాగు చూడాలి. తరువాత, ప్రజలకు కావలసిన తిండి, బట్ట, యిల్లు, ఆసుపత్రిలు, విద్యాలయాలు, సినీమాలు, —ఇవన్నీ ప్రతిచోటా ప్రజల అందుబాటులో దొరికేటట్లు చూడాలి. ఈ విధంగా, దేశం యొక్క ఉత్పత్తి సంస్థలకూ, ప్రజలకూ, అవసరాలను సప్లయి చేసే బాధ్యత ప్రభుత్వానిది. ప్లానింగ్ కమిషన్‌వారు ఈ అవసరాలకూ, మొత్తం ఉత్పత్తికీ సామరస్యం ఏర్పడేలాగు లెక్కలు తయారుచేయాలి. ఈ వివరాలన్నీ పరిష్కారం అయాక, సరకును, ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి పంపడానికి రైళ్ళు, పడవలు మొదలైన రాకపోక సౌకర్యాలు కూడా దేశం అంతటా నిర్మించాలి.

ఇట్టి రాకపోక సౌకర్యాల ఎక్కువ చేయడానికి బాల్టిక్ సముద్రాన్ని తెల్ల సముద్రాన్ని కలువుతూ లెనిన్ గ్రాడ్ మీదుగా ఒక కాలువను త్రవ్వారు.

మాస్కో నగరమునుండి వాల్గానదిలో కలుపుతూ, మాస్కోనదిని పెద్దదిచేశారు. వాల్గానదిని, బాల్టికు సముద్రమును కలుపుతూ ఒక కాలువను, వాల్గానదినీ ద్వినానదిని కలుపుతూ ఒక కాలువను త్రవ్వుతున్నారు. దీనివలన మాస్కో నగరమునుండి బాల్టిక్, వైట్, కాస్పియన్, బ్లాక్ (నల్ల) సముద్రములతో తిన్నగా నావికామార్గాలు ఏర్పాటు చేయబడుతున్నాయి.

# విదేశ వ్యాపారము

దేశం మొత్తంమీద ఉత్పత్తి అయ్యే సరకు ప్రజల అవసరాలకంటె తక్కువగా ఉన్నట్టయితే విదేశాల నుంచి ఆ సరకు తెప్పించుకోవాలి. సోవియట్ యూనియన్‌లో విదేశ వ్యాపారమంతా ప్రభుత్వమే స్వయంగా నడుపుతుంది. లేకపోతే, సోషలిస్టు సమాజం తప్పక దెబ్బతింటుంది. ఇతర దేశాలమాదిరిగా విదేశ వ్యాపారం అంతా వ్యక్తుల చేతుల్లో ఉంటే, ఉత్పత్తి విధానంలో మళ్ళీ అరాజకం ప్రబలుతుంది. ఎందువల్ల నంటే, ఒక నిర్దిష్టమైన ప్రణాళిక ప్రకారం ఉత్పత్తి జరగాలంటే, ఆ ఉత్పత్తికి అవసరమైన సామాను యావత్తూమీద అధికారము (కంట్రాక్టు) విదేశ వ్యాపారం వ్యక్తుల చేతుల్లో ఉంటే, విచ్చలవిడిగా పెట్రోలు, ఇనుము, బొగ్గు, బంగారం మొదలైన సరకులు విదేశాలకు ఎగుమతి చేయబడతాయి. అప్పుడు దేశంలో పారిశ్రామికాభివృద్ధి సరిగా జరగదు. కాని, ప్రభుత్వమే విదేశ వ్యాపారం నడిపితే ఇదిజరగదు. దేశానికి ఏసరకు ఎంత అవసరమో ప్రభుత్వానికి ముందుగానే తెలుస్తుంది అంత సరకును మాత్రమే ఇతర దేశాలనుంచి తెప్పిస్తుంది. అయితే, దాని ఖరీదుకూడా ఎంత అవుతుందో అది ఆదేశానికి చెల్లించాలి. సాధారణంగా, గోధుమలు, ప్రత్తి, పెట్రోలు మొదలైన ముడి పదార్థాలను ఎగుమతి చేస్తుంది. కాబట్టి ప్రజలకు కావలసిన వాటికంటె యీ పదార్థాలను ఎక్కువగా పండించాలి. విదేశాలనుంచి సాధారణంగా యంత్ర సామగ్రిని సోవియట్ యూనియన్ దిగుమతి చేసుకొని దాని విలువకు సమానమైన ముడి పదార్థాలను ఎగుమతి చేస్తుంది. ఒక్కొక్కప్పుడు బంగారాన్నే ఎగుమతి చేస్తుంది.

# ప్రభుత్వ నిర్ణయాలు

ఇప్పటికి, ప్రణాళిక యొక్క మొదటిదశ పూర్తి అవుతుంది. దేశం మొత్తంమీద ఏయే సరకు ఎంతెంత ఉత్పత్తి అవుతుందో, ఏయే సరకు ఎంతెంత అవసరమో ప్లానింగ్ కమిషన్ లెక్కకట్టి ఒక విధమైన చిత్తు ప్రణాళికను తయారు చేస్తుంది. ఇట్టి ప్రణాళిక యొక్క ఉద్దేశం ఏమై యుండాలో ప్రభుత్వం ముందుగానే నిర్ణయించి, ఆ నిర్ణయానికి అనుగుణమైన తీర్మానాలు కొన్ని చేస్తుంది.

సోవియటు యూనియనులో ప్రజలందరి యొక్క సౌఖ్యమే ప్రభుత్వంయొక్క ఆదర్శం. ఈ ఆదర్శాన్ని ఏయే పద్ధతులతో పొందడమా అనే విషయం నిర్ణయించేది ప్లానింగ్ కమిషన్ కాదు. సోవియట్ ప్రభుత్వం. ఉదా: మొదటి పంచవర్ష ప్రణాళిక ప్రకారం, సోవియట్ యూనియన్‌లో పారిశ్రామికాభివృద్ధి ఎక్కువ కావాలి. రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క ఉద్దేశం. దేశంలో వర్గాలను లేకుండజేసి ప్రజలకు కావలసిన అనుభవ వస్తువులను విరివిగా తయారు చేయడం. అంటే వ్యవసాయంలోనూ, వ్యాపారంలోనూ ప్రజలను దోపిడీ చేసుకొని లాభాలు అనుభవించే వర్గాలు లేకుండాచేసి ప్రజలకు సౌఖ్యము కలిగించడము నేడు ఈ ఆదర్శం పూర్తిగా నెరవేరింది.

ఇదే విధంగా ప్రతి ప్రణాళికకు ఒక ఉద్దేశం ఉంటుంది. ఆ ఉద్దేశాన్ని ప్రభుత్వమే నిర్ణయించాలి. ఆ ఉద్దేశం నెరవేరడానికి దేశంలో ఏ యే సరకులు, ఏ యే సౌకర్యాలు వృద్ధి చేయాలో ప్రభుత్వమే సూచిస్తుంది కూడా.

కాబట్టి, ప్రభుత్వానికి శాఖలైన మంత్రివర్గానికీ, కమ్యూనిస్టు పార్టీ యొక్క పొలిట్ బ్యూరోకీ-సెంట్రల్ కమిటీకీ స్టేట్ ప్లానింగ్ కమిషన్ తన చిత్తు ప్రణాళికను చూపుతుంది. దానిపై యీ కమిటీలు చర్చలు సాగించి, కొన్ని నిర్ణయాలు చేస్తాయి. వ్యవసాయానికి ఎంత యంత్రశక్తిని సప్లయి చేయాలో; ఏ పరిశ్రమలలో కార్మికులు పూర్వం కంటె ఎక్కువగా కష్టపడాలో; ప్రజలకు కావలసిన సామాన్య వస్తువులకూ (ఆహారం, బట్ట, మొదలయినవి) కర్మాగారాలకు కావలసిన యంత్ర సామగ్రీ ఎంతెంత సప్లయి చేయాలో; విదేశాల దాడిని ఎదుర్కొటానికి స్వరక్షణకై ఏ యే పరిశ్రమలను వృద్ధి చేయాలో: కార్మికులకు వృత్తి, విద్య, సాధారణ విద్య ఏ యే శాఖలలో ఎంతెంత ఈయాలో, ఆస్పత్రులు, ఆరోగ్యశాలలు, కార్మికులకు ఇండ్లు, డాక్టర్లు, నర్సులు, వీటికి ఏ యే ప్రదేశంలో ఎంతెంత ఖర్చు పెట్టాలో; సరియైన అంచనా వేయనందువల్లగాని, ప్రమాదాలు తటస్థించడంవల్లగాని, ఇతర అసాధారణ పరిస్థితులవల్లగాని, ప్రణాళిక పూర్తిగా అమలు జరగక నష్టంకూడా అప్పుడప్పుడు వస్తూ ఉంటుంది. కాబట్టి, దానికి ఎంత సొమ్మును ప్రత్యేకించాలో, మొదలయిన అంశాలన్నిటిపైన ప్రభుత్వం నిర్ణయాలిస్తుంది. అప్పుడే ప్రణాళిక యొక్క ఉద్దేశం నెరవేరుతుంది.

ఈ ప్రభుత్వ నిర్ణయాలనూ, ప్రజా సంస్థల రిపోర్టులనూ దగ్గర పెట్టుకొని, స్టేట్ ప్లానింగ్ కమిషన్ ఒక ప్రొవిజనల్ ప్రణాళికను తయారు చేస్తుంది.

దీనితో ప్రణాళిక యొక్క రెండవ దశ పూర్తి అవుతుంది. దీనిపై ప్రజల అభిప్రాయం తెలుసుకోవడానికి మరొకసారి పంపుతారు. వివిధ శాఖల మంత్రుల ద్వారా దీన్ని ప్రతి ఫ్యాక్టరీకి, ప్రతి వ్యవసాయ సంస్థకూ, ప్రతి విద్యా సంస్థకు, ప్రతి సహకార సంస్థకు పంపుతారు. ఆ సంస్థలలో తమకు సంబంధించిన సమస్యలను గురించి కార్మికులు, రైతులు, ఇతర ప్రజలు చర్చించి, ప్రణాళికను గురించి తమ తుది అభిప్రాయం తెలియజేస్తారు. సాధారణంగా, ప్లానింగ్ కమిషన్‌వారు సూచించే దాని కంటె ఎక్కువ సరకు ఉత్పత్తి చేయడానికి వారు మార్గాలు సూచించి, అందుకు తోడ్పడతారు. ప్రజలు తెలియజేసిన ఈ అభిప్రాయాలూ, ప్రొవిజనల్ రిపోర్టూ మళ్ళీ ఒకదాని ప్రక్క మరొకటి పెట్టుకొని, ఏయే మార్పులు ఏయే పరిశ్రమలో చేయాలో స్టేట్ ప్లానింగ్ కమిషన్‌వారు తమ అంతిమ నిర్ణయం యిస్తారు. దీన్ని సోవియట్ యూనియన్ యొక్క మంత్రివర్గ సమావేశంలోనూ, సెంట్రల్ ఎక్జిక్యూటివ్ కమిటీలోనూ చర్చించి, శాసనం చేస్తారు. ఆ శాసనమే ప్రణాళిక. ఇది ప్రణాళిక యొక్క మూడవ దశ.

1928 లో ప్రారంభించ బడిన మొదటి పంచవర్ష ప్రణాళిక, 1932 లో ప్రారంభించ బడిన రెండవ పంచ ప్రణాళిక, 1938 లో ప్రారంభమైన మూడవ పంచవర్ష ప్రణాళిక యీ దశలన్నీ దాటి చేయబడ్డాయి. ఇట్టి ప్రణాళికను ప్రజలు ఆచరణలో పెట్టడమే కాకుండా, అనుకొన్న దానికంటె ఎక్కువ ఉత్పత్తి కూడా ఉత్సాహంతో చేస్తారు. ఎందువల్ల నంటే, ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వం ప్రజల కొరకు అనేక సదుపాయాలు చేస్తూంటే, అట్టి ప్రభుత్వానికి తోడ్పడని వ్యక్తి ఎవడుంటాడు?

ప్రభుత్వం చేత స్థాపించబడి, ప్రభుత్వం చేత నడుపబడే పరిశ్రమలు, వ్యాపార సంస్థలు విధిగా యీ ప్రభుత్వ శాసనాలను అమలు పరచితీరాలి. కాని, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ఉత్పత్తి సహకార సంస్థలు — ప్రణాళికకు సహాయం చేయక పోవచ్చునని కొందరు తలచవచ్చు. దీనికి కారణం, అవి ప్రభుత్వేతర సంస్థలు కాబట్టి. అంతేగాక, ఈ సంస్థలు తమ సరకులో అధిక భాగాన్ని బజారులో అమ్మి సొమ్ములోకి మార్చుకుంటారు. ఆదాయమే వీటి ప్రధాన ఆశయంగా ఉంటుంది. కాబట్టి ఇవి ప్రభుత్వంతో సహాయ నిరాకరణ చేస్తారని ప్రభుత్వం చేత నిర్ణయించ బడిన ప్రణాళిక వీటి స్వేచ్ఛకు అడ్డు తగులవచ్చు.

కాని, సోవియట్ యూనియన్‌లో ఈవిధంగా ఎన్నడూ జరుగదు. ప్రభుత్వానికి యిట్టి ప్రయివేటు సంస్థలు చెల్లించవలసిన పన్నులా బహు స్వల్పం. ప్రభుత్వం వీటి సభ్యులకుచేసే సదుపాయాలా అపారం. ఇందువల్ల ఎల్లప్పుడూ రైతులు, చిన్న పరిశ్రమదార్లు ప్రణాళికను తూచ తప్పకుండా అమలు పరుస్తారు. ఒకవేళ కొన్ని సంస్థలు బుద్ధి పూర్వకంగా ఎదురు తిరిగితే, ప్రభుత్వం అనేక మార్గాలతో వాటిని అణచివేస్తుంది. ఉదా. పన్నులు ఎక్కువ విధించుట; ఈ సంస్థలవద్ద సరకులు కొనుక్కొనే వ్యాపార సంస్థలు తక్కువ ధరలకు కొనేటట్లు చేయుట: ట్రాక్టర్లు మొదలైన యంత్ర సామగ్రికి అద్దె, ఖరీదు ఎక్కువ చేయుట.

# పని చేయడానికి ఉత్సాహం ఎక్కడ నుంచి?

పెట్టుబడిదారీ దేశాలలో ఒక్క ధనిక వర్గాలకే ఉత్పత్తిలో ఉత్సాహం, హుషారు ఉంటుంది. కార్మికులు కూడా ఉత్సాహం లేకపోయినా, తాము నిర్వర్తించ వలసిన పనిని ఎక్కువ శ్రద్ధతో చేస్తారనే మాట నిజమే. కాని, దీనికి కారణం యేమంటే ఆవిధంగా పనిచేయక పోతే, నిరుద్యోగుల సంఖ్యలో చేరవలసి వస్తుంది. కార్మికుడు తన పనిని శ్రద్ధతో చేయనైనా చేయాలి, లేకపోతే కడుపు మాడ్చుకొంటూ వీధుల్లో తిరగనైనా తిరగాలి. మరొక మార్గంలేదు. ఇక పని చేయగలిగి ఉండి యిచ్చేవాడులేక బాధపడే నిరుద్యోగుల విషయంలో పని యెడల ఉత్సాహం, ఉద్రేకం ఈ శబ్దాలకు అర్థం లేనేలేదు.

సోవియట్ యూనియన్‌లోనో? ఆ విధంగా కాదు. ఎవడు ఎక్కువగాను, తెలివి తేటలతోనూ పని చేస్తాడో అతనికి అంత ఎక్కువ వేతనం దొరుకుతుంది. ప్రభుత్వ స్వాధీనంలో ఉన్న ఫ్యాక్టరీలలోను, గనులలోను, వ్యవసాయ క్షేత్రాలలోనూ పని చేసే కార్మికులకు పనికి తగినంత ప్రతిఫలం యిస్తారు. ఇది దొరికే దేశం ప్రపంచంలో ఒక్క సోవియట్ యూనియనే, అని చెప్పాలి. ఒక్కొక్క కార్మికుడు తన నైపుణ్యాన్ని వృద్ధి చేసుకోవడానికి ఎన్నో అవకాశాలుకూడా (వృత్తి విద్య మొదలైనవి) ప్రభుత్వం యిస్తుంది.

ప్రభుత్వ పరిశ్రమలలో పనిచేయడానికి ఇష్టం లేకపోతే, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనో లేక చేతి పరిశ్రమల ఉత్పత్తి సహకారసంస్థలలోను చేరి పని చేయవచ్చు. ఇట్టి పనికి జీతం అనేది ఉండదు. ఉత్పత్తి అయిన సరకు బజారుకు తీసుకొనువెళ్ళి అమ్ముకొనవచ్చు.

ఎక్కువ ఆదాయంతోబాటు, ప్రతి వ్యక్తికీ పనిలో ఉత్సాహం మరొకటి కూడా ఉంది. ప్రజలలో ఖ్యాతిని సంపాదించడం అంటే ప్రతి వ్యక్తికి సంతోషం. సోవియట్ యూనియన్‌లో కూడా, ఇంతే. ఆర్డర్ ఆఫ్ లెనిన్, రెడ్ బ్యానర్ ఆఫ్ లేబర్, ఆర్డర్ ఆఫ్ ది రెడ్ స్టార్ మొదలయిన బిరుదులు, బహుమతులు ప్రతి సంవత్సరం శ్రద్ధతో పని చేసే వారికి పంచిపెడతారు. ప్రజలు గర్వంతో వాటిని స్వీకరిస్తారు.

సమిష్టి వ్యవసాయ సంస్థలలోను, ఇతర సహకార సంస్థలలోను పాల్గొనేవాడు తమ సరకులకు బజార్లో సాధ్యమైనంత యెక్కువ విలువ రావాలనే ఆశతోనే తయారు చేస్తాడు. అయితే, పెట్టుబడిదారీ దేశాలకూ సోవియట్ యూనియన్‌కూ భేదం ఎక్కడని కొందరు అడగవచ్చు. ఈ సమిష్టి సంస్థలలో పాల్గొనేవారు తమ శ్రమవల్ల తయారైన వస్తువులను తామే అమ్ముతారు. కూలీలచేత పని చేయించకూడదు. పెట్టుబడిదారీ దేశాలలో ఈ విధంగా కాదు. అసంఖ్యాకులైన కూలీలను అనేక పరిశ్రమలలో పని చేయిస్తారు, వారి శ్రమవల్ల లభించిన సరకులను అమ్మి యజమానులు లాభాలు సంపాదిస్తారు. ఆ విధంగా కాకుండా ప్రజలు స్వయంగా శ్రమపడి, ఆ శ్రమవల్ల లభించిన సరకును బజార్లో అమ్మి ధనం సంపాదించడంలో ఎట్టి ఆక్షేపణ ఉండ కూడదు. సమిష్టి వ్యవసాయం చేసే రైతులు మరొక కారణంవల్లకూడా ఎక్కువ కష్టపడి పని చేస్తారు. తాము ఎంత యెక్కువ పని చేస్తే అంత యెక్కువ సరకు ఉత్పత్తి అవుతుంది. అంతే కాకుండా, ఏ వ్యక్తి అదనంగా ఎంత పని చేస్తాడో ఆ పనికి తగినట్లు ప్రతి ఫలం రూపాయలణాల పైసలతో యిస్తారు. కాబట్టి ప్రతి ఒక రైతు ఎక్కువగా శ్రమపడి పని చేయడానికి ప్రయత్నిస్తాడు. మూడవ విషయం: ఒక్కొక్క రైతు కుటుంబానికి $2\frac{1}{2}$ యకరాల భూమి వంతున యింటి చుట్టూ ఉంచుకొనవచ్చు. శాసనం దీనికి అనుమతిస్తుంది. ఆ భూమిమీద పనిచేసి, పంటను బజార్లో అమ్ముకొనవచ్చును.

ఈ పై పద్ధతులన్నీ స్వార్థానికోసమే పనిచేసే వ్యక్తుల్ని కూడ తప్పకుండా ఆకర్షిస్తాయి. కాని, మానవ స్వభావం అంటే స్వార్థం మాత్రమే కాదు. సాధారణంగా, ప్రపంచంలో అనేక వ్యక్తులను ఉన్నతమైన ఆదర్శాలు ప్రోత్సహిస్తూ ఉంటాయి. చైనాలోనూ, స్పెయిన్‌లోనూ నేడు లక్షల కొద్దీ మనుష్యులు శత్రువులతో యుద్ధం చేస్తూ చనిపోతున్నారంటే, దీనికి కారణం, వారి దేశభక్తి. ప్రపంచ చరిత్ర చూస్తే, అసంఖ్యాకులైన ప్రజలు వేర్వేరు ఆదర్శాలకై చనిపోయినట్టు తెలుస్తుంది. ఈ విధంగా, ఆదర్శాలకు చనిపోయే వ్యక్తులు ఆ ఆదర్శాలకై కష్టపడి పనిచేయడంలో ఆశ్చర్యం ఏమిటి?

అనేక సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ప్రజలలో కృత్రిమ దేశభక్తిని పురిగొల్పి సైన్యంలో చేర్చుకుంటూరు. ఫలితం ఏమంటే ధనిక వర్గాలకు ఎక్కువ లాభాలు, నిరుద్యోగులకు ఎక్కువ ఆకలి బాధ, కార్మికులకు ఇంకా తక్కువ జీతాలు. కాని, సోవియట్ యూనియన్‌లోనో? ఉన్నతాదర్శాల కొరకు ఎక్కువగా కష్టపడితే, దానివల్ల ప్రజా సామాన్యానికి సౌఖ్యం అనేక రెట్లు ఎక్కువౌతుంది. ఒక ఫ్యాక్టరీ ఉన్నదంటే, దానిలో పనిచేసే ఒక కార్మికుడు ఇతర కార్మికుల కంటె ఎక్కువ శ్రద్ధతో పని చేస్తే, అతని బొమ్మను బహిరంగ ప్రదేశాలలో వేలాడ కట్టుతారు. అందరికన్న సోమరిపోతుగా ఉండే కార్మికుల బొమ్మలు కూడా ఈ విధంగానే బహిరంగ పరచబడతాయి. "సోషలిస్టు పోటీ" అనే పద్ధతి సోవియటు యూనియనులో అమల్లో ఉంది. దీని ప్రకారం, ఒక వ్యక్తిగాని — ఒక ఫ్యాక్టరీ గ్రూపుగాని ఇతర వ్యక్తుల కంటె ఇతర ఫ్యాక్టరీ గ్రూపుల కంటె ఎక్కువ సరకును ఉత్పత్తి చేస్తామని "ఛాలెంజి" చేస్తారు. ఒక్కొక్క పరిశ్రమలో పనచేసే కార్మికులు సెలవు రోజులలో కొన్ని అత్యవసరమైన పనులు ఉచితముగా చేస్తారు. మాస్కో నగరంలో ఒక పెద్ద స్వరంగము రైలుమార్గము ఈ విధంగానే త్రవ్వబడింది. కొన్ని కొన్ని సంస్థలలో ఎల్లప్పుడూ పనిచేసే కార్మికులుగాని, సైనికులుగాని ఇతర సంస్థలకు ఉచితంగా సహాయం చేస్తారు. రెడ్ ఆర్మీ సైనికులు ఈ విధంగా వెనకబడియున్న కొన్ని సమిష్టి వ్యవసాయ సంస్థలకు వెళ్ళి అక్కడి రైతులకు సలహా

యివ్వడం చాలా చోట్ల జరుగుతుంది.

ప్రజలచేత ఎక్కువ పని చేయడానికి ప్రభుత్వం ఇంకా యెన్నో ఉపాయాలు కనిపెట్టుతూ ఉంటుంది. ప్రజలుకూడా సంతోష పూర్వకంగా ప్రభుత్వానికి సహాయం చేస్తారు. తాము స్వయంగా స్థాపించుకొన్న ప్రభుత్వానికి ప్రజలు ఎంత త్యాగమైనా చేసి తోడ్పడడంలో ఆశ్చర్య మేముంది?

## స్టేట్ ప్లానింగ్ కమిషన్





# ఆంధ్ర రాడికల్ లిటరేచర్ సెల్లింగు డిపో

గుంటూరు

రు 1 పుస్తకం. డిస్కౌంటు 25%

స్టాలిన్ ఉపన్యాసం, ఫాసిజం, లెనిన్, మార్క్సు, అమ్మా, దేవీ జోన్, డివెలరా, ప్రపంచ వీరులు. రాజకీయశాస్త్రము, చీనా జపాన్ ప్రళయం. స్పెయిన్ దుస్థితి, కార్మికోద్యమము, అన్నా, అండమాన్సు జీవితం. World Politics, మార్క్సు తిరుగుబాటు, ఆస్ట్రియా, జో—స్టాలిన్, వలస దేశాల సమస్య, నిర్మాణ సమస్యలు, ఏమి చెయ్యడం వగైరాలు దొరకగలవు.

(హిట్లరు దురంతాలు వచ్చుచున్నది.)

ఏజంట్లు:—

1. సిటీ స్టూడెంట్సు ఎంపోరియం.
2. సి హెచ్. రా॥ కృష్ణమూర్తి C.o ఆంధ్ర పబ్లిషింగ్ హోం } తెనాలి.
3. ఆర్. మహదేవ, హైదరాబాద్
4. ఎం. బి. సుబ్రహమణ్యం, నెల్లూరు.
5. రంగా & కో. బందరు.
6. శ్రీ జయలక్ష్మి ఫ్యాన్సీ మార్టు, బెజవాడ.
7. సి. సి. సుబ్బయ్య. గుంటూరు.
8. ఎం. ఆర్. మూర్తి, రంగూన్.

అన్నిచోట్ల ఏజంట్లు కావలయును.

వలయువారు:—

సి. పి. సారథి
మేనేజరు.

# లలితకళలు



'పీటర్ ది ఫస్టు' అనే సినిమా 1937 లో పారిస్ ఎక్సోప్రజిషన్ ఎవార్డు వారి బహుమతి గడించింది.
ఆ సినిమాలోని 'పీటర్' వేషదారి ఇతడు.

కామ్రేడ్ కొండేపూడి లక్ష్మీనారాయణ

కవి, చిత్రకారుడు, నటుడు వీరు మానవనాగరికతను మహోన్నతస్థానానికి తీసుకుపోగలరు. ఒక్కొక్కప్పుడు అధోగతిపాలుచేసి నాశనమూ చేయగలరు. అయితే ఈ మూర్పు ప్రజా సామాన్యంతో వీరికుండే సంబంధాన్ని బట్టివుంటుంది. కాని దీనినెంతమంది గుర్తించారు? అనేది ప్రశ్న. దీనికి సమాధానం సోవియటు యూనియన్‌చాలు ప్రస్తుతం కవిత్వం లోనికి దిగకుండా మిగతా కళను గురించి మాత్రమే పరిశీలించుదాం.

సామాన్యంగా చిత్రకారుడెక్కడో మహాప్రపంచంలో వుంటాడని, మనందరి కంటె అతీతుడనీ/అనుకుంటూ వుంటారు. అతనికి మనకీమధ్య సముద్రమంత ఎడం వున్నట్లు భావిస్తుంటారు, ఇది పొరపాటని సోవియటు యూనియన్ నిరూపించింది. నిజంగా చిత్రకారుడు ఈ భౌతిక ప్రపంచంతోటీ, మానవ సమాజపు పరిణామం తోటీ సంబంధంలేకుండా వుంటే అతడు చిత్రకారుడే కాడు. అతనికి కళోపాసన తెలియదనే చెప్పాలి. ఒకవేళ ఎవరైనా అలా వుండగలమని అనుకున్నప్పటికీ, అది అసంభవంకూడ. దీనికి ఒక చిన్న ఉదాహరణచాలు. ఎవరికీ కనబడక, ఎక్కడో వుండే భగవంతుడు కూడా ఈ మహాప్రపంచంలోని చిత్రకారుని సూక్ష్మదృష్టికి మానవాకారంలోనే కనబడుతున్నాడు గాని ఎక్కువగా ఏమిలేదు. ఎటొచ్చి మనకంటె అతీతుడనడానికి నాలుగుచేతులు మాత్రం తగిలిస్తున్నారు. అసలు ఇంతకీ ఈ కళ అంటే ఏమిటి? సమాజంలో దీని స్థానం ఏమిటి? అనే విషయాలు తెలుసుకుంటే సోవియటు యూనియన్‌లో కళలకున్న ఔన్నత్యాన్ని గుర్తించ గలుగుతాం.

చిత్రలేఖనం ఒక కళ; శిల్పం ఒక కళ, సంగీతం ఒక కళ: నాట్యం, అభినయం, సినిమాలు. తివాసీలు నేయడం, బట్టలమీద అద్దకం.... ఇవన్నీ కళలే. చివరకి మనం చేసే ప్రతి పనిలోనూ ఆర్టు చూపవచ్చు. అందుచేత మానవసమాజంయొక్క 'స్వభావాన్ని, చారిత్రికాభి వృద్ధిని అర్థం చేసుకోగలిగినవారే కళకు సరియైన నిర్వచనం చెప్పగలరు. కేవలం కళకోసమే ఈ కళలన్నీఏర్పడివుంటే అవి మనకక్కరలేదు. ఆర్టును గురించి మాట్లాడుతూ లెనిన్ ఒకసారి, "ఆర్టును గురించి మనం ఏమనుకుంటున్నదీ ముఖ్యంకాదు. దానిని గురించి ప్రజాసామాన్యం ఏమంటోంది అనేది ముఖ్యం. ఎందుకంటే, ప్రజాసామాన్యంలో బాగా వ్యాప్తిచెందిన నాడే నిజమైన ఆర్టు ప్రారంభమౌతుంది!" అన్నాడు.

కళ (ఆర్టు) అంటె వాస్తవికతను గ్రహించి. దానిని వివరించి ప్రతిబింబించే ఒక సాధనం. ఊరికే, ఉన్న ప్రపంచాన్ని

ఉన్నట్లుగా ప్రతిబింబింప జేయడంతోనే అది పరిపూర్ణం కాదు. చారిత్రికంగా రావలసిన మార్పులను తీసుకొని రావడానికి కూడా అది ఎక్కువగా ఉపయోగపడాలి.

నేడు సోవియటు యూనియన్‌లో నూతన నాగరికత యైన కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి కళలు ఎక్కువగా సహాయం చేస్తున్నాయి. 1917 విప్లవ కాలానికే, ప్రజలకు చైతన్యము కలుగజేసి ఐక్యపరచడానికి తోడ్పడ్డాయి. సోవియటు చిత్రకారుడు మన చిత్రకారునివలె, బైటి ప్రపంచంతో సంబంధం లేకుండా చుట్టూ ఊహానిర్మితమైన ఒక గోడ కట్టుకొని కూర్చోడు. నూతన సమాజ నిర్మాణంలో తన కర్తవ్యం ఎంతవరకో గుర్తెరిగి ప్రవర్తిస్తాడు. సోవియటు యూనియన్‌లో కళలు ఏ కొద్దిమంది దయాదాక్షిణ్యాల మీదనో ఆధారపడి లేవు. అవి ఆబాలగోపాలానికి చెందినవిగా ఉన్నాయి. ఇతర ప్రభుత్వాలవలె గాకుండా సోవియట్ ప్రభుత్వం, కళా పోషణకూడ తన కర్తవ్యాలలో నొకటిగానే భావించి పోషిస్తోంది. ప్రజలలో ఎక్కువగా వ్యాప్తిచెందేటట్లు చేస్తోంది. పాఠశాలలలో బాలబాలికలకు చిత్రలేఖనం, సంగీతం కూడా నేర్పబడుతాయి. అంటే, పాఠాలు చెప్పినట్లుగా చెప్పరు. విద్యార్థులు చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడతారు. ఎవరి అభిరుచులను బట్టి వారా కళలను అభ్యసిస్తారు. ఉపాధ్యాయులు, ఎడ్యుకేషనల్ కమిటీలు వారికి ప్రోత్సాహ మిస్తాయి. దీనికి తోడు ఆయా కళలలో తమ అభివృద్ధిని గురించి ఈ గ్రూపులు, ఉపాధ్యాయుల సహాయముతో, చర్చలు సాగిస్తూంటారు. వీరిలో బాగా పనికివచ్చే వారిని ఏరి, వారికి విద్యాశాఖ ప్రత్యేక శిక్షణకూడా ఇస్తుంది. ఇదే విధంగా షాపులలోను, రైల్వేలలోను, ఫ్యాక్టరీలలోను, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోను పని చేసే వారు, గ్రూపులుగా ఏర్పడి చిత్రలేఖనం, సంగీతం, శిల్పం, డ్యాన్సు మొదలైన వన్నీ అభ్యసిస్తారు. ఈ చిన్న గ్రూపులు వృత్తి రీత్యా చిత్రకారులు, శిల్పులు, సంగీత ప్రవీణులు అయిన వారికీ, ప్రజలకీ దగ్గర సంబంధం ఏర్పరచేవిగా ఉంటాయి.

వృత్తి రీత్యా చిత్రకారుడు, నటుడు, శిల్పి అయినవారు కేవలం పొట్టపోసుకోడానికే ఆ వృత్తు లవలంబించడం లేదు. వారు ప్రభుత్వ పోషణ క్రింద ఉంటారు. దేశంలో అన్ని ప్రాంతాలు సంచారం చేస్తూంటారు. పైన చెప్పిన చిన్న గ్రూపులతో చర్చలు సాగిస్తూ, వారి అభివృద్ధికి తోడ్పడడమే కాకుండా, వివిధ రాష్ట్రాల లోని ప్రజల జీవిత పద్ధతులు, సమస్యలు తెలుసుకుంటారు. తెలుసుకొని వాటిని తమ చిత్ర లేఖనం వల్ల గాని, నటనా చాతుర్యం వల్లగాని చక్కగా ప్రదర్శిస్తారు. కేవలం ప్రదర్శించడంతోనే వారి పని పూర్తి కాలేదు, చిత్రకారుడు తన చిత్రంలోను; శిల్పితనశిల్పంలోను, నటుడు తనపాత్రలోను ఆ సమస్యల పరిష్కార విధానం కూడా సూచించి, వారి విజ్ఞాన వికాసానికి తోడ్పడుతారు.

సంగీతం ఆనందించడానికి సోవియటు యూనియన్‌లో ఉన్నంత అవకాశం ఏ ఇతర దేశ ప్రజలకు లేదు. ప్రతి గ్రామంలోను, ఫ్యాక్టరీలోను, వ్యవసాయ క్షేత్రంలోను, ఓడలమీద ఆర్కెస్ట్రాలుగా ఏర్పడి పాడుకుంటూ వుంటారు. ప్రజలు కూడా చాలమంది వాటికి వస్తూంటారు. ఈసౌకర్యం ఎక్కువ చేయడం కోసం ప్రభుత్వం బ్రాడ్కాస్టింగు స్టేషనులను 60 రెట్లు ఎక్కువ చేసింది. కొన్ని లక్షల దూరశ్రవణయంత్రాలు(Loudspeakers) ఏర్పాటు చేసింది. ఇవి గాక 20 లక్షలకు పైగా ప్రయివేటు రేడియో సెట్లు (1935 నాటికే) ఉన్నాయి.

మ్యూజియములు, చిత్రకళా ప్రదర్శనశాలలు, ప్రజలలో కళలు ఎక్కువ వ్యాపించడానికి సహాయ పడుతున్నాయి. ఇదివరకుకంటె ఇప్పుడు వాటిని బాగా అభివృద్ధి చేశారు. అందులో అనేకరకాలైన చిత్రపటాలు, వివిధ కాలాలల్లో నాగరికతా పరిణామం మొదలైన విషయాలను తెలియపరచేవి; కళల క్రమాభి వృద్ధిని తెలియపర్చేవి అన్నీ ప్రదర్శింపబడతాయి. ఈ మ్యూజియములు, చిత్రకళా ప్రదర్శనాలయాలు ఎల్లప్పుడూ తెరువబడి ఉంటాయి. అందు అందరికీ ప్రవేశం ఉంటుంది. ప్రేక్షకులకు అందలి చిత్రాలను గురించి చెప్పడానికి సమర్థులైన వారు నియోగింపబడి ఉంటారు. ఇవి ప్రజల చారిత్రిక రాజకీయ విజ్ఞానాభివృద్ధికి మంచి సాధనాలుగా వున్నాయి. రష్యాలోని మ్యూజియములు, ఆర్టు గ్యాలరీలు చూచిన ఇతర దేశస్తులు "ప్రపంచంలో ఇంత చక్కనివి లే"వని అభిప్రాయాలిచ్చారు.

సోవియట్ రష్యాలో నాటకకళ, సినిమాకళ, ఇతరదేశాలలోవలె కేవలం వినోదంకోసం, కాలక్షేపం కోసంమాత్రమే లేవు. దానికి తోడు, వివిధ రాష్ట్రాల ప్రజలు పరస్పరం అర్థం చేసుకోవడానికి తమతమ సమస్యలు ( సాంఘికం, రాజకీయం, ఆర్థికం, వైజ్ఞానికం, సారస్వతం విద్యా విధానం, ఆరోగ్యం మొదలైనవన్నీ ) పరిష్కరించుకునే మార్గాలు తెలుసుకోడానికి కూడ ఈ కళ ఉపకరణంగా పనిచేస్తూవుంది. ప్రాథమిక పాఠశాలలెంత విరివిగాను ఉపయోగకరంగాను వుంటాయో నాటకసమాజాలు, సినిమాలుకూడ, అంతే. ఇవి "పీపిల్సు కమిసార్ ఆఫ్ ఎడ్యుకేషన్" (విద్యామంత్రి) అధికారంక్రింద వుంటా[illegible]. " రిపెర్టరీ కమిటీ " అని ఒక [illegible]సంఘం వుంటుంది. ప్రదర్శించవలసిన నాటకాలు ఫిలిం తీయవలసిన కథలు [illegible]సెలెక్టు చేయడం, ఈ కళల అభివృద్ధికి [illegible]వలసిన ఇతర ఏర్పాట్లు అన్నీ ఈ క[illegible]టీ చేస్తూవుంటుంది. ప్రతి ఫ్యాక్టరీలో [illegible] సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, గ్రామాలలోను నాటక సమాజాలుంటాయి. ఇవిగాక 15 సం॥ లోపు వయస్సుగల పిల్లలకందరకూ వేరు వేరు సమాజాలు, సినిమా హాలులువుంటాయి. పిల్లలు ప్రదర్శించే నాటకాలు వేరు. పెద్దవారు ప్రదర్శించే నాటకాలువేరు. పిల్లలకుచూపే ఫిల్ములు వేరు. పెద్దవారికి చూపించే ఫిల్ములువేరు. ఎవరి స్థాయి (**Standard**) ని బట్టి, ఎవరికి అవసరమైనవి వారికి చూపబడుతూ వుంటాయి. సినిమాకళ చాల అద్భుతంగా అభివృద్ధిచెందింది. సినిమాకళకు ఆటపట్టని చెప్పుకునే హాలివుడ్ ఫిలిములను మించిన ఫిలిములు రష్యాలో తయారవుతున్నాయి.



ఒక సంగీతంపాడే దృశ్యం ఉందనుకోండి. నటుడు సంగీతం పాడటం ప్రారంభించక పూర్వమే ఆదృశ్యం చూస్తేనే ప్రేక్షకునికి తాను సంగీతం వింటూనట్లు వుంటుంది. ఇది సోవియటు సినీమాలను గురించి ఒక విదేస్తుడిచ్చిన అభిప్రాయం. అంటే ఫిలింటెక్నిక్ అంత చక్కగా అభివృద్ధి చెందినదన్నమాట. క్లుప్తంగా చెప్పాలంటే నేటి సోవియటు సినిమా, థియేటర్, ఇవి వివిధ సమస్యా పరిష్కారానికి నిలయాలు. ప్రస్తుత ప్రపంచానికి, చారిత్రికంగా అది పొందవలసిన నూతన నాగరికతావసరాన్ని గూర్చి అమూల్యసందేశాన్ని ఇచ్చేవిగా వున్నాయి. కాని రష్యాలో కళలకీస్థితి ఒక్కసారిగా వచ్చి పడిందనుకోడం పొరపాటు. అవి అనేక దశలు దాటి వచ్చాయి.

సోవియటు రిపబ్లిక్ ఏర్పడకపూర్వం రష్యాలో కళలన్నీ ఇప్పుడు మన దేశంలోనూ, ఇతర బూర్జువా దేశాలలోను ఉన్నట్లే అంధకారంలో పడి ఉండేవి. చిత్రకారునికి, నటునికి, వారి కుండవలసిన, జాతీయజీవనంలోను, విశాల మానవ ప్రపంచం యొక్క ఆశలు, ఆశయాలలోను, లీనమై, వాటిని ప్రతిబింబింపచేయడానికి, స్వాతంత్ర్యం ఉండేది కాదు. ఎల్లప్పుడూ ధనానికి దాసత్వం చేస్తూ ఎవరో కొద్దిమంది ఆదరాభిమానాలపై ఆధారపడి ఉండేవారు.

కాని దేశంలో సోషలిస్టు చైతన్యం ఎక్కువైన కొద్దీ ఆర్టు యెడల దృక్పథం కూడా మారుతూ వచ్చింది. విప్లవ సమయంలో ప్రజల నైక్య పరచడానికి బాగా తోడ్పడిందని పైన చెప్పాము.

విప్లవానంతరం 1917 నుండి 1921 వరకు ఒక దశగా విభజించ వచ్చు. ఈ దశలో రష్యన్ ఆర్టు, లెనిన్ మాటలలో చెప్పాలంటే "Infantile disorder of leftism"తో కుంటువడింది. విప్లవ సమయంలోను అంతకుపూర్వము బయలుదేరిన ధోరణు లన్నీ ఒక అస్పష్టమైన స్థానాన్ని సంపాదించాయి. అనేక గ్రూపులు ఏర్పడ్డాయి విప్లవ సమయంలో నేర్చుకున్న నినాదాలన్నిటిని ఈ గ్రూపులు తమకు తోచిన రీతిని, పెటీ బూర్జువా రంగులలో బైట పెట్టడం ప్రారంభించాయి. ఈ దశలో కళలు, వెర్రి తలలు వేశాయి అని చెప్పాలి.

తరువాతి దశ 1922—27 ల మధ్య కాలం. ఈ దశలో కళలు కోలుకోడం ప్రారంభించాయి. అప్పుడు రష్యా లో ప్రవేశపెట్టబడిన నూతన ఆర్థిక విధానం వల్ల దేశం ఆర్థికంగాను రాజకీయంగాను కూడ అభివృద్ధి చెందుతూ వచ్చింది. త్వర త్వరగా మారుతూ వచ్చిన ఈ సాంఘిక కట్టుబాట్లు, చిత్రకారుని మీద, నటుని మీద ఎక్కువ ఒత్తిడి కల్గించాయి. వాటి కనుగుణ్యంగా వీరుకూడ పరివర్తించుకోక తప్పలేదు. విప్లవ దినాల్లో కళలు కేవలం ఆందోళన కొరకే ఉపయోగపడేవి. అప్పుడా అవస్థ దాటిపోయింది. సాంఘిక నిర్మాణానికి దారి తీయవలసిన సమయం వచ్చింది. దీనికి తోడు వీరికి రాజకీయ విజ్ఞానం కూడా ఎక్కువ అలవడింది. మొత్తంమీద ఈ దశలో కళలు (Realism) వాస్తవికత వైపుకు దారి తీశాయి.

మూడవ దశ 1928—32 ల మధ్య, అంటే మొదటి పంచవర్ష ప్రణాళిక దినాలు. ఇది లలితకళలకు పునర్నిర్మాణ దశ. ఈ దశలో కళలు ఎక్కువగా అభివృద్ధి చెందాయి. ప్రజా సామాన్యంలో ఎక్కువమందికి లలితకళ లంటే అభిలాష హెచ్చింది. ఎక్కువ శ్రద్ధ వహించడం ప్రారంభించారు. ఎన్నో కొత్త కొత్త సంఘాలు, గ్రూపులు తలలెత్తాయి. పంచవర్ష ప్రణాళికలో, ప్రజలను ఇంకా ఉన్నత స్థానానికి తీసుకు పోవడానికి వారిలో అదివరకు కలిగిన చైతన్యాన్ని సోషలిస్టు చైతన్యముగా మార్చడం ప్రారంభమైంది. దీని కనుగుణ్యమైన త్రోవలలో కళలు నడిచాయి. వివిధ గ్రూపులకు ఐక్యత ఏర్పడజొచ్చింది. మొత్తం మీద ఈ దశలో లలిత కళలకు ఒక శైలి, సుస్థిర స్థానం ఏర్పడ్డాయని చెప్పవచ్చు.

సోవియట్ ఆర్టు వివిధ దశల పాలు కావడమే కాకుండా రక రకాల మనుష్యుల చేతులలో పడి నలిగి పోయింది కూడ. వీరిని కూడ మూడు ముఖ్యమైన రకాలుగా విభజించ వచ్చు. మొదటిది ప్రొలిటేరియన్, సెమీ ప్రొలిటేరియన్ వర్గం. ఒక మాదిరి మధ్య తరగతికి చెందినవారు—ప్రొలిటేరియట్‌తో కలసి వచ్చేవారు—కూడా ఈరకానికి చెందుతారు. వీరు లలిత కళల యెడల మార్క్సిస్టు దృక్పథం కలిగి ఉండేవారు. రెండవ రకం ( cultured technical intelligentsia) నాగరికత గల మేధావులు. వీరు కళలలో కొత్త రకాలుకూడా ప్రవేశ పెట్టేవారు. ఫ్యూడల్ విధానంపై తిరుగుబాటు చేసిన వారైనా వీరు ప్రొలిటేరియట్ విజ్ఞానాన్ని, దృక్పథాన్ని (ideology) అర్థం చేసుకో లేకపోయారు. వారితో కలసి రాలేక ఆర్టును వదలి పెట్టివరిశ్రమలవైపుకుపోయారు. కానిఇప్పు

డిప్పుడు కొంత అభివృద్ధి చెంది మరల కళల వైపుకు మరలుతున్నారు. వీరిలోనే ఇంకోరకం ఉండేది. వీరు ప్రోలిటేరియన్ విజయాన్ని గుర్తించి వారితోపాటుగానే అభివృద్ధి పొందుతూ వస్తున్నారు. ఇంక మూడో రకం. వీరు నవంబరు విప్లవానికి పూర్వంగా ఉన్నవారు. ఇప్పటి మన చిత్రకారులు, నటులు వలెనే రాజకీయాలకు ఈ కళలకు సంబంధం ఉండకూడదని వాదించే వారు. విప్లవంలో అణగునని మది గట్టుకు కూర్చున్నారు. కాని కాల ప్రవాహానికి ఎదురీద లేక పోయారు. విప్లవానంతరం సోవియట్ యూనియన్‌లో ఉపాధ్యాయులుగను ఇతర ఉద్యోగాలలోనూ చేరారు. ఇప్పుడు వీరు కూడా తమ తప్పుడు దృక్పథాన్ని గుర్తించి ఇతరులతోపాటుగానే సమాజాభివృద్ధికి తోడ్పడుతున్నారు.

ఈ ఐక్యతకు 1932 లో రష్యన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘం చేసిన నిర్ణయం ఎక్కువ సహాయం చేసింది. ఆనిర్ణయంతో సోవియట్ కళల చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమైంది. అప్పటినుండి సోషలిస్టు రియలిజం. సోవియట్ కళల ప్రధాన సూత్రం అయింది. మొత్తంమీద సోవియటు యూనియన్‌లో లలితకళలు గత కొలది సంవత్సరాలలోనే ఇంత ఉన్నత దశకు వచ్చాయి. దీనికి కారణం అవి పూర్తియైన మార్క్సిస్టు దృక్పథం కలిగి వున్నాయి. ప్రజా సామాన్యంతో సన్నిహిత సంబంధము కలిగి ఉన్నాయి. వారి రోజు రోజు సమస్యల పరిష్కారానికి సహాయపడుతున్నాయి. సోవియటు చిత్రకారులు, నటులు, శిల్పి వీరు పొట్టకోసం కళల నమ్ముకొని వ్యక్తులకు దాసత్వం చేయ నవసరం లేదు. వారికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంది. సమాజాభివృద్ధికి తామెంత వరకు సహాయపడాలో వారు తెలుసుకున్నారు.

---


## శ్రీ రామకృష్ణా ఆయుర్వేద ఫార్మశీ,

ప్రొప్రయిటరు:—వైద్యవిద్వాన్ సి. సన్యాసయ్య, ఎ. ఆర్. ఎ. సి.

మెయిన్‌రోడ్, విజయనగరం.

### పూర్ణ చంద్రోదయ మాత్రలు

అకాల జరామృత్యు రోగములను బాపి చిరాయువు నొసంగ గలదని ప్రఖ్యాతి వడసినది. గ్రహిణీ రోగము, వీర్యస్ఖలనము, ఉన్మాదము, సుఖవ్యాధులు మొదలగువాటి నణచి శరీరపుష్టి, ధాతువృద్ధి కలిగించును. సీసా 1కి 30 మాత్రలు గలది రు 3—0—0.

### హీ ట్ కిల్లర్

20 వ శతాబ్దమునకు పేరు వడసినది.

వేనకువేలు విక్రయం! వేనకువేలు విక్రయం!! సమస్త మేహవ్యాధులను నిర్మూలించును. నరముల దుర్బలత్వమును పోగొట్టి అమితమగు బలము చేకూర్చును, అన్ని తత్వములకు అనుకూలము. సీసా 1 కి రు 1—0—0.

అన్నిరకముల ఆయుర్వేద ఔషధములు మావద్ద దొరకును.

---

## లీలా హెయిర్ ఆయిల్ [illegible]

ఇందు వాడమియా నూనె వాడుటచే మెదడునకు చలువచేసి, వెంట్రుకలను పట్టుకుచ్చువలె నుంచును.

## J. R. SWAMY'S,

### ఆమ్లా తల నూనె

దీనిలో చాలా విలువగల వనమూలికలున్నూ, పుష్ప జాతులున్నూ, సుగంధ ద్రవ్యములున్నూ చేర్చి, మిగుల అనుభవముతో తయారు చేయబడినది.

### ఓటో పుష్పసేన (సెంటు)

మా ఓటో పుష్పసేన (సెంటు) మీ బట్టలపై చల్లిన దాని పరిమళమునకు దేవేంద్ర పుష్పవనములో నున్నట్లు ఆనందము చెందకమానరు.
యింకా మా కంపెనీలో పలువిధములైన పరిమళ ద్రవ్యములు, కెమికల్సు, వేసలైన్లు, బ్రిలియన్ టైన్సు వగైరా దొరుకును.
ఒకసారి ఆర్డరు ఇచ్చిన మీకే తెలియగలదు.

హెడ్డాఫీసు:—
లీలా టాయిలెట్ వర్క్సు, హైక్లాస్ పర్‌ఫ్యూమర్సు,
తెనాలి.

బ్రాంచి:—
హైటర్ బస్తీ, నెం 47 రు.
శికిందరాబాద్, (దక్కన్).



# కార్మికోద్యమం





ఉత్పత్తి విధానంలో నూతన శకాన్ని ఆరంభించిన స్టకానోవ్ బొగ్గు గనిలో పనిచేస్తున్న చిత్రము.

కామ్రేడ్ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు

మిగిలిన ప్రపంచ మంతటా కార్మికులు తమ యజమానులవల్ల పీడింపబడు తున్నారు. నిరుద్యోగముచే అల్లాడుతున్నారు. తమ సంఘాలను ట్రేడు యూనియనులను కూడ నిర్మించుకొనే హక్కు లేకుండ చేయబడుతున్నారు. కాని ఒక్క సోవియటు యూనియనులో మాత్రము, కార్మికులు వైభవంతో ఉన్నారు. తమ ప్రభుత్వాన్ని స్థాపించి గత 21 సంవత్సరాలనుండి నూతన సమాజాన్ని నిర్మిస్తున్నారు. ఈ భేదమే మిగిలిన దేశాలలోని కార్మికోద్యమానికి, సోవియటు యూనియనులోని కార్మికోద్యమానికి గల భేదానికి కారణం. మిగిలిన దేశాలలో ట్రేడు యూనియనులు, కార్మికుల ఆర్థిక హక్కుల కోసం పోరాడవలసి ఉంటుంది. సోవియటు యూనియనులో "అధికారము వహించిన కార్మికవర్గ మంతటి నిర్మాణమూ ట్రేడు యూనియనులు. వీనిలో అన్ని పరిశ్రమలలోను, అన్ని వృత్తులలోను ఉన్న కార్మికులందరూ చేరి ఉన్నారు. వీనికి సంబంధించిన శాఖలు అనేకాలున్నవి. ఉత్పత్తికి, విద్యకు, విజ్ఞానానికి సంబంధించినవి. ఇవి కమ్యూనిస్టు పార్టీ సంస్థలు కావు. అయితే కమ్యూనిజము నేర్పే పాఠశాలలు. వీనిలో బాగా అభివృద్ధి చెందిన కార్మికులూ ఉన్నారు. బాగా వెనకబడిన కార్మికులూ ఉన్నారు. అందుచే వీరియువురి మధ్య సంబంధమును ఏర్పరిచే సంఘాలుగా ఉంటాయి. ఈ ట్రేడు యూనియనులలో నుండే, వివిధ పరిపాలనా శాఖలను నడపడానికి కావలసిన వ్యక్తుల

నందరిని తీసుకుంటున్నారు."

అయితే ఈ స్థితికి రావడానికి ముందు సోవియటు కార్మికు లేయే దశలను దాటివచ్చారో చూస్తాము.

### ట్రేడు యూనియను ఉద్యమ చరిత్ర.

మొట్టమొదట 1875 లో జస్లావస్కీ, ఒడిస్సా నగరములో "దక్షిణ రష్యా కార్మికుల యూనియను" అనే సంఘాన్ని ఏర్పాటు చేశాడు. 1879 లో పెట్రోగ్రాడ్‌లో (లెనిన్ గ్రాడ్‌లో) స్టీవన్ ఖల్టొరిన్ 'ఉత్తర రష్యా కార్మికులు యూనియనును" ఏర్పాటు చేశాడు. కాని వీనినన్నింటిని జారు పోలీసులు వెనువెంటనే అణచివేశారు. అయినా రహస్యంగా ఈ ట్రేడు యూనియనులను నెలకొల్పుతూనే వచ్చారు. 1896 లో ఇట్టి ట్రేడు యూనియనులలో పని చేస్తున్నప్పుడే లెనిను మొదటి పర్యాయము అరెస్టు చేయబడ్డాడు.

1905 రష్యను విప్లవము రోజులలో మాస్కోలో అఖిల రష్యను ట్రేడుయూనియను కాన్ఫరెన్సు 1907 లో జరిగింది, కాని జారు చక్రవర్తి వీని నన్నింటిని అణచివేశాడు. 1912 లో లీనానది ఒడ్డున బంగారపు గనులలో పనిచేసే కూలీలు సమ్మె చేస్తున్నప్పుడు పోలీసులు తుపాకులతో కాల్చి చాలమందిని చంపారు. దీనితో కార్మికోద్యమము రష్యాయంతా విజృంభించింది.

1917 మార్చిలో జారును కూలద్రోసిన విప్లవము నాటికి ట్రేడు యూనియనులలో సభ్యత్వము కొన్ని వేలకు మించలేదు. కాని 1917 అక్టోబరు నాటికి 20 లక్షల మంది సభ్యులు అయినారు.

1919 జనవరిలో అఖిల రష్యను ట్రేడు యూనియను కాంగ్రెసు సమావేశమయి, లెనినుచే ఏర్పరుచబడిన కార్మిక నియంతృత్వాన్ని బలపర్చాలని సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పడానికి పూనుకోవాలని నిర్ణయించింది. అంతర్యుద్ధం సాగుతూ ఉన్నంతకాలము పరిశ్రమలో పని చేసే వాడెల్లా ట్రేడు యూనియనులలో నిర్బంధంగా చేరాలి. కాని నూతన ఆర్థిక విధాన సమయంలోనూ, తదుపరి కూడా సభ్యత్వము, వ్యక్తుల ఇష్టానికి వదలివేయ బడింది. నేడు సోవియటు ట్రేడు యూనియనులలో సభ్యత్వము 2 కోట్ల 30 లక్షలు.

ఆ నూతన ఆర్థిక విధాన్నానుసరించేకాలంలో, ట్రేడు యూనియనులు కేవలము ప్రభుత్వ శాఖలుగా ఉండాలనీ, తద్వారా పారిశ్రామికోత్పత్తి, శిక్షణను, ఒక సైన్యముచేత చేయించినట్లు చేయించాలసినదని ట్రాట్‌స్కీ వాదించాడు. కాని ఆ వాదనను పార్టీ నిరాకరించింది.

1929 లో అప్పటివరకు ట్రేడు యూనియను కాంగ్రెసుకు అధ్యక్షుడుగా ఉండిన టామ్‌స్కీ, ట్రేడు యూనియనుయొక్క 8 వ కాంగ్రెసులో, మిగిలిన పెట్టుబడి దేశాలలో లాగనే సోవియటులోకూడ, ట్రేడు యూనియనులు కార్మికుల జీతాలను హెచ్చుజేయుడానికి ఎప్పుడూ పోరాడుచుండాలనీ, ఉత్పత్తిని ఎక్కువ చేసే ప్రయత్నాలతో దానికేమి సంబంధములేదని వాదించాడు. కాని, సోవియటు యూనియనులో, కార్మికుల శ్రమ ఫలితాన్ని దోచుకొనేవారు ఎవరూలేరు. అందుచే ఉత్పత్తి ఎంత ఎక్కువవుతుందో అంత ఎక్కువ జీతాలు కార్మికులకు ఇవ్వడానికి సాధ్యమవుతుంది. ఇది కేవలము ఒక పరిశ్రమలో గాక దేశములోని అన్ని పరిశ్రమలలోను ఉత్పత్తి ఎక్కువయితేనే సాధ్యమవుతుంది. అందుచే ట్రేడు యూనియనులు, సోవియటు యూనియనులో కార్మికుల జీతాలు, సౌకర్యాలు ఎక్కువ చేయడానికి, పారిశ్రామికోత్పత్తి ఎక్కువ చేయాలసి ఉంటుంది. టామ్‌స్కీ వాదన త్రోసివేయ బడింది. కామ్రేడ్ ష్వెర్నికును కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

1938 నుంచి కార్మికుల వివిధ సౌకర్యాలు కోసం ప్రభుత్వం ఖర్చు చేసే ధనాన్నంతా ట్రేడు యూనియనుల వశము చేశారు. అవియే వివిధ సోషల్ ఇన్సూరెన్సు స్కీములకు నవశానికి పూనుకున్నాయి.

### ట్రేడు యూనియనుల నిర్మాణము.

ప్రతి ఫ్యాక్టరీకి ఒక ఫ్యాక్టరీ కమిటీ ఉంటుంది. ఫ్యాక్టరీలో పని చేసే వారంతా సమావేశమై ఈ కమిటీని ఎన్నుకుంటారు. ఫ్యాక్టరీలోని, ఇంజినీర్లు, మెకానిక్కులు, సాధారణ పనివారేగాక. ఫ్యాక్టరీ అనుబంధించి యుండు అస్పత్రులలోనూ, క్రిచిలలోను, ఫలహార శాలలలోనూ పనిచేసేవారుకూడ, డాక్టర్లతో, నర్సులతో సహా, ఈ సభలో పాల్గొంటారు.

పారిశ్రామిక సంస్థలు కాని, పాఠశాలలు, వైద్యాలయాలు, పరిశోధనాలయాలు, ప్రభుత్వ డిపార్టుమెంటులు, శాఖలు వీనిలో ఎన్నుకొనే కమిటీలను స్థానిక కమిటీలంటారు.

ఒక ఆబ్లాస్టులో ఉన్న బట్టల మిల్లుల పనివారలందరికి ఒక ఆబ్లాస్టు ట్రేడు యూనియను కమిటీ ఉంటుంది. వివిధ బట్టల మిల్లులలోని ఫ్యాక్టరీ కమిటీ ప్రతినిధులు ఒక చోట సమావేశమయి ఆబ్లాస్టు కమిటీని ఎన్ను కుంటారు.

ఒక సోషలిస్టు రిపబ్లిక్కులో ఉండే వివిధ ఆబ్లాస్టు ట్రేడు యూనియను కమిటీలు ప్రతినిధులను పంపి రిపబ్లిక ట్రేడు యూనియను కమిటీని ఎన్ను కుంటాయి.

సోవియటు యూనియనులోని రిపబ్లికు ట్రేడు యూనియనులు, తమ ప్రతినిధులను పంపి అఖిల యూనియను ట్రేడు యూనియను కమిటీని ఎన్ను కుంటాయి. ఇటువంటి అఖిల సోవియటు ట్రేడు యూనియను కమిటీలు, పరిశ్రమ కొకటి చొప్పున 165 ఉన్నవి.

ఈ 165 సోవియటు ట్రేడు యూనియనుల సభలలో నుండు ప్రతినిధులను ఎన్ను కుంటారు. ఈ ప్రతినిధుల సమావేశానికి, అఖిల సోవియటు ట్రేడు యూనియనుల కాంగ్రెసు అని పేరు. ఈ కాంగ్రెసులో అఖిల సోవియటు ట్రేడు యూనియనుల కాంగ్రెసు కేంద్ర కమిటీని ఎన్ను కుంటారు.

ఏ విధంగా అఖిల సోవియటు ట్రేడు యూనియనులన్నీ కలసి ఒక అఖిల సోవియటు ట్రేడు యూనియనుల కేంద్ర కమిటీని ఏర్పరుస్తాయో, అదే రీతిఒక రిపబ్లికులోని రిపబ్లిక్కు ట్రేడు యూనియనులన్నీ కలసి ఒక రిపబ్లికు ట్రేడు యూనియనుల కేంద్ర కమిటీని ఏర్పరుస్తాయి. అదే విధంగా ఆబ్లాస్టులోకూడ ఉంటాయి.

అంటే ఒక ప్రదేశంలో ఒక్కొక్క పరిశ్రమకు ఒక్కొక్క ట్రేడు యూనియనునే గాక, ఆ ప్రదేశములలోనున్న పరిశ్రమల కన్నింటికిని కలిపి మరియొక ట్రేడు యూనియను ఉంటుంది.

ఈ వివిధ ప్రాంతీయ ట్రేడు యూనియనులు ఆ ప్రాంతములోని వివిధ ట్రేడు యూనియనుల మధ్య బయలుదేరు అనేక విషయాలను పరిష్కరిస్తూ ఉంటాయి. ఆ ప్రాంతములోని వివిధ ట్రేడు యూనియనుల పనిని సమన్వయము చేస్తుంటాయి.

ఈ వివిధ ట్రేడు యూనియనులే గాక, ఒక్కొక్క ఫ్యాక్టరీకి, ఒక్కొక్క ప్రాంతాన ఉండే, వైద్యులు, ఇంజినీర్లు, శాస్త్రజ్ఞులు తాము ప్రత్యేకముగా ఒక ట్రేడు యూనియనుగా ఏర్పడుతారు. ఒక వైద్యుడు, ఒక పరిశ్రమకు చెందిన ట్రేడు యూనియనులోనే గాక, వైద్యుల ట్రేడు యూనియనులోకూడ సభ్యుడుగా ఉంటాడు.

### ట్రేడు యూనియనులు చేసే పనులు.

సోవియటు యూనియనులో ఉండే ట్రేడు యూనియనులు, ఉత్పత్తిని ఎక్కువచేసి, జీతాలు ఎక్కువగా కార్మికులకు సంపాదించడముతోనే తమ పని పూర్తి అయినట్లు భావించవు. సభ్యులను యంత్ర ప్రమాదాలనుండి రక్షించడము: కార్మికులు పనిచేసే స్థలాలు ఆరోగ్యవంతంగా ఉండేటట్లు చూడడము; ఫ్యాక్టరీ ఏ పద్ధతులమీద నడుపాలో చర్చించి సలహాలు మానేజ్‌మెంట్ కీయడము; కామ్రేడ్సు కోర్టులను నిర్వహించడము; ఫ్యాక్టరీ సహకార విక్రయ సంఘము ఏయే వస్తువులు, ఎంతెంత ఏయే ధరలకు ఇవ్వవలయునో పరిశీలించడము; జబ్బులకు, రోగాలకు, ముసలితనానికి ఏర్పరచిన భీమా నిధులను నిర్వహించడము: తమ సభ్యుల హక్కుల కాపాడడానికి లీగల్ సలహా ఉచితంగా ఇవ్వడానికి ప్లీడర్ల కమిటీని ఏర్పాటు చేయడము; గృహవసతి కల్గించడం; ఫ్యాక్టరీ కార్మికుల విద్య, విశ్రాంతికోసం ఏర్పరచే క్లబ్బుల పరీక్షించడము; కార్మికులకు సెలవు దినాలలో కాలము గడపడానికి ప్రదేశాలను నిర్ణయించడము; ప్రయాణము కోసం సదుపాయములు చేయడం; సినిమాలకు, నాటకాలకు సంగీత కచ్చేరులకు టిక్కెట్లు సంపాదించడము; ఇవి ట్రేడు యూనియనులు చేసే పనులలో కొన్ని.

ఈ పనులన్నీ గావించడానికి ప్రతి ఫ్యాక్టరీ కమిటీకి ఒక అధ్యక్షుడు, కార్యదర్శి 6 మొదలు 12 మంది వరకుగల ఒక ప్రెసిడియము ఉంటుంది. వీరేగాక ఈ క్రింది సబ్‌కమిటీలు కూడ ఉంటాయి.

1. కార్మికుల రక్షణకోసం, వారి ఆరోగ్యాన్ని పెంపొందింపజేయడానికి ఒక కమిటీ 2. విద్య, విజ్ఞాన విషయాలు; గోడ వార్తా పత్రికలు; నాటకాలు; గ్రంథాలయాలు వగైరాలకోసం 3. జీతాల నిర్ణయించడం కోసం 4. ఉత్పత్తిని అధికం చేయడంకోసం 5. లెక్కలు చూడడం కోసం 6. డబ్బుకోసం 7. అంతర్జాతీయ కార్మికుల సహాయనిధికోసం 8. సహకార వస్తు విక్రయ సంఘ పనికోసం 9. క్లబ్బు మేనేజ్‌మెంటు కోసం.

ఈ సబ్‌కమిటీలలో పని చేయడానికి సాధారణ సభ్యులే ఎట్టి జీతాలు తీసుకోకుండా పని చేస్తూఉంటారు. ఒక్క అధ్యక్షుడు, కార్యదర్శికి మాత్రము పూర్తిగా పని చేయవలసి యుండుటచే జీతాలు ఇస్తారు. జీతాలు తీసుకోకుండా పనిచేసే వారిసంఖ్య 10 లక్షలకు మించి ఉంది. తీసుకొని పనిచేసే వారి సంఖ్య కేవలము 30,000.

ఫ్యాక్టరీ కమిటీతో ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటు ఎప్పుడూ సంబంధము కలిగి ఉంటుంది. ఫ్యాక్టరీల్లో ఏవైనా మార్పులు చేయాలంటే ఫ్యాక్టరీ కమిటీకి తెలియజేయాలి. కార్మికుల కష్టాలను గూర్చి వాటితో చర్చించాలి. కమిటీలుచేసే సూచనలను జాగ్రత్తగా గమనించాలి. ఉత్పత్తిని ఎక్కువ చేయుడానికిని, సామగ్రి దుబారా కాకుండగను, ఉత్పత్తి ఖర్చులు తక్కువ కావడానికి అవకాశాలను గూర్చి ఫ్యాక్టరీ కమిటీతోనే చర్చించాలి.

ఈ ఫ్యాక్టరీ కమిటీలే ఇతర ఫ్యాక్టరీలతో ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి "సోషలిస్టు పోటీ"లను ఏర్పరస్తుంది. షాక్ బ్రిగేడ్సును ఏర్పాటు చేస్తుంది.

సోవియటు యూనియనుతో ట్రేడు యూనియనులు, ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటులతో సమిష్టి ఒడంబడికలను చేసుకొంటాయి. ఈ ఒడంబడికలలో ప్రధానంగా ఈ క్రింది విషయాలుంటాయి.



1. జీతాలెంత ఇవ్వవలసి యుండేది.
2. ప్రతి ఫ్యాక్టరీ, సోషల్ ఇన్స్యూరెన్సు కోసం ఎంత ఖర్చు పెట్టేది ?

కార్మికులకు సదుపాయాల కోసం, వారి భీమా నిధుల కోసం కార్మికులు తమ జీతాలనుండి ఇతర దేశాలలాగ, కొంత భాగాన్ని ప్రతి మాసమూ కట్టుతూ ఉండ నవసరములేదు, వారసలు కట్టనే కట్టరు. భీమానిధికి కావలసిన డబ్బు అంతా, ప్రతి ఫ్యాక్టరీ తన ఆదాయములో నూటికి ఇంత అని ప్రత్యేకిస్తుంది. నూటికి ఎన్ని వంతులు ఈ సదుపాయాలకు ప్రత్యేకించాలనే విషయంలోనే ఒడంబడిక. ఈ ఒడంబడికను చేసుకోవడానికి ముందు, మేనేజ్‌మెంటుతో చర్చించడానికి కార్మికులు అందరూ సమావేశమవుతారు. వీరందరూ కలిసి చర్చించి నిర్ణయాలకు వస్తారు. కాబట్టి, అనుకొన్న ప్రకారము ఉత్పత్తి పూర్తికాకపోతే అనుకొన్న ప్రకారం, భీమా నిధులకు డబ్బు ఫ్యాక్టరీ ఇవ్వజాలదు. అని కార్మికులు తెలుసుకుంటారు. అందుచే కార్మికులు ఉత్పత్తిని అనుకొన్న ప్రకారము పూర్తిచేయడానికి పని చేస్తారు.

### జీతాలు ఏ విధంగా నిర్ణయించ బడతాయి !

అఖిల సోవియటు ట్రేడు యూనియనుల కేంద్ర కమిటీ, పీపుల్సు కమిస్సార్లతోనూ. వివిధ పరిశ్రమల కేంద్ర మేనేజ్‌మెంటుతోనూ ఈ విషయమై చర్చిస్తుంది. రాబోవు సంవత్సరానికి, ఎంత, ఏయే సరకు ఉత్పత్తి చేయాలో స్టేటు ప్లానింగు కమిషను నిర్ణయించినపుడు, ఆ ప్రణాళికలో మొత్తము సోవియటు యూనియను కంతటికి జీతాల క్రింద ఎంత ఖర్చు పెట్టాలో నిర్ణయిస్తుంది. ఈ నిర్ణయము ఈ క్రింది విషయాలమీద ఆధారపడి ఉంటుంది.

మరమ్మతుల కోసం కొంత డబ్బు ఖర్చు పెట్టాలి. పాడైపోయిన యంత్రాలకు బదులు క్రొత్త యంత్రాలను కొనడానికి కొంత ఖర్చు పెట్టాలి. నూతన పరిశ్రమలను, నూతన రాకపోకలను నిర్మించడానికి మరికొంత ఖర్చు పెట్టాలి. అంతేగాక సమిష్టిగా ఖర్చు పెట్టాలసిన విషయాలెన్నో ఉన్నాయి. న్యాయ పరిపాలన కోసం, ప్రభుత్వ డిపార్టుమెంటుల కోసం, సైన్యం కోసం, శాస్త్ర పరిశోధన కోసం, విద్యకోసం, వైద్యము కోసం, ప్రజా సామాన్యానికి కావలసిన సదుపాయాలు చేయడానికి భీమా నిధుల కోసం. వీటి కన్నిటికి ఎంత ఖర్చుపెట్టాలి? జీతాలుగా ఎంత ఖర్చుపెట్టాలి అనే విషయాన్ని అఖిల సోవియటు ట్రేడు యూనియనుల కాంగ్రెసు, స్టేట్ ప్లానింగు కమిషనుతోను, పీపుల్సు కమిస్సార్లతోను కలసి చర్చించినిర్ణయానికి వస్తుంది.

ఈ విధంగా మొత్తం జీతాలకు వచ్చిన డబ్బును, ఏయే పరిశ్రమలో ఎంత ఖర్చుపెట్టాలో, అఖిల సోవియటు ట్రేడు యూనియనుల కాంగ్రెసులో భాగాలయిన 165 వివిధ పరిశ్రమల యొక్క, సోవియటు ట్రేడు యూనియనులు తమలోతాము నిర్ణయించుకుంటాయి. ఒక్క పరిశ్రమలో ఎంతమంది పనిచేసే వారున్నారో చూచి, ఒక వ్యక్తికి గంటకు ఇంత వస్తుందని నిర్ణయిస్తారు.

ఆవరేజ్ పనిని చేసే వ్యక్తికి. ఒక గంటకు నిర్ణయించిన జీతాన్ని, ఒక గంటలో ఎంత పనిచేస్తే ఇవ్వాలసి ఉంటుంది అని ప్రతి ఫ్యాక్టరీ కూడ నిర్ణయించాలసి ఉంటుంది. ఎందుకంటే సోవియటు యూనియనులో జీతాలు సర్వ సాధారణంగా పరిశ్రమలలో పైమ్మునుబట్టి గాక, పనినిబట్టి ఇస్తారు, ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటు ఈ రేటును నిర్ణయించేటప్పుడు ఫ్యాక్టరీ కమిటీతో చర్చించి ఒడంబడికకు రావలయును.

### జీతాలలో హెచ్చు తక్కువలు.

పీస్ రేటు (పనినిబట్టి జీతా లివ్వడము)లకు వ్యతిరేకముగా పెట్టుబడి దేశాలలో కార్మికులు, ట్రేడు యూనియనులు ఎప్పుడూ పోరాడుతూ ఉంటాయి. అలాంటి పీస్ రేటుపద్ధతే సోవియటు యూనియనులో అవలంబిస్తే కార్మికులెందుకు పోట్లాడరు? పెట్టుబడిదారీ దేశాలలో పీస్‌రేటు ప్రకారము పని చేసేకొందీ, ఉత్పత్తి ఎక్కువగుటచే, లాభాలకోసం పని చేసే పెట్టుబడిదారులు, తక్కువమందిని పెట్టుకుంటారు. అందుచే కార్మికులకు నిరుద్యోగం హెచ్చుతుంది. నిరుద్యోగం వలన కార్మికులు తమలోతాము పోటీ పడతారు. అప్పుడు పీస్‌రేటులు కూడ తగ్గిస్తారు యజమానులు. సోవియటు యూనియనులో, ఉత్పత్తి పరికరణాలన్నీ కష్టజీవుల సౌకర్యము కోసం, ఉపయోగం కోసం, సామగ్రిని తయారు చేయడానికి వినియోగిస్తున్నారు. కాబట్టి, ఎంత ఎక్కువ ఉత్పత్తి చేస్తే అంత హెచ్చుగా వస్తుంది కార్మికులకు.

పీస్ రేటుల ప్రకారము వచ్చే హెచ్చు తక్కువ లేగాక, గ్రేడులనుబట్టి కూడ ఈ హెచ్చు తక్కువలు మరింత వస్తున్నాయి. సోవియటు యూనియనులో కార్మికుని నైపుణ్యము ననుసరించి, వారిని 8 గ్రేడులుగా విభజించియున్నారు, ఈ గ్రేడులకు, ఈక్రింది రేట్ల ననుసరించి జీతాలు ఇస్తారు.

| గ్రేడు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|---|
| జీతము రేటు | 1 | $1\frac{1}{4}$ | $1\frac{1}{2}$ | $1\frac{3}{4}$ | 2 | $2\frac{1}{4}$ | $2\frac{1}{2}$ | 3 |

అంటే ఒక పరిశ్రమలో తక్కువ కూలి తీసుకొనే వ్యక్తికన్న ఎక్కువ కూలీ తీసుకొనే వ్యక్తి జీతము, మూడురెట్లకు మించి ఎప్పుడూ ఉండదన్నమాట.

తక్కువ గ్రేడులోనుండి ఎక్కువ గ్రేడులోకి పోవాలంటే ఎక్కువ గ్రేడులో 15 రోజులు పనియిచ్చి, ఆగ్రేడుకు తగిన పని చేస్తూఉంటే ఆ గ్రేడులోనే ఉండనిస్తారు. లేనిచో మామూలు స్థానానికే పంపుతారు. దీనివల్ల ప్రతి శాఖలో పనివాళ్లలో నూటికి 90 మంది పై గ్రేడులోకి పోవాలని సాయంత్రం తాము పనినుండి వచ్చిన పిదప ప్రత్యేక తరగతులలో చదువడానికి వెళ్లుతున్నారు.

సోవియటు యూనియనులో వివిధ పరిశ్రమలలో ఈ క్రింది రకముగా జీతాల్ను ఇస్తున్నారు.

రుబుల్సులలో సాంవత్సరిక జీతాలు.

| పరిశ్రమ | 1932 | 1937 |
|---|---|---|
| 1. పెద్ద పరిశ్రమలు:— | | |
| కార్మికులకు | 1385 | 1736 |
| గుమాస్తాలకు | 2076 | 2353 |
| ఇంజినీర్లకు | 3634 | 4361 |
| 2. చిన్న పరిశ్రమలు. | 1251 | 1490 |
| 3. చేతిపనులు | 1720 | 2150 |
| 4. తాపీ పనివారు | 1509 | 1794 |
| 5. రైల్వే | 1496 | 1859 |
| 6. వర్తకము | 1351 | 1533 |
| 7. ప్రభుత్వపు హోటళ్ళు | 1059 | 1200 |
| 8. విద్యా డిపార్టుమెంటు | 1633 | 1960 |
| 9. వైద్యము | 1248 | 1560 |
| 10. ప్రభుత్వోద్యోగులు | 1942 | 2368 |
| 11. వ్యవసాయము | 866 | 1299 |

రుబులు అంటే రూపాయిన్నర.

### సోషల్ ఇన్సూ్యరెన్సు.

కార్మికుల కీవిధంగా జీతాలెక్కువగా ఇవ్వడమేగాక, ఇంకను అనేక సౌకర్యాలను ఫ్యాక్టరీ మేనేజ్‌మెంటు లిచ్చేటట్లు ట్రేడు యూనియనులు ఒడంబడికలను చేసుకుంటాయి. అట్టివానిలో ముఖ్యమైనవి:— కార్మికుల నివసించడానికి వసతులు; క్లబ్బులు; బిడ్డలకు నర్సరీ స్కూళ్లు కిండర్గార్టన్లు; తనకు, తన భార్యకు టెక్నికలు స్కూళ్లు: సెలవు రోజులలో ఎక్స్‌కర్షన్లు, (దేశాటనము), సంవత్సరానికి ఒక నెలరోజులు నిండు జీతముతో సెలవులు; తాము పనిచేసే స్థలాలలో భద్రతకు, ఆరోగ్యానికి కావలసిన ఏర్పాట్లు, హాస్పిటల్సు, సానిటోరియములు, సోషల్ ఇన్సూరెన్సు నిధులు.

ఆర్థికంగా ఒక వ్యక్తికి ఎట్టి చీకుచింతాలేకుండ చేయనిదే అతనికి శాంతిగాని, సుఖముగాని ఉండదు. అతను అభివృద్ధి కావడానికి, నాగరికత, విజ్ఞానాన్ని పొందటానికి తగిన శక్తికూడ కలిగి ఉండడు. అందుచే ఇట్టి చీకుచింతా లేకుండ సోవియటు యూనియనులోని ప్రతి వ్యక్తికీ సోవియటు ప్రభుత్వం చేయగలిగింది. ఈ ఏర్పాటులకే సోషల్ ఇన్సూరెన్సు అంటారు.

### ని రు ద్యో గ భీ మా.

నేడు పనిలేనివాడు సోవియటు యూనియనులో ఒకడూలేడు. 1930 వరకున్నప్పుడు నిరుద్యోగ కోసం ఈ క్రింది ఏర్పాటులు చేసియుండిరి.

1. పనిలేని కార్మికుని పేరు లేబరు ఎక్స్ఛేంజిలో రిజిష్టరు చేసుకుంటారు. (లేబరు ఎక్స్ఛేంజి అంటే పనిలేనివారికి పనిని చూపించడానికి ప్రయత్నిచే సంస్థ.)

2. ట్రేడు యూనియనులో సభ్యుడుగా ఒక సంవత్సరమయినా ఉండాలి. లేక తానేదో ఒక పరిశ్రమలో పనిచేస్తూ ఉన్నట్లు రుజువైనా చూపాలి. 3 సంవత్సరాలు మొదలు 5 సంవత్సరాలు వరకు పని చేస్తున్నట్లు చూపించాలసి ఉండేది.

3. నిపుణత గల్గిన వర్కర్లకు వారు నివసించే ప్రాంతములో ఇచ్చు జీతాలలో మూడవ వంతు నిరుద్యోగ భృతిగా ఇచ్చేవారు,

కొంచెము నిపుణత గల్గిన కార్మికులకు, ఉన్నత పాఠశాలలో చదివిన వ్యక్తులకు నాల్గవ వంతు ఇచ్చేవారు.

నిపుణత లేనివారికి. మిగిలిన వారికి ఐదవ వంతు ఇచ్చేవారు.

నిపుణత గల వారికి 9 నెలలు, నిపుణత లేనివారికి 6 నెలలు మాత్రమే ఇచ్చేవారు.

అయితే, నిరుద్యోగ కాలములో సైతము, గర్భవతులకు, పసిపాపలకు, రోగ నివారణకు ఇచ్చే మామూలు సహాయము పొందేవారు.

### చనిపోయినపుడు సహాయము.

ఉత్తర క్రియలకయ్యే ఖర్చంతా ఇచ్చేవారు. ఇదిగాక ఒక కార్మికుడు చనిపోతే, అతనిమీద ఆధారపడినవారు ఒకరైతే అతని జీతములో మూడవ వంతునూ, ఇద్దరైతే సగము, ముగ్గురు గాని అంతకన్న ఎక్కువమంది గాని ఆధారపడిన వారున్నట్లయితే ముప్పాతిక ఇచ్చేవారు.

### జబ్బు చేసినపుడు.

కార్మికునికి జబ్బుచేసినా,. లేక ప్రమాదము జరిగినా, లేక తన వృత్తికి సంబంధించిన ఏదో వ్యాధికి గురియైనా, వారు నివసించే స్థలము చుట్టూ అంటువ్యాధులు వ్యాపించి యుండడము వలన పనిలోకి రావీలు లేకపోయినా, తనమీద ఆధారపడిన వారి కెవరికైనా జబ్బు చేయడము వలన తాను వారి శుశ్రూష కోసం ఆగిపోవలసి వచ్చినా, పూర్తిగా టైము రేటు ప్రకారం జీతమంతయు ఇవ్వబడును. అయితే ఆ కార్మికుడు ఒక పరిశ్రమలో కనీసం రెండు నెలల నుండియైనా పనిచేస్తూ ఉండాలి. డాక్టర్లు చెప్పిన ప్రకారము చికిత్స చేసుకోవాలి. ఈ సహాయ భృతి రోజుకు $7\frac{1}{2}$ రుబుల్సుకు నెలకు 180 రుబుల్సుకు మించకూడదు.

### ముసలితనానికి, పని చేయలేక పోయినపుడు.

దీనిని ఆరు భాగాలుగా విభజించారు.

1. ఏమీ పని చేయలేక పోవడమే గాక మరియొకరి సాయము, శుశ్రూష ఎప్పుడూ కావలసిన వ్యక్తులు. గ్రుడ్డివారు, పక్షవాత రోగులు, పడకమీద నుండి లేవనివారు. వీరికి పూర్తి జీతాలు ఇస్తారు.

2. ఏమీ పని చేయలేనివారు. కాని మరియొకరి పరిచర్య అవసరము లేనివారు. కుంటివారు. వీరికి జీతాలలో మూడింట రెండు వంతులు ఇస్తారు.

3. ఏమీ పని చేయలేనివారు. కాని ఎట్టి అంగ వికలము లేనివారు, ముసలివారు. వీరికి వారు ముందు సంపాదించుకొనే దానిలో సగము ఇస్తారు. పురుషులు 25 సంవత్సరాలు పని చేసిన పిదప 60 ఏండ్లు నిండిననూ, స్త్రీలు 20 సంవత్సరాలు పనిచేసి 55 ఏండ్లు నిండిననూ, గనులలో పనిచేసే వారు, 15 సం॥లు పనిచేసి 50 ఏండ్లు నిండిననూ, ముసలివారుగ పరిగణింప బడుదురు.

4,5,6 భాగాలలోనివారు పని చేయగలరు. కాని తాము సహజంగా చేయగల్గినంత చేయలేనివారు. వీరికి తాము ముందు సంపాదించుకునే జీతములో మూడవ వంతు వరకు ఇస్తారు.

ఇది 1927 లో ఉండిన పద్ధతి.

సోషల్ ఇన్సూ్యరెన్సుకోసం సోవియటు ప్రభుత్వము ఈ క్రిందిరీతిని ఖర్చు పెట్టింది.

రుబుల్సులో

| | 1933 లక్షలు | 1937 లక్షలు | 1938 లక్షలు |
|---|---|---|---|
| తాత్కాలికంగా పని చేయలేక పోయిన వారికి | 7318 | 19500 | 21366 |
| గర్భిణీ స్త్రీలకు | 837 | 7856 | 9915 |
| పనిచేస్తూ ఉన్న వర్కర్లకు పెన్షన్లు | 350 | 2684 | 3147 |
| ఇన్సూ్యర్డు చేయబడిన బిడ్డలకు | 989 | 5103 | 6544 |
| విశ్రాంతి గృహాలు సానిటోరియములు | 2380 | 9230 | 10342 |
| పరస్పర సహాయక సంఘాలు | 147 | 920 | 1043 |
| పూర్తిగా పనిచేయలేని వారికి, ముసలి వారికి నిరాధారులకు అంగ వికలులకు | 5545 | 14752 | 16688 (సుమారు) |



సోషలిస్టు సమాజంలోకూడ హెచ్చు తక్కువ జీతాలుంటాయా యని చాల మందికి సందేహము కలుగవచ్చును.

మార్క్సు, ఎంగిల్సు, లెనిను సోషలిజములోగాని, కమ్యూనిజములోగాని అందరికీ ఒకే జీతం ఉంటుంది అని ఎప్పుడూ అనలేదు. అది అసంభవము. న్యాయముకూడాకాదు అని కూడ అన్నారు.

పెట్టుబడిదారీ సమాజములో జీతాలెక్కువ ఇస్తే ఎక్కువ పని చేస్తాము లేకుంటేలేదు, అనే సిద్ధాంతాన్ననుసరించి పనిచేసే కార్మికులు ఆకస్మికంగా సోషలిస్టు ప్రభుత్వం రాగానే తమ స్వభావము మార్చుకుంటారనుకోడం వెర్రితనము. పెట్టుబడిదారీ సమాజంలో పనిచేసే వాడికి తిండిలేదు. పనిచేయక కర్రపెత్తనం చేసేవాడికి అంతాఉంది. సోషలిస్టు ప్రభుత్వం రాగానే ప్రతివానికీ వాడుచేసే పనినిబట్టి ప్రతిఫలమిస్తుంది. దీనివలన ఎక్కువ ఉత్పత్తి చేస్తారు. ఈ ఎక్కువ ఉత్పత్తి స్వేచ్ఛగా చేసేకొందీ, కొత్త ఉత్పత్తి శక్తులను తయారు చేసేకొందీ, మానవ స్వభావము కూడ మారిపోతుంది. సోషలిస్టు ప్రభుత్వంలో ఉత్పత్తి శక్తులన్నీ ప్రభుత్వం చేతులో ఉన్నందున తానెంత ఎక్కువ పని చేస్తే అంత ఎక్కువగా తనకు, సమాజానికి లాభము రావడము చూస్తాడు. అప్పుడు శక్తికొలదీ పనిచేసి, కావలసినమటుకే తీసుకుంటాడు. వస్తు విభజనకు ఇంతకన్న న్యాయమైన సూత్రమేమీ లేదు.

అందరికీ సమానంగా జీతాలిస్తే అది కొన్ని సందర్భాలలో అన్యాయమే అవుతుంది. ఎక్కువ పని చేసేవాడికి ఎక్కువ ఖర్చు అవుతుంది. కాని అతనికి మామూలు ఖర్చులయ్యే మామూలు పనివానికి ఇచ్చినంతే ఇస్తే, తాను ఎక్కువ పనిచేసినా తనకు కావలసిన మటుకుకూడ రానందున అతనికి అన్యాయమే జరుగుతుంది. కేవలము కమ్యూనిస్టు సమాజానికి మొదటి మెట్టయిన సోషలిస్టు సమాజములోలాగ (నేడు సోవియటు యూనియనులో ఉన్నది సోషలిస్టు సమాజమే.) పనిని బట్టి ఇస్తే: ఒక బలహీనుడు తక్కువ పని చేస్తాడు: తక్కువ జీతం వస్తుంది. కాని అతనికి కావలసిన ఆహారము, ప్రత్యేక సౌకర్యాలు లేనందున, అతను బాధ పడుతాడు. మరియొకనికి ఎక్కువ పని చేస్తున్నాడని ఎక్కువ జీతమిస్తే, ఆ జీతం అతని అవసరాలకన్న ఎక్కువయి నిరుపయోగమవుతుంది. అందుచే నిజమగు న్యాయసమాజము కమ్యూనిస్టు సమాజమే. అట్టి సమాజాన్ని స్థాపించడానికి సోవియటు యూనియను ప్రయత్నిస్తూ ఉంది. కాని దానికి ఉత్పత్తి శక్తులు అమితంగా పెరిగిపోవాలి. ఇప్పటికే స్టకోనోవ్ లాంటివారు తమ శక్తికొలది పని చేయడానికి ఉత్పత్తి శక్తులను పెంపొందింప జేయడానికి మొదలుపెట్టారు. కాని సోవియటు యూనియను నేటి సోషలిస్టు సమాజ దశనుండి కమ్యూనిస్టు సమాజ స్థితికి వెళ్ళడానికి ఒక స్టకోనోవ్ చాలడు. వందలకొలది స్టకానోవులు చాలరు; సోవియటు యూనియనులోని ప్రతివ్యక్తి స్టకోనోవులులాగ, అంతకన్న మెరుగుగ తయారుకావాలి; ప్రపంచమందున్న మిగిలిన పెట్టుబడిదారీ దేశాలలో సోషలిస్టు ప్రభుత్వాలు కూడ రావాలి.

# జీవన్ ప్రెస్, తెనాలి.

అందమగు ప్రింటింగు. సరసమగు ధరలకు పెట్టినది పేరు.

## ఆరోగ్యసుధ

సమస్త సెగ సవాయి వ్యాధులకు
20 సంవత్సరములనుండి మా అనుభవములో నున్నది.

సెగవ్యాధులు జీర్ణించుట, సవాయి వ్యాధులు జీర్ణించుట, చర్మదోషములు. మూత్రనాళ్ళము నందలిమంట, మూత్రము సన్నముగ వచ్చుట. కీళ్ళ నొప్పులు, ఉడుకువ్యాధులు, శుక్లనష్టము మొదలగు వానికి దివ్యామృతము.

సుమారు 1 నెలకు 1 తు॥ రు 4-0-0 లు

## స్త్రీసుధ

స్త్రీల సమస్త వ్యాధులకు
20 సంవత్సరములనుండి మా అనుభవములో నున్నది.

మైల సరిగ కాకుండుట, ఋతుశూల, తెలువుబట్ట
మైల అధికముగ ఆగుట మొదలగువానికి
నెలకు 1 తులం రు 3-0-0 లు

**N B:-** ఇంకను 250 రకముల ఔషధములును, మరికొన్ని అనుభూత మందులును, మాచే రచింపబడిన ప్రసిద్ధిములగు ఆయుర్వేద గ్రంధములును మావద్ద దొరకును.

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
## బెజవాడ.

మా అనుభవ మందులకును గ్రంధములకును. ప్రసిద్ధమగు ప్రతిష్ఠాపులోను అడుగవలయును.

## ది మెడికల్ హాల్,
తెనాలి.

హోమియో, ఇంగ్లీషు మందులు
సరసమగు ధరలకు విక్రయించబడును.

## స్త్రీజనామృతము

స్త్రీలవంధ్యత్వము, పోగొట్టుటకు దివ్యముగ పనిచేయు అమృతము. ముట్టునొప్పులు యెంత కాలమునుండి బాధించుండినను నిర్మూలింప గలదు. అధికసంఖ్యాకులగు స్త్రీలకు "తెల్లబట్ట" యనువ్యాధి సహజముగా యేర్పడి, యెన్నోవిధముల ప్రయత్నములు జేసినను విఫలమనోరధులై యుండుట అందరు యెరిగి యున్నదే. అట్టివ్యాధి, స్త్రీలపాలిట మహామ్మారియై, సంతానసిరోధమునుసల్పి, సుష్కింప జేయుచున్నది. అట్టి సర్వబాధలను నివారింప గలది ఒక్క స్త్రీజనామృతము మాత్రమే.

## వెల 2 రూపాయలు

గుణము పొందుటకు యీ వెల పందుచాలును:

## 'ఉరిటి బ్రదర్సు'
వైద్య శాఖ, ఏలూరు.

## గణేశ్ వాచ్ కంపెని
హైక్లాస్ వాచ్ రిపేరర్సు,
బ్రాడీపేట, గుంటూరు.

పనితనమునకు పూచీ: చార్జీలు సరసము!

అన్నిరకములగు గడియారములు మిగుల నమ్మకముగాను, 1 సంవత్సరము గ్యారంటీ [పని చేయనిచో సొమ్ము వాపసు] పద్దతిమీద రిపేరుచేసి నియమిత కాలమునకు యిచ్చెదరనునది గమనించదగిన విషయము.

అనుభవము లేనివారికిచ్చి మీ గడియారములను పాడు చేసికొనకుడు.

**K. S. CHOUDHARY,**
ప్రొప్రయిటర్ అండ్ హైక్లాస్ వాచ్ రిపేరర్

## మంచి హోటలు కోసం

ఎక్కడండీ, ఎక్కడ అంటూ వెదుకుతూ ఉంటారు. స్నాన పాన సౌకర్యాలూ - శుచీ, రుచీ, ఉన్న భోజన పదార్థాలూ, కావాలంటే మా ఆంధ్ర భారతీ భవనం (అరండేల్ సత్రం వద్ద, హిందూస్థాన్ బ్యాంకికి ఎదుట) కు, ఒకసారి విచ్చేయండి. మీకే బోధపడుతుంది.

యల్. వి. యస్, రావు,
ప్రొప్రయిటరు,
ఆంధ్ర భారతీ భవనం,
గవర్నరుపేట. బెజవాడ. బ్రాంచి: గుంటూరు.

## మీకే ఆయుర్వేద మందులు
కావలసినా
## శ్యామలా ఆయుర్వేదిక్ ఫార్మసీ, తెనాలి.

రెండవ కూర్పు — 460 పేజీల గ్రంధము

# వైద్యయోగరత్నావళి

చక్కని అట్టబైండు — ప్రకాశకులు — బ్రహ్మశ్రీ — వెల రు 3—0—0.

## ములుగు రామలింగయ్యాగారు

ప్రొప్రయిటరు ; ది ఇండియన్ మెడికల్ స్టోర్సు, తెనాలి, (గుంటూరు జిల్లా.)

సుప్రసిద్ధములగు 25 ఆయుర్వేద గ్రంధములనుండి సంగ్రహించి G. O., P. H. నెం. 2411 OF 1929 లోను, 1936 సం॥ రివైజుడు లిస్టులోను గవర్నమెంటువారు ప్రకటించిన 266 ఔషధ ప్రకరణములను 40 అనుభవయోగములను సిద్ధపఱుచు విధానమును తెలుపు గ్రంధము,




# ప్రపంచానికి వెలుగునిచ్చే సోవియట్ సాహిత్యం

కామ్రేడ్ తుమ్మల వెంకట రామయ్య

There is no life without books (పుస్తకాలు లేకుండా జీవితమే లేదు) అన్నాడు లెనిన్. సాహిత్యం-ఏ సాహిత్యమైనా కానీయండి-పుస్తకాలు ఎక్కువగా రచించనిది వృద్ధి పొందదు. పుస్తక రచనకు ప్రోత్సాహం - రచించిన పుస్తకాలు అచ్చుపడే అవకాశం—ఈ రెండూ ఉంటేనేగాని నిజమైన సాహిత్యాభివృద్ధికి అవకాశం వుండదు. కాని ఈ ప్రపంచంలో - అంటే ఒక వర్గాన్ని రెండో వర్గం పీడించుకొని తినే ప్రపంచంలో - ఎంత మందికి విద్యాభ్యాసానికి అవకాశం ఉంది? విద్యాభ్యాసానికి అవకాశం ఉన్నా, గ్రంధ రచనకు ఎంత అవకాశం ఉంది? ఎంతో నాగరికత గలదేశం అని పిలువబడే బ్రిటన్‌లో, బెర్నార్డుషా "సీవా! నీవా!" అంటూ మొదటి రోజుల్లో తన వ్రాత ప్రతులను బట్టుకొని తిరగాలసిన గతి పట్టింది.

ఇక విప్లవానికి పూర్వం రష్యా సంగతి చెప్పవలెనా? జారు చక్రవర్తుల పరిపాలనలో, 100 కి 80 మందికి విద్యయే లేదు. పైగా, అల్ప సంఖ్యాకులగు జాతుల భాషకు ప్రోత్సాహము బదులు అణచుటే ఎక్కువయింది. నాటి రష్యా తన క్రిందనున్న బానిస జాతుల భాషను స్కూళ్ళలో ఉపయోగించు కొననీయ లేదు. వారు మూర్ఖులని, దొంగలని, నీచులని, ఏమేమో అన్నది. కొన్ని జాతులకు లిపి కూడ లేదు. అట్టి పరిస్థితులలో సారస్వతం సంపూర్ణ వికాసం పొందే అవకాశం ఎక్కడిది?

## సాహిత్యాభివృద్ధికి అవకాశాలు

విప్లవానికి పూర్వపు పరిస్థితులకు, నేటి పరిస్థితులకు వ్యత్యాసం ఇంత అని చెప్పడానికి వీలులేదు. నేడన్ని జాతులకు స్వాతంత్రం-విద్య-లిపి-విజ్ఞానం ఈయబడింది. ఇది వరకు లిపియే లేని జాతులకు నేడు లిపి కల్పింపబడింది. సారస్వతము పెరిగింది. రష్యా నేడు సోవియట్ యూనియన్‌గా మారింది. 11 రిపబ్లికులు-ఎన్నో భాషలు-సోవియట్ యూనియన్‌ను ఒక దేశం అనడం కన్నా ఒక ఖండం అనాలి. ప్రపంచంలోని ఆరవ భాగమైన సోవియట్ యూనియన్‌లో నేడు నూటికి 98 మందికి విద్య గరిపేందుకు ప్రయత్నించి జయించినపుడు సాహిత్యం వృద్ధిపొందక ఏమవుతుంది?

ఇంతేగాదు. తక్కిన ధనిక దేశాలలో లాగా రచయిత తన జీవితం కోసం వెదుక్కోనక్కర లేదు. తన రచనకు కావలసిన విజ్ఞాన సంపత్తికి కొదువలేదు. తన రచన అచ్చు పడదనే భయంలేదు. తన రచనతో పోటీ వచ్చి, తన నోట్లో ఎవడు దుమ్ము కొడతాడో అనే భయం లేదు. ప్రభుత్వం ఏమంటుందో, పరిపాలక వర్గం ఏమనుకొంటుందో అని భయపడాలసిన అవసరంలేదు. నేటి రష్యన్ రచయిత స్వతంత్రుడు. సుఖజీవి-ఇక సాహిత్యానికేంకొదువ?

సాహిత్యానికి సోవియట్ యూనియన్ ఎంత విలువ ఇస్తుందో చూడండి. పుస్తకాలు చౌకగా, అందరికీ అందుబాటులో ఉండేటట్లు చేస్తుంది. కొనుక్కోలేని వారికి అందుబాటుగా లైబ్రరీలు ఉంటాయి. ఈ లైబ్రరీలు కూడా ఎంతో దూరానగాక, వారు పనిచేసే పరిశ్రమాలయాలలోను, వ్యవసాయ క్షేత్రాలలోను, ఆఫీసులలోను దగ్గరగా ఉంటాయి. ఉత్తమ సాహిత్యాన్ని, ఏరాజునో, ఏ ప్రభువునో "నీవు ఇంద్రుడవు! చంద్రుడవు!!" అనకుండానే ప్రచురించి గౌరవిస్తుంది ప్రభుత్వం. "వెబ్" దంపతుల లెక్క ప్రకారం, 1932 లో సోవియట్ యూనియన్ 55 వేల రకాల పుస్తకాలు ప్రచురించింది. మొత్తము ప్రచురించిన పుస్తకాలు, 1000 లక్షలు. తక్కిన ప్రపంచమంతా ఎన్ని గ్రంధాలు అచ్చు వేయించిందో అన్ని పుస్తకాలు ఒక్క సోవియట్ యూనియనే అచ్చు వేసింది. ఈ గ్రంధాలను క్రింది విధంగా విభజించవచ్చు. (1) స్కూళ్ళ పుస్తకాలు (2) ఫ్యాక్టరీ ఇనస్ట్రక్టివ్ పుస్తకాలు (3) చౌకరకపు కరపత్రాలు (రాజకీయ నాయకుల ఉపన్యాసాలు) (4) సాహిత్య రచనలు.

గత 100 సంవత్సరాల నుండి నేటివరకు అంటే పుష్కిన్ మొదలుకొని టాల్‌స్టాయ్ వరకు, గల సాహిత్య వీరుల రచనల నన్నింటినీ (కలెక్టెడ్ వర్క్సు) సమకాలిక కవుల కధకుల, నాటక కర్తల, రచనలకు కలిపి, సోవియట్ యూనియన్ భాష లన్నిటిలోను ప్రచురించారు. ఇవి కొద్దిమాత్రమే. కాని ఇతర దేశాలకంటె ఎక్కువే.

ఇంకా ఇతర దేశాలలోని ముఖ్య గ్రంధాల అనువాదాలెన్నో ప్రచురింపబడినయి. ఇంగ్లీషు జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్ కవుల గ్రంధాలెన్నో అనువదించబడినవి. డాంటీ, చాసర్, షేక్స్పియర్, వాల్టయిర్, బాల్జాక్, ఫ్లాబర్టు, గెధే, డికెన్సు మొదలుకొని నేటి బ్రిటిష్ అమెరికన్ ఆధునిక నవలా రచయితల రచనలు అనువదించ బడినయి.

పుస్తకాలన్నీ చౌక. ఎన్నో వర్ణ చిత్రాలున్నవి సైతం, కలెక్టడ్ వర్క్సు (గ్రంధ సంపుటి) సైతం చౌక. ఒకొక్క వాల్యూం ఒక్క రుబుల్‌క్కూడా ఇస్తారు. ఇవిగాక అన్ని శాఖలలోను లైబ్రరీలున్నాయి. 1935 లో 50 వేల లైబ్రరీలు చిన్నవీ పెద్దవీ కలిసిఉన్నాయి.

నేడు 30 ఏండ్ల లోపలి ప్రతి సోవియట్ పౌరుడూ, పుస్తకాలంటే పడి చస్తున్నాడు. ఇట్టి అఖండ సాహిత్య సంపత్తుగల దేశంలో సాహిత్యం ఎందుకు వృద్ధి పొందదు? ఇంత వరకు సోవియట్ సాహిత్యం విశాలాభివృద్ధి పొందడానికిగల అవకాశాలనే చర్చించాం. ఇక సోవియట్ సాహిత్యం వివిధ దశలలో ఎలా వృద్ధిపొందుతూ వచ్చిందో, నేటి సోవియట్ సాహిత్యానికి, ఇతర సాహిత్యాలకుగల భేదం ఏమిటో విచారించుదాం.

# విప్లవానికి పూర్వం

సోవియటు యూనియన్ అటు యూరప్ ఖండంలోను, ఇటు ఆసియా ఖండంలోనూ ఉంది. అందుచేత ఇటు పాశ్చాత్యులు, అటు ప్రాచ్య దేశస్థులు మాటి మాటికి దండెత్తుతూ వచ్చారు. మంగోలీలు, నెపోలియన్ సైన్యాలు, పోలిష్ సైన్యాలు, ట్యూటన్ ప్రభువులు, స్వీడిషు సైనిక దళాలు రష్యాపై దండెత్తి వచ్చాయి. ఎన్నో యుద్ధాలు జరిగాయి. కాని రష్యా స్వాతంత్ర్యము నశించలేదు. ఇంతేగాక జారు ప్రభువుల దుష్పరిపాలన, విజ్ఞానాన్ని నాశనం చేయడం, బుద్ధి హీనతకూడా రష్యన్ సాహిత్యంలో ప్రముఖుల సృష్టికి అంతగా అడ్డురాలేకపోయింది. సాంఘిక న్యాయము, మానవత్వం, ఉదాశయాలు గల కవులు పుట్టక పోలేదు. వారు, రాడిష్‌చెవ్, చెర్నీషెవ్స్కీ, హెర్జెన్, బెలిన్స్కీ, దోబ్రోల్ యూబవ్, స్చెడ్రిన్, నెక్రాసవ్, గోర్కీలు, పుష్కిన్‌కి, మాయాకోవ్‌స్కీకి మధ్య ఒక శతాబ్దం భేదం ఉన్నా వీరిద్దరూ కూడా సాంఘిక న్యాయం, మానవ ప్రేమ కలవారే. విప్లవానికి పూర్వం, పుష్కిన్, టాలస్టాయ్, గోర్కీల లాంటి రచయితను కల్గడం రష్యన్ సాహిత్య ప్రతిభను తెల్పుతుంది. అయినా సోషలిస్టు విప్లవానికి పూర్వం సాహిత్యం ఎంత అభివృద్ధి పొందాలో అంత అభివృద్ధి పొందలేదనే చెప్పవచ్చు, పైగా ఆ సాహిత్యానికి నేటి సాహిత్యానికి హస్తిమశకాంతర భేదం ఉంది. విప్లవానికి పూర్వం, టర్జినీవ్, డాస్టవిస్కీలు శిక్షలకు పాత్రులయ్యారు. ఇంకా ఎంతమంది పేదరికంతో కృశించారో!

విప్లవ పూర్వ సాహిత్యం ఎక్కువగా భౌతికాతీతమైన విషయాలతోను అమరత్వాన్ని గూర్చిన సమస్యలతోను నిండియుండేది. అసాధ్యమైన వాటిని గురించి కలలు గనడం, కాలానికి, స్థలానికి దూరంగావడం పూర్వ సాహిత్యంలోని ఒక దుర్గుణం. అసత్యమైన, మందమతుల 'ఐడిలిజం' (భావవాదం, లేక ఆదర్శవాదం) కోసం పాకులాడుట వుండేది. ఆ సాహిత్యమంతా పరిపాలకులను సమర్థించేది. రాజ్యమేలే వర్గాల క్షేమాన్ని కోరేది. లేదా పెసిమిజం (నిరాశావాదం) ప్రబలియుండేది. నిరాశ, భవిష్యత్‌లో అపనమ్మకం, మానవత్వంపై అవిశ్వాసం హెచ్చుగా ఉండేది.



రాడిష్‌చెవ్



చెర్నీషెవిస్కీ

ఆ రోజుల్లో కధానాయకుడు (Hero) ఒక రాజు—ఒక ప్రభువు—బూర్జువా—మేధావి—లేక వ్యక్తిత్వవాది (ఇండి.విడ్యుయలిస్టు)యో అయి ఉండేవాడు. అలగ్జాండర్ బ్లాక తాను 20 ఏండ్ల ప్రాయాన Living corpse (బ్రతికియున్న శవం)గా నున్నానని చెప్పుకొన్నాడు. ఇదిచాలు నాటి రష్యన్ రచయితల స్థితి చెప్పడానికి.

## నేటి సాహిత్యం యొక్క ఉద్దేశ్యం

నేటి సోవియట్ సాహిత్యం ప్రతిభావంతమైంది. అనేక రకాల సాహిత్యం అభివృద్ధి చెందడమే గాక సోవియట్ సాహిత్యం పూర్వపు సాహిత్యానితోనే గాక నేటి బూర్జువా (పెట్టుబడిదారీ) దేశ సాహిత్యాలతో విభేదించుతుంది. నేటి సోవియట్ సాహిత్యం అందరాని పళ్ళకు అర్రులు చాచడం లేదు. స్పష్టమైన, ఆదరణ యోగ్యమైన, నిర్ణీతమైన సమస్యల పరిష్కరించడమే నేటి సాహిత్యం పని. నేడు సోవియట్ సాహిత్యం స్వర్గం వంక, ఆకాశం వంక, శూన్యం వంక చూడటం లేదు. స్వర్గాన్నుండి నడివీధిలోకి లాగారు ఆదర్శాలను. ఎదురుగా కళ్ళకు కన్పడే మానవుల్లోని అంతరంగిక శక్తివైపుకు త్రిప్పారు సాహిత్యాన్ని. పూర్వపు 'హిరోయిజం' (శౌర్యం)కు అర్థం పోయింది. పూర్వపు విషాదాంతాలకు అర్థం పోయింది. నేడు ప్రశ్న ఎలా ఉండాలి? అని కలలు గనడం కాదు, ఇపుడేమి చెయ్యాలి అన్నదే ప్రశ్న. 'నేను—నా వ్యక్తిత్వం' గాదు ప్రధానం. "మనము—మన వ్యక్తిత్వం" అన్నది ప్రధానం. సోవియట్ యూనియనులో జరిగిన మార్పు—జరుగుచున్న మార్పు అపాయముగా కన్పింపవచ్చు. కాని ఆశ ఉంది. భవిష్యత్తున్నది. ఫలితమున్నది.

## సోషలిస్టు రియలిజం

నేటి సోవియట్ సాహిత్యం 'రియలిజం'. (వాస్తవికత, మిధ్యకానిది) అయితే 19 వ శతాబ్దంలోని "రియలిజం"కు దీనికి భేదం ఉంది ఆ "రియలిజం" ప్రబోధించిన వారలందరూ సంఘంలోని, జీవితంలోని, లోపాలను, కష్టాలను బయటపెట్టారు. కాని దానికి మందు చెప్పలేదు. ఇలాచేస్తే ఈ లోపం పూర్తి అవుతుందనే "పాజిటివ్" సలహా ఇవ్వలేకపోయారు. నేటి సోవియట్ రచయితలు సాంఘిక లోపాలను గుర్తించడమే గాదు. సిర్మాతలు. ఒక నూతన మానవత్వాన్ని, యుగాన్ని, సృష్టిస్తున్నారు. సోవియట్ యూనియన్‌లోని సాహిత్యమంతా "సోషలిస్టు రియలిజం" పైనే ఆధారపడి వుంది. ఇదే బూర్జువా, సోషలిస్టు "రియాలిజా"లకు గల భేదం. విప్లవాభివృద్ధిని తెలియజేసే సత్యమైన, ఛారిత్ర్యాత్మకమైన, ఖచ్చితమైన, 'సోషలిస్టు రియలిజం'. శ్రామిక వర్గాన్ని సోషలిస్టు దృక్పధానికి తయారు చేస్తుంది. సోవియట్ సాహిత్యము యొక్క నిర్మాణ సిద్ధాంతానికి పునాది అవుతున్నది. నేడు సోవియట్ గ్రంధాలలోని వీరులు, రాజులు మహారాజులు గాదు; సేనాధిపతులు, దోపిడి గాండ్రునూ కాదు; ఒక రాణిని ప్రేమించి యుద్ధంచేసే మరొక వీరాధివీర పురుషుడూ కాదు. స్టాలిన్ చెప్పినట్లు "These heroes and creators of new life" (నూతన జీవితాన్ని సృష్టించే వీరులు-అంటే శ్రామిక వర్గం) సోవియట్ సాహిత్యంలో ప్రధాన పాత్ర వహించుతారు. మానవ చైతన్యాన్నే మార్పుచేసే పోరాటంలో పాల్గొనటమే సోవియట్ రచయితల పని. ప్రాత బంధాలను తెగగొట్టి, నూతన సృష్టి కల్పించుటే సోవియట్ రచయితల పని. అందుకనే స్టాలిన్ "Writers are engineers of the Soul" (రచయితలు ఆత్మయొక్క ఇంజనీర్లు) అని అన్నాడు. "సోషలిస్టు రియలిజం" పాఠకుని ఊహను గ్రహించి చిత్రించుతూ, విప్లవాభివృద్ధి యొక్క వాస్తవికతను తెలియజేస్తుంది. పోరాటానికి, సోషలిస్టు నిర్మాణానికి పాఠకుని ఉత్తేజితుల గావించుతుంది. ఇదే సోషలిస్టు రియలిజం. ఇందుచేత సోవియట్ రచయితలకు స్వాతంత్ర్యం లేదనిగాని, రచయిత లందరూ గాడికి కట్టిన ఎద్దులలాగ ఒకే రీతిని ఉంటారనిగాని అనుకోడం పొరపాటు.

నేటి బూర్జువా రచయిత పరిస్థితు లేమిటి?

**The freedom of bourgeois writer, artist, and actor is nothing but disgusted (or hypocratical) dependence on money, bribes, and on patronage - Lenin**

[బూర్జువా రచయిత, ఆర్టిస్టు, నటునియొక్క స్వాతంత్ర్యం డబ్బు, లంచం, ఒకరి దయా ధర్మాల మీద అసహ్యకరంగా ఆధారపడి ఉండుట తప్ప మరేమీ లేదు—లెనిన్] కేపిటలిస్టు ప్రపంచంలో సరియైన నాగరికత అంతా నశిస్తుంటే, ఫేసిస్టు ముష్కర పరిపాలన క్రింద కళ, విజ్ఞానాలు మాసిపోతుంటే ఒక్క సోవియట్ యూనియన్ విజయవంతంగా సాగిపోతున్నది.

## సాహిత్య చరిత్ర

రష్యాలో 19వ శతాబ్దానికి పూర్వం అంతగా సాహిత్యం లేదనే చెప్పాలి. ఉన్నా అనుకర



పుష్కిన్

ణాలే తప్ప స్వతంత్రమైన జాతీయ సాహిత్యం సున్న. ఉదాహరణకు "చిన్నికధను" తీసికొంటే, క్రిలాఫ్ చిన్న కధలు ఎంతో బాగున్నా, అవి "యీసప్‌ఫేబిల్సు"కు అనుకరణాలే. పుష్కిన్‌తో చిన్నకధ ప్రారంభమవుతుంది. రష్యాలో చిన్న కధను బాగా గుర్తించారు. విప్లవానికి పూర్వం, తర్వాతనూ చిన్నకధ తన స్థానంనుండి పడిపోలేదు. సోవియట్ సాహిత్యాన్ని ఈ క్రింది విధంగా విభజింపవచ్చు. (1) క్లాసికల్ పిరియడ్ (పురాణ యుగం) (2) డెవలప్‌మెంటు పిరియడ్ (అభివృద్ధి యుగం) (3) విప్లవ పూర్వ యుగం. (4) విప్లవ యుగం, నిర్మాణ యుగం.

(1) క్లాసికల్ పిరియడ్‌లో లెక్కింపదగిన రచయితలో: పుష్కిన్, గోగల్, డాస్టవిస్కీ, టర్జనీవ్, లెర్మొంటవ్

(2) అభివృద్ధి యుగంలో ఎన్నదగిన రచయితలు: టాలస్టాయ్, చెకావ్, కుప్రిన్, సోలోగబ్, బర్నిన్.

(3) విప్లవ పూర్వ యుగంలోని ముఖ్య రచయితలు: గోర్కీ, చెలీ, వెరిసాయెవ్, సెర్జీయట్, నెస్కీ మొదలగువారు.

(4) విప్లవానంతరము, నిర్మాణ యుగంలోను పేరు పొందినవారు రోమనాఫ్, ఫిల్నియక్, జోషెంకో, కాటాయెల్, షాలోకోవ్ పాన్‌ఫెరెవ్, అడయాంకో మొదలగు యువకులు.

విప్లవానంతరము పెంపొందిన నేటి ఉత్తమ సాహిత్యాన్ని గురించి చెప్పేముందు సోవియట్ సాహిత్యంలో టాల్‌స్టాయ్ - మాక్సిం గోర్కీల పాత్రలను వివరించాలి.

## గోర్కీ—టాల్‌స్టాయ్

మార్క్సు, బూర్జువా సాహిత్యాన్ని ఆనందించి, షేక్‌స్పియర్, గథే, డాంటీ మొదలగు రచనల చదివాడని, నేటి మార్క్సిస్టులు మాత్రం బూర్జువా విజ్ఞానాన్ని త్రోసిపుచ్చుతున్నారని బూర్జువా రచయితలు ప్రచారం చేయ సాగారు. నిజమే! మార్క్సు ఆ రోజుల్లోని సాహిత్యాన్ని ఆనందించాడు. అలాగే, లెనిన్ పుష్కిన్, టాల్‌స్టాయ్‌ల రచనల చదివి ఆనందించాడు. కాని అంత మాత్రాన, బూర్జువా సాహిత్యమే విజ్ఞానం అని వారు చెప్పలేదు. అదయినా ఎందుకు హర్షించారు? 18 వ శతాబ్దపు కవుల రచనల యెడల ఎందుకు హర్షము చూపారు?



గోర్కీ

అప్పుడప్పుడే దేశంలో మెటీరిలియజం (భౌతిక వాదం), నాస్తిక వాదం, రియలిజం పెరుగజొచ్చింది. పూర్వపు దానికన్న ఇది 'ప్రొగ్రెసివ్' (అభివృద్ధి కరమైనది) కాబట్టి హర్షించారు. కాని ఎవరుకూడా మార్క్సు జర్మన్ 'రొమాంటిక్' కవులను హర్షించినట్లు చూపెట్టలేరు. అలాగే టాల్‌స్టాయ్ పుష్కిన్ల గురించి లెనిన్ హర్షించాడు. పుష్కిన్‌లోకూడా ఎంత వరకు అభివృద్ధి ఉన్నదో అంతవరకు మార్కిస్టులు హర్షించారు.

టాల్‌స్టాయ్ రష్యన్ సాహిత్యానికి ఎంతో ప్రఖ్యాతి తెచ్చాడు. నిజమే. అతని రచనలలో రష్యన్ జీవితాన్ని అద్భుతంగా చిత్రించడమే గాదు. ప్రపంచ సాహిత్యంలో కూడ ఉన్నత స్థానాన్ని పొందగల్గాడు. కాని అతని రచనలలో క్రీస్తు పేరిట భూస్వామి వీర కిరీటం ఒక ప్రక్క ధరిస్తున్నాడు. మరో ప్రక్క దోపిడి చేసే కేపిటలిస్టు సమాజాన్ని గురించి తీవ్ర విమర్శన ఉన్నది. ధన సంపదను గురించి, బాధలతో నలిగిపోయే ప్రజా సామాన్యపు దుర్భర స్థితిని గురించి ఉన్నది. మరియొక ప్రక్క "చెడుగును ప్రతిఘటించ వలదు" **(non-resistance to evil)** అనే మెట్ట వేదాంతం ఉన్నది. కాని అంతర్విభేదాలు, ఆ అభిప్రాయాలు టాల్‌స్టాయ్ ద్వారా వెల్లడి కావడం ఏదో హఠాత్తుగా పుట్టుకరావడం వల్ల కాదు. అవి ఆనాటి సంఘంలోని అంతర్విభేదాలను తెలియజేస్తవి. 19 వ శతాబ్దపు చివరి భాగంలోని సాంఘిక స్థితిగతుల స్వరూపాన్ని చిత్రించుతవి.

టాల్‌స్టాయ్‌లో పెరిగి పెరిగి ప్రోగయిన ద్వేషం కన్పిస్తుంది. మంచి జీవితం కోసం తహతహలాడే పరిపక్వ దశ కన్పించుతుంది. గతాన్నంతా త్రోసిపుచ్చాలనే కోర్కె కూడ కన్పించుతుంది. అపరిపక్వదశ, కలలుగంటూ ధ్యానించడం, రాజకీయంగా అనుభవం లేకపోవడం, పటుత్వంలేని విప్లవ గ్రామజీవనం, టాల్‌స్టాయ్‌లో ప్రతిబింబించు చున్నయి.

రష్యన్ ఫ్యూడలిజంయొక్క శిథిలావస్థ, రాజాధి రాజుల పతనం టాల్‌స్టాయ్ సిద్ధాంతాలుగా మారాయి. భ్రాతృత్వం, సమానత అని ఎన్ని బోధించినా టాల్‌స్టాయ్ ఇండివిడ్యువలిస్టే. అతని వేదాంతం, నూతన సాంఘిక విధానపు పుట్టుకను ప్రతిబింబించ లేదు. ప్రాత సంఘపు పతనాన్నే ప్రతిబింబించింది. కళను గ్రహించ గల బుద్ధి. వివేచనా శక్తిగల టాల్‌స్టాయ్ కళను, విజ్ఞానాన్ని విసర్జించుతాడు. కాని గోర్కీయో?

గోర్కీ సాధారణమైన కార్మికుడు. చదువుకు తహతహ లాడాడు. విజ్ఞానం కోసం దప్పికగొన్నాడు. రాత్రింబవళ్ళు పుస్తకాలు చదివి. తనకు తానే విద్యావంతు డయాడు. సాహిత్యాన్ని రచించాడు. ప్రొలిటేరియన్ కల్చరల్ రివల్యూషన్‌కు (శ్రామిక నాగరిక విప్లవానికి) నాయకుడయాడు.

గోర్కీ రష్యన్ విప్లవం వచ్చేసరికే 50 ఏండ్ల ప్రాయపువాడు. అతని రచన ప్రారంభం నుండీ క్రొత్తధోరణి త్రొక్కింది. విప్లవం వల్లనేగాక విప్లవానికి పూర్వమూ అతని ప్రతిభ హెచ్చింది. రష్యాలో విప్లవ శ్రామిక వర్గ ఉద్యమం ప్రారంభ మయినపుడే గోర్కీ రచన కూడ ప్రారంభమయింది. ఆ రోజుల్లో సాహిత్యం ప్రభువుల చేతులలో, బూర్జువా చేతులలోనూ ఉంది. కాని గోర్కీ ఎదురీత ఈదాడు. సాహిత్య వీధిలో కార్మిక పతాకాన్ని మొదట ఎగరవేసింది గోర్కీయే. కార్మికుని 'హీరో'గా చేసింది గోర్కీయే. టాల్‌స్టాయ్, చెకావ్ కోరోలెంకో బ్రదికియున్నారు. డాస్టవిస్కీ. పేరు ప్రతిష్ఠలు, ప్రభావం, సాహిత్యంపైన ఎక్కువగా ఉన్నాయి. "సింబాలిస్టు"లు "ఫేషన్‌బుగ్"గా తిరుగుతన్నారు. అలాంటి రోజుల్లో గోర్కీ వచ్చాడు.

డాస్టవిస్కీ "నమ్రతగా ఉండు" **(Be humble Proud Man)** అని బోధించాడు. టాల్‌స్టాయ్ 'చెడును ప్రతిఘటించుటకు దౌర్జన్యం వలదని' బోధించాడు. చెకావ్ 'వినయమే విజ్ఞానమని' బొమికలు విరగగొట్టుకు పనిచేసే శ్రామికులకు చెప్పాడు.

కాని, గోర్కీ ఆ లొంగుబాటు వినయాలను సాంఘిక పోరాటాన్నుండి తప్పించుక పొయ్యే కవిత్వ పలాయనంను, బోధించక తిరస్కరించాడు. స్వాతంత్ర్య వీరులను, సృష్టించే శక్తి గల కార్మిక వర్గాన్ని, ప్రపంచ దాస్యవిమోచకులను, ఉత్సాహించాడు. 1903 లోనే 'జ్ఞాన్యే'అనే పత్రిక స్థాపించి, విప్లవ రచయితలను ప్రోగు చేశాడు. 1904—1905 లో కొంతమంది విప్లవ ప్రతిఘాతక ముఠాలో చేరారు, కాని గోర్కీ నిరుత్సాహ పడలేదు. బూర్జువా విమర్శకులలో నిరాశా వాదం, భగవంతుని కోసం ప్రాకులాడటం, గొప్ప సాహిత్యంగా ఎంచబడుతున్న సమయంలో, గోర్కీ "మదర్" అనే నవల వ్రాశాడు. "ఎనిమీస్" (శత్రువులు) అనేడ్రామా వ్రాశాడు. వాటిలో బానిసలైన కార్మికు లేవిధముగా విప్లవ కార్మికు లవుతున్నారో తెలిపాడు.

గోర్కీ ఒక్క రచయిత మాత్రమే గాదు. ప్రచారకుడు కూడా. "కళ వేరు. విప్లవం వేరు" అనే వాదన ఒకటి రష్యన్ రచయితలలో ఒకప్పుడు ప్రబలింది. నవంబరు విప్లవ సమయంలో కొందరు "మేం కవులము. రచయితలం. మాపని జీవితాన్ని పరిశీలించుతూ, భావనాశక్తి నుపయోగించి వ్రాయడం. విప్లవం అంటే కార్యాచరణ కాని పరిశీలించుట కాదు. కాబట్టి రచనా శక్తి విప్లవానికి దూరంగా ఉన్నపుడే కల్గుతుంది." అని అన్నారు. అంతేగాదు ఇంకా కొంత ముందుకు సాగి "కళ ఒక్క శాంతి సమయంలో విజృంభించుతుంది" అని కూడా అన్నారు. ఇలాంటి వాదాన్ని గోర్కీ నిరసించి తీవ్రమైన ప్రచారం గావించాడు.

"ఫోమా గోర్డియెవ్, త్రీ" మొదలగు రచనలతో పై వాదనలో అర్థం లేదని ఋజువు చేశాడు. ఎన్నో వ్యాసాలే గాక, విప్లవ సమయంలో "ది ఆర్టామనావ్ బిజినెస్" "లైఫ్ ఆఫ్ క్లిమ్ సామ్గున్" అను ఉత్తమ రచనల రచించి పై వాదనను ఖండించాడు. వీటితో విప్లవానికి పూర్వపు రష్యాను చిత్రించాడు. తక్కిన దేశాలలోని ప్రఖ్యాత కవులు కొందరు 'కేపిటలిజం'ను సంస్కరింప దలచితే, గోర్కీ కేపిటలిస్టు విధానం నాశనం చేసి, సోషలిస్టు సమాజ నిర్మాణానికి తోడ్పడ్డాడు. 1861 నుండి రష్యన్ శ్రామికవర్గ విప్లవ చిత్రాన్ని కన్పరచాడు తన రచనలలో.

గోర్కీ ఆధునిక రచనలు గురించి తర్వాత చూద్దాం. గోర్కీ ఒక రచయిత మాత్రమే కాదు అని చెప్పడానికి అనేక ఉదాహరణ లున్నాయి. అతడు సాహిత్య విమర్శకుడు-గురువు-నాయకుడు. సోవియట్ యూనియన్లో ఒకసారి అత్ని వ్యంగ చిత్రం వేశారు. గోర్కీని కోడి పెట్టగాను, చుట్టూ కోడి పిల్లలను చిత్రించారు, పిల్లలన్నీ ఆధునిక సోవియట్ కవులు. వారి రచన లెన్నో విదేశ భాషలలోకి తర్జుమా అయి ప్రఖ్యాతిగన్న వారే. ఈ వ్యంగ చిత్రమే తెల్పుతుంది గోర్కీకి సోవియట్ సాహిత్యంలో గల స్థానం.

విప్లవ చరిత్రలను, అనుభవాలను ఎన్నో సంగ్రహింప జేశాడు. సివిల్‌వార్ చరిత్ర, ఫ్యాక్టరీ కార్మికుల అనుభవాలు, యువకుల చరిత్ర, ఇలాంటివే ఎన్నో జీవిత చరిత్రలను ప్రోపు చేయించి ప్రచురింపజేశాడు. ఇతని సంపాదకత్వాన ఎన్నో పత్రికలు వెల్లువడటంలో ఆశ్చర్యమే లేదు.

గోర్కీ—వ్యాసకర్త, నవలా కారుడు—నాటక కర్త—విమర్శకుడు—గురువు — ఇంకా అతన్ని గురించి ఏమనాలి?—

గోర్కీ చివర రోజులలోని సాహిత్యం ఎంతో ప్రతిభావంతమైనది. ఇతన్ని ఈ రచనలను వాల్టయిర్. హ్యూగో, టాల్‌స్టాయ్‌లతో పోల్చవచ్చును. కాని ఒక్క భేదం మాత్రం ఉంటుంది. వాల్టయిర్, హ్యూగో, టాల్‌స్టాయ్ రచనలలో నిస్సహాయతాక్రందనం కన్పడుతుంది. అలవికానిబాధ, కన్పించుతుంది. కాని జీవితంలో ఘోరాలను నాశనం చేయగల సత్తువ వాటిలోలేదు. ఇక గోర్కీ రచనలా? పాత ప్రపంచంలోని అన్యాయాల్ని, అక్రమాలను, ఘోరాల్ని రూపుమాపే మరణ శిక్షలు. ఇదే వీరికి గల భేదం.

## ఆధునిక సాహిత్యం

విప్లవం రష్యన్ రచయితలలో అనేక మార్పులు తీసుక వచ్చింది. 'జగత్‌మిధ్య' **(The cosmic absurdity of Existance)** అనే వాదాన్ని ప్రబోధించే 'సోలోగబ్' మారిపోయాడు. "జీవితంయొక్క ఉద్దేశ్యం" ఏమిటి అని తర్క వితర్కాలు గావించే మేధావులు క్రమేణా 'రియలిజం' యొక్క ఆవశ్యకత గుర్తించారు. కాని మొట్ట మొదటి రోజుల్లో వారి భావాలు వింతగా ఉండేయి.

బ్లాక్, బీలీ, మొదలగు 'సింబాలిస్టు'లు బోల్షివిక్ విజయాన్ని గురించీ, రెడ్ ఆర్మీని గురించి కవిత్వం వ్రాశారు. బ్లాక్, రెడ్ ఆర్మీలోని కొంతభాగాన్ని 'క్రీస్తు ప్రవక్త'లగా సృష్టించాడు. **"Crist is risen"** అనే దానిలోకూడ తన దేశపు బాధలు వర్ణిస్తూ మళ్లా 'క్రీస్తు పునరవతారం' రష్యాలో జరుగుతుందని వ్రాశాడు. కాని బోల్షివిక్‌లే అవతరించి ప్రజల కష్టాల నీడేర్చారని ఇతడు తెలుసుకొనక ముందే చనిపోయాడు. వీరి తర్వాత ప్రపంచ యుద్ధానికి పూర్వము నుండే ఉన్న 'ఫ్యూచరిస్టులు' బయలు దేరారు. వీరి నాయకుడు 'మాయకోవిస్కీ'. వీరు 'సింబాలిస్టు'లను ఎదుర్కొని, గ్రామ్య భాషలోను, వార్తా పత్రికల భాషలలోను వ్రాయ మొదలుబెట్టారు. వీరు వ్రాసిన విషయాలనుకూడా, ఆహారసప్లయి, బ్రైనా విప్లవం రొట్టెల ధరలు, అంతర్జాతీయ వార్తలు, మొదలైన వాటి మీదనే వ్రాసేవారు.



మాయకోవిస్కీ

వీరినే 'లెఫ్టిస్టు'లని కూడా అనేవారు. వీరి వాదన, నవలలు, కథలు, మొదలైనవి పనికి రావని. కథలు, నవలలు, టాల్‌స్టాయ్, టర్జినీవ్‌లవంటి రాచ ప్రభువులూ, బాల్జాక్ వంటి బూర్జువా వ్రాయవలసిందే కాని శ్రామిక వర్గానికి అవసరం లేదన్నారు. వీరికి వ్యతిరేకంగా వ్యాసాలు **(Essay)** రచించడం పనికి రాదని, ఆర్ట్‌కీ దానికి సంబంధం లేదని, ఊరికే లెక్కలు మొదలైనవి మాత్రం వ్యాసాలలో వ్రాయాలని మరో ఉద్యమం బయలుదేరింది. హానికరమైన ఈ రెండు ఉద్యమాలను కూడా గోర్కీ మొదలగు వారు తీవ్రంగా విమర్శించి ఆక్షేపించారు.

వీరి తర్వాత 1920-21 లో ప్రోలీకల్ట్, ఉద్యమం బయలుదేరింది. 'ప్రోలీకల్ట్' అంటే ప్రోలిటేరియన్ కల్చర్ అని అర్థం. ఈ ఉద్యమ నాయకులు ఒక్కసారి సాహిత్యాన్ని 'ప్రోలిటేరియనైజ్' చేయాలన్నారు. అందుకు వీరవలంబించే మార్గం కూడా విచిత్రమే. "దీనిలో వర్గ కలహం ఉందా లేదా" పరీక్ష చేయడం, లేకపోతే ఆ సాహిత్యాన్ని త్రోసివేయడం. దీనిని బట్టి పూర్వ సాహిత్యాన్నంతా సర్వ నాశనం చేసి ఒక్క దెబ్బన 'ప్రోలిటేరియన్ సాహిత్యాన్ని' ఆకాశం మీద నుంచి ఊడిపడ్డట్లుగా సృష్టించాలన్నారు. ఒక నూతన విజ్ఞానం నెమ్మదిగా వస్తుంది. జీవితం పరిపక్వ దశకు రావాలి. ఏదో గవర్నమెంటు ఆర్డర్లు వేసినంత మాత్రాన నూతన విజ్ఞానం కల్గదు. అందుకనే ఈ ఉద్యమాన్ని ఆక్షేపించారు. లెనిన్ ఈ ఉద్యమాన్ని గురించి, "హా! హా!" అని ఎగతాళి చేశాడు. 1925 లో పార్టీ కూడ ఒక తీర్మానం గావించింది. దానిలో ప్రాత సాహిత్యాన్ని, కవులను ద్వేషించడం. పనికి రాదని తెల్పారు. నూతన ఆర్థిక విధానంతో, పై వాదన అంతరించడమే గాక మళ్ళా సాహిత్యం తలఎత్తింది.

కాని ఈ సాహిత్యం అంతా ప్రచారం కొరకే ఏర్పడిందనుకోవడం పొరబాటు. ఉదాహరణకు షోలొఖోవ్ రచించిన **And quiet flows the don** (అండ్ క్వైట్ ఫ్లోస్ ది డాన్) అనే గ్రంథం తీసుకొందాం. దానిని బోల్షివిక్కుల విజయంతో పూర్తి చేయలేదు. పైగా ఒక రెడ్‌ఆర్మీ కెప్టెన్లకు ఉరిత్రాడు తగిలించి గాలిలో తన్నుకుంటూ, చివరికి కమ్యూనిజమ్ జయించాలనే ఆక్రందించుతూ చనిపోయినట్లు చిత్రించుతాడు. ఇలాగే అనేక ఉదాహరణలు దొరుకుతాయి అతని నవలలో షోలోఖోవ్ నవల, వర్గ ద్వేషంగాని, జాతి ద్వేషంగాని, ఆత్మ వినాశకరమయిన లొంగుబాటునుగాని, డబ్బుకోసం పాటుబడే ఆపర్ట్యూనిజంగాని లేకుండా కళతో-హ్యూమన్ ఆర్ట్‌తో-నిండి ఉంది.

ఇక గోర్కీ రచనలను గురించి మళ్ళీ చెప్పడం అనవసరం. తర్వాత ఎన్నదగిన రచనలు ఇస్సాక్ బేబెల్‌వి. 1924—26 మధ్య **Odessa, Red cavalory** అనే కథల సంపుటాల్ని ప్రచురించాడు. 1928-29 పంచవర్ష ప్రణాళిక ప్రారంభ మయినపుడు సాహిత్యంలో కూడ ఒక పార్టీ డిక్టేటర్‌షిప్ ఏర్పడింది. ఆపార్టీ రష్యన్ ప్రొలిటేరియన్ రచయితల సంఘం. ఈ సంఘ ఆధిపత్యాన సాహిత్యం వివిధ ముఖాల విజృంభించింది. ఈ రోజుల్లోని సాహిత్యాన్ని "కన్స్ట్రక్టివిస్టు" (నిర్మాణ) సాహిత్యం అంటారు. దీని ఉద్దేశ్యం పారిశ్రామికంగాను, వ్యావసాయకంగాను దేశం ఎంత ముందుకు పోతున్నదో దానితో పాటు పోవడమేగాక పునర్నిర్మాణంలో జరిగే వర్గ కలహాన్ని, పంచవర్ష ప్రణాళిక యొక్క కర్తవ్యాన్ని చిత్రించడం. ఈ రోజుల్లో వెలువడిన గ్లాడ్కావ్ రచించిన 'సిమెంటు'

(Cement) 'పవర్' (Power): కాటాయెవ్ రచించిన 'ఫార్వర్డ్' (Forward). ఓ. టైం: (O! Time) ష్లిన్యాక్ రచించిన 'వాల్గాఫాల్స్ టు ది కాస్పియన్ సీ' (Volga falls to the Cospian see) అనునవి ముఖ్యమయినవి.

పైన చెప్పినవి ఆయా కాలంలోని చరిత్రలను తెలియ జేస్తున్నాయి. షోలోఖోవ్ రచించిన క్వైట్‌డాన్ అంతర్యుద్ధాన్ని తెల్పుతుంది. అతడే రచించిన 'వర్జిన్ సాయిల్ అప్ టర్న్‌డ్' (Virgin soil upturned) సమిష్టి వ్యవసాయాన్ని గురించి తెల్పుతుంది. కాటాయెవ్ రచించిన Time, Forward (టైం, ఫార్వర్డ్)లో కార్మికులలో బోల్షివిక్ పోటీని గురించి తెల్పుతాయి. ఇలాగే తక్కినవి.

కాని ఈ కవుల ఆధిపత్యంక్రింద వ్రాయడం కొంత విమర్శనకు గురియైంది. అసంతృప్తి హెచ్చింది. ప్రభుత్వము ఈ అసంతృప్తిని గుర్తించింది. గోర్కీ ప్రోత్సాహంతో ఈ సంఘము నెమ్మదిగా రద్దయింది. కాని మళ్లా 1932 లో సోవియట్ యూనియన్ యావత్ రచయితల సంఘం ఏర్పడింది. ఈ యూనియన్ ఉద్దేశం కలం పట్టినపుడల్లా కమ్యూనిస్టు ప్రచారం చేయడమని (బూర్జువా రచయితలు తలచినట్లు) కాదు. కాని సోషలిస్టు నిర్మాణానికి ఆశయాలకు సానుభూతి మాత్రం ఉండాలి. కమ్యూనిస్టు పార్టీలో చేరనంత మాత్రాన పెటీ బూర్జువా అనిగాని, విప్లవ ప్రతి ఘాతకుడని గాని, శ్రామిక వర్గ శత్రువనిగాని అనుకొనడం లేదు. నేటి సోవియట్ రచయిత తన ఇష్టం వచ్చినట్లు వ్రాసికోవచ్చు. కాని చెడుగా-అంటే దేశద్రోహంగా మాత్రం వ్రాయ కూడదు. కాని నేడే రచయితకూడా 'సోషలిస్టు రియలిజం'కు దూరానికి పోయే అవకాశంలేదు. పోతే అతడు సంఘానికి దూరమై పోతాడు. నేడు నిర్మాణ సమస్యల గురించిన వాఙ్మయమేగాక చారిత్రాత్మక సాహిత్యంకూడా క్రొత్తది వచ్చింది. పూర్వపు చరిత్రలలో కార్మికుల భాగమేమిటో, పాత్ర యేమిటో, బూర్జువా సాహిత్యం ప్రచురించలేదు. కాని నేడు ఎ. టాలస్టాయ్ వ్రాసిన 'పీటర్ ది ఫస్ట్' (Peter the first) మొదలగు వాటిలో ఇది వివరించ బడింది. విప్లవ సమయంలో గోర్కీ నాటకాలను వ్రాయలేదు. కాని 1932 తర్వాత Yeger Bulychev & others, Dostigayev and others అనే రెండు నాటకాలను వ్రాశాడు. అతడిదివరకు వ్రాసిన 20 నాటకాలే గాక ఈ రెండూ రష్యన్ సాహిత్యానికి ప్రతిభను హెచ్చించినయి.

## భవిష్యత్తు?

నేడు సోవియట్ యూనియన్‌లో, ఒక నూతన శక్తి, ఉత్సాహం, నిర్మాణ బలం; జీవితంలోను, ఆలోచనలోను హెచ్చింది. పూర్వపు వాసనలు, కుల ఆచారాలు, వర్గపు దోపిడి, ధన ప్రభావం నేడు లేకపోవడం మనుష్యుడు మనుష్యుడే అని తలఎత్తి తిరగడానికి అవకాశం కల్గింది. సోవియట్ యూనియన్ నేడొక పెద్ద ఎక్స్పెరిమెంటు (పరిశోధన) చేస్తున్నది. దానికై ఆత్మత్యాగం, బలి, గావించు తున్నది. పశు సమాజం పోయి, మానవత్వం కన్పించే సమాజానికి ప్రయత్నించుతుంది. ఆ ప్రయత్నాన్నే సోవియట్ సాహిత్యం బలపరచుతుంది. సోవియట్ సాహిత్యం రష్యన్ విప్లవం లాగానే అనేక దేశాలలో వెలుగు చూపింది. ఇప్పుడు కాకపోయినా ఎప్పుడయినా సోవియటును ప్రపంచం అనుకరించక తప్పదు....

సోవియట్ యూనియన్ ఒక నూతన సాహిత్యాన్ని – నాగరికతను – సమాజాన్ని సృష్టించింది నిజమే. కాని ఇది మాత్రం నిలుస్తుందా? అని ప్రశ్నింపవచ్చు. దీనికి బెర్నార్డ్‌షా చెప్పిన సమాధానమే (1935 లో కాబోలు) చెపుతాను.

"లెనిన్ చేసిన పరిశోధన విఫలమయితే ఆధునిక నాగరికతే, వెనుకటి నాగరికతల లాగానే విఫలమవుతుంది. మన చారిత్రక పరిశోధనల వలన చాల నాగరికత లున్నవనీ; చివరకు పాశ్చాత్య కేపిటలిస్టిక్ నాగరికత దశకు వచ్చామనీ, మనం నేర్చుకొన్నాం. కాని కేపిటలిస్టు నాగరికత త్వరత్వరగా పతనమైంది. చివరకు మృగదశకు పోయింది. తమ ఉన్నత స్థానానికి చేరాలని మానవజాతి మరల మరల ప్రయత్నించింది. కాని విఫలమయింది. కాని లెనిన్ ఒక విధానం–ఆ స్థానాన్ని చేరడానికి– చూపించాడు. మన మాతని బోధల వింటే– తక్కిన ప్రపంచ మందంతా ఈ కమ్యూనిస్టు పరిశోధన వ్యాపిస్తే చరిత్రలో మనమొక క్రొత్త యుగాన్ని చూస్తాం....

కాని. ఈ పరిశోధనను త్రోసివేస్తే; విఫలమయితే; ప్రపంచం అంతా, కేపిటలిస్టిక్ పద్ధతులపైననే నడవాలన్ని పట్టుబట్టితే; స్నేహితులారా! నేను మీవద్ద నుండి విషాద పూర్వకముగా సెలవు తీసుకోవలసి వస్తుంది."

## మన కర్తవ్యం ఏమిటి?

ఇప్పుడిప్పుడే ఆంధ్రదేశంలో 'ప్రొలిటేరియన్ కవిత్వం' అనే మాటలు వినబడుతున్నాయి. కొందరు ఎగతాళి చేస్తున్నారు. కొందరు అది 'మూడో రకం'లో నడుస్తుంది అంటున్నారు. కాని మనం భయపడ నవసరం లేదు. రాజకీయంగాను, సాంఘికంగాను మనం పోరాడటమే గాక సాహిత్య రంగంలో కూడ మనకు పోరాటం తప్పదు.

కేపిటలిజం క్రింద, సామ్రాజ్యవాదం క్రింద, ఫేసిజం వల్ల, నేడు ప్రపంచ నాగరికత ధ్వంసమోతున్నది. ఇలాంటప్పుడు మనమొక నూతన సమాజానికి–సోషలిస్టు సమాజానికి ప్రయత్నిస్తున్నాం. ఇందుకు పాత ప్రపంచం చావాలి. పాత ప్రపంచాన్ని చంపడానికి–పూడ్చిపెట్టడానికి మనం సహాయం చేద్దాం. లేకపోతే అది నాశనమవడమే గాక తనతోపాటు మనల్ని కూడా నాశనం జేస్తుంది.

యువకవులారా! ఇందుకు మీరేమంటారు?....

---


వేంకటరామా అండ్ కో

హెడ్డాఫీసు:

ఏలూరు మద్రాసు

అన్ని స్కూళ్లకు, లైబ్రరీలకు, జనసామాన్యమునకు, పనికివచ్చు, అన్ని కంపెనీల ఇంగ్లీషు, తెలుగు, అరవ, హిందీ, సంస్కృత గ్రంధములున్నూ, స్టేషనరీ సామానులు, మ్యాపులు, గ్లోబులు అన్ని రకముల యితర సామానులున్నూ, సరసమైన ధరలకు సప్లయి చేయబడును.

మా బ్రాంచెస్:—బెజవాడ, తెనాలి, రాజమండ్రి. పాలకొల్లు, సికింద్రాబాద (దక్కన్).




# ఆదర్శ గ్రంథమండలి

## క్రొత్త పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| తిరుగుబాటు | .... | .... | 0—4—0 |
| మాలపిల్ల | .... | .... | 0—4—0 |
| క్రాంతి గీతాలు | .... | .... | 0—4—0 |
| కమ్యూనిజానికే జయం | | .... | 0—1—0 |
| మన సంపద | .... | .... | 0—1—0 |
| వలస దేశాల సమస్య | | .... | 0—1—0 |
| స్టాలిన్-ఉడ్వీగుల సంభాషణ | | .... | 0—1—0 |

ఆదర్శ గ్రంథమండలి, యలమర్రు. (కృష్ణా జిల్లా)

## సంఘంలో

దరిద్రం, నిరుద్యోగం, అన్యాయం, అక్రమాలు పెచ్చు పెరుగుతున్నాయి. ఇవి లేకుండా సంఘము సౌఖ్యాన్ని పొందా లంటే శాస్త్రీయ పద్ధతులతో

## ప్రజావిప్లవం రావాలి

అటువంటి ప్రజా విప్లవాన్ని సాధించ గల యువతీ, యువకులను తయారు చేయగలవి పుస్తకాలు పత్రికలు. అలాంటి నవ్యసాహిత్యం కావాలంటే

## సాముల సీతారామయ్య

తెనాలికి వ్రాసి తెప్పించుకోండి. మీరు తెనాలి వచ్చినప్పుడు గాడి భావివద్ద మా షాపుకు వచ్చి మావద్దగల తెలుగు, ఇంగ్లీషు పత్రికలు, పుస్తకాలను గురించి తెలుసుకోండి.

చదువ వలసిన హిందీ వార పత్రికలు

**నయా హిందూస్థాన్** జీరో రోడ్డు, అల్హాబాద్. సం॥ చందా 2—0—0.

**జనతా** బంకీపూరు, పాట్నా. సం॥ చందా రు 3—0—0.

## లక్ష్మి ప్రావిడెంటు ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్, మచిలీపట్టణము.

కార్మికులకు, కర్షకులకు సులభముగా నుండు

భీమా ప్రణాళికలు గలవు

1. రు 50 లు మొదలు, రు 500 లు, వరకు భీమాచేయుటకు వీలగునట్లు, ప్రావిడెంటు ఇన్సూరెన్సు ప్రణాళికలు గలవు.
2. వైద్య పరీక్షతోను, లేకుండగను, భీమాచేయుట కవకాశము లేర్పరుప బడినవి.
3. ఏజంట్లకు వంశపారంపర్య కమీషన్ పద్ధతులు గలవు.

ప్రావిడెంటు శాఖలో

రు 250 లకు

నెలసరి ప్రీమియము రు 1—0—0 మాత్రమే.

వైద్య పరీక్ష లేదు.

కమీషను పద్ధతి మీదగాని, జీతముమీదగానీ పనిచేయుటకు అన్ని ప్రాంతములకు ఏజంట్లు ఆర్గనైజర్లు కావలెను.

వివరములకు—మేనేజింగు డైరెక్టరు పేర కంపెనీకి వ్రాయుడు.

# సందేహాలు: సమాధానాలు

కామ్రేడ్ పి. ఎ. శివయ్య, బి. యస్. సి.

శ్రామిక విప్లవం నిర్వహించి, రష్యా ధనికుల అధికారాన్ని త్రోసి రాజన్నది. వాళ్ళ అధికారాన్ని నిలుపబెట్టే సంస్థలకు ఆచారాలకూ నిలువ నీడ లేకుండా పోయింది. దీనితో ప్రపంచంలో ధనికులు కట్టిన సామ్రాజ్య వాద సౌధాలు పునాదులతో సడలిపోతున్నాయి. ఎవరి శ్రమతో ఈసౌధాలు నిర్మింపబడ్డాయో అట్టి కష్టజీవులందరికి సోవియట్ యూనియన్ జ్యోతిగా ప్రకాశిస్తూ ఉంది. ఆ జ్యోతిని మలినం చేయటానికి, ఆర్పివేయటానికి, ప్రపంచ ధనికవర్గమంతా ఏకమై అనేక పుక్కిటి పురాణాలల్లుతున్నారు. అనేక అపవాదులు వేస్తున్నారు. అనేక కుట్రలు పన్నుతున్నారు. అందుచే ప్రజాశక్తులను సంఘటనజేసి, విప్లవం నిర్వహించి, కష్టజీవుల ప్రభుత్వాన్ని స్థాపించిన సోవియటు యూనియనులోని నిజ పరిస్థితులను తెలుసుకోవలసిన అవసరం, దాస్యంలోనుంచి, ఆకలినుంచి తప్పించుకోదలచుకున్న కష్టజీవులందరికి ఉన్నది.

ఈ వ్యాసంలో మన వాళ్ళలో ప్రాయికంగా కలిగే అనుమానాలలో కొన్ని తీర్చటానికి ప్రయత్నిస్తాను,

1. ఇటలీ, జర్మనీలలో ముస్సోలినీ, హిట్లరులు డిక్టేటర్లయితే, సోవియట్ యూనియన్‌లో స్టాలిన్ డిక్టేటరు. భేదమేమి?

ప్రైవేటు ఆస్థి వచ్చిన తరువాత సంఘం, ఉన్నవాళ్ళు లేనివాళ్ళని రెండు వర్గాలుగా చీలిందని, పెట్టుబడిదారీ విధానంలో ఈ చీలిక కాదగినంత పెద్దదవుతుందని అందరెరిగిన విషయమే. ఈ రెండు వర్గాలున్నంతవరకు కలవాళ్ళ వర్గం లేనివాళ్ళ వర్గం మీద ప్రభుత్వం చేస్తుంది. ఈప్రభుత్వం కలవాళ్ళ కనుకూలంగా ఉంటుంది. లేనివాళ్లు అధికారంలో ఉంటే ప్రభుత్వం వాళ్ళ కనుకూలంగా ఉంటుంది. ప్రభుత్వం ప్రజలందరి మంచికనే మాటల్లో అర్థం లేదు.

పెట్టుబడి విధానంలోని వైరుధ్యం ఏమంటే తనను నాశనము చేయగల శక్తిని—శ్రామికులను—తాను వృద్ధిగావటంకోసం సృష్టించుకుంది. పెట్టుబడి విధానం వృద్ధి గావటం అంటే, లాభాల తృష్ణ ఎక్కువ కావటం, డబ్బంతా ఒక రిద్దరి చేతుల్లో చేరటం, ఉత్పత్తి కేంద్రీకరణం కావటం. దీనికి ఫలితంగా శ్రామికుల సంఖ్య ఎక్కువ గావటం, వారి దరిద్రం ఎక్కువ కావటం, వారందరు పెద్ద సంఖ్యల్లో ఒక చోట చేరటం, సంఘా లేర్పడటం హక్కుల కోసం పోరాడటం.

పెట్టుబడిదారుల ప్రభుత్వం ప్రజాస్వామికంతో మొదలు పెట్టింది. ఓటింగు హక్కు ఇంకా ఇతర కొన్ని హక్కులు శ్రామికులకు ప్రజాసామాన్యానికి కుంటాయి. ఈ హక్కుల నాధారం చేసుకుని తమకు విరోధమైన ప్రయోజనాలు గలిగి అధికారంలోఉన్న పెట్టుబడిదారులతో పోరాడుతారు. పెట్టుబడి విధానానికి సహజమైన ప్రయోజనాలు వ్యాపార మాంద్యం, ఆర్థిక క్షోభల మూలముగా, వీరి హక్కు లివ్వటానికి క్రమేణ అసంభవమై పోతుంది. ఈ పరిస్థితుల్లో ప్రజాస్వామిక సంస్థ లన్నిటికి అంతర్గర్భితమైయున్న పెట్టుబడిదారీ వర్గ నియంతృత్వం బయటికి విజృంభిస్తుంది. అదే ఫాసిజము. అదే నాజీజము. ఈనియంతృత్వాన్ని ఈ పెట్టుబడి విధానాన్ని రూపు మాపాలంటే ఈ విధానంలోనే అండ రూపంగా ఉన్న కార్మిక వర్గ ప్రజా స్వామిక సంస్థలను అభివృద్ధి చేయాలి. విప్లవం నిర్వహించి కార్మిక వర్గం అధికారం వహించినప్పుడు ఈసంస్థలే ప్రభుత్వానికి పునాదులౌతాయి. ప్రజాస్వామిక సంస్థలతో గూడిన ఈ ప్రభుత్వమే పెట్టుబడిదారులపై నియంతృత్వం చెలాయిస్తుంది.

అంటే నియంతృత్వం ఉత్పత్తి సాధనాల అధికారంలో ఉన్న వర్గం యెడల ప్రజాస్వామికం గాను, వాటిపై అధికారం లేని వర్గం యెడల నియంతృత్వంగాను చెలాయిస్తుంది. జర్మనీ, ఇటలీలో మాదిరి హిట్లరు, ముస్సోలినీలు, అమెరికా ఇంగ్లండులలో మాదిరి కాబినెట్లు గాని నామ మాత్రమే. నియంతృత్వాలు పూర్తిగా వర్గ నియంతృత్వాలు, హిట్లరు ముస్సోలినీలను, ఇంగ్లండు అమెరికా కాబినెట్లను అధికారంలోకి తెచ్చింది, ఆ దేశపు బూర్జువాలు. ఆ బూర్జువాలే వాళ్ళను అధికారంలో నుంచి తొలగించవచ్చు. సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టులనుఅధికారంలోకి తెచ్చింది ఆదేశపు శ్రామికులు కర్షకులు; కమ్యూనిస్టు పార్టీ; స్టాలిన్‌ను పార్టీ కార్యదర్శి పదవినుండి తొలగించగలదు. నూటికి ఇద్దరు ముగ్గురైన పెట్టుబడిదారులు మిగిలిన 98 మందిని తొక్కిపట్టాలి. గాబట్టి నియంతృత్వం ఎక్కువ విపరీతంగా, ఎక్కువ కౄరంగా ఉంటుంది. శ్రామిక నియంతృత్వం పట్టుపల గలిగినా అంత కౄరంగా ఉండదు.

పెట్టుబడి విధానం వృద్ధి గావాలంటే, ఉత్పత్తిసాధనాలు ప్రైవేటు ఆస్థిగా ఉండాలి, శ్రామికు లుండాలి, వాళ్ళను దోచుకోటం ఎక్కువ చేయాలి. శ్రామిక నియంతృత్వానికి ఆశయం సోషలిజం. సోషలిజంలో ఉత్పత్తి సాధనాలు ఏ ఒకని ఆస్థిగా ఉండవు. శ్రామికు లుండరు. వాళ్ళను దోచుకోవటం ఉండదు. వర్గ భేదం లేని సంఘం ఏర్పడుతుంది. పెట్టుబడి ప్రభుత్వం ప్రజాప్రభుత్వం పేరుతో ఏర్పడి పెట్టుబడి విధానపు వైరుధ్యాలు పెరిగిన కొద్ది, నియంతృత్వంగా ఒక్కమారు శ్రామిక విప్లవంలో క్షీణమై, శ్రామిక ప్రభుత్వానికి తావిస్తుంది. శ్రామిక ప్రభుత్వం శ్రామిక నియంతృత్వంగా మొదలుపెట్టి పెట్టుబడిదారుల యొక్క ఆ స్వభావ పరిజ్ఞానాల యొక్క ప్రతిఘటన తగ్గి దేశాన్ని పూర్తిగా వదలిపోయేటప్పటికి నిజమైన సార్వజనికమైన ప్రజాస్వామ్యం ఏర్పడుతుంది. అప్పుడే దేశంలో సోషలిజం ఏర్పడుతుంది. స్టాలిన్ నాయకత్వాన సోవియట్ యూనియన్‌లో, విద్రోహం అణచివేయ బడ్డది. మొన్నటి క్రొత్త రాజ్యాంగ ప్రణాళికతో పూర్తి ప్రజా హక్కులు పెంపొందించ బడ్డాయి. స్వామ్యం ఏర్పడ్డది. సోషలిజం విజయం పొందింది. స్టాలిన్ పార్టీ కార్యదర్శిగా వచ్చినప్పటి నుంచి, లెనిన్ తరువాత నాయకత్వాన్ని జయప్రదంగా నెరవేర్చాడు. పరిశ్రమలను బాగా వృద్ధి పొందిచడంలో, సమిష్టి వ్యవసాయాన్ని యూనియన్ అంతటా స్థాపించడంలో యంత్ర పరిశ్రమలు ఇతరముఖ్య పరిశ్రమలను వృద్ధి చేయటంలోను, భాగ్యవంతులైన రైతుల వర్గాన్ని లేకుండా చేయటంలోను, రెండుపంచవర్ష ప్రణాళికలలోను ఆయన నాయకత్వం క్రింద, జయం గలిగింది. ఇది యూనియన్ ప్రజలందరికీ తెలుసు. అందుకని ఆయన్ని అమితంగా పొగడుతారు. ఆయనకు లెనిన్‌తో సమానమైన స్థానం ప్రజల హృదయాల్లో గలిగింది. ఆతడు యూనియన్‌లోని ప్రజాప్రతినిధులందరికన్న పలుకుబడి కలవాడు. ఆ పలుకుబడి ఆయనకు అధికారం వల్ల వచ్చింది కాదు. ఇటలీ జర్మనీలలో ముస్సోలినీ హిట్లర్లకున్నట్లు సోవియట్ యూనియన్‌లో ఆయనకు చట్ట ప్రకారం అధికారం గల ఉద్యోగం యేమీ లేదు. కేవలం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ జనరల్ సెక్రటరీ. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్య నిర్వాహక వర్గంలో సభ్యుడు మాత్రమే. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ చెప్పిన పని చేస్తుంటాడు.

వెబ్బు దంపతులు, లూ యీస్ట్రాంగు మొదలైన వాళ్ళు సోవియటు యూనియన్‌కు వెళ్ళి అన్ని పరిస్థితులు చూచారు. స్టాలిన్ కమిటీ మీటింగులలో గాని, పైన గాని, ఇతర వ్యవహారాల్లో గాని నియంతగా ప్రవర్తించడు, పార్టీలో చర్చించనిదే ఏపని చేయడు, అసలు సోవియట్ ప్రభుత్వ నిర్వాణమే-దాని సమావేశాలు, దీర్ఘ చర్చలూ, ప్రజల రాజకీయ చైతన్యము, ప్రభుత్వాన్ని గురించి వాళ్ళు చేసే చర్చలు, విమర్శనలు, మీటింగులు, చూసే - స్టాలిన్‌ను—నియంత అనడం తప్పని వ్రాశారు.

2. సోవియటు యూనియన్‌లో వ్యక్తి స్వాతంత్ర్యం లేదా?

ఫ్యూడలిజంతో దెబ్బలాడుతూ, పౌరసత్వ హక్కులను బూర్జువా వర్గము కొన్నిటిని తెచ్చింది. కాని యీ నాటి పెట్టుబడిదారీ ప్రభుత్వాలలో కార్మిక కర్షక ప్రజా సామాన్యానికి ఈ హక్కులు లేవు. ఎందుచేత? ఈనాడు పెట్టుబడిదారుల అధికారం స్థిర స్థాపితం అయింది. పైగా ప్రజాసామాన్యంలో చైతన్యం ఎక్కువై వాళ్ళ అధికారానికి అపాయం కలిగేట్లుంది. అందుకనే వాళ్లు సంపాదించిన హక్కులే గాక కొత్తగా వాళ్ళిచ్చిన హక్కులు గూడ లాక్కుంటున్నారు. పౌర హక్కులని, పైకి మాత్రం మాట్లాడుతారు మోసగించటానికి; మోసం వీలుగాకపోతే నిరంకుశం చెలాయిస్తారు. కాని ఇవి ఉన్నప్పటికి ఉత్పత్తి సాధనాల మీద ఏమి అధికారం లేని ప్రజా సామాన్యానికి ఏమీ ఉపయోగం లేకపోతున్నాయి.

ప్రజా సామాన్యానికి సభా స్వాతంత్ర్యం ఉంది. మంచి మంచి సభా స్థలాలు, ప్రచురణ సాధనాలు, ధనికుల చేతుల్లో ఉన్నవి.

ప్రజా సామాన్యానికి సభా స్వాతంత్రం ఉంది. అచ్చుయంత్రాలు, ఫ్యాక్టరీలు, కాగితాల స్టాకులు ధనికుల చేతుల్లో ఉన్నవి.

వాక్కు స్వాతంత్ర్యం ఉంది. కాని గవర్నమెంటు విధానానికి వ్యతిరేకంగా మాట్లాడినా దోపిడి విధానానికి వ్యతిరేకంగా మాట్లాడినా, రాజద్రోహం క్రింద శిక్ష పడుతుంది.

సంఘం పెట్టుకోటానికి, సమ్మె చేయటానికి అధికారం ఉంది. కాని లంచాలు పెట్టి, వాటిని భగ్నం చేయటానికి ధనికుల డబ్బు ఉంది, గవర్నమెంటు ఉంది.

ఉద్యోగం లేక తిండి లేక బాధపడే వారికి ఈ హక్కు లేని వారికి ఉపయోగపడడము లేదు. అనుభవించటానికి తీరిక ఉండదు; విరామం ఉండదు. అతనికి ఉండే స్వేచ్ఛా ఒకటే, దాస్యం చేయటానికి మాడి చావటానికి!

దీనిని బట్టి వ్యక్తికి స్వతంత్రం ఉండటానికి మార్గం "లా"కు సంబంధించిన అడ్డంకులు తీసివేయటం కాదు ప్రధానమైన పని. దానితో పాటు ఆ స్వతంత్రం అనుభవించటానికి వీలైన పరిస్థితు లేర్పరచాలి. అవి ఏర్పరచటం, ఇప్పుడు ధనికుల స్వాధీనంలో ఉన్న ఉత్పత్తి సాధనాలు ఇతర సౌకర్యాలు ప్రజాసామాన్యానికి చెందినప్పుడే జరుగుతుంది.

ఇది ఒక్క సోవియట్ యూనియన్‌లోనే జరిగించి.

ప్రెస్సుల మీద, పేపర్ల మీద నిఘా ఉన్నదంటారు, నిజమే: విప్లవ ప్రతిఘాతకమైన విషయాలను అచ్చు వేయనీయరు. ప్రకటించనీయరు. పత్రికా విలేఖరుల వ్రాతలు పరీక్ష చేయబడుతాయి. సోవియటుయూనియన్ ప్రభుత్వం తాను చేసిన తప్పులను గూడ, ప్రత్యేకంగా ప్రభుత్వాన్ని, దాని నాయకత్వాన్ని అప్రతిష్టపాలు చేయుటకు, పడగొట్టుటకు ఉద్దేశం లేకపోతే ప్రచురింపనిస్తుంది. ప్రపంచంలో ఏ దేశంలో గూడ సోవియటు ప్రజలు అనుభవిస్తున్న పత్రికా స్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం అనుభవించటం లేదు. ప్రతి ఫ్యాక్టరీకి ఒకవార్తాపత్రిక ఉంటుంది.

ప్రతి కార్మిక సంఘానికి, ఒక పేపరు ఉంటుంది. ఇందులో ఫ్యాక్టరీలలో ఇంకా ఇతరచోట్ల సోవియటు పరిపాలనలో జరిగే లోపాలు నిష్కర్షగా విమర్శింపబడతాయి. ప్రభుత్వం యొక్క రాజనీతి గూడ, అవసరమైతే తీవ్రంగా విమర్శింప బడుతుంది. కేవలం ఇందుకు కాల్చబడరు ; శిక్ష లేదు. ఈ విమర్శన లన్నీ ఇతర దేశ విలేఖరులు తీసుకోవచ్చు. నిజానికి వీటిని ఉపయోగించే, ఇతర దేశాలలోని ధనిక ప్రభుత్వాలు సోవియట్ యూనియన్‌కు వ్యతిరేక ప్రచారం చేస్తున్నారు.

ఇంతకన్నా ముఖ్యం అయింది దేమిటంటే, లా ప్రకారం వ్యక్తి స్వాతంత్ర్యానికి అడ్డంకులు తీసివేయబడటమే కాకుండా, ప్రత్యక్ష సౌకర్యాలు కల్పించబడ్డాయి. నిరుద్యోగం లేదు. జీవనం నిశ్చితం. కావలసినంత విశ్రాంతి. కాబట్టి ఆలోచించటానికీ విషయాలు తెలుసుకోడానికి, విమర్శనా శక్తిని సంపాదించడానికి అవకాశం ఉంది. జీవనావకాశాలెక్కువైన కొద్ది వ్యక్తి స్వాతంత్ర్య అనుభవం ఎక్కువౌతుంది.

దీన్ని బట్టి సోవియట్ యూనియన్‌లో వ్యక్తి స్వాతంత్ర్యం ఉందనీ సామ్రాజ్యవాద ప్రభుత్వాల్లో కొద్దిమంది ధనికులు స్వతంత్రా న్ననుభవిస్తే ఇక్కడ సోవియటు యూనియనులో ప్రతి వ్యక్తీ అనుభవిస్తున్నాడని తేలుతుంది.

3 సోవియటు యూనియనులో మత స్వాతంత్ర్యముందా ?

మానవుల అజ్ఞానంలో మతం పుట్టింది. అలవి గాని ప్రకృతి శక్తులన్నీ దేవుళ్లయినవి. మతం అంతా వీళ్లను గురించిన కథలతో అల్లబడ్డది. రెండో దశలో, మానవులకు ప్రకృతి మీద కొంత అధికారం వచ్చింది. ఉత్పత్తి సాధనాల ప్రైవేటు ఆస్తి అయిపోయినవి. కొత్త రకపు శక్తులు—సాంఘిక శక్తులు—అధికారంలోకి వచ్చినవి. ఈ కొత్త రకపు శక్తు లేమిటో, తమ ఆర్థిక జీవనం ఎందు కింత అనుమాన స్థితి కొచ్చిందో మామూలు ప్రజల కెవ్వరికి తెలియదు. అంటే ప్రకృతి శక్తుల మీద అధికారం వచ్చినప్పటికి మానవుల పైనందిన జీవితాన్ని నిర్ణయించే శక్తు లేవో ఇంకా అగమ్యగోచరంగానే ఉన్నవి. అందుకే మత నమ్మకాలింకా ఉంటూనే వచ్చినవి. పూర్వం ప్రజలు ప్రకృతి శక్తుల వల్ల కలిగే ఆపాంతరాలను అర్థం చేసుకొనే దానికి మతం అవసరమని అనుకుంటే, ఈనాటి ప్రజలు సాంఘిక శక్తుల వల్ల కలిగే ఆపాంతరములను అర్థం చేసుకోటానికి మతం కావాలనుకుంటారు.

ఉత్పత్తి సాధనాలను ప్రైవేటు అధికారంనుంచి లాగేసి ఇప్పటి ఆర్థిక జీవనాన్ని అనుమానాస్పద స్థితి నుంచి తప్పించినప్పుడు, క్రమంగా మానవు డొకటి తలుస్తే వేరొకటి తలచే దైవం మాయమౌతాడు. మతం దాని మూలకారణాన్ని రూపుమాపినప్పుడే, మాయమౌతుంది. ఆర్థిక జీవనానికి ఫరవాలేదనుకునే పరిస్థితు లేర్పడక ముందే బలవంతంగా మతాన్ని అణచివేయటం అసంభవం. అలాంటి పరిస్థితు లేర్పడ్డ తరువాత అణచివేయ చూడటం అనవసరం:

పైన వ్రాసినదాన్నుంచి రెండు విషయాలు తెలుకోవచ్చు. 1. ఆర్థిక పరిస్థితులు విషమించిన కొద్దీ మత నమ్మకా లెక్కువౌతాయి. 2. సాధారణ జీవన పరిస్థితులు తృప్తికరంగాఉంటే మతం మాయం కావటానికి ఎక్కువ కాలం పట్టదు.

ఆర్థిక పరిస్థితులు రోజు రోజుకూ విషమించే ప్రైవేటు ఆస్తి సంఘములో, ఈ విషమించటానికి నిజమైన కారణా లగుపడకుండ మత నమ్మకా లెక్కువ చేస్తారు ధనికులు. ఇందువల్ల ధనికుల ప్రభుత్వ యంత్రంలో మతసంస్థ ఒక భాగమైపోతుంది. మత సంస్థల కాస్తి ఎక్కువగా ఉంటుంది. మత గురువులు చెప్పనలవి గాని సౌకర్యా లనుభవిస్తుంటారు. కష్ట జీవులు ఉత్పత్తి సాధనాలను వశపరచుకోవడమంటే మతసంస్థల ఆస్తులనుగూడ వశపరచుకోటం అన్న మాట మత గురువుల సౌకర్యాలను తీసివేయటం గూడాను.

ఇక సోవియటు యూనియనులో ఏంజరిగిందో చూదాం.

రష్యాలో మత సంస్థ ప్రభుత్వ నిర్బంధ విధాన యంత్రముతో కలిసినంత ఎక్కువగా మరి యే దేశములోనూ కలువలేదు. ప్రభుత్వ మంత్రుల్లో ఒకడు దేశములోని మతసంస్థ కంతటికీ అధికారి. సంస్థ అంతా పన్ను రూపముగా వసూలు చేసిన ప్రభుత్వ ధనముతో గాని లేకపోతే గొప్ప ఆస్తి మూలముగా గాని, నడపబడుతుంది. ఇలా ప్రభుత్వంచేత రుద్దబడే ఈమతం మతమేనా ?

చివరకు విప్లవం వచ్చినప్పుడు రష్యాలో మత సంస్థలు తమ బలాన్నంతా ప్రయోగించి జారు ప్రభుత్వాన్ని కాపాడ చూచాయి. జారుప్రభుత్వాన్ని పడద్రోసిన తరువాత మళ్ళీ నిలువబెట్ట చూచాయి. అధికారంలో ఉన్న సోవియట్ యూనియన్ ఇటువంటి మత సంస్థలను ఎదుర్కోవలసి వచ్చింది. వాటి రాజకీయ అధికారాన్ని భగ్నం చేయాలసి వచ్చింది. ఇది చేసిన వెంటనే ఈ మత సంస్థలు జీవం పోసి పెంచిన మూఢ నమ్మకాలన్నిటినీ సాధ్యమైనంత త్వరగా పోగొట్టవలసి వచ్చింది. మత సంస్థలనుంచి రాజకీయాధికారాన్ని, ప్రజలను మూర్ఖత్వంలో నుంచే మతసంస్థల హక్కులను, తీసివేయటం, మతాన్ని బలవంతంగా అణచటం మత స్వాతంత్ర్యం అరికట్టటం ఏలా అవుతుంది !

విప్లవం జరిగిన మొదటి రోజుల్లో, ప్రభుత్వానికి సహాయము చేసిన మతసంస్థలను ప్రజలు కఠినంగానే హింసించారు. వాటి భూములను రైతులంతా లాక్కుని పంచుకున్నారు. అడ్డు వచ్చిన మత గురువులను తన్నారు. చంపారు. గ్రామాలలో ఉండే చర్చీలను పదిమంది అనుకొని క్లబ్బులు గానో, స్కూళ్లు గానో, ధాన్యపు కొట్లు గానో ఉపయోగించారు. దీనికి మతము



మీద ఉండే వ్యతిరేక భావం అంత కారణం కాదు. గాని, దుర్మార్గాలు చేసిన మత సంస్థలమీద ద్వేషమే కారణం.

తరువాత ప్రభుత్వం, పాఠశాలలలో మతబోధ నిషేధించింది. ప్రజలు రద్దు చేసిన చర్చీలను, దైవ వ్యతిరేక ప్రదర్శన శాలలుగా మార్చింది. వీటిలో మత గురువులు చేసిన గారడీల రహస్యం బహిరంగపరుపబడింది. మతసంస్థకీ వెనుకటి ప్రభుత్వానికి ఉన్న సంబంధం చూపే బొమ్మలు, వీటికి వచ్చే ఆదాయాల గొప్పతనాన్ని చూపే లెక్కలు ప్రదర్శించబడేవి.

నిజానికి మత వ్యతిరేక ప్రచారమంతా మత వ్యతిరేక సంఘాలు, నిరీశ్వర వాద సంఘాలు చేశాయి. ప్రభుత్వము చేయలేదు. మతసంస్థల మీద కొన్ని హద్దులు మాత్రము పెట్టింది. స్కూళ్లలో మతము ప్రచారం చేయకూడదు. సంస్థల తరపున పాఠశాలలు ధర్మ సంస్థలు పెట్టకూడదు. ఇంత మాత్రమే. ఆ యా మతాలలో నమ్మక మున్నందుకు ప్రజలను హింస పెట్టలేదు. వాళ్ళు చర్చీలకు, మసీదులకు మొదలైన వాటికి నిరాటంకముగా వెళ్ళవచ్చు. అక్కడ ప్రార్థనలు జరుపుకోవచ్చు. ఇండ్ల దగ్గర తల్లి తండ్రులు పిల్లలకు మతబోధ చేసుకోవచ్చు. కావాలన్న వాళ్ళ ఖర్చు మీద మత తంత్రాలు జరపవచ్చు. మతసంస్థలకు డబ్బు ఖర్చు లేకుండా దేవాలయాలుగా ఉపయోగించుకొనేందుకు, ఇండ్లు ఇస్తారు. వాటికి పన్ను మాత్రము కట్టాలి. 1934 లో మాస్కోలో 50 కి పైగా చర్చీ లుండేవి. కీవ్‌లో దాదాపు 25 ఉండేవి. యూనియన్ మొత్తం మీద ఇప్పుడు 38,000 చర్చీలున్నవి. విప్లవము పూర్వ మున్నవాటిలో నూటికి 70. ఈ రోజులలో ఏ చర్చీనైనా ఆ గ్రామములో దాదాపు అందరు ప్రజలు కోరితేనే తప్ప మూసివేయకూడదని రూలున్న కొత్త రాజ్యాంగ ప్రణాళిక ప్రకారం, యూనియన్ ప్రజలకు మత స్వాతంత్ర్యం ఇవ్వబడినది. మతానికి వ్యతిరేకముగా ప్రచారము చేయడానికి కూడ అధికార మివ్వబడినది.

దీన్ని బట్టి సోవియటు ప్రభుత్వము మతాన్ని బలవంతముగా అణచివేయలేదని, అట్టి అవసరము కలుగలేదని, తెలుస్తుంది. అవసరము ఎందుకు కలుగలేదు ?

సోవియటు విధానములో సమిష్టి జీవనము—లోటు లేనిది—ఉంది. కార్మికులు కర్షకులు ఈ విధానములో ప్రవేశించగానే ఎక్కడలేని స్వేచ్ఛను పొందుతారు. వెంటనే తమ పూర్వపు మతము ఏదయినా, మత్తుమందులాగుంది. దాస్యాన్నే తెచ్చిపెట్టినది కాబట్టి, ఆ దాస్య మతాన్ని వదలిపెట్టి నిరీశ్వర వాది అవుతారు. ఇలా వేలకొలది గుంపులు గుంపులుగా నిరీశ్వర వాదులయ్యేవారు. 1935 కి సోవియటు యూనియనులో కనిసము సగము జనాభా అయినా మతమునుంచి విముఖులై యుంటారు. వీళ్ళందరికి మత వ్యతిరేక సంఘాలు స్థానికంగా ఉండి కేంద్ర సంఘము ఏర్పడింది 1929 లో. దాని పేరు తీవ్ర నిరీశ్వర వాద సంఘము. 1932 కు దీని సభ్యత్వము 55 లక్షలు.

ఇంకనూ సోవియటుయూనియనులో మత స్వాతంత్ర్యము లేదంటారా ?

4 సోవియట్ యూనియన్‌లో కుటుంబం భగ్నం మయిందా?

ఒక భార్యతోనే కాపురముండటం ఇప్పుడు అన్నిటికన్నా నాగరికమైన పద్ధతిగా చూడబడుతున్నది. అసలు ఈ పద్ధతి ప్రైవేటు ఆస్తి ఒకడి చేతులో ఎక్కువగా కూడటానికి అవకాశం కలిగినప్పుడే అమల్లోకి వచ్చింది. ఆస్తికి హక్కుదారును నిశ్చితంగా ఏర్పరచటానికే ఈ పద్ధతి వచ్చింది.

ఇతరులు పలానా వాడి కుమారుడు అని 'లా' గుర్తించాలి. అప్పుడా కుమారుడు వారసు డౌతాడు. అంటే స్త్రీ తనకు పుట్టిన సంతానానికి ఆస్తి రావాలంటే ఒకే పురుషుడితో ఉండాలి, పురుషుడు ఒకే స్త్రీతో ఉండవలసిన అగత్యం ఈ వార సత్వపు 'లా' లో కన్పించదు. అందువల్ల పేరుకు ఏక పత్నీ కుటుంబం అయినా, ఆస్తి చేతులో ఉండి, అధికారం కలిగిన పురుషుడు అనేకమంది స్త్రీలతో తిరగొచ్చు. ఆస్తి వ్యక్తిగతంగా చేతులలో లేని ప్రాథమిక తెగల జీవనం అమలులో ఉన్నప్పుడు స్త్రీ స్వతంత్రంగా ఉండేది.

ప్రేమ ఉంటేనేగాని కుటుంబం సక్రమంగా ఉండదని అందరూ ఒప్పు కుంటారు. కాని మగవారికి అధికారం చెలామణీ అయ్యే ఏక పత్నీ కుటుంబంలో నిజమయిన ప్రేమకు స్థానంలేదు.

పెట్టుబడిదారీ విధానంలో కంట్రాక్టు వివాహ పద్ధతి వచ్చింది. కంట్రాక్టు ప్రకారం పెండ్లి చేసుకునే స్త్రీ పురుషులు సమానులు. కాని యజమాని కార్మికుడూ "లా" ప్రకారం సామానులైనప్పటికి, యజమాని పౌర స్వతంత్రాలనుభవిస్తుంటే కార్మికుడేమి అనుభవించ లేక ఏవిధంగా యజమానికి లోబడి ఉంటాడోఅదే విధంగా కంట్రాక్టు కుటుంబంలోగూడ, ఆస్తి పురుషుడి చేతులో ఉన్నప్పుడు, స్త్రీ స్వతంత్రంలేక పురుషుడికి కట్టుబడి ఉండవలసి వస్తుంది. "లా"లో స్త్రీ పురుషులు సమానంగా లేకపోవటంవల్ల ఆర్థిక సమానత్వం లేకుండ పోలేదు. ఆర్థిక సమానత్వం లేకుండా పోవటంవల్లనే "లా"లో ఇద్దరు సమానులు కాకుండ పోయారు. ఇవి ఆస్తి ఉన్న కుటుంబాల విషయం.

పెట్టుబడిదారీ విధానం ఆస్తిలేని శ్రామిక కుటుంబాలనెక్కువ చేసింది. ప్రైవేటు ఆస్తిలేని ప్రాథమిక కమ్యూనిస్టు సంఘంలో పురుషుడు వేటాడి ఆహారం తీసుకురావటం ఎంత సాంఘిక వృత్తో, స్త్రీ యింటి పనులు చేయటం అంత సాంఘిక వృత్తే. మగవాడికి ఆర్థికాధికారము వచ్చిన తరువాత పద్ధతి మారిపోయింది. స్త్రీ మగవాడికి మొదటి దాసీ అయిపోయింది.

మరల స్త్రీ పురుషుడితో సమానాధికారానికి రావాలంటే పురుషునితో సమానముగా స్త్రీకికూడ ఆర్థిక స్వాతంత్ర్యం హక్కు ఉండాలి. ఇది పెట్టుబడి విధానములో జరిగిన అభివృద్ధి మీదనే జరగాలి. ఈ నాగరికత అంతా వదలుకుని ప్రాథమిక కమ్యూనిజం రోజులకు పోరాదు. నేటి బూర్జువా నాగరికత వల్ల 'లా'లో కొన్ని విషయాలందు ఏర్పడ్డ స్త్రీ పురుష సమానత్వం యొక్క పునాదుల మీద పోరాడితేనేగాని నిజమైన సాంఘిక సమానత్వము ఏర్పడదు.

స్త్రీ పురుషుల మధ్య ప్రేమ నిజానికి పీడిత ప్రజాసామాన్యముయొక్క కుటుంబములోనే అవుపడుతుంది. ముఖ్యముగా శ్రామిక వర్గములో స్త్రీని బానిసను చేసే ఏక పత్నీ కుటుంబానికి పునాది అయిన ప్రైవేటు ఆస్థి ఉండదు. అది గాక పరిశ్రమలు పెరిగిపోవటము, వీళ్ల దరిద్రము ఎక్కువ కావటంతో స్త్రీ గృహమువదలి కూలి జీవనములోకి వచ్చింది. ఆచరణలో స్వతంత్రము వచ్చింది. ఏక పత్నీ కుటుంబానికి ఉండవలసిన ప్రేమ ఉంటుంది.

కాని పెట్టుబడి విధానములో వైరుధ్యము ఏమంటే తాను సృష్టించిన అభివృద్ధి సూచకమైన సంస్థలను పెరుగనీయదు. నిజమైన ప్రేమమీద ఆధారపడ్డ ఏకపత్నీ కుటుంబాలకు పునాదులైన శ్రామిక కుటుంబాలను వృద్ధి గానీయదు. రోజు రోజు భరింపరాని దరిద్రాన్ని, చావును తప్పించుకోటానికి శ్రామిక కుటుంబాలలోని ప్రతి మెంబరు పనికి పోవాలి. ఎక్కువ కాలం పని చేయాలి. భార్యా భర్తలు ఎక్కువ కాలము విడిగా ఉండాలి. ఇద్దరు కలిసినా, ప్రేమా సంసారసుఖాలకు అవకాశం ఉండదు. రేపుతమకు తమపిల్లలకు తిండివిషయమై ఆందోళన పడటమే సరిపోతుంది. నిత్య నిరుద్యోగ భయముతో క్రుంగిపోతున్న మధ్య తరగతి కుటుంబాలు గతియింతే. ఎన్నో ఆత్మ హత్యలు జరుగుతున్నాయి. శ్రామిక కుటుంబాలలో పుట్టిన పిల్లలు తమ తల్లి దండ్రుల నెరుగక, బజారులలో దిక్కులేక తిరుగుతుంటారు. పెద్ద పెద్ద పట్టణాలల్లో బండ్లక్రింద మోటార్లక్రింద చచ్చే చావులన్ని వారివే. ఇలాంటి పరిస్థితులనన్ని కల్పించి రోజుకు రోజూ ఎక్కువ చేస్తున్న పెట్టుబడిదారీవర్గం, వారి వైజ్ఞానిక ప్రభావములో ఉన్న వాళ్ళు సోవియటు యూనియనులో కుటుంబము భగ్నము అయిందనీ, స్త్రీలు విచ్చలవిడిగా తిరుగుతారనీ పుకారులు వేస్తున్నారు. రష్యాలో నిజంగా ఏం చేశారు.

సోవియటు యూనియనులో స్త్రీ దాస్యానికి పురుషుల వ్యభిచారానికీ మూలమైన ప్రైవేటు ఆస్థిని లేకుండ చేసి సంఘపరం చేశారు. సంఘముయొక్క ఆర్థిక రాజకీయ సాంఘిక జీవనములో స్త్రీకి సమాన ప్రాముఖ్యత యిచ్చారు. ఆమె స్త్రీగా చేయవలసిన గృహ నిర్వాహణ బిడ్డలను పెంచటం కేవలము ఆమెకు సంబంధించినది గాక సమాజానికంతకూ సంబంధించినదిగా పరిగణించి, అనేక సదుపాయాలు చేశారు. నిరుద్యోగ సమస్యలేదు. మాడుతూ బిడ్డలను పెంచు భారంలేదు. సంతోషముగా సంసారము గడిపే అవకాశము ఉన్నది. నిజమయిన ప్రేమ కవకాశము ఉన్నది. విడాకు లిచ్చుకోవటానికి హక్కున్నా, ఉపయోగించే అవసరము ఉండదు.

ఇలాంటప్పుడు సోవియట్ యూనియనులో కుటుంబము భగ్నమైందని, స్త్రీలువిచ్చలువిడితిరుగుతారనిఅనుకోటంపొరపాటు.

సోవియటు యూనియనులోనే నిజంగా ప్రేమ పూర్వకమయిన కుటుంబ జీవనం ఉంది. అక్కడే నిజమైన స్త్రీ పురుష నీతి ఉన్నది.


ఆంధ్రా అడ్వర్‌టైజింగు బ్యూరో

బెజవాడ టవున్ మార్కెట్టు వద్ద

స్లయిడ్ల ద్వారా వ్యాపారాభి వృద్ధి పొందుము.

ఎలక్ట్రిక్ స్తంభముల మీద రాత్రింబవళ్లు అడ్వర్‌టైజు చేయుదురు. పోస్టర్లకు ప్రత్యేక సదుపాయములు.

వివరములకు :— టి. రామారావు, బి. ఏ.

ఆంధ్రా టైపు అండ్ షార్టు హేండ్ ఇన్‌స్టిట్యూటు,

గవర్నరుపేట, బెజవాడ.




# నవంబరు 7......

ఇప్పటికి 21 ఏండ్లయింది. రష్యాలో జార్ ప్రభుత్వాన్ని కూలద్రోసి, కేపిటలిస్టు సమాజాన్ని నాశనం గావించింది విప్లవం. సోషలిస్టు సమాజం నెలకొల్ప బడింది. సోషలిస్టు సమాజం నుండి కమ్యూనిస్టు సమాజానికి పరివర్తన జరుగుచున్న రోజులివి.

సోవియట్ యూనియన్ యొక్క ఈ పరిశోధన ప్రపంచానికి దిగ్భ్రమ కల్గించింది. అందుకు కారణము అచటి సమాజిక విధానమే.

నేడు సోవియట్ యూనియన్‌లో వ్యక్తుల లాభం కోసం ఉత్పత్తి చేయడంలేదు. ప్రజల ఉపయోగం కోసం—సమాజ క్షేమం కోసం ఉత్పత్తి చేయబడుతున్నది. శరీర సామర్థ్యముండి సోమరి పోతులలాగ, మన పెట్టుబడి దారులలాగ ఉండటం నేటి సోవియట్ యూనియన్‌లో అవమానం క్రింద ఎంచబడుతూంది. ఒక ప్రణాళిక ననుసరించి ఉత్పత్తి జరుగుతుందేకాని నేటి ఇతర ప్రపంచంలోవలె అరాచకం లేదు ఉత్పత్తిలో.

పనిలో, విశ్రాంతిలో, ఆట పాటల్లో, అందరకూ, అన్ని రకాలవారికీ అవకాశాలు సమానంగా ఉన్నాయి. స్త్రీ పురుషులకు; వివిధ జాతులకు; తల్లి దండ్రులకు బిడ్డలకు; ఉపాధ్యాయులకు విద్యార్థులకు; ఫ్యాక్టరీ మేనేజర్లకు కార్మికులకు; సైనికోద్యోగికి, సైనికునకు కృత్రిమ భేదభావాలు లేక మిత్రులవలె కలిసి మెలసి యుంటారు.

సోవియట్ పౌరుడు నేడు తన వ్యవహారాలను, ట్రేడ్ యూనియన్‌ల ద్వారా, విక్రయ సహకార సంఘాలద్వారా, సోవియటుల ద్వారా చక్కపెట్టు కొంటాడు. ఈ సంఘాలలో పాల్గొని, చర్చించి. కలిసి పని చేసుకొంటాడు. ఇలాంటి నిజమైన ప్రజా ప్రాతినిధ్య విధానము నేటివరకు ప్రపంచమందు మరెక్కడా లేదు.

ప్రజా నాయకత్వం వహించి, ఒక రష్యాకేగాక, ప్రపంచానికి మార్గం చూపే ఒక అద్భుతమైన కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది.

సమాజానికి మూలకందం శాస్త్ర జ్ఞానం. (సైన్సు). శాస్త్ర జ్ఞానానికై సోవియట్ యూనియన్ ఎంతో శ్రద్ధ చూపుతుంది. వారు ప్రతి పనినీ సైంటిఫిక్‌గా (శాస్త్రీయంగా) ఆలోచించిచూస్తారు. అన్ని దేశాలలో పెద్ద పెద్ద పెట్టుబడిదారులు తమ లాభాలకై శాస్త్ర పరిశోధనలి కొనుక్కొని బయటికి రాకుండ కుంటువడజేస్తుంటే, సోవియట్ యూనియన్‌లో శాస్త్ర పరిశోధనకై ప్రజలు తహతహ లాడటమేగాక మహాద్భుత పరిశోధనలు చేస్తున్నారు. మూఢనమ్మకాలు, మత పిచ్చలూ వదిలేసి శాస్త్ర పరిజ్ఞానాన్ని అనుసరించి జీవితం గడుపుతున్నారు.

ప్రతి వ్యక్తీ తానేదో సమాజంలో పుట్టి పెరుగుతున్నాడు గాని ఆకాశం నుండి ఊడిపడటం లేదు. అందుచేత సమాజానికి వ్యక్తి ఋణగ్రస్థుడు. ఆ ఋణాన్ని తీర్చుకోడం మానవుని కర్తవ్యం. అందుకనే తన సమాజంకోసం పాటుబడని వ్యక్తిని సోవియట్ యూనియన్‌లో 'హేయ్యంగా చూస్తారు. అలాగే వివిధ సంస్థలు కూడ తమ సభ్యులయెడ తమ కర్తవ్యాన్ని మరచిపోవు.

ఇట్టి ప్రత్యేక లక్షణాల గల సమాజాన్ని ఒక నూతన సమాజాన్ని సృష్టించింది సోవియట్ యూనియన్. ఇంతేగాదు. ఒక నూతన నాగరికతను - నూతన మానవునే సృష్టించింది.

సోవియట్ యొక్క ఈ నూతన నాగరికతను, నూతన సమాజాన్ని నాశనం గావించాలని ప్రపంచంలో పెట్టుబడిదారీ దేశాలన్నీ ప్రయత్నిస్తున్నాయి. ఆ ప్రయత్నాలను భగ్నం కావించడానికి ప్రతి దేశంలోనూ కార్మిక కర్షకులు, ప్రజాతంత్ర వాదులు కలిసి పని చేస్తున్నారు. మనం మాత్రం వెనుక బడతామా?

మనం బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాం. పీడితులమైన మనపై పీడితులకు కష్టజీవులకు ఆశాజ్యోతియైన సోవియట్ యూనియన్‌ను రక్షించుకొనే భారం ఉంది. మన స్వాతంత్ర్యం కోసం పోరాడటం అంటే, సోవియట్ యూనియన్‌ను నాశనం గావించడానికి ప్రయత్నిస్తున్న నేటి బ్రిటిషు సామ్రాజ్య వాదానికి స్వస్తి చెప్పడముకూడ అవుతుంది. మనం మన స్వాతంత్ర్యాన్ని సంపాదించి నూతన సమాజం నెలకొల్పుదాం! కష్టజీవుల రాజ్యాన్ని రక్షిద్దాం!! ఇదే మనం నవంబరు 7 వ తేదీన తీసుకోవలసిన ప్రతిజ్ఞ.

— సంపాదకుడు.

Editorial Board : M. Chandrasekhara Rao, (Editor.) K. Satyanarayana, P. Sundarayya, T. Venkatramayya.
Printed, and Published by M. Annapurniah at Navasakti Press, Governorpet, Bezwada.

ENGLISH—TELUGU

**SANKARA NARAYANA'S DICTIONARY**

శంకరనారాయణగారి ఇంగ్లీషు — తెలుగు డిక్షనరీలు.



వేలకొలది క్రొత్త పదములను చేర్చి నిర్దుష్టముగ అచ్చువేయ బడినది.

6000 ప్రతులు రెండేడ్లలో ఖర్చు పడినవి.

మీయింట నుండవగిన ప్రతిని మీరు తీసుకొంటిరా ?

కొద్ది ప్రతులు మాత్రమే కలవు. పూర్తి క్యాలికో బైండ్లు మిడియమ్ సైజు 3—0—0. జేబుసైజు 1—10—0.

డిక్షనరీలలో యింత అమోఘమైన డిక్షనరీ యింకొకటి లేదు.

వేంకట్రామ అండ్ కో

ఏలూరు — మద్రాసు

బ్రాంచెస్:— బెజవాడ, తెనాలి, రాజమండ్రి, సౌతు ఇండియా విక్టోరియా (డక్కన్).




## Papers to Read

1. Congress Socialist :—Organ of All India Congress Socialist Party.
138, Medows St. Fort Bombay.
Rs. 4—0—0 per annum.

2. National Frxnt:—The Marxist Weekly Edited by Famouns Indian Communists.
62 E. Girgaon Rd: Bombay 4.
Suscription Rs 4. per annum.

3. New Age:— The only Marxist Monthly in India.
270, Triplicane High Road Madras.
Sub. Rs. Rs 1—8—0 per year.

4. Student's Call:— The best Student's monthly in India.
Annual Subscription Rs 1— —0.
21, Dalal Street, Fort Bombay.

అవయవ సౌష్ఠవ నిర్మాణానికి దేహపటుత్వ సంసిద్ధికి—




రక్త మాంస రహితమై ఒట్టి ఎముకల గూళ్ళ ఆసరాతో — తారసిల్లే

— ము దు స లు ల కు —

రక్త మాంసాలు నామ మాత్రావశిష్టంగా ఉండి దుర్బలత్వంతో కాలం గడిపే

— యు వ కు ల కు —

స్వామీస్ 'అమృత ప్రాశ'

★ అసమానమైన రసాయనం ★

అశ్విన్ కుమార్ ఫార్మసీ, నర్సాపురం.





## నవశక్తి ప్రెస్, బెజవాడ.

ఇచ్చట అన్నివిధములైన ప్రింటింగ్, బైండింగ్, రూలింగ్, రబ్బర్ స్టాంప్ ఎన్‌గ్రేవింగ్, అందంగాను, సకాలంలోను తయారుచేసి ఇవ్వగలం.



శిశువైద్య.

డా॥ జమ్మి వ్యాసారావు,

లివర్ అండు స్ప్లీన్ యెన్లార్జిమెంటు స్పెషలిస్టు అండ్ మెడలిస్టు.

వ్యాసకుటీరము, విజయనగరం.

వీరి ఔషధములు త్వరలో గ్యారంటీగా గుణము నిచ్చును. దిగువ వ్రాసిన యోగ్యతా పత్రముల జూడుడు.

మీ ఔషధం వల్ల మా అమ్మాయికి గుణం కనబడినది. నె 1 రు మందు 60 పొట్లములు. నె 4 రు మందు 60 పొట్లములు V. P. P. గా తిరుగుటపాలో పంపకోర్తాను.

H. Mukhyaprana Rao. 4-12-37.
*Head Clerk, Kirlampudi Estate office BOBBILI.*

కుర్రవానికి కొంచము సులువుగా యున్నది. మీ ఔషధము వలన కళ్ళ పచ్చదనము తగ్గింది.

(Sd) Ch. V. Malleswaramma, 31-8-37 Vizagapatam.

మీ మందులు అమోఘముగా పనిచేయుట చేతను మా పిల్లడు ఆరోగ్యము పొందుచుండుట చేతను తమకు పై విధముగా వ్రాసుకున్నాను. మా పిల్లడుకు రక్షకులై కాపాడుతూ దైవరత్నమగు ఔషధములిచ్చి మా పిల్లడుకు పూర్ణాయురారోగ్యములు ప్రసాదింతురు గాక.

(Sd) Vajhula Narasimham, M. A. (His) M. A. (Ecn) B. E. D.
Municipal High School, 19-8-38 Chicocole.

లెప్రసీ క్యూర్ (రిజిష్టర్డు)

కుష్టరోగులకు కోరికోరని వరము.

25 ఏండ్ల అనుభవముగల మా యీసంస్థచే తయారై ఎందరకో 'పునర్జన్మ' ప్రసాదించి ఎందరో గొప్పగొప్ప డాక్టర్లు పొగడిన అద్భుత ఔషధ రాజము.

బ్రాంచీలు

బ్రాడ్వే. P. B. 37 మద్రాసు. గాంధీనగర్, బెజవాడ.

అమృతాంజనం

అన్నినొప్పులకు దివ్యామృతం

Navasakti Regd. No. M 3824

# On the Eve of October Revolution By LENIN

**IN THE PRESS**
will be ready by the 15th November.

About 200 Pages — Price As. 12 only

Read below the offer given during the Month of November.

*CONTENTS:*



**Send Annas Six only by M. O.**

(NO STAMPS ACCEPTED). PLEASE WRITE YOUR ADDRESS LEGIBLY ON THE M. O. COUPON.

THE MANAGER, THE SOCIALIST LITERATURE PULISHING CO., GOKULPURA, AGRA.

NOTE: "Pamphlet Service" Subscribers need not order for this publication. It will reach them by the middle of November.

